అంతర భారతీయ పుస్తకమాల

# కథా భారతి
# గుజరాతీ కథలు


సంకలన కర్తలు

**యశ్వంత్ శుక్ల**

**అనిరుద్ధ్ బ్రహ్మభట్**

అనువాదం

**డా॥ టి.వెంకటాచలం**





నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

ISBN 81-237-3045-4

ప్రథమ ముద్రణ 2000 *(శక 1921)*

*Original title in Gujarati* : Gujarati Vartao compiled by Yashwanta Shukla and Anirudh Brahma Bhatt

*Telugu translation* : Katha Bharathi : Gujarathi Kathalu

రూ. 60.00

డైరెక్టర్, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, ఎ-5, గ్రీన్ పార్క్,
న్యూఢిల్లీ-110 016 ద్వారా ప్రచురింపబడినది.

# విషయ సూచిక

# భూమిక

కథానిక పర్వతం వలె అతి పురాతనమైనది. అది ప్రతీ దేశంలోనూ ప్రజలందరి దగ్గిరా ఉంటుంది. పౌరాణిక కథ, దృష్టాంత కథ, నీతి కథ, జానపద కథ మొదలైనవి గుజరాతీలో నాడూ వున్నాయి, నేడూ వున్నాయి. కానీ గద్య సాహిత్యంలో స్వతంత్ర రూపంలో వున్న ఏ సాహిత్య ప్రక్రియనైతే ఈనాడు మనం కథ అంటున్నామో దాని ఆరంభం గుజరాత్‌లో ఇరవయ్యో శతాబ్దం ప్రారంభంలోనే జరిగినట్లు కనిపిస్తుంది. గుజరాతీ భాషలో నవల వంటి ఇతర సాహిత్య ప్రక్రియల మాదిరిగానే కథ కూడా పాశ్చాత్య సాహిత్య ప్రభావం నించి వికాసం చెందిన ప్రక్రియ. గుజరాతీ కథ తన రూప గత యోగ్యతల్ని ఎక్కడెక్కడ వికసింప జెయ్యడం అవసరమయిందో అక్కడల్లా పౌరాణిక కథ, జానపద కథ మొదలైన వాటి నిరూపణ పద్ధతుల్నించి కొన్ని తత్వాల్ని ఉపయోగించుకోవడం అవసరమైంది (జయంతి దలాల్ రచించిన ''మూకం కరోతి'' కథలో మాదిరి) అయితే అలాగని ఈనాటి కథ పౌరాణిక కథతోనూ, పుక్కిటి పురాణంతోనూ సంబంధం కలిగివుందని చెప్పరాదు.

శ్రీ అంబాలాల్ సాకరలాల్ దేశాయి రచించిన 'శాంతిహాస్' (క్రీ.శ. 1900) అనే కథ గుజరాతీలో మొట్టమొదటి కథగా పరిగణింప బడుతోంది. ఆశ్చర్యాన్ని కలిగించే విషయమేమంటే అంబాలాల్ ఈ కథని కేవలం కథ వ్రాద్దామనే సంకల్పంతో కాక ఒక అర్థశాస్త్రజ్ఞుడి దృష్టికోణంలో స్వదేశీ వస్తువుల్ని ఆలంబనగా స్వీకరించి ఆ వెనుక దాగివున్న తన ఆలోచనలకి ఒక రూపం ఇవ్వడం కోసం వ్రాశారు. ఈ విధమైన జ్ఞాన సంపూరకమైన కథలు ఈ కాలంలోనే ఇంకా చాలా రచింపబడ్డాయి. 'శాంతిహాస్' తన కథా వస్తువును బట్టి ఈ కాలంలో వచ్చిన ఇతర కథల కంటె భిన్నమైనది. ఎందుచేతనంటే ఈ కాలపు మిగతా కథలు కథా వస్తుక్షేత్రం ముఖ్యంగా అప్పట్లో చెలరేగిన సాంఘిక దురాచారాలు, జడత్వం నిండిన జాతివాదం వల్ల పరిణమించిన భగ్నప్రేమకు సంబంధించిన విషయాలకు దగ్గిరగా ఉన్నట్టు కనబడతాయి. ఈ కాలంలోని కథల గురించి వ్రాయదగ్గ మరొక అంశం హాస్యరస నిరూపణ. రమణభాయి నీలకంఠ్ 'భోమియానె దీఫేలీ

భూలధాప్' అనే ఒక హాస్య రసపూర్ణమైన కథాకల్పన మార్క్ ట్వైన్ యొక్క ఒక రచన ఆధారంగా చేశారు. దీని ప్రచురణతో గుజరాతీ కథలో హాస్యరస ప్రధాన కథల ప్రాబల్యం పెరిగింది. ఈ కోవకు చెందిన కథా రచయితలైన - ఘనసుఖ్‌లాల్ మెహతా, క.మా. మున్షీ, మలయానిల్ మొదలైన వారు హాస్యరస ప్రధాన కథలు సృష్టించారు. క.మా.మున్షీ కథలలో హాస్యం ముఖ్యంగా కోమలంగానూ, నర్మ గర్భంగానూ ఉంటాయి. మలయానిల్ కథలలో హాస్యం ప్రముఖంగా ఉండదు. కానీ దాని ప్రవాహం ఆయన తాలూకు అనేక కథలతో అంతర్నిహితంగా ప్రవహించడం కనిపిస్తుంది. ఈ విధమైన ప్రారంభకాల గుజరాతీ కథలలో ముఖ్యంగా మూడంశాలు దృష్టిగోచరమవుతాయి - ఉపదేశం, సంఘ సంస్కరణ, హాస్యరస నిరూపణ. దీన్నించి తరుచుగా ఎక్కడైనా కథ ఉపదేశం కింద అణిగిపోవడమో లేకపోతే మరోచోట సంఘ సంస్కరణ తాలూకు జెండాని ఎగరెయ్యడంలో కథా నిర్మాణం దెబ్బతినడమో జరగడంతో హాస్యరస నిష్పత్తి సరిగా వున్నా కూడా కథకి న్యాయం జరగలేదు. అయినప్పటికీ వీటిల్లో కొన్ని అపూర్వమైనవీ లేకపోలేదు. ఈ సందర్భంలో శ్రీ మలయానిల్ కథ 'గోవాలణీ' (క్రీ.శ.1918) వెంటనే దృష్టి నాకట్టుకుంటుంది. ఈ రచన సాహిత్యేతర కారణాలనించి దోషరహితమై వుంది. శుద్ధ కళాకృతప్రప్రథమంగా ఈ కథలో దొరుకుతుంది. గొల్లవనిత వైపు కథానాయకుడు ఆకర్షితుడవడం, అతని బారినుంచి తనను తాను కాపాడుకోవడానికి గొల్లవనిత ద్వారా రూపొందించబడిన ఉపాయం ఎంతసహజ రీతిలో మలచబడిందంటే ఎక్కడా ఏ తికమకా కనిపించకపోగా కథ ఏ ఉద్దేశ్యంతో వ్రాయబడిందో అందులో కృతకృత్యురాలైంది.

ఈ ప్రారంభకాలిక కథలలో 'సుందరీ - సుబోధ్', 'గుణసుందరి', 'వారా వారిధి', 'వీసమీ సదీ' మొదలైనవి ప్రసాదించిన ప్రభావం ఒక ప్రేరణ శక్తి రూపంలో ఉల్లేఖించదగినది.

ధూమకేతు ప్రవేశంతో గుజరాతీ కథ ఒక మహత్వ పూర్ణమైన మలుపు తిరిగింది అనవచ్చు. విషయ క్షేత్రం విస్తారమైంది. కథలో ధ్వని తత్త్వం యొక్క మహత్తు స్వీకరించబడింది. ధూమకేతు తన కథలలో ప్రకృతి, పాత్ర నడవడికల తాలూకు వ్యవహారాల సుసాంగత్యం వైపు తన మొదటి రచనలకంటె కూడా ఎక్కువగా దృష్టిని కేంద్రీకరించారు.

ధూమకేతు కథలలో వన జీవితం, గ్రామీణ జీవితం, నగర జీవితం యొక్క వివిధ వర్గాలను తీసుకుని రచన చేయడం జరిగింది. జీవితాన్ని

పర్యాలోకించడం, దాన్ని చిత్రించడంలో ఆయన చేపట్టినది ముఖ్యంగా భావవాదం. ఆయన పాత్రలలో ఎక్కువ భాగం భావుకత నిండిన జీవితం లోంచి వచ్చినవి కావటం చేత యథార్థ వ్యావహారిక జగత్తుతో పాటు తన మేళతాళాల్ని ఎక్కువగా మేళవించలేవు. అందుచేత కథలో కరుణ రసం ఉత్పన్నమవుతుంది బహుశః ఇందువల్లే ఆయన పాత్రలు అవ్యవహారిక రీతిని కలిగి (అసహజంగా వుండి) తీవ్రధోరణితో వున్నవిలా కనిపిస్తాయి. పూర్తిగా తమ ఉద్దేశ్యాల్లోనే నిమగ్నమైపోయే ఇటువంటి మనుషుల యొక్క ఒక పూర్తి ప్రపంచాన్ని మనముందు ధూమకేతు నిలిపారు.

యంత్రాలతో వచ్చిన నాగరికత ఫలితంగా ఉత్పన్నమైన నగరంలోని యాంత్రిక జీవితం ముందు ప్రకృతి నడుమ నెలకొని వున్న గ్రామీణ జీవితపు నైసర్గిక స్థితిని ధూమకేతు తన కథలెన్నిటితోనో మనముందు వుంచారు. అనేక సార్లు నగర జీవితం కంటే గ్రామీణ జీవితం పట్ల ఆయనకున్న పక్షపాతం స్పష్టంగా వ్యక్తమవుతుంది. గ్రామీణ జీవితాన్ని రొమాంటిక్ భాషతో పెనవేసి చిత్రించడం ఉత్తమం అని ఆయన భావిస్తారు. పరిస్థితుల-కన్నా పాత్రలే ధూమకేతు కథలలో ఎక్కువ గొప్పగా వుంటాయి. కనుక ధూమకేతు కదలలో ఎక్కువ భాగం పాత్ర ప్రాధాన్యత కలవి.

ధూమకేతు ఆగమనంతో గుజరాతీ కథకు మొదటి సారిగా కావ్యమయ ప్రకృతి వర్ణన లభించింది, నాజూకైన వచన సంపత్తి దొరికింది, రకరకాల పాత్రలు దొరికాయి, నగర సంస్కృతి నుంచి ఉత్పన్నమైన మానవ జీవితంలోని సమస్యల సాకార రూపం దొరికింది, ముఖ్యంగా ఆకర్షణీయమైన దృష్టికోణానికి కనిపించే గ్రామీణ జీవితం దొరికింది. ప్రేమ భావనకి సంబంధించిన త్యాగ నిరతి ధూమ కేతు సృష్టించిన అనేక పాత్రలలో కనబడుతుంది. ఈ ప్రేమ వ్యక్తి పట్ల, పశు పక్ష్యాదుల పట్ల, భూమి పట్ల కలుగుతుంది. చాలాసార్లు ఈ ప్రేమ పంక్తి బద్ధత రూపంలో కూడా ద్వంద్వ రహితంగా మనుముందు కానవస్తుంది.

రా.వి. పాఠక్ 'ద్విరేఫ' కథలలోని పాత్రలు కథలో వాస్తవికత ఉట్టిపడేలా చిత్రించబడ్డాయి. యదార్థ నిరూపణలో భావుకత స్థానేతర్కపూర్ణ సంయమం 'ద్విరేఫ' కథలలో శ్లాఘించదగిన విశేషం. ద్విరేఫ ప్రయోగశీలురై తమ కథా రచనను సాగించారు. ఇందువల్లనే ఆయన కథలలో భావవ్యక్తీకరణ కొరకు అనేక శైలులు దృష్టి గోచరమౌతాయి. ద్విరేఫ మానవ జీవితంలో నిహితమైన అంధశక్తుల చిత్రణ చేశారు. మానవ జీవన నియామక శక్తి రూపంలో శారీరక తత్త్వాల ప్రభావాన్ని తన కథనంగా చేసుకుంటూ ప్ర

ప్రథమంగా ద్విరేఫే కథలనందించారు.

ద్విరేఫ ఈ కథలు రచిస్తున్న సమయంలోనే ప్రగతి వాద ప్రాబల్యం ప్రారంభమైంది. కానీ ద్విరేఫ కథల మీద దాని ప్రభావం చాలా తక్కువ కనబడుతుంది. మేఘాణీ కథల మీద దాని ప్రభావం కావలసినంత ఉంది. మేఘాణీ కథల సంరచనలో రెండు ప్రముఖ శక్తులున్నాయి – ఒకటి జానపద సాహిత్యంతో మేఘాణీకున్న సన్నిహిత సంబంధం, రెండు ప్రగతి వాద ప్రభావం. మేఘాణీ కథలలో నిమ్నవర్గపు దళిత – పీడిత మానవుల పట్ల సానుభూతి మనసు నాకట్టుకుంటుంది. సాహసం, ఆత్మత్యాగం, వీరత్వ భావాలను వ్యక్తీకరించగల అపూర్వ కౌశలం మేఘాణీ రచనలో వుంది. ఎక్కడ డంభం, అణచివేత, శుష్కదయాహీనత వుంటాయో అక్కడ ఈ రచయిత యొక్క స్వాభావికమైన ఆక్రోశం దర్శనీయమవుతుంది. ఆనాటి జానపద జీవనంలోని రంగులు కూడా మేఘాణీ కథలలో కనబడతాయి. మేఘాణీ కథలలో శిల్పసిద్ధికంటె సంఘటనల క్రమం యొక్క శక్తీ, వేగంగా సాగే చిత్రణాత్మక కథాశైలిల ఆకర్షణ ఎక్కువగా కనపడతాయి.

పాఠకుణ్ణి ఊపివేసి అతన్ని నూతన న్యాయ పూరితమైన సమాజం నిర్మాణంవైపు అభిముఖుణ్ణి చెయ్యడం ప్రగతి వాదలక్ష్యాలలో ఒకటి. బకులేశ్, జయంత్ ఖత్రీ మొదలైన వారి కథలలో సగానికి పైగా ఈ ప్రగతి శీల ప్రవాహం గల కథలే. సుందరమ్ కథలమీద ప్రగతి వాద ప్రభావం ఒకచోట స్థూల రూపంలోనూ, మరొకచోట సూక్ష్మరూపంలోనూ పడింది. 'మాజావేలా నుంమృత్యు'లో ఫుట్‌పాత్ మీద నివసించే వారి వేదనానుభవం సాకారమై వుంటుది. దాని కరుణరసం భవ్యతా క్షేత్రాన్ని చేరుకోవడంలో సామర్థ్యాన్ని సంతరించుకుంది. దాని వెనుక ఒక పదునైన వ్యంగ్య రచన వ్యక్తమ వుతుంది. 'ఖోలకీ' లో సుందరమ్ రచనా సంయమం. ప్రశంస నీయమైనది. పరిస్థితి పూర్తిగా వ్యంగ్య వక్రత ద్వారా నిరూపించబడింది. 'మానో ఖోళే'లో కరుణ ఘనీ భూతమై వుంటుంది. కథ శీర్షిక దగ్గిర్నుంచే చివరి వరకూ రచయిత దృష్టి కోణంలోని ఆ వ్యంగ్య వక్రత అనుభవమవుతూ వస్తుంది.

శ్రీ ఉమాశంకర్ జోషీ కథలు సమాజగత బాహ్య పరిస్థితులు వెనుక నుంచి పాత్రల మానసిక ప్రక్రియల నిరూపణ చేస్తాయి. ఒక్కసారిగా అనుకోని ఆకస్మిక సంఘటనని బీజరూపంలో తీసుకొని దాని నుంచి అనివార్య గంభీర కరుణని నిష్పత్తితో ఉంచే ప్రవృత్తి 'చక్కీనుంభూత్', 'కళంకిని' వంటి రచనల్లో కనబడగలదు. పాత్రల గూఢమైన మనోభావాల

అప్పుడప్పుడు పరస్పర విరోధమనోభావాల - రూపాలని మార్చి వేసే కౌశలాన్ని ఉమాశంకర్ చూపించారు. ఈ దృష్టికోణంలోనే 'మారీ చంపానోవర్' ఉల్లేఖించదగ్గ కథగా భావించబడుతోంది. 'శ్రావణీమేళో'లో గ్రామీణ జీవితపు రంగుల గుర్తింపుతో పాటు దాని కఠిన కఠోర వాస్తవికతని కూడా ఉమాశంకర్ చిత్రించారు. కథలో ఆకృతి విధానాన్ని ప్రయోగించడం పట్ల కూడా ఉమాశంకర్ దృష్టి కేంద్రీకృతమైంది.

గులాబ్ దాస్ బ్రోకర్ పాత్రలు ఎక్కువ విచిత్రంగా అనిపిస్తాయి. వాటి ప్రవర్తనని బట్టి వాటి మనసుల అట్టడుగు ప్రవాహాల వైపు పాఠకుడిని తీసుకు పోతాయి. జాతీయతకి సంబంధించిన ప్రశ్నల్ని బ్రోకర్ మహా ప్రగల్భంతో లేవనెత్తుతారు. 'లతాశుంబోలే?' అనేది ఇందుకు ఉల్లేఖించదగిన ఉదాహరణ. మానవ జీవితానికి సంబంధించిన శుభకరమైన భావనల్ని పట్టుకునే ప్రవృత్తి శ్రీ స్నేహరశ్మి కథలలో విశేషంగా కనబడుతుంది.

బాలుర ప్రవర్తనకి సంబంధించిన చిత్రణను శ్రీ స్నేహరశ్మి 'హీరానాం లటకణియాం' అనే రచనలో చక్కగా వర్ణించారు.

గ్రామీణ జీవితానికి సంబంధించిన కథలు గుజరాతీ కథల ప్రారంభ కాలం నుంచి రచించబడుతున్నాయి. కానీ పట్టణంలో నివసించే రచయిత గ్రామాంచలం మీద కథలు తరుచు వ్రాయడం జరుగుతోంది. అతనికి గ్రామంతో, అక్కడి జీవితంతో కించిత్ అనుభవం ఉంటుంది. దాంతో ఏ సుందరమో 'మానోఖోళే' వంటి కథ వ్రాస్తేనో లేదా ఏ ఉమాశంకర జోషీనో 'శ్రావణీ మేళో' వంటి కథ వ్రాస్తేనో దానిలో గ్రామీణ జీవితానికి సంబంధించిన ప్రతి ధ్వని తప్పకుండా వినిపిస్తుంది. కానీ గ్రామీణ జీవితానికి సంబంధించిన బహువిధ అనుభవ సృష్టి తన అనేక రంగులతో మొదటి సారి ఏ రచయితలోనన్నా కనబడిందా అంటే అది పన్నాలాల్ పటేల్‌లో. పన్నాలాల్ నగర జీవితానికి సంబంధించిన కథలు కూడా వ్రాశారు, కానీ గ్రామీణ జీవితానికి సంబంధించిన కథలైతే నేటికీ అద్వితీయ మైనవిగా ఉన్నాయి. ఆయన కథలలో పాత్రల మనోభావాలతో పాటు చిత్రితమైన గ్రామీణ జీవన వాతావరణం కూడా కలిసిపోయి ఏకరూపమై పోతుంది. 'వాత్రకనె కాంఠె' ఇందుకొక అందమైన ఉదాహరణ. పాత్రల మనసులోని ద్వైత (ద్వంద్వ) ప్రవృత్తిని చిత్రించే అసాధారణ ప్రజ్ఞ పన్నాలాల్‌లో వుంది. ఉత్తర గుజరాత్‌లోని జానపద భాషా ప్రయోగం సాహిత్య క్షేత్రంలో బహుశః మొట్టమొదటి సారి తన కథలలో చేసినవారు ఉమాశంకర్. కానీ దాని స్వరాలు, కంఠధ్వనుల వైభవం పన్నాలాల్ కథలలోనే దొరుకుతుంది.

పేటలీకర్ కృతకృత్యులైనది కూడా ముఖ్యంగా గ్రామ జీవితానికి సంబంధించిన కథలలోనే. పాత్రల ప్రవర్తనలోని సహజత్వం తాలూకు చిత్రణ పేటలీకర్ కథలలో గొప్ప నర్మగర్భ రీతిలో కొనసాగింది. 'లోహీనీ సగాయీ' లో ఏ విధమైన ఆడంబరమూ లేకుండా తల్లి ప్రేమ చిత్రించబడింది. ఈ ప్రవాహంలోని ఇతర రచయితలలో శ్రీ మోహన్‌లాల్ పటేల్ ప్రసాదించినది ఉల్లేఖించదగ్గది.

జయంత్ ఖత్రీ కథలు గుజరాతీ కథా సాహిత్యంలో ఒక విశిష్టమైన వికసిత రూపంలో వస్తున్నాయి. ఆయన కథలు చదివినప్పుడు మనకు ఒక అనుభవం కలగకుండా వుండదు – ఆయన వెనుక నైపుణ్యంగల ఒక కళా కారుని హస్తం వుండి వుంటుందనిపిస్తుంది. ఆయన కథల్లో అతి సూక్ష్మ వివరణలు కూడా సంపూర్ణ రచనా సందర్భాన్ని దృష్టిలో ఉంచుకుని చిత్రించ బడతాయి. ఎన్నో స్థలాలలో జరిగిన సంఘటనలు ఆయన కథలో ప్రతీకలు కావటంలో సామర్థ్యాన్ని పొందాయి. ఈ దృష్టితో చూసినట్లయితే 'ఖరా బపోర్', 'ధాడ్', 'నాగ్' మొదలైనవి ఉల్లేఖించదగిన కథలు. ఆయన కథలలో సహజ వాతావరణం ఒక సజీవ తత్త్వం రూపంలో చిత్రితమైంది.

శ్రీ జయంతి దలాల్ సాంఘిక చైతన్యం, ప్రయోగశీలతతో పాటుగా కథా క్షేత్రంలో ప్రవేశించారు. సంక్షిప్తత అనేది కథ యొక్క గుణం అనుకునేట్లయితే ఆ లక్షణం వెంటనే జయంతి దలాల్ కథలలో దర్శనమిస్తుంది. ఇందువల్లనేకాబోలు ఆయన కథలలో ధ్వని సమృద్ధి ఎన్నో సార్లు పాఠకుల్ని వ్యాకుల పరచేదిగా ఉంటుంది. ఆయన కథలో ఒక చోట నివేదిక వున్నాకూడా కవిత యొక్క కాంతి రేఖనీ తాకుతాయి. పాత్రల మనుసు లోపల చెలరేగే కల్లోలపు చిత్రణలో చెప్పబడే మాటల సారాన్ని దలాల్ పిండిపోశారు. వ్యంగ్యపు పదును మీద సాగే వచనం దలాల్ సృష్టికి ఒక విశిష్ట రూపం. కథన శైలి ప్రయోగాలు 'ద్విరేఫ' తర్వాత ఎక్కువగా దలాల్‌లో కనబడతాయి.

వ్యావహారిక జీవితంలోని వాస్తవికత, ఆదిమ ప్రాకృతిక శక్తుల పరివర్తన కారణంగా జీవితంలో ఏర్పడే కరుణాత్మక వక్రపరిస్థితి – ఇదే చునీలాల్ మడియా కథలలోని కఠోర యదార్థ భూమి. 'కమాపూ దీకరో', 'వానిమారీ కోయల్' కేవలం మడియాకే కాదు యావత్ గుజరాతీ సాహిత్యంలో కూడా ఉల్లేఖించదగ్గ కథలు. భావజగత్తు యొక్క సూక్ష్మ వైవిద పూర్ణ వివిధ వర్ణ మయత వాటిల్లో ఉండవు. కానీ వేగవంతమైన ఆవేగాల నిరూపణలో మడియాకి పేర్కొనదగ్గ సాఫల్యత సమకూరింది. మడియా ఈ పని

సంఘటనల కూర్పు ద్వారా చేశారు. బహుశః ఆయన కథలలో కథా తత్త్వం ఎక్కువగా ఉండటానికి ఇదే కారణమై వుంటుంది.

గుజరాతీ కథలలో సురేష్ జోషీ ప్రవేశం మరొక మలుపుకి సూచన. కథలో సంఘటనల క్షీణతలకి సిద్ధి కలిగించడంలో ఎక్కువ ప్రయత్న శీలురైనారు. సంఘటన ప్రాధాన్యతకీ, వేగంగా మారిపోయే సంఘటనల క్రమానికే వ్యతిరేకంగా పోయి అతి కాల్పనికతని ప్రతిష్ఠాపించే ప్రయత్నం కూడా శ్రీ జోషీ కథలలో చూడవచ్చు. శ్రీ జోషీ కథలో సంఘటన తాలూకు ఒక చిన్న సూత్రాన్ని తీసుకుని దాన్ని సజీవంగా మార్చడం, కథని కూడా ఒక ప్రతీకగా చేసి నిలబెట్టడం అనేవి సిద్ధింప జేసుకోవడానికి గొప్ప ప్రయత్నం చేశారు.

ఒక వంక శ్రీ సురేష్ జోషీ సంఘటనల క్షీణతద్వారా కళాత్మక రచనా సిద్ధి కోసం ప్రయత్నిస్తూ వుంటే మరోవంక శ్రీ చంద్రకాంత్ బక్షీ సంఘటనా ప్రధాన కథలలో నగర జీవితం లోని వేదనని ఋజువు చేయడం కోసం ప్రయత్నించారు. నగర జీవితంలోని ఒంటరితనం దానివల్ల ఉత్పన్నమయ్యే కృత్రిమత్వం, దాని కారణంగా అనుభవమయ్యే లోతు లేని ప్రగల్భం, దాన్నుంచి వెలికి పారిపోయే అసహాయత, దాని కారణంగా మనసులో చెలరేగే విరక్తి లేక ఏదోవిధంగా బతుకీడ్చేసే ఆరోగ్య కరంగాని మనః ప్రవృత్తి - వీటన్నిటి చిత్రణా శ్రీ బక్షీ కథలలో ముఖ్యంగా ఉంటుంది.

నవీన గుజరాతీ కథలో ఏదోఒక మనః స్థితిని చిత్రించడం లేక ఏదో ఒక వేదనని శబ్ద బద్ధం చెయ్యడం అనే ప్రవృత్తి కూడా కానవస్తుంది. శ్రీ మధురామ్ కథ 'హార్మోనికా', శ్రీ జ్యోతిష జానీ, శ్రీమతి సరోజ్ పాఠక్‌ల తాలుకు అనేక కథలు కూడా ఈ దృష్టితో చూసినట్లయితే ఉల్లేఖించతగ్గవి. శ్రీ కిశోర్ జాదవ్ ఈ ప్రవృత్తిని ఒక చివరి తీరందాకా లాక్కుపోయారని చెప్పవచ్చు. మధురామ్ కథలలో అనుభూతి క్షేత్రం కంటె ప్రయోగ క్షేత్రం పెద్దది. కథా రచయితల్లో సగానికి పైగా కథని ఏదో ఒక నిర్దిష్టమైన ముగింపు వరకూ లాక్కుపోవాలనే దాన్ని అంగీకరించరు. శ్రీమతి సరోజ్ పాఠక్ కథ 'న కోంసమాం నకోంస బాహర్' ఒక స్త్రీ మనః స్థితిని చిత్రిస్తుంది. ఇందులో మనిషి అంతరాంతరాల్లో జరిగే పరస్పర విరుద్ధమైన భావాల పీకులాట ఎంతో సహజంగా కనిపిస్తుంది. అందులో భావన యొక్క సత్య స్వరూపం సాకారంగా కనిపిస్తుంది. దీరు బహెన్ పటేల్, ఈ వాడేవ్, సుధీర్ దలాల్ కథలు నాజూకైన భావస్థితిని లేక భావ పరివర్తనలని సాకార రూపంలో చూపిస్తాయి. ఈవాడేవ్ దృష్టి విశేషించి మానసిక ప్రక్రియల మీద ఉంటుంది. సంభాషణ చూసినా, భాష చూసినా పూర్తిగా స్వదేశీ. ఈవాడేవ్ మానసిక

ప్రవృత్తులనీ, ప్రక్రియల్నీ అమోఘమైన రీతిలో గ్రహించి రచించడంలో సమర్థులు. 'చోట్టీ', 'బిచారీ జమనీ' మొదలైన కథలు అందుకు చక్కని ఉదాహరణలు.

నవ్య కథ కేంద్రానికి చుట్టూ వున్న సంఘటనల చట్రాన్ని నిలబెట్టే ప్రయత్నాలని త్యాగం చేసినట్టే వుంది. అది ఒకప్పుడు భావనా ప్రవాహం యొక్క ముక్కుసూటి ఆలేఖన ద్వారా, మరొకప్పుడు సంభాషణల సూక్ష్మత ద్వారా పాఠకుణ్ణి సూటిగా కథ కేంద్ర బిందువు దగ్గరకు తీసుకుపోతుంది. శ్రీ రాదేశ్యామ్ శర్మ కథ 'సళియా' ప్రతీకాత్మక కథకి చక్కని ఉదాహరణ. శ్రీ రఘువీర్ చౌధరీ సంభాషణలలో తర్కపు చాక చక్యాన్ని చక్కగా ప్రవేశపెట్టి కథ రచించగలరు, సంభాషణలని వ్యక్త అవ్యక్త సీమ రేఖమీద నడిపించగలరు, రెండు పిరిస్థితుల్ని పక్కపక్కనే ఉంచి అందుండి ఏదైనా మూడో మనోభూమివైపు పాఠకుణ్ణి ప్రేరితుణ్ణి చెయ్యగలరు. వ్యక్తీకరణ మాధ్యమం రూపంలో భాషా కల్పనల లోతుని అందుకోవడానికిగానూ అటువైపు కూడా ఈ కొత్త కథా రచయితలు తమ దృష్టిని సారించారు. పౌరాణిక కథల్ని ఆధునిక సందర్భాలలో గుచ్చెత్తి చూసే ప్రయత్నం కూడా చేశారు. ఈ కొత్త కథా రచయితలు. కొత్త వారిలో సాహసముంది, పదాలలోతుల నందుకొనే ధ్యాన నిమగ్నత ఉంది. స్వీకరించిన అమూల్యమైన సందర్భాలను కిందు మీదు చేసి వేసే శక్తి కూడా చాలా మందిలో కనబడుతుంది. ప్రయోగాలు చేశారు, సఫలత లభించనూ లభించింది - ఇటువుంటి మనోదశతో కొత్త రచయితలు బయటి కొస్తున్నారు. రేపటి గుజరాతీ కథకి ఇది అశాప్రద సంకేతం.

- యశవంత్ శుక్లా

- అనిరుద్ధ బ్రహ్మ భట్టు

# 1. గొల్ల పిల్ల

**మలయానిల్**

కంచన్ లాల్ వాసుదేవ్ మెహతా (1892-1991 క్రీ.శ.) జన్మస్థానం అహమ్మదాబాద్. కొన్ని ప్రగతి కావ్యాలు, హాస్య రచనలు మరియు కథల సృష్టికర్త. 'గోవాలణీ' అనే బీజీ వాతో' అనే కథల సంపుటి ప్రచురితమైంది. 'గోవాలణీ' కీర్తి నార్జించి పెట్టిన కృతి.

★ ★ ★

ఆమె మంచి యౌవనంలో వుంది. ఎవరికైనా పదిహేనేళ్ల ప్రాయంలో పెదవుల్లో గులాబీలు పూస్తాయి, పదిహేడు పద్దెనిమిదేళ్ళ ప్రాయంలో కళ్ళలో మెరుపొస్తుంది, కానీ ఈమెకు పదహారేళ్ళ ప్రాయంలోనే కంఠంలో కోయిల పలకడం ప్రారంభించింది. అమాయకత్వమిక సెలవు తీసుకుంటోంది. పసితనం స్థానే సౌందర్యం చోటు చేసుకుంటోంది. మొగ్గగా ముడుచుకున్న పువ్వు ఇప్పుడిక వికసించాలని కోరుకుంటోంది.

ఆమె చదువుకున్నది కాకపోయినా చాలా తెలివైనది. బస్తీలో నివసించేది కాకపోయినా సభ్యతకలదిగా తోస్తుంది. ఉన్నతజాతిలోపుట్టినది కాక పోయినా సౌందర్యవతి. చూస్తే ఆమె కళ్ళల్లో నీలిభ్రమరాలున్నాయా అనిపిస్తుంది. కనుపాపల్లో బాణపు ములుకులవంటి చురుకుదనం వుంది. చెక్కిళ్ళమీద గులాబీలు పరుచుకున్నట్టుంటుంది.

తలమీద మెరిసిపోయే ఇత్తడి బిందె పెట్టుకుని శివారునుంచి ఊళ్ళో అడుగెడుతూంటే లక్ష్మీదేవే దిగి వస్తున్నట్టుంటుంది. వాడవాడలా ఆమె కూజితం వినబడుతుంది - ''పాలు తీసుకుంటారా, పా...లు?'' పళ్ళు తోముకుంటూ అందరూ ఆమెవైపే చూస్తూంటారు. ఈరోజు శుభకరంగా గడుస్తుంది అనిపిస్తుంది పురుషులకు. ఈర్ష్య కలుగుతుంది స్త్రీలకి.

ఆమె గుజరాతీ గొల్లపిల్ల. తెలతెలవారుతూండగానే ఆమె గ్రామం నుంచి బయలుదేరుతుంది. తాజాగా తీసిన పాలు తీసుకుని మావూరొస్తుంది. ప్రతివాళ్ళకీ ఆమె దగ్గిర పాలు తీసుకోవాలన్న కోరిక కలుగుతుంది. ''పాలు

తీసుకుంటారా పా...లు'' అన్న పిలుపు విన్నవెంటనే పేటలోని స్త్రీలు పక్కమీదనించి లేచి కూచుంటారు.

ఆమె నిత్యం ఎర్రచీర కట్టుకుంటుంది. ముతకదే అయినా శుభ్రంగా వుంటుంది. ఎంత జాగ్రత్తగా కట్టుకుంటుందంటే ఎప్పుడూ ఆచీర కొత్తదిలా వుంటుంది. నల్లకొంగుకి పసుప్పచ్చ అంచు, దాని మీద జరీ. చేతులకి ఏనుగు దంతమ్మీద వెండి నగిషీ పనితనంగల పెద్ద పెద్ద గాజులు ధరిస్తుంది. కాళ్ళకి లావుపాటి కడియాలు. ముక్కుకి ముక్కెర, చెవులకి జూకాలు, వేళ్ళకి వెండి ఉంగరాలు, మెడలో కంటె, చిన్న చిన్న బంగరు పూసల మాల. ఇవీ ఆమె ఆభరణాలు. తలమీద తేలికపాటి ముసుగు వుంటుంది. అందుకని ఆమె జుత్తు ఎలా వుంటుందో ఎవరికీ తెలియదు. కుల వృత్తి చేస్తూ ఉండవచ్చు, పాపట సింధూరం ధరించి ఉండవచ్చు కానీ ఈ కల్పనే ఆమె సౌందర్యాన్ని వృద్ధి చేస్తోంది.

సరిగ్గా ఆమె వచ్చే సమయానికే అరుగుమీద పళ్ళు తోముకోవడానికి కూర్చుంటాను. ఆమె వస్తూండటం కనపడగానే బిడియపడకుండా రెప్పార్ప కుండా ఆమె వేపు చూస్తూండిపోతాను. వెర్రిపిల్ల సిగ్గుపడుతుంది, చూపులు వాల్చేస్తుంది, కానీ మిగతా తరుణుల్లాగా నడవడి మాత్రం మారదు, ఆమె వణకదు, మెలికలు తిరగదు. శాంతంగా, గంభీరంగా ఎప్పట్లాగే ''పాలు తీసుకుంటారా పా...లు'' అని కేకపెడుతుంది.

నేను రోజూ మా ఆవిడతో ''నువ్వీ గొల్లపిల్ల దగ్గిర పాలెందుకు తీసుకోవు? 'సోదరీ, పాలు తీసుకుంటావా?' అనడిగడిగి ఆమె నోరు నొప్పెడుతోందే గాని నీకది కాస్త కూడా పట్టదు'' అంటూంటాను.

ఎలాగైతేనేం ఆమెను చూసినప్పటినుంచీ నాహృదయంలో ఏవో విలక్షణమైన భావాలు తలెత్తుతున్నాయి. ఏమైనా కానీ నేను ఇంట్లో ఈమె దగ్గర పాలు కొనిపిస్తాను. కొంచెం సేపు ఈమెను మా ప్రాంగణంలో కూర్చోబెట్టి నావేపు చూసే అవకాశం కల్పించుకుంటాను. ఇంతటి కోమలాంగై వుండీ ఈమె గొల్లవాళ్ళలో ఎందుకు పుట్టిందో! ఈమె కోమలమైన శరీరం మీద ముతక గుడ్డలెలా వున్నాయో! జన్మనిచ్చేప్పుడు ఈశ్వరుడు కాస్తంతైనా చూసుకోడు కదా!

ఆ రోజే అనిపించింది నేను గొల్లవాళ్ళలో పుడితే బాగుంటుందని. చెరువు గట్టుమీద నిలబడి పిల్లన గ్రోవి వాయించడం వస్తే ఎంత బాగుంటుంది. పశువుల్ని ఊరి శివార వరకూ తోలుకెళ్ళి లావుపాటి తలపాగ చుట్టి, చేపాటి కర్రకి ఆనుకుని జోరు జోరుగా పాటలు పాడగలిగితే ఎంత బాగుండును.

గ్రామీణుడైన ఆబాల గోపాలుడి జీవతమూ అదే. పిచ్చెక్కించే ఈ గొల్లపిల్ల కూడా ఆరాధ జాతికి చెందినదే! ఆసుందరిని ఆమె సౌందర్యాన్ని అనేకమార్లు చూడ్డంతో నామనసు మీద ఆమె ప్రభావం గాఢంగా పడింది. గంభీరంగా, మత్తుగా వుండే ఆమె కళ్ళంటే నాకు మోహం కలిగింది. ఆమె వెనకే సందు సందు తిరుగుతూ ఆమె ఎక్కడికి వెడుతుందో చూద్దాం అనుకున్నాను మనసులో.

ఒక రోజు ఎనిమిది గంటలకి అటూ ఇటూ వెళ్ళడం మానేసి గ్రామంలోకి ప్రవేశించే మార్గంమీద వెళ్ళి నిలబడ్డాను. ఆమె పాలు అమ్ముకుని ఇంటికి వెళ్ళడానికి అటు వస్తుందని ఊహించాను. అప్పుడు నేను అమాయకుడిలా ఆమె వెంటనంటి వెళ్ళాలనుకున్నాను. అవకాశం దొరకగానే నువ్వెవరు? నీ ఈ కళ్ళలో ఏముంది? మీ గొల్లజాతిలో కూడా ఇటువంటి మూర్ఛపోగొట్టేంత అప్సరసలున్నారా? అని అడిగేస్తాను.

మనసులోనే ఈ ప్రశ్నల్ని తయారు చేసుకుంటూ నేనక్కడే నిలబడ్డాను. ఇంతలో ఆమె గ్రామం నుంచి బయటికొచ్చింది - తలమీద అలవోకగా ఖాళీ పాలబిందె వుంచి తల నిటారుగా ఎత్తుకునుంది కానీ చూపులు క్రిందకున్నాయి. ఆమె రెండు చేతులతో డబ్బులు లెక్కచూసు కుంటూ వస్తోంది. నేనామె వెనకాలే వెళ్ళడం ప్రారంభించాను.

త్రోవమీద బళ్ళ చక్రాల గుర్తులు పడివున్నాయి. మెరక భూమి నుంచి రావడం చేత దారికిరువైపులా మట్టిగోడల్లా తయారయ్యాయి. ఎగువన బొమ్మ జెముడు పొదలు, గురివింద తీగలు మొలిచి వున్నాయి. బళ్ళ చక్రాల వల్ల ఏర్పడినగాడిమధ్యలోని ధూళినిరేపుతూ ఆమెవడివడిగా అడుగులేసు కుంటూ వెడుతోంది. సూర్యుడు ముఖానికెదురుగా ప్రకాశిస్తున్నాడు. అందుకని ఆమె ఒకచేతిని కళ్ళకడ్డంగా పెట్టుకుని రెండో చేత్తో గిన్నె పట్టుకుంది. ఒకటి రెండుసార్లు ఉన్నట్టుండి వెనక్కి చూడ్డంతో ఆమె నన్ను గమనించింది. నేనామెని వెంటాడటంలేదుకదా అన్నసందేహంకలిగి వుంటుంది. బహుశః ఇందుచేత ఆమె ఒకసారి నెమ్మది నెమ్మదిగానూ, ఒకసారి వేగంగానూ నడవడం ప్రారంభించింది. నేనుకూడా తదనుగుణంగా నానడక వేగాన్ని మారుస్తున్నాను. నిజానికి ఆమె పవిత్రతనిగానీ నడవడికని గానీ తప్పు పట్టాలన్న ఉద్దేశ్యం లేదునాకు. నేనామె రూపం వల్ల ప్రభావితుడి నయ్యాను. మానసికంగా భ్రష్టుడినైనా బుద్ధింకా పని చేస్తోంది. మతి చెడిన వాడిలా హద్దు మీరి చిత్తం వచ్చినట్టు ప్రవర్తించలేదు.

ఈ విధంగా మేం అరమైలు దూరం వెళ్ళామో లేదో ఆమె ఆగిపోయింది. అక్కడ మర్రి చెట్టు నీడవుంది. మర్రి కింద బాటసారులు

కూచునేందుకు గానూ ఒక గుడిసె నిర్మించ బడివుంది. పైన కోయిల కూస్తోంది. కింద ఆవులు - గేదెలు, దూడలు, మేకలు అటూ ఇటూ తిరుగుతూన్నాయి. ఆ ప్రదేశం రమణీయంగా వుంది.

గుడిశె బయట బిందె దించి పెట్టి దారిపక్క పచ్చిక మీద 'హాయ్‌రామ్' అంటూ కూలబడింది - గొల్లపిల్లలు కూచునే మాదిరి పాదం పైకెత్తి పెట్టి కూర్చుంది.

నాపరిస్థితి చాలా విషమంగా తయారయింది. అనుసరించేదా ఆగిపోయేదా? ఆమెతో మాట్లాడదామనుకున్న విషయం గుర్తు రాగానే గుండె దడ ప్రారంభమైంది. ముఖం ఎర్ర బడింది. ఇప్పటివరకూ ధైర్యంగా వస్తూ వచ్చాను. కానీ ఇప్పుడు ఆయాదవ కులసుందరి నా శక్తినంతా హరించేసింది.

కాస్తఆలోచించి నేనుఆదారివెంట ముందుకిసాగడం ప్రారంభించాను. ఆమెని వెన్నంటడం మాని రెండడుగులు ముందుకేశానో లేదో ఆమె ''సందన్ భాయీ! ఇలా ఎక్కడెకెళుతున్నావు?'' అనడిగింది. ప్రతి రోజూ మా దగ్గరికి వస్తున్న కారణం చేత ఆమె నన్ను బాగా గుర్తుపట్టింది. కానీ ఆమెయిలా ఎకాయెకీ నాతో మాట్లాడెయ్యటం ప్రారంభిస్తుందని ఊహించ లేదు. అయితే నేను తనని అనుసరిస్తూ వస్తున్నానన్న విషయం గ్రహించిందా? నాగురించి ఈమె ఏమనుకుంటోందో? ఈ విధంగా ఎన్నెన్నో అనుమానాలు మనసులోకి రావడం ప్రారంభించాయి. అయినా ఆమె ప్రశ్నకి సమాధానం చెప్పాలిగా. ఏం జవాబు చెప్పను? కంగారులో చెప్పేశాను - ''మీ ఊరు చూడ్డానికి.'' చెప్పేశాక తెలివొచ్చింది నేనేం చెప్పానో! ఆమె ఊరు చూడ్డానికంటే ఏవిఁటి అర్థం? ఈ పాటికి ఈమె నామనోబలహీనతని తప్పకుండా పసికట్టి వుంటుంది. ఎక్కడైనా ఈమెకి తప్పుతోచి ఎవరితోనైనా సందన్‌భాయి మావూరుచూడ్డానికి వచ్చారనంటే? కానీ ఇంతలోనే ఆమె ''అందులో మీరు సూట్టానికేటుంది? ఏదో మీ ఊరిలాంటిదే గదేంటి. సరే, ఇలా రావయ్యా, కూంత ఈ పాలు తాగు. కూంచేపటి క్రితమే తీసిన గేదెపాలు, మీకు మజా కలుగుద్ది.''

నాసంకోచం తొలగిపోయింది. నావ్యవహారాన్నీమె చెడుగా తలంచ లేదు. మీదు మిక్కిలి ఈమె తనే స్వయంగా నన్ను ఇష్టపూర్వకంగా పిలుస్తోంది. అందుచేత ఈమె నన్ను నీచుడిగా చూడటం వంటిదేమీ జరగదు. గులాబీ బుల్‌బుల్ పిట్టని పిలిస్తే బుల్ బుల్‌పిట్ట దోషమేముంది? పామే నెమలి దగ్గిర కొచ్చి కూర్చుంటే నెమలి దోషమేముంది? ఏమైతేనేం ఇప్పుడు నాకోరిక రూపుదాలుస్తుందిలే!

''ఈ విధంగా ఇక్కడ పాలు తాగడం ఎలాగే? రేపింటికొచ్చి ఇచ్చిపో.'' తాగాలని మనసులో ఎంతగానో ఉంది. కానీ ఈ విధంగా ఒకసారి అడగ్గానే తాగేశానంటే అసభ్యంగా ఉండదూ?''

''అరే, ఇంట్లో తీసుకుంటే తీసుకుందువులే గానీ ఈడాతాగు. ఆడ ఈ చక్కని మర్రి చెట్టునీడ దొరుకుద్దా? పచ్చులు ఇలా పాటలు పాడుతా దొరుకుతాయా? మల్లా మరి, ఆడ, ఏం ఇలా నా నేతి పాలు దొరికేనా? ఆడైతే ఒకేల నాసోదరికి తెలిసిపోనాదంటే ఓటి తీసుకుంటాది రొండిస్తాది.''

ఎవరైనా ఈమెని నిరక్షరకుక్షి అనిగనక అన్నట్టయితే దానర్థం ఈమెకి అక్షర జ్ఞానం లేదు అని. ఎవరైనా ఈమెకి మాటాడ్డం రాదు అని గనక అన్నట్టయితే దానర్థం ఈమెది పట్నవాసపు ఆడంబరం లేని భాషని. ఆమె ప్రకృతి మధ్య పెరిగింది. ప్రకృతిసిద్ధమైన అభిరుచినికనిపెట్టింది. పల్లెటూరి కంఠస్వరమే కానీ తనమధురమైన కంఠస్వరంలో దానిని నేను తెలుసుకునేటట్టు చెయ్యగలుగుతోంది. మళ్ళా మరి ఇటువంటి సమయంలో, ఇటువంటి ఏకాంతంలో ఆమె తన మనసులోని సమస్త భావాలనూ సహజ భావనా శక్తితో ప్రభావపూరితమైన తీరులోవ్యక్తం చెయ్యడంలో సర్వ సమర్థురాలు. నేను క్షణ క్షణం ఆమెకిస్వాధీనమైపోతూ బంధితుణ్ణి అయిపోతున్నాను.

''సరే, నేను పాలుతాగుతాను కానీ డబ్బులు తీసుకోవాలి.''

''పిచ్చాడిలాగున్నవే? ఇలా ఏడైనా డబ్బులుచ్చుకుంటరా? తాగక్కపోతే నామీద ఒట్టే,'' అందామె. నేను దగ్గరకు వెళ్ళి నిలబడేసరికి ఆమె గొంతుగ్గా కూర్చుని పాలగిన్నె నాముందుకు తోసింది. ఇప్పుడు ఎక్కువ ముందు వెనకలాడ్డం మంచిది కాదనుకున్నాను. నిష్ఠాచారం పాటించినట్లయితే వేడుకోలుకే కమలం చేజిక్కుతుంది. నేనామె చేతినుంచి పాలు కొలిచే ఆ గిన్నె తీసుకుని పాలు తాగేశాను. పాలు కాచినవి కావు. అందులో పంచదార కూడా లేదు. అయినా కూడా నాకవి రుచిగానే వున్నాయి. పాలు ప్రకృతి సిద్ధంగా రుచిగానే ఉంటాయి. తాజాగా పితికిన వాటిని తాగేవాళ్ళకి ఆ విషయం బాగా తెలుస్తుంది. పైగా ఈ పాలైతే ఒక సుందర స్త్రీ మూర్తి చేత్తో ఇచ్చినవి, పట్టుబట్టి మరీ ఇచ్చినవి, ఒక మోహావేశపరుడికి తాగడానికి దొరికినవి!

''గొల్లమ్మాయ్, నీదేకులం?'' పాలు తాగుతూ తాగుతూ మాటలు ప్రారంభించాను.

''నూశావా ధర్మం తప్పుతున్నావు!''

''లేదు - లేదు నేనందుకడగలేదు. ఊరికే తెలుసుకుందామని. చెప్పు ఏకులం నీది?''

''ఎందుకేటి? మేము పశువుల్ని మేపుకునే యాదవ కులపోళ్ళం.''

''నీకు పెళ్ళి అయిపోయిందా లేక కన్యవేనా?'' నాపిచ్చి ఇప్పుడు ముదరడం ప్రారంభించింది.

కొంచెం సిగ్గుపడి ఆమె మెల్లగా చెప్పింది – ''పెళ్ళైనాది.''

''ఎవరితో?''

''అరే సందన్ భాయీ, ఏడైనా ఆడి పేరు సెబుతారేటి? నావంటి గొల్లతనితోనే.''

''ప్రేమంటే ఏమిటో నీకు తెలిసిందా''? నేను ఒంటిమీద తెలివి లేకుండా ఏమడగవచ్చో ఏమడగకూడదోకూడాతెలీకుండా మాట్లాడుతున్నాను. నేనేమడిగానో ఆమె అర్థం చేసుకోలేదు.

''ఏటీ?''

''నీకు తెలుసా ప్రేమంటే ఏమిటో? నీకు మీ ఆయన బాగుంటాడా?''

''సందన్ భాయీ, నీకేమైనా పిచ్చెక్కినాదా?''

''కాదు, చెపుదూ, నీ వెనక ఇంతదూరంవచ్చాంమరి. పేట కొచ్చినప్పుడు మాట్లాడదామంటే భయం. చెప్పు, ఇప్పుడు ఒకవేళ నువ్వు నాతో మాట్లాడక పోతే నామీదొట్టు,'' అని చెప్పి నేనామెకు దగ్గరగా కూర్చున్నాను. మధ్యలోపాలకుండ వుంది.

హఠాత్తుగా ''అ...య్యో! నేను నాచిన్నమూట మర్చి పోయాను. అయ్యయ్యో!'' అనేసరికి తుళ్ళి పడ్డాను. ఆమె నిలబడిపోయి– ''సందన్ భాయీ, కొంచెం నా పాత్రలు చూత్తాండవా? నేను చిట్టుమూట ఏడో వొదిలేసొచ్చినా. పరుగెట్టుకెళ్లొచ్చేస్త.''

ఎందుకు చూడనూ? కొంచెం సేపేయేవిఁటి ఆమె రోజంతా ఎండలో కూచోమని చెప్పినా అందుకు నేను సిద్ధమే.

''ఆఁ ఆఁ వెళ్ళి తెచ్చుకో. నేనీ పాకలో కూచుంటాను.'' దారిలో కూచోవడం ఎవరైనా చూస్తే ఇక్కడ కూచున్నావేఁమిటి అంటారని బిందెని తీసుకువెళ్ళి పాకలో కూచున్నాను. లోపల ఎవరో గడ్డి పరచి పడక తయారు చేసివుంచారు. పైన తాటాకులకప్పుని తుమ్మకొమ్మలస్తంభాల మీద నిలబెట్టారు. వెనుక గోడలో కిటికీ వుంది. గోడకి జార్లబడి కాళ్ళు చాపుకు కూర్చున్నాను. వహ్వా గొల్ల సుందరీ! నీ గ్రామ్య భాషలో ఎంత తియ్యదనం! ఇవాళ దాన్ని పోనివ్వను. ఇంటికెళ్ళాలన్న ఆలోచన కూడా రానీకుండా మాటల్లో పెట్టి ఆపేస్తాను. చూస్తాను. ఆమె నాకు గోవుల్ని మేపటం నేర్పుతుందో లేదో.

ఆమె పల్చని చీర, బిగుతైన చోళీ, ధరిస్తే ఎలా వుంటుంది? కొప్పులో గులాబీ తురిమి, మెడలో ముత్యాల హారం వేసుకుని ఇదే మత్తెక్కించే తీరులో వెళుతూ వుంటే ఈమె ఎవరిని మైమరిపించదు? కల్పనల్ని జోడించుకుంటూ నేనామె రూపాన్ని మరింత ఎక్కువ మోహపూరితం చేసుకుంటున్నాను. నేను కల్పించుకున్న ఆ చిత్రం దిశగా మరింత మోహావేశంతో వెళ్ళి పోతున్నాను.

ఆమెబిందెమీద ఏదోపేరువ్రాసివుంది. దాన్నిచూడ్డం ప్రారంభించాను. ఆ స్పష్టమైన అక్షరాలలో కేవలం 'దలీ' అనేది చదవగలిగాను. దాంతో ఆమె పేరు 'దలీ' కావచ్చుననుకున్నాను. కానీ అది స్త్రీ పేరేనా? బహుశః పుట్టింటినించి అత్తారింటికెళ్ళేటప్పుడు ఈబిందెనిఆమె తల్లి దండ్రులిచ్చి వుండొచ్చు. వీటినామె లోపలా-బయటా ఎంత పరిశుభ్రంగా వుంచిందీ! ఇలా వుండబట్టే మరీ పాలఅందం రెట్టింపయిందటేనూ, బాగున్నాయంటేనూ ఇందులో ఆశ్చర్యం ఏముంది? కాని ఆమె నెత్తిమీద పెట్టుకునేచుట్ట కుదురు నెందుకు తీసుకెళ్ళలేదూ? ఆమె బిందె తలమీద అలవోకగా పెట్టుకుని గ్రామంలో కొస్తూంటే ఆమె కంఠస్వరం ఎలాగుంటుంది! తెలతెల వారుతూన్న సమయంలో మేలు కొలుపు పాటలా తియ్యగా వుంటుంది. అర్ధ జాగ్రదావస్థలో అది వినపడితే ప్రాతః కాల శుభశకునాల స్వప్నం వస్తుంది. రోజంతా ఆనందంగా గడుస్తుంది. గ్రామానికంతటికీ ఆమె ఆశీర్వచనాన్నిచ్చే దేవి మాదిరిగా వుంటుంది.

ఈ విధంగా ఆలోచించుకుంటూ ఊహించుకుంటూ నేను సుమారు ఇరవైనిమిషాలైనా కూర్చునుంటాను. ఈలోగాఆమెవచ్చేసింది. ''కూర్చు న్నావా?'' అంది.

''ఏం మూట దొరికిందా?''

''లేదు భాయీ! నాలుగైదిళ్ళలో అడిగివస్తున్నా, కానీ ఏడాలేదు. ఎవురింటో వొదిలోసినానో. నడిజాము అయిపోనాది ఉప్పుడు దాకా దానికోసరం తిరిగినా'' ఇలా చెప్పిచెప్పి ఆమె నిరాశ చెందిన దానిలా కూలబడింది.

''దలీ.''

'దలీ' అన్నది వింటూనే ఆమె కొంచెం తుళ్ళి పడింది - ''గ్రామంలో అందరూ నన్ను పాలుపోసే అమ్మాయంటారు.''

''చూడు, ఇది నీ బిందెమీద వ్రాసుంది. ఇది మీ పుట్టింటి నించి వచ్చినది కదూ? నీ పెళ్ళి సమయంలో.''

నేనామెలో తాదాత్మ్యం చెందాను అందుచేత ఆమె గురించి అలా అంచనాలు వేసుకోవడంలో ఆశ్చర్యంలేదు.

''మీ ఆయనకి ఇద్దరు భార్యలా?'' నా దృష్టి ఆమె సుందర శరీరంమీద పడినప్పుడు ఆమె మెడలోని 'సవతి మాల'ని చూసి అడిగాను. ఆమె నావేపోసారి చూసి చీర సవరించుకుని పైకి లాక్కుంది.

''రోజంతా మీ భార్యాభర్తలు ఏం చేస్తారు?''

''అరే మీ మొగజాతి... '' అని క్రీగంట చూసి నవ్వేసింది. మొగ్గల్లాంటి పలువరుసని పెదవి చాటున దాచి నవ్వుతుంది.

''లేదు – లేదు. మంచిమాటే. ఉదయం నించి సాయంకాలం వరకూ మీరిద్దరు ఏమేం పనులు చేస్తూంటారూ అని, చెప్పు.''

''ఏం పన్లు సేత్తామా? పశువులపని. తెల్లారుతుండగానే శానా తొందరగా లెగసిపోతం. పల్లుతోముకోడం అదీ సేసి దూడలకి పాలు కుడుపుతాం. ఆడు ఆవులికి పాలు తీత్తాడు నేను గేదలకి పాలు తీత్తాను. పాలు కాచినాక పశువులికి మేతా అదీ యేసి మేవిఁద్దరం బయటికి బయల్దేర్తం. ఆడు అటు పోతాడు, నేను మీ యెంపు వత్తాను. పాలమ్మిన తర్వోత నేనిక్కడికొచ్చి కూకుంటాను. ఆడొచ్చేవరకూ ఈడే కూకునుంటాను.''

అకస్మాత్తుగా నాగుండె దడదడలాడ్డం ప్రారంభించింది. ఈమె భర్త వస్తూండవచ్చు. వొచ్చి అతను నేనామెతో కూర్చునుండడం చూస్తే? పరువు పోతుంది. నీచంగా చూడొచ్చు. కొట్టినా కొట్టొచ్చు. ఇలా ఆలోచిస్తూంటే నా ముఖమ్మీద భయం, ఆందోళనముసురుకున్నాయి. నేనక్కణ్ణించి వెళ్ళిపోవడానికి టోపీ సరిచేసుకున్నాను.

''కానీ మీరేం భయపడమాకండి. ఇయ్యాల నేనొక్కర్తినే. వచ్చినా. ఆడియ్యాల నెయ్యి అమ్మటానిక్కి ఎల్లాడు.''

నాకు మనసు కుదుట పడింది. ఆమెతో మాటలు ప్రారంభించాను – ''మీరందరూ అతని దగ్గిరే నిలబడిపోయేటట్లు మీ ఆయన పిల్లన గ్రోవి వాయిస్తాడా? నేను చెరువుగట్టున నిలబడి పిల్లనగ్రోవివాయిస్తే నాకు వాయించడం వొస్తుందా?''

''ఆహా, ఎందుకు రాదూ! అయితే మీకు మాలాగా మారిపోటం అనేది ఎందుకు బాగుంటాదంటా?''

''నీ కోసమే దలీ! నువ్వేది తింటే అదే తినాలనీ, లావుపాటి రొట్టెలని నీకోసం కాల్చాలనీ, నీ ఆవుల్ని కాయడానికి వెళ్ళాలనీ నాకు మనసుగా వుంది. మీగ్రామం ఇంకా ఎంత దూరం వుంది?''

''నాలుగైదు పొలాలకాతలే. ఆఢ పోకసెట్టు కనబట్టంలా, ఆడే. మీరు నిజింగానాయింట వుంటారా? మేమైతే ధోవతుల బొంతమీద తొంగుంటాం.

ఆరుబయట మంచం యేత్తాం. దగ్గిర్లోనే పశువుల్ని కట్టేత్తాం. అయి రేత్రి తెల్లార్లూ గోం-గోం - అని అరుత్తా ఉంటాయి. మీయంటోరికి ఆడ బాగుండదు.''

''నామటుకూ అది చాలా బాగుంటుంది. అక్కడ కూడా నీలాటి దెవరేనా నాతో పాటే ఉంటే అప్పుడిక నేను ఇంటికెళ్ళాలన్నమాటే తలపెట్టను.''

ఈ సంభాషణవల్ల ఆమె నాకు ఆత్మసమర్పణ చేసుకుంటుందనీ, నేనామె మనసుని దొంగిలించగలననీ, ఆమె మెల్లి మెల్లిగా తన భావాల్ని వ్యక్తపరచడం ప్రారంభిస్తుందనీ నాకు అనిపిస్తోంది. పూవు మాదిరగా నామనసు వికసిస్తోంది. సెలయేరులా నా కల్పన ప్రవహిస్తోంది. మొగలిపూవు మాదిరి నామనసు ఊగుతోంది. ఆమె గడ్డిపోచ తీసుకుని నేలమీద గీతలు గీస్తోంది. దానిని వంచి విల్లు తయారు చేస్తోంది. మళ్ళా దాన్ని తుంపి ముక్కలు ముక్కలు చేసి పడేస్తోంది. ఈ విధంగా ఆమె ఆడుకుంటోంది. గాభరా, సిగ్గు, భయం లేకుండా నాతో స్నేహితురాల్లా పరిచయమై కబుర్లు చెపుతోంది.

కొంచెం సేపు మేం నిశ్శబ్దంగా ఉండిపోయాం. ఇంతలోనే మెరుపు మెరిసినట్టు, పిల్లవాడి గుండె రంజిల్లినట్టు, అఘోరఘంట వచ్చినట్టు, మాలతీ లత పుష్పించినట్టు, ఆనందం అలుముకుంటున్నట్టు ఉండాల్సిందల్లా - శోకం వొచ్చి పడ్డమాదిరిగా తెరిచి వున్న కిటికీ లోంచి నా భార్య తొంగి చూసి క్రోధంతో నా వేపు రెప్పార్పకుండా చూస్తోంది.

అది చూడగానే నా శరీరం కంపించడం ప్రారంభించింది. క్రోధం కారణంగా ఆమెకళ్ళల్లోనీరుతిరుగుతోంది. మాట్లాడటమా లేక మాట్లాడక పోవడమా అన్న సందిగ్ధంలో పడింది ఆమె. స్వల్పంగా అది వ్యక్తపరచడానికి నిట్టూర్చిందేగానీ మళ్లా ఒక్కమాట కూడా మాట్లాడలేదు. కేవలం నావేపే చూస్తూండిపోయింది. నేను చూపులు కిందకి వాల్చేశాను. ఇంక దలీ... ధత్తే రీకీ! దలీ చీర చెరుగులో మొహం దాచుకుని నవ్వుతోంది.

చిత్రకారుడికి చిత్రించడానికిక్కడిప్పుడు మూడు విచిత్రాలున్నాయి. ఒకటి పువ్వు, రెండోది ఐంద్రజాలికురాలు, పోతే మూడు ఒక మూర్ఖుడు.

# 2. రాజపుత్ర వనిత

**ధూమకేతు**

గౌరీ శంకర్ గోవర్ధన రాయ్ జోషీ (క్రీ.శ. 1892-1965) పుట్టినదీ పెరిగినదీ, చదువుకున్నదీ గుజరాత్‌లో. చదువు నేర్పడం (బోధించడం), రచన చెయ్యడం ఒక ఉద్యమంగా స్వీకరించారు. నవల, ఆత్మ కథ, వ్యాసం మొదలైన సాహిత్య ప్రక్రియలంటే వీరికి ప్రీతి, కానీ కథ అంటే విశేషమైన పక్షపాతం. ఈయన కథా సంపుటులలో పేర్కొనదగినది 'తణఖా' భాగం 1 నుండి 4 వరకూ 'చౌలాదేవీ' మొదలైన నవలల వల్ల కూడా వీరికి పేరొచ్చింది.



రూపేణ నది వర్షాకాలంలో రెండు తీరాల వరకూ పొంగి ప్రవహిస్తోంటే చాలా భయంకరంగా ఉంటుది. ఎవరైనా దాని పాలబడితే సుడి గుండంలో పడి చూస్తూ చూస్తూండగానే అదృశ్యమై పోతారు. ఒక వర్షాకాలం నాటి మాట, రూపేణకి వరదొచ్చింది. పొలాలు మునిగిపోయాయి. నదులూ, కాలవలూ విరుచుకుపడ్డాయి. మబ్బులన్నీఏకమై భూమినీ ఆకాశాన్నీఏకం చేసెయ్యాలన్న ఆవేశంతో ఎడతెరిపి లేకుండా కురుస్తున్నాయా అనిపిస్తోంది. ఆ సమయంలో ఒక జాగీర్దారు తన గుర్రం మీద సవారీ అయి అక్కణ్ణించి బయలుదేరాడు.

ఆయన తన గుర్రాన్ని రూపేణలోకి తోలాడు. గుర్రం మంచి ఉత్తమ జాతికి చెందినదీ, మంచి వేగంగా పరుగెత్తేదీ, కానీ నదీ ప్రవాహం చాలా వేగంగా వుంది. కొద్ది సేపట్లోనే గుర్రం, గుర్రపురౌతూ ఇద్దరూ నీళ్ళలో మునకలేస్తూ గిరగిరా తిరుగుతూ సుడిగుండంలోకి వెళ్ళి పడ్డారు.

జాగీర్దారు ఎంతగానో కాళ్ళతో, చేతులతో ఈద ప్రయత్నించాడు కానీ అతని శ్రమంతా వృథా అయి కొద్దిసేపటికి ఆ సాహసం, శౌర్యం అచేతనమై పోయాయి.

వరదలేని రోజుల్లో రూపేణలోంచి వెళ్ళే మార్గం సుందర వనరాజ వృక్షాలతో పరిపూర్ణమై చాలా రమణీయంగా వుంటుంది. అక్కడ ఒక మర్రి చెట్టువుంది. బాటసారులు బళ్ళు ఆపుకుని దాని కింద విశ్రాంతి తీసుకోవడం

కోసరం నాటారా అన్నట్టుగా. ఈ సుందర వటవృక్షంకింద ఎంతమంది పథికులు విశ్రాంతి తీసుకున్నారో, ఎన్ని పశువులు విశ్రాంతి సుఖాన్ని పొందాయో లెక్కలేదు. రూపేణనది, ఇటువంటి సుందర వటవృక్షం, సుందరంగా, స్వచ్ఛంగా ఉన్న నేల, చిన్నదైనా అందంగా వుండి భయంకరం అనిపించని వనం – వీటన్నిటి కారణంగా ఈ ప్రదేశం ఎలా వుందంటే పిరికివాడి కన్నా పిరికి వాడైన వణిజుడి హృదయం కూడా ఇక్కడ విశ్రాంతి తీసుకోవాలని ఆశపడుతుంది.

కానీ ఆ జాగిర్దారు మృత్యువు తర్వాత ఈ సుందరమార్గం ధ్వంసం కాజొచ్చింది. చాలా కష్టాల కోర్చుకోవలసి వచ్చినప్పటికీ జనం మరో సుదీర్ఘమైన మార్గం గుండా వెళ్ళడం ప్రారంభించారు. ఈ సుందర మార్గం పాడుబడింది. పొరుగున వున్న గ్రామాల్లో ఈ మార్గం గుండా వెళ్ళే ఏ బాటసారీ సురక్షితంగా పోలేడన్న వార్తనలువైపులా ప్రబలింది. ఇందుకే జనం రమణీయమైన ఈ మార్గాన్ని వదిలి జనసమ్మర్దం లేని మార్గం గుండా వెళ్ళడం ప్రారంభించారు, క్రమక్రమంగా పరిత్యజించబడిన ఈ మార్గం నిర్మానుష్యంగా, భయంకరంగా మారిపోయింది.

ఒకసారి సరిగ్గా మిట్టమధ్యాహ్న సమయంలో మిటమిట లాడుతున్న ఎండలో ఒక చారణ్ సమీప గ్రామానికి వెళ్ళి ఈ మార్గంలో రావడానికి బయలు దేరాడు. గ్రామంనించి బయలుదేరిఅతను దారడిగితేచాలామంది అడక్కుండానే ఇలా సలహా ఇచ్చారు –''భాయీ! ఈ మార్గం వెళ్ళడానికి తగినది కాదు, ఈ దారిన వెళ్ళేవాడి శిరస్సు మొండెం మీద వుండదు.''

''ఎందుకూ? ఏమిటి సంగతి?''

''అయిదు సంవత్సరాల క్రితం మాట. ఒక జాగీర్దారు మరణించినప్పటి నించీ ఈ దారి నిర్మానుష్యమై పోయింది. జాగీర్దారు వర్షాకాలంలో నది దాటే సాహసం చేశాడు కానీ ఆయన ఆశ పూర్తి కాలేదు. ఆయన నది దాటి తన అత్తవారి ఊరికి వెళ్లాలిసివుంది – భార్యని తీసుకురావడానికి, కానీ దారిలోనే మునిగిపోయాడు. దాం తర్వాత ఈ దారిన వెళ్ళిన వాడెవడూ లేనేలేడు.''

''చూద్దాం'' అనేసి చారణ్ గుర్రాన్ని పరుగెత్తించాడు. గ్రామ ప్రజలు మృత్యుముఖంలోకి వెడుతున్న ఆ మూర్ఖుణ్ణి చూసి నవ్వుకున్నారు. చారణ్ ఆ మార్గానే వెళ్ళాడు.

మధ్యాహ్నపు ఎండ తగ్గసాగింది. పశువులు – పక్షులు ఎండకి నిస్త్రాణొచ్చి కొంత సేపు విశ్రాంతి తీసుకోవడానికి నీడపట్టుకి వెళ్ళాయి. నాలుగు చెరగులా ఒక విధమైన నీరవత అలుముకుంది. రూపేణ యొక్క

సుందరమైన ఒడ్డు వెన్నెల ప్రవహిస్తోందా అన్నట్టుగా కనిపిస్తోంది. ఇదంతా చూశాక చారణ్ మనసులో లక్షల కొద్దీ, తరంగాలు లేవడం ప్రారంభించాయి, ఓహో! ఇటువైపు మర్రి చెట్టు వొంగివుంది; రెండోవైపు మోదుగ చెట్ల అడవి నిలిచింది; దట్టమైన నీడలో పావురాలు, తీతువు పిట్టలు, నెమళ్ళు ఎలాటెలాటి గోష్ఠిలు ఏకమై ఉన్నాయో! చారణ్ ఆ ప్రదేశంలో ఇటువంటి మనోహర దృశ్యాల్ని చూసి ''వహ్వారూపేణ! వహ్వారూపేణ!'' అనుకుంటూ ముందుకి సాగడం ప్రారంభించాడు. అతను మర్రి చెట్టుకి దగ్గిర కెళ్ళి అక్కడ ఒక అపూర్వ దృశ్యం చూశాడు. అలా చూస్తూ స్తబ్ధుడైపోయి నిలబడి పోయాడు.

మర్రి చెట్టుకింద దాదాపు పాతికమంది దేవతల్లాటి రాజపుత్రుల సభ తీర్చివుంది. అందమైన ''దివాను'' పైన లావుపాటి మెత్తలు పరచివున్నాయి. వాటిమీద తెల్లటి దుప్పట్లు పరచి వున్నాయి. నడుమ పరచివున్న రత్న కంబళం మీద కూర్చుని వున్న ఒక యువరాజపుత్రుడు మండలితో ఏదో చెబుతున్నాడు. మర్రిచెట్టు దగ్గిర కచ్ఛ్, కఠియవాడ్‌లకి చెందిన మంచిజాతిఅశ్వాలు నిలబడివున్నాయి. మండలిమధ్యవెండిహుక్కా ఇటునుంచిఅటూ తిరుగుతోంది. ఒకవేపు కుసుంభామతు, పానీయం నింపి వున్న నగిషీపాత్ర. ఒకవేపు మిఠాయిలున్నపళ్ళెం నిండుగా వున్నాయి. సమృద్ధి, పరంపర, శౌర్యాల సజీవ ప్రతికృతిని చూసి చారణ్ కూడా గుర్రం దిగిపోయి మండలి వేపు నడిచాడు.

అతను రావడం చూసిన యువ రాజపుత్రుడు మందహాసం చేశాడు. మండలి వేపు అర్థవంతంగా చూశాడు. పాతిక - ఏభై కంఠస్వరాలు అతనికి స్వాగతమిచ్చాయి. - ''రండి, రండి, చాలా మంచి సమయంలో వచ్చారు. ఎక్కణ్ణించి వస్తున్నారు.?''

చారణ్ అక్కడ కూర్చున్నాడు, కానీ సభ మొత్తంలో అతనికి ఎవరి ముఖంలోనూ, మానవవర్చస్సు కనిపించలేదు, అందుచేత అతను జవాబివ్వడంలో కొంచెం వెనుకాడాడు. కానీ మర్రిచెట్టు కింద సకిలిస్తున్న ఉత్తమాశ్వాల్ని చూసి అతను శాంత చిత్తంతో ఎదురుగా కూర్చుండిపోయాడు. మండలిలో తిరుగుతున్న హుక్కానించి రెండు-మూడు దమ్ములు కొట్టాడు, కుసుంభా మాదక పానీయాన్ని కూడా సేవించాడు. అతను స్వప్నలోకంలో కొచ్చినట్టుగా ఉంది. రకరకాల కబుర్లు చెప్పడం ప్రారంభించాడు.

''మీరు దేవీ పుత్రులు కదూ?'' ఆ రాజ పుత్రయువకుడు హఠాత్తుగా మధ్యలోనే అడిగాడు - ''ఒక ప్రశ్నకి జవాబివ్వండి.''

చారణ్ అతనివేపు చూడసాగాడు.

''విషయం ఏమంటే పరమేశ్వరుడు ఇన్నిన్ని రోజుల్నీ, ఇన్నిన్ని ఋతువుల్నీ కల్పించాడు, ఒక ఋతువులో ఆనందం మరో ఋతువులో దొరకదు, మరైతేసమస్తఋతువుల్లో అన్నిటికన్నామంచిదీ, ఆనందదాయియైన ఋతువేది?''

చారణ్ విషయం అర్థమైనట్టుగా మోగాళ్ళమీద కూర్చున్నాడు.

''దర్బార్! ఋతువులైతే అన్నీ మంచివే, అయితే ఆ దీనావనుడు స్త్రీ-పురుషుల కోసం శిశిర ఋతువుని సృష్టించి చేతులు కడిగేసుకున్నాడు. శిశిర ఋతువు బాప్-రే! ఏది గతి. శిశిరం వస్తుంది. రకరకాల వంటకాలు తింటారు, చక్కని నిప్పు సెగ దగ్గిర వెచ్చదనం పొంది శరీరం ఆనంద పరవశమవుతుంది. వేయించబడిన లేతగింజలు, శనగల సాతాళింపు, తియ్యని ఆవుపాలు, చక్కని అంగనలు! బాప్-రే! శిశిర ఋతువు గురించి చెప్పనేల! ఆ దీనావనుడు శివపార్వతులచేత యోగసాధన విరమింప జెయ్యడానికి శిశిర ఋతువుని సృష్టించాడు.

రాజపుత్ర యువకుడు మెరిసే కళ్ళతో చారణ్‌ని చూడసాగాడు.

''కానీ, మానవమాత్రుడికి జీవితాన్నిచ్చే వర్షఋతువు ఏమవుతుంది.'' అతను తిరిగి చారణ్‌ని ప్రశ్నించాడు. చారణ్ తల ఊపాడు - ''లేదు దొరాలేదు! ఎక్కడ చూడండి నీళ్ళు, బురద, మళ్ళీ మెరుపు మెరుస్తుది, జంతువులు దుఃఖ పడతాయి, మనిషి వ్యాకుల పడతాడు...''

రాజపుత్రుడు ఇంకొంత కుంచించుకుపోయాడు. అతని మెరిసే కళ్ళలో తీవ్ర వేదన, నిరాశ కనిపించాయి. చారణ్ చూస్తూండి పోయాడు. తిరిగి చెప్పాడు.

''ఇటువంటి వర్షఋతువు ప్రభూ, దుఃఖదాయిని కూడా అవుతుంది. బాగు బాగు ఎక్కడైనా ఈ ఋతువులో ప్రియుడు కామినీ ఆనంద పూర్వకంగా నవ్వుకుంటూ ప్రేమ మాటలు చెప్పుకోగలుగుతారా? స్వామీ, ఋతువుల్లో ఋతువు శిశిర ఋతువు! దీని తర్వాత మంచి ఋతువేదైనా వుంటే అది గ్రీష్మం - బాగు బాగు వర్షఋతువు కూడా ఒక ఋతువే! అది మంచి ఋతువు కాదు!''

''చాలా బాగుంది, చారణ్, నువ్వు నిజంగా దేవీ పుత్రుడివి'' అంటూ రాజపుత్రుడు లేచి నిలబడ్డాడు. చారణ్ చేరువకు వొచ్చి అతని చెయ్యి పట్టుకుని లేవదీశాడు.

''దేవీపుత్రా, నేనుజాగీర్దారును'' రాజపుత్రుడు చెప్పడం ప్రారంభించాడు. చారణ్ భయవిహ్వాలతతో అటూ ఇటూ చూశాడు. మండలి మాయమైనట్టు, గుర్రాల సకిలింపు బంద్దై పోయినట్టు తెలిసొచ్చింది. ఇప్పుడు కేవలం అతనూ, జాగీర్దారు మాత్రమే మర్రి చెట్టుకింద నిల్చునున్నారు!

''చూడు, భయపడకు, ఆఁ...!''

చారణ్ నవ్వాడు - ''నేను భయపడతానా, బాగుంది! చెప్పు రాజపుత్రా, నువ్వు చెప్పదల్చుకున్నది చెప్పు.''

రాజపుత్ర వీరుడి ముఖంమీద ఆశాకిరణాలు విచ్చుకుంటూ వ్యక్తమయ్యాయి. అతను మరింత ప్రేమతో చారణ్ చేతిని వొత్తి చెప్పాడు - ''అయిదు సంవత్సరాల క్రితం నేను భారీ వర్షంలో నాపత్నిని కలుసుకోవడానికి బయలుదేరాను. రూపేణ కివరదవొచ్చివుంది. ఆ సుడిగుండం...'' అతను చెయ్యెత్తి అగాధంవంటి సుడిగుండం వేపు అత్యంత దుఃఖం కూడుకున్న దృష్టితో చూశాడు - ''నేనా సుడిగుండంలో మునిగిపోయాను. పత్నిని కలుసుకోవాలన్న ఆశనా మనసులోనే మిగిలిపోయింది.''

రాజపుత్రుడు కొంచెంసేపు మౌనంగా ఉండిపోయాడు, నిరాశ అనే కొండని దాచాలని ప్రయత్నిస్తున్నట్టుగా, మళ్ళీ చెప్పాడు -''దేవీ పుత్రా, ఇద్దరు వ్యక్తుల మధ్య వియోగంవంటి విషాదం మరొకటేముంటుంది?''

''మరేదీ లేదు ప్రభూ, కానీ నువ్వు నీకథ పూర్తిగా నాకు వినిపించు.''

''ఏడేడు జన్మాంతరాల విషమ చక్రం నా శిరస్సుమీద పరిభ్రమిస్తోంది. నువ్వు నాకోపని చేసి పెట్టినట్లయితే దారీ తెన్నూలేక తిరుగుతున్న నా ఆత్మకి సద్గతి కలుగుతుంది. ఆత్మ అనేది అగ్ని జ్వాలలో కూడా కాలదనీ, దాని క్కూడా అశరీరవాసన లుంటాయనీ నీకు తెలుసు.''

''అవును.''

''అయినప్పుడు నువ్వు రూపేణని దాటి దక్షిణం వేపు సాగిపో. అయిదు ఊళ్ళ తర్వాత దాంతాసర్ అనే ఊరువస్తుంది. అక్కడ నా పత్ని నివసిస్తోంది - ఎంత సౌందర్యవతంటే కేవలం సింధూరంతో రూపొందించినట్టుంటుంది. ఆమె ఒకసారి వొచ్చినాకు దర్శనమిస్తే నా ఆత్మకి శాంతి లభిస్తుంది. నువ్వు తప్ప ఈ పనిని ఎవరు చెయ్యగలుగుతారు?''

రాజపుత్రుడి అభ్యర్థనా పూర్వకమైన దుఃఖ భరిత స్వరం పూటుకు లీతుండగా చారణ్ జవాబిచ్చాడు - ''ఠాకుర్, నేను నిజమైన దేవీ పుత్రుణ్ణే అయితే ఠాకురానీని తప్పకుండా ఇక్కడికి తీసుకవస్తానని ప్రతిజ్ఞ చేస్తున్నాను.

కానీ నువ్వు కూడా నిజమైన రాజపుత్రుడువే అయితే రాజమార్గంవంటి ఈ మార్గం మీదకి మళ్ళీ రానని మాటివ్వు.''

''వెళ్ళు, నేను మాటిస్తున్నా. నేనీ మార్గాన్ని వదిలి వేస్తాను. చారణ్, నేను వర్షాకాలంలో మరణించాను అందుచేత వర్షఋతువు నాకు చెడ్డదిగా కనిపిస్తుంది. ఋతువుల్లో ఏఋతువుమంచిది అని మాత్రమే అడుగుతుంటాను - నేను బాటసారుల్ని. వాళ్ళు షాక్‌వల్ల లేక భయం వల్ల మూడోరోజు చనిపోతూంటారు. మరి వాళ్ళు అలా మరణిస్తూంటే ఇందులో నా దోషమేమిటి చెప్పు చారణ్.''

''సరే, ప్రభూ, నేటినుంచి ఎనిమిదో రోజున ఠాకురానీ ఇక్కడికి వస్తారు.''

చారణ్ తలతిప్పి గుర్రం కళ్ళెం పట్టుకోవడం కోసం వెనక్కి దృష్టి సారించాడు. మళ్ళీ తిరిగి చూస్తే అక్కడ కేవలం మర్రి చెట్టు ఆకులు గలగలమని శబ్దం చేస్తున్నాయి. తీవ్ర వేదనని అనుభవించడం కోసం అతను ఒంటరిగానే నిలిచి పోయి ఆకుల్ని ఖట ఖట మనిపిస్తున్నాడు.

రాజపుత్రుడు చెప్పిన మార్గంలో వెళ్ళి చారణ్ దాంతాసర్ చేరుకున్నాడు. చారణ్‌కి యుద్ధ క్రీడలలో నిమగ్నమయ్యుండే రాజపుత్రులంటే ఇష్టం, అదొకటి మరొకటి రాణివాసంలోకి ప్రవేశిస్తే అది రాజదర్బారులోని ఏ వ్యక్తికయినా సరే అతని మీద కళంకాన్ని ఆపాదిస్తారు. కాని రాజకవైతే ఎల్లప్పుడు నిర్దోషిగా పరిగణింపబడతాడు. అందుచేత చారణ్‌కి ఠకురానీని ఏకాంతంగా కలుసుకోవడానికి కష్టమేమీ లేదు. అతను రాజపుత్రుడి అత్తవారిల్లు చేరాడు. ఏకాంతంలో రాజపుత్రవనితని కలిశాడు.

''ఠాకురానీ, నేనొక పనిమీద వచ్చాను, చూడూ, నిరాకరించవద్దు.'' కాఠియాణీ భాష కొంచెం కర్కశంగా ఉన్నట్టనిపిస్తుంది, కానీ ఠాకురానీ ఎంత సౌందర్యవతో అంతగానూ మధురంగా వుంది ఆమె వాణి. మాట్లాడేటప్పుడు చెవులకున్న చిన్న చిన్న బంగారు జూకాలు ఊగుతూంటే సుందరమైన దంతావళి కనబడుతోంటే ఆమెపలుకులోఅపారమైన మాధుర్యంనిండి వున్నట్టనిపిస్తోంది. ఠాకురానీ జవాబిచ్చింది - ''చెప్పు, నాతో అటువంటిదే పనొచ్చి పడింది?''

''అమ్మా, బతికుండగా ప్రేమించడం అందరూ చేస్తారు, నేను మరణించిన తర్వాతి ప్రేమ గురించి మాట్లాడ్డాని కొచ్చాను.'' ఠాకురానీ తుళ్ళిపడింది. చారణ్ చెప్పేది ఎంతో ఆత్రుతతో వినసాగింది. చారణ్ అడిగాడు - ''ఠాకుర్ పోయి ఎన్ని సంవత్సరాయింది?''

''అయిదేళ్ళు.''

సరిగ్గా చెప్పారు. నిజం చెప్పాలి, దాని తర్వాత నువ్వాయన్ని కలలో చూశావా?''

''లేదు, ఎప్పుడూలేదు. వెళ్ళిపోయినతర్వాత ప్రేమని మర్చి పోయారనే అనిపిస్తోంది.''

''లేదమ్మా లేదు. అసలు కులీన రాజపుత్రుడు, బాగుంది, సతిని మర్చిపోగలడా? శివపార్వతులయోగంలో ఏమైనాలోటుండగలదా? మర్చి పోలేదు, ఆయన ఇప్పటిదాకా నిన్ను మరవలేదు. ఇంకా వినమ్మా, కోపగించుకోవద్దు, నువ్వు నిజమైన రాజపుత్రివేనా?''

రాజపుత్రి బిగుసుకు పోయింది. చారణ్ కంపించి పోయేంత దృ ఢస్వరంతో పలికింది – ''పరీక్షకి, నిలబడాలా యేం? ఠాకుర్ భూతమై నా క్షేమ సమాచారం అడిగారా?''

చారణ్ చకితుడై ఉండిపోయాడు – ''విచిత్రంగా వుంది ఠాకురానీ! నీకెలా తెలుసు?''

''ఎలా తెలుసు! ఏ రాజపుత్రుడైతే రణసంగ్రామంలో మరణించడో, అతను భూతమే అవుతాడు. ఆ భూతాన్ని దాని వాసనాసహిత జడమూల సమేతంగా నాశనం చెయ్యాలి. అందుకే నేను సహగమనం చెయ్యలేదు. చెప్పు, ఇప్పుడు నువ్వేం చెప్పదల్చుకున్నావు?''

''ఠాకుర్ నిన్ను కలుసుకోవడాని కొస్తున్న సమయంలోనే రూపేణలో మునిగిపోయారు, అలాంటి లాంటి ప్రేమా ఇది?''

''కాదు – కాదు, అలాటిలాంటి దెందు కవుతుందీ!'' ఠాకురానీ కఠిన స్వరంలో చెప్పింది – ఇందుకోసమే కాబోలు బంగారం లాంటి రాజమార్గాన్ని ఠాకుర్ పాడుపెట్టేశారు. ఏం?''

''నిజవేఁమ్మా నిజం, కానీ మరణించిన వారితో శత్రుత్వమేమిటి? భూతప్రేతాలతో ఎవరు నెగ్గగలరు? ఇదైనా వాటికీ వాసననేదుంటుంది. ముక్కా చెక్కా పడేసి నట్లయితే పారిపోతాయి. విను, ఠాకుర్ కున్న వాసనల్లా నిన్ను చూడాలని, రెండు రోజుల క్రితం ఆయన నన్ను మఱ్ఱి చెట్టుకింద కలిశారు. దిన్ – దాహడే కేసరీ సింగ్ మాదిరి దర్బారు తీరి కూర్చున్నారు. దైవాంశ కలిగిన రాజపుత్రులతో కూడుకున్న సంపూర్ణ మండలి కూడి వుంది, అందరూ మృత్యులోకంలో అవతరించారా అన్నట్టున్నారు. ఒకసారి నీ దర్శనం చేయిస్తానని నా దగ్గిర మాట తీసుకున్నారు. మరి అమ్మా, నేను మాటిచ్చేశాను, కాబట్టి ఇప్పుడిక నువ్వు ప్రతిజ్ఞాపాలన చేయించు, అప్పుడే విముక్తి కలుగుతుంది. నేను కూడా ఆయన దగ్గిర మాట తీసుకున్నాను దీని

తర్వాత ఆయన మళ్ళా ఎప్పుడూ ఈ దార్లో కనబడకుండా.''

''ప్రతిజ్ఞా పాలన చేస్తాను. ఒకసారి కాదు, వెయ్యిసార్లు. కానీ నేనిక్కడి ఠాకురానీని. ఆయన బాటసారుల్ని చంపారు, చంపిన తర్వాత కూడా ఎలా ప్రవర్తించారో తెలియదు. రూపేణ ఛత్రం వంటి మర్రి చెట్టు పాడుపెట్టేశారు, సువర్ణ రేఖ వంటి రాజమార్గాన్ని నల్లని సిరా మరక చేసేశారు. ఇటువంటి ఠాకూర్ నా పతే ఎందుకవ్వాలి, నేను ఇటువంటి భర్తని సైతం శ్మశాన భూమిలో దింపుతాను. వస్తాను. కలవడానికొస్తాను. కానీ చారణ్, ఆయనతో ఠాకురానీ వస్తోందనీ, కరవాలపు పదునంచు మీద ఒకసారి మళ్ళీ పెళ్ళి చేసుకోమని ఆమె కోరికనీ చెప్పిరా.''

''కానీ అమ్మా, అతనేమోఅశరీరుడు. అతనితోటి ఎక్కడన్నా కరవాలంతో పోరాడటంవీలవుతుందా? అదేమైనామానవశరీరమా స్వాధీనం లోకి రావడానికి? అతనైతే ధూళి నిండిన సుడిగాలి మాదిరిగా ఎగిరి పోతాడు...''

ఠాకురానీ మొగలి దండం మాదిరి బిగుసుకు పోయింది. ఆమె రోష పూరితమైన దేహలత నాగుబాములాగా బుసకొడుతూ లేచి నిలబడింది. చారణ్ వేపు ఆమె ఎంత కఠోర దృష్టితో చూసిందంటే ఎంతో సాహసవంతుడి క్కూడా ఎముకలు కంపించిపోతాయి- ''నువ్వు దేవీ పుత్రుడవేనా? రాజపుత్ర వనితతో మాట్లాడ్డానికొచ్చావా లేక ప్రేయసితోనా?''

ఒక్క ఊపుతో లంఘించి ఆమె మేకునించి నాగుబాము లాంటి కరవాలాన్ని బయటికి తీసింది. ఆచ్ఛాదన లేని కరవాలాన్ని చేతిలోకి తీసుకుని ఒరని విసిరివేసి చెప్పింది – ''పద దేవీ పుత్రా! ముందుకు పద, ఇవాళ ఆ మార్గాన్ని నిర్భయం చెయ్యాలి.''

చారణ్ మాట్లాడకుండా ముందు నడిచాడు. ఠాకురానీ అతని వెనుక వెళ్ళింది – మహిషాసురుణ్ణి వధించడానికి రణచండి వెడుతున్నట్టుగా.

మధ్యాహ్నం పన్నెండు గంటల సమయం చూసుకుని ఠాకురానీ, చారణ్ మర్రి చెట్టుకింద కొచ్చి చేరుకున్నారు. మర్రి చెట్టు ఆకులెంత భయంకరంగా ఖడ ఖడ మంటున్నాయంటే పిరికిగుండెవాడెవడేనా ఉంటే అక్కడే కుప్పకూలిపోతాడు. పొలిమేరలో ఎవరూ కనబడటం లేదు. మర్రి చెట్టుకింద ఏ బాటసారీ కూడా లేడు. అటువంటి భయంకరమైన ఏకాంతంలో చారణ్, ఠాకురాని మాత్రం నిలబడ్డారు.

''ఎక్కడ రాజపుత్రులు?'' అంది ఠాకురానీ ఆమె స్వరానికి కంపిస్తూ మర్రిచెట్టు మరింత ఎక్కువగా ఖడఖడ మంటూ ''ఇక్కడ ఎవ్వరూ లేరు''

అని అంటున్నట్టుగా వుంది.

''చూడాలి, ఇప్పుడే వస్తాడు ఆయన.''

కొంచెం సేపటి వరకూ నిశ్శబ్దంగా నిలబడున్నారు. వాళ్ళ మౌనంతో ఆ ప్రాంతం మరింత భయంకరంగా అయిపోతున్నట్టుగా వుంది.

అకస్మాత్తుగా ఒక గుర్రపు రౌతు కనబడ్డాడు. రాజపుత్రుడు తన సొగసైన గుర్రమ్మీద సవారీ అయి వస్తున్నట్టుంది. అతని కళ్ళు రూపేణ మీద లగ్నమైవున్నాయి.

చారణ్ విహ్వాలుడై ఠాకురానీ వేపు చూశాడు. ఠాకురానీ మొహంలో భయానికి సంబంధించిన ఆనవాళ్ళు కూడా లేవు. ఆమె తన కరవాలాన్ని మరింత ఆవేశంతో బిగించి పట్టుకుని చారణ్‌ని ఛాలెంజ్ చేసింది - ''చూడూ, మొగవాడివై నిలబడు, తెలిసిందా!'' కొద్ది సేపట్లో గుర్రపు రౌతు దగ్గరకొచ్చేశాడు. ఇరవై ఎనిమిది - ముప్పై ఏళ్ళ యౌవనంతో పరిపూర్ణుడైన రాజపుత్రుడు.

''సరి, ఈయనే! రానివ్వు''

''చూడమ్మా యోగమాయా, దాడి చెయ్యకు.''

రాజపుత్రుడు సరిగ్గా దగ్గర కొచ్చేశాడు. అతని సుందర వదనం కనిపించింది. అతను ఠాకురానీ వేపు చూడసాగాడు. ఠాకురానీ అతని వేపు చూడసాగింది.

''పోల్చుకున్నావా?''

''ఆఁ ఆఁ!'' ఠాకురానీ జవాబిచ్చింది - ''ఎందుకు పోల్చుకోనూ? ఎవరైతే భార్యని కలుసుకోవడానికి ఏదోషమెరుగని పథికుల్ని చంపారో, రాజమార్గాన్ని అపవిత్రం చేశారో, బికారిలాగా చారణ్‌ని యాచించారో, ఇంకా...''

''వొద్దు - వొద్దు, అమ్మా?'' చారణ్ రాజపుత్ర వనితని వారించాడు. రాజపుత్రుడు కుంచించుకు పోయాడు. అతని చేతినించి గుర్రపు కళ్ళెం జారిపోతున్నట్టు కనిపించింది. అత్యంత దుఃఖంతో కూడుకున్న దృష్టితో అతను ఠాకురానీ వేపు చూశాడు - ''ఠాకురానీ!''

''నా ఊరికి చెంది, నా ఆశ్రయంలో జీవిస్తున్న జనాల్ని నువ్వెందుకు చంపావు?''

''నేనా? నేను చంపలేదు ఠాకురానీ!''

''నిజమైన రాజపుత్రుడివైతే సన్నద్ధుడవుకా.''

''జాగీర్దారు ఆకృతి ఒక్కసారిగా మారిపోయింది. చారణ్ వణకడం

ప్రారంభించాడు. భయంకరమైన పిడుగు పడినట్టుగా జాగీర్దారు చేత కరవాలం మెరిసింది. అతను ఎంత వేగంగా దాడి చేశాడంటే ఎడమ భుజం మీది బెల్టు తెగిపోయుండేది.

''చంపేశావు! చాలు-చాలమ్మా'' అంటూ చారణ్ మధ్యకి దూకాడు కానీ జాగీర్దారు అక్కణ్ణించి అంతర్ధానమైపోయాడు. జాగీర్దారిణి కత్తివేటు శూన్యంలో పడటం చేత జాగీర్దారిణి మోకాళ్ళ మీద వంగింది. కత్తి విసురుకి ఎగిరిన కొద్దిపాటి ధూళి కనబడింది.

''జరిగింది చాలమ్మా!''

''ఏం ఫరవాలేదు దేవీ పుత్రా! నువ్వు నీ ప్రతిజ్ఞని పాలించావు.'' గాలిలోంచి కేవలం శబ్దం మాత్రం వినిపించింది.

ఠాకురాని ఒక్కుదుటున శబ్దం వచ్చిన దిశగా చూసింది. జాగీర్దారు గుర్రం మీద సవారి అయి నదివేపు వెడుతూవుండడం కనిపించింది. ఆమె అతని వెనుక అనాచ్ఛాదితంగా వున్న కరవాలాన్ని తీసుకుని పరుగెత్తింది. ఆమెని వారిస్తూ చారణ్ ఆమె వెనుక పరిగెత్తాడు.

రూపేణలో స్వచ్ఛమైననీరు ప్రవహిస్తోంది. జాగీర్దారు గుర్రాన్ని నదిలోకి తోలాడు. ఠాకురానీ కూడా అతని వెనకే నీటిలోకి దిగిపోయింది.

''జాగీర్దారువైతే నిలబడు'' ఠాకురాని గర్జించింది. విని జాగీర్దారు ఆగిపోయాడు. ఠాకురానీ అతని సమీపానికొచ్చింది, కానీ అతను మళ్ళీ అంతర్ధానమయ్యాడు. అయితే ఠాకురానికి ఎవరో ఆమె వస్త్రాల్ని పట్టుకుని ఆమెని నీటిలోకి లాగుతున్నట్టనిపించింది. ఆమె పరికిణీ తడిసిపోయింది. దాన్నించి నీరు బొట్లు బొట్లుగా కారుతోంది. ఠాకురానీ కిందికి చూసేసరికి నీటిలో రాజపుత్రుడి ముఖం కనిపిస్తోంది. అతి బేలగా వుంది ముఖం. రాజపుత్రుడు దాహంతో, చేతులని అంజలి పట్టి అందులో పరికిణీ నుంచి బొట్లు బొట్లుగా కారుతున్న నీటిని నింపుకుని వివశుడై గుక్క గుక్క ఆత్రంగా తాగుతన్నాడనిపించింది ఆమెకు... ఘటుక్... ఘటుక్... ఘటుక్...

ఠాకురానీ చూస్తూ ఉండిపోయింది. రాజపుత్రుడు కూడా ఆమెవేపు చూస్తున్నాడు. అయితే నిట్టూరుస్తూ! ఎంత వేదన! ఎలాంటి దుఃఖం! ఎటువంటి నిరాశ! వర్ణించనలవికాని తృష్ణ. ఠాకురానీ ఎంతో మమత నిండిన స్వరంతో అడిగింది - ''రాజ పుత్రా, ఏమిటిది?''

''చాలు, నా దాహం తీరింది, ఒక్కసారిగా తీరింది ఠాకురానీ ఇప్పుడు కత్తి దుయ్యి. ఈ రెండవ మరణంలో మొదటిసారికంటే! ఎక్కువ ఆనందం కలుగుతుంది.''

రాజపుత్ర వనిత చేతిపట్టు సడలిపోయింది. కరవాలం పట్టు విడి పోతూ వుంది. ఆమె కిందికి వొంగి ఒక చేత్తో రాజపుత్రుడి చెయ్యి పట్టుకుంది.

రాజపుత్రుడు ఒకసారి చెయ్యి విడిపించుకున్నాడు. రాజపుత్ర వనిత మళ్ళీ పట్టుకుని అడిగింది – ''నువ్వెక్కడ మునిగిపోయావు? ఇంకా ఇప్పుడు నువ్వెక్కడి కెడుతున్నావు?''

రాజపుత్రుడు రూపేణలోకి ఒక దూరపు చూపు సారించాడు. ఒక చోట నీరు చాలా లోతుగా వుంది. అతని దృష్టి అక్కడికి పోయి స్థిరంగా నిల్చిపోయింది.

''ఇప్పుడు నేన్నిన్ను వెళ్ళనివ్వను.'' రాజపుత్ర వనిత కరవాలాన్ని దూరంగా నది నీట్లోకి విసిరేసింది. రాజపుత్రుడి రెండో చెయ్యి కూడా పట్టుకుంది.

కానీ ఆమె చేతుల్లో నీటి బుడగలు మాత్రమే ఉన్నాయి. రాజపుత్రుడి ముఖం కొంచెం దూరంగా నదీ తరంగాల్లో కనిపించింది. రాజపుత్ర వనిత ముందుకి సాగింది. రాజపుత్రుడు దూరంగా కనబడుతూ చేతితో సంకేత మిస్తూ ఆమెని ముందుకు సాగిరావడానికి ఉత్తేజితురాల్ని చేస్తున్నాడు. రాజపుత్ర వనిత మరింత ,ముందుకిసాగింది. రాజపుత్రుడు ఇప్పుడు ఇంకాదూరంగా కనబడ్డాడు.

చారణ్ ఒడ్డునించికేకపెట్టాడు- ''అమ్మా, తిరిగొచ్చెయ్యి! మున్ముందు నీరుచాలాలోతు, అతను ఎగిరిపోయాడమ్మా, ఇక తిరిగొచ్చెయ్యి.''

రాజపుత్ర వనిత మందహాసం చేస్తూ మధురమైన కంఠ స్వరంతో చెప్పింది – ''వెళ్ళు, వెళ్ళు దేవీపుత్రా! ఇప్పుడు నువ్వు సుఖంగా నీ ఇంటికి వెళ్ళు నేనీ దుఃఖ భరితమైన రాజపుత్రుడి ఇంటిని తిరిగి నిలపాలి.''

# 3. ఖేమీ

ద్విరేఫ్

రామనారాయణ్ విశ్వనాథ్ పాఠక్ (క్రీ. శ. 1887 - 1955) జన్మస్థానం గాణోల్. బొంబాయిలో పట్టభద్రులైనారు. ఉత్తర గుజరాత్ లోని భాదరాలో వకీలుపనిచేశారు. తదనంతరం గుజరాత్విద్యాపీఠ్‌లో అధ్యాపకులుగా నియుక్తులయ్యారు. 'ప్రస్థాన్' పేరుగల మాసపత్రికలో సంపాదకులుగా పని చేశారు. 'శేష' అనే ఉపనామంతో కావ్యాలు, 'ద్విరేఫ్' అనే ఉపనామంతో కథలూ, 'స్వైర విహారి' అనే ఉపనామంతో లైటర్ వీన్ రచనలు రచించారు. 'ద్విరేఫ్‌నీ వాతో, భాగాలు 1,2,3 ఈయన ప్రసిద్ధ కథా సంపుటులు. 'కావ్యనీ శక్తి,' 'సాహిత్య విమర్శ', 'సాహిత్యాలోక్', 'ఆలోచనా' మొదలైనవి వివేచనాత్మక గ్రంథాలు. 'బృహత్ పింగళ్'కి ఈయనకి 1955 లో శ్రేష్ఠ గుజరాతీ పుస్తక అకాడమీ, బహుమతి లభించింది. 'అర్వా చీన్ కావ్య సాహిత్యనా వహేణో' పేరొందిన ఈయన వ్యాఖ్యానాల సంగ్రహం.

★ ★ ★

''అరె, ఎన్ని పుల్లలిట్టా తగలేసినావ్? ఒక్క అగ్గిపెట్టెని రొండురోజుల్లో అవగొట్టెయ్,'' అంది ఖేమీ. ఎందుకలా అందంటే బీడీ ముట్టించుకోవడానికి ధనియా ఒకదాని తర్వాతొకటి ఐదు పుల్లలు వెలిగించాడు.

''కానీ సూడు గాలెంత జోరుగా వీత్తన్నాదో - నుప్పు పుల్లని మండనిత్తం లేదెహె,'' ధనియా మళ్ళా అగ్గిపెట్టెని తెరుస్తూ అన్నాడు.

''ఉండు, బట్ట ఆడ్డెడ్తను.'' ఖేమీ ముసుగేసుకున్న కొంగు అంచుని లాగి ధనియా దగ్గరకెళ్ళి అతని ముందు పెట్టి గాలి రాకుండా చేస్తోంది. ధనియా గీసిన అగ్గిపుల్ల వెలిగింది. అతని దమ్ముతో పాటే అగ్గిపుల్ల వెలుగు భగ్గు భగ్గు మంటోంది. ధనియా పూర్ణ యౌవనం తొణికిసలాడుతున్న భార్య మొహంలోకి చూస్తూ ఉండిపోయాడు. కాంతివంతమైన గోధుమరంగు, పెద్ద పెద్ద మెరిసే కళ్ళు, ముక్కుకి పెద్ద లవంగమొగ్గ. బీడీ తాగుతూ తన్మయత్వాన్ని పొందడానికి బదులు నవోఢ సౌందర్యోపాసనలో మునిగి

పోయాడు. బీడీ వెలిగింది. ఖేమీ అక్కడ నించి తప్పుకోబోతోంటే ధనియా ''ఎల్లమాక, నామీదాన,'' అన్నాడు.

''పిచ్చోడి వైపోయినావేటి?'' అంటూ ఖేమీ తన చోటికి తిరిగొచ్చింది.

''నీమీదాన ఖేమీ నివ్వు నాకెంతో బాగున్నావే.''

''చూడ్నాడు. ఏంమాటడతన్నావో. ఎంతమందున్నారీడ ఈళ్ళున్నారన్న గురుతన్నా లేదా కూతంతకూడా?''

''ఆఁ ఆళ్ళు తింటం తాగటంలో ఉండిపోనారు, మనేపు సూసే తీరికెవురికి? కొత్తగా పెల్లైనోల్లు పెతీచోటా ఇలాగే అనుకుంటా ఎల్తారేటి?''

ధనియా పనిచేస్తున్న ఇళ్ళల్లో ఒక వ్యాపారస్థుడి ఇంట్లో ఇవాళ సౌభ్రాతృత్వ పూర్వకంగా బంధుమిత్రులకి విందు జరుగుతోంది. అందుచేత వాళ్ళిద్దరూ మంచిబోజనం దొరుకుతుందన్న సంతోషంతో వంటింటి మెట్లమీద కూర్చుని ఏకాంతంగా పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నారు. తక్కువజాతి వాళ్ళు విందుకి రాకుండా ఆపడానిగ్గానూ సేఠ్ వాళ్ళిద్దర్నీ అక్కడ కూర్చోబెట్టాడు. ధనియా తలకి తుండుగుడ్డ చుట్టి, సిల్క్ శాటిన్ జాకెట్ నీ, కాళ్ళకి మేజోళ్ళనీ తొడుక్కున్నాడు. ఖేమీ ఒక సిల్కు గుడ్డ కప్పుకునుంది. సుమంగళిగా ఒక సేఠ్ భార్య మరణించినప్పుడు స్మశానంలో విసిరేసిన శవం మీది గుడ్డ అది. ఈ బట్టల్నే వాళ్ళు కొద్ది రోజుల క్రితమే జరిగిన వాళ్ళ పెళ్ళిలో కట్టుకున్నారు.

ధనియా ఒక బీడీ దమ్ముకొట్టి - ''ఖేమీ, మీయ్యమ్మ ఏవఁడిగినా నానిచ్చీసి నిన్ను మనువాడుండే వోణ్ణి'', అన్నాడు.

''కానీ సెప్పు. మాయ్యమ్మ నీనించొక పైసయినా తీసుకున్నాదా? అలా కాకుండా ఎదురు నేనే నియ్యింటికి కొంత తీస్కుని వొచ్చినా? మా అమ్మ బేమ్మర్లకి మాదిరి మనువుసేసినాది.''

''మీయ్యమ్మ శానా మంచిదే. కానీ నివ్వెలాగింత తప్ప బుట్టినవ్?''

''ఓహోహో, నాన్నీకేం సెడు సేసినానూ?''

''సూడు, మనువప్పుడు నివ్వెంత గలభాసేస్నావ్. తాగుడు తాక్కూడదు, తిట్లుతిట్టకూడదు. నామీద సెయ్యెత్తకూడదు అంటా మాటిత్తేనే మనువాడ్తను లేకుంటే మనువాడను. ఒప్పుడైనా అలా సేత్తే ఇడిసి పెట్టెలిపోతాను అంటివి. ఏడైన అలగొద్దా?''

''ఎందుగ్గాదు? తాగొచ్చినా, మత్తెక్కి దురుసుగా రేగినా పాడు తిట్లు తిట్టినా నా నొల్లకోను. ఇట్టా దెబ్బలు తింటా వుండి పోయానోల్లకి యేరే పేరెట్టు.''

ఖేమీ నిజాయితీ, ఖరా, ఖండీతనం ముందు హత ప్రభుడయ్యాడు – ''సర్లే కానీ నేనేడ తాగినానని ఇట్టా నివ్వు సిటపట్లాడతన్నావు. ఏమైనా కానీ నేన్నిన్ను మనువాడేసినాను. నివ్వు సిన్నదానివిగా ఉండేటప్పుడు గాతీ (తలమీదుగా కప్పుకుని మెడదగ్గిర ముడి వేసుకునే వస్త్రం.) కట్టుకుని మీయ్యమ్మతో బయదెల్లేదానివి సూడు అప్పట్నించే నివ్వు నాకెంతో ఇట్టం. నివ్వు గాతీ కట్టుకోటం ఏడ నేర్చినవు ఖేమీ?'' అన్నాడు ధనియా.

''పడఘరీలో ఆడ ఆడపిల్లలందరూ పనిసేసేటప్పుడు ఇటుంటియే గాతీ కట్టుకుంటరు.'' ఖేమీ తల్లి మొదట్లో కఠియవాడ్‌లో పడఘరీలో ఉంటూండేది. కరువొచ్చిన సంవత్సరం ఆమె ఖేమీని తీసుకుని ఇక్కడికి వచ్చేసింది.

''కానీ ధనియా, ఈ సారాని మీమొగోల్లెందుకు తాగుతారూ? కల్లులో అసలు ఏటుంటదని? నివ్వు సెప్తాంటవ్‌గదా కల్లు సేదుగా ఉంటదని?''

''ఖేమీ ఏ పొద్దైనా మనసు దుఃఖ పడితే తాగుతరు. బాగ అలిసిపోతేనూ, మనసు దుఃఖ పడ్తేనూ సారా తాగితే సరైపోద్ది.''

ఖేమీ కాసేపు నిశ్శబ్దంగా ఉండిపోయింది. మళ్ళీ ఆమెకితన సత్తాన్నీ, సౌభాగ్యాన్నీ నిలబెట్టుకోవాలన్న కోరిక కలిగింది. ''ధనియా, నా మనువు మరోరెవర్తోనన్నా జరిగుంటేం?'' అంది.

''ఓసినీ, నిన్ను మనువాడి తీస్కపోటానికి ఎవడమ్మ సేరుంబావు శౌంఠి తిన్నట్టుగా నాకగపడ్డంలేదు. నివ్వేడున్నా సరే నేనెత్తుకొచ్చేత్తా.''

''ఆఁ ఆఁ ఇంత కావరం కూడదు. ఈ పెపంచకంలో సేరుకోసం సేరుంబావులు పడున్నాయి పాపం,'' అంది ఖేమీ.

అప్పుడే విందులో కోలాహలం చెలరేగింది. కుక్కొకటి లోపల జొరబడి ఒక పాత్రలో మూతి పెట్టింది. కొట్టి బయటికి తరిమెయ్య బడిందది. ఈ ఘటనకి సేఠ్‌కి కోపం వొచ్చేసింది. ఆయన తన నౌకర్ని కసురుకున్నాడు. నౌకరు నేరాన్ని తక్కువవాడి మీదకి నెట్టాడు. సేఠ్ ''మాలావు గవర్నరుగారు కూచున్నారండీ చేత బీడీపుచ్చుకుని! కుక్కల్నీ తరమలేరుగానీ. లే ఇక్కణ్ణించి హరామ్ జాదీకె...' అంటూ కోపాన్నంతా చిమ్మేవాడిమీద తీర్చుకున్నాడు. ఇక కొట్టడం తన్నడం ఒకటే తక్కువగా.

ధనియా, ఖేమీలకి చాలా చెడ్డగా అనిపించింది. వాళ్ళ ఆనందానికి విఘాతం కలిగింది. వాళ్ళ ఉల్లాసం అంతా తుడిచిపెట్టుకు పోయింది. ఏమీ అనకుండా ఇద్దరూలేచివెళ్ళారు. ఎక్కడికెళ్ళాలి అన్నది. నిశ్చయించు కోలేదు, కానీ ఖేమీ సహజ సిద్ధమైన ఊహననుసరించి రిచీరోడ్ వేపు

నడిచింది, మనసుని రంజింపచేసే దృశ్యాలేవైనా కనిపించవచ్చునని. ఖేమీ కన్నాఎక్కువగా కించపడ్డాడు ధనియా. ఖేమీఅతన్ని సముదాయించ సాగింది. ధనియా అక్కడ అనలేక పోయిన మాటలన్నీ ఇంతసేపటి తర్వాత ఇక్కడన్నాడు - ''కుక్కల్ని తరిమీ పని నౌకర్లది మళ్ళా, పైగా నేరం నా మీదెంతుకు నెట్టాలి?'' ఖేమీ మళ్ళా అతన్ని సముదాయించింది. ధనియా తన మనసులోవున్న అసలు వ్యధని చెప్పేశాడు ''మల్లా అసలందులో ఏవుందనీ. పైగా ఆయనదంతా నీ ముందంటం నాకేటీ బాగలేదు.''

ఖేమీ లోతుగా ఆలోచన్లో పడింది. తనే ధనియాని మాటల్లో పెట్టింది. దానివల్లే ధనియాకి అవమానం జరిగింది. ఇదే ఆమెని బాధిస్తున్నది. ధనియా మాట్లాడకుండా నడుస్తున్నాడు అందువల్ల ఖేమీ మనసు కొద్ది కొద్దిగా కంపిస్తోంది. వెళుతూ వెళూతూండగా రాయఖడ్ సారాయి దుకాణం వుండే దారొచ్చింది. ధనియా మనసు దుఃఖపడితే, సారాతాగితేకుదుట పడుతుందని ఖేమీకి గుర్తొచ్చింది. స్త్రీ కుండే సహజ కోమల స్వభావం చేత ఆమె కొంగుకి కట్టుకున్న ఎనిమిదణాలు విప్పి ధనియాకిస్తూ - ''ఇట్టా ఎంచేపు మూగోడి లాగుంటవ్? ఎల్లు, అట్నించి సారా తాగిరా.'' ధనియా ఆనంద పరవశుడవుతూ వెంటనే వెళ్ళిపోయాడు.

ఖేమీ ఎదురుచూస్తూ నిలబడింది. తనిలా చెయ్యడం మంచిది కాదని పించింది. తనే సారాతాగరాదని ప్రతిజ్ఞ చేయించింది. మళ్ళా తనే సారా తాగటానికి డబ్బు లిచ్చింది. ఇంతలో ధనియా సంతోషంగా తిరిగొచ్చి చెప్పడం ప్రారంభించాడు - ''సూడు ఖేమీ. ఉప్పుడంతా సరైపోనాది. నేసెప్పలా సారాతో నేను బాగై పోతననీ?''

దానికి ఖేమీ అంది - ''ఉప్పుడు కీమాటనొగ్గెయ్. కానీ కబడ్దార్ మల్లా ఒప్పుడన్నా తాగినావో ఇంటినించెల్ల గొడ్త.''

''లేదు ఖేమీ, ఇకమీన ఒప్పుడూ తాగను. నివ్వెంతో మంచిదానివి. ఉప్పుడిక సేఠింట్లో యిందులేకపోతే పోయిందిలే. నే తాగినా కూడా ఒప్పుడూ తాగుడెక్కువ సెయ్యను. సూడే ఇప్పటొరుకూ నామాట్లో తేడా ఏటయినా ఒచ్చినాదా? నువ్వుత్తినే నానంటే బయపడ్తన్నవు. సారా ఎంత తాగినా నాన్నిన్నొప్పుడూ కొట్టను. నాకు నివ్వెంతో ఇట్టం...''

ఇలాగే ఏదేదో వాగుతూ నడవడం ప్రారంభించాడు. ఖేమీ మాట్లాడ కుండా జరిగిన సంఘటనలనన్నిటి గురించి ఆలోచిస్తూ ఇంటివేపు నడుస్తోంది.

## 2

సంధ్యా సమయం. ఖేమీ అదే గాతీ కట్టుకుని చీపురు కడుతోంది. అది చూసే అహ్మదాబాద్‌లో ధనియా ముగ్ధుడయ్యాడు. కానీ ఇప్పుడు ధనియా అహ్మదాబాద్‌లో లేడు. ఆరు నెలల పైనయింది. అతను ఇద్దర్నీ ఒదిలేశాడు.

వివాహసమయంలో ధనియా సారాతాగనని ప్రతిజ్ఞ చేసినప్పటికీ ముందు జరిగిన సంఘటన తర్వాత అతను సారా తాగటం ప్రారంభించాడు - ఖేమీ సహిస్తుందని కొంత, ప్రతిజ్ఞా పాలన అతనికి దుర్మార్గుల ఎదుట బలహీనుడిగా కనబడటం లాంటిదిగా తోచికొంత, ఈ మిథ్యాభిమానం కారణంగా కొంత సారా తాగటం ఎక్కువ చేశాడు. ధనియాకి సాంగత్యం మంచిది లేకపోవడం కూడా కొంత కారణమైంది. ఖేమీ అతన్ని చాలా సార్లు కోప్పడింది. అతన్ని తిరస్కరించింది. అతన్ని విడిచి వెళ్ళిపోతానని బెదిరించింది, కానీ ధనియా దాన్ని ఒట్టి బెదిరింపుగా అనుకుని దాన్ని లక్ష్యపెట్టలేదు. ఆఖరికోరోజు అతను ఎక్కువగా తాగివచ్చి ఖేమీని కొట్టడం ప్రారంభించాడు. అసలీ దురాగతంతో వదిలేసి వెళ్ళిపోయుండాల్సింది.

కానీ ఖేమీ రెండోరోజు అక్కణ్ణించి వెళ్ళిపోయింది. ఆమె తల్లి మరణించింది. ఇందుచేత ఆమె నడియాడ్ వొచ్చేసి నౌఖరిచెయ్యడం ప్రారంభించింది. మునిసిపాలిటీలో రోడ్లుచిమ్మే వాళ్ళపై అధిపతి పురుషోత్తం. అతనికి జీతంలోంచి లంచం ఇచ్చుకునేట్టు ఒప్పందం కుదుర్చుకుని ఖేమీ పని సంపాదించింది. నడియాడ్‌లో సాధారణంగా రీతిలో అందరూ ఆమెని మనసుకెంత తోస్తే అంత చేసే స్త్రీగా భావించారు. రోడ్లుచిమ్మే వాళ్ళందరూ ఆమెని ఆటపట్టిస్తూంటారు కానీ ధనియాని వదిలివేయాలన్న సంకల్పం ముల్లులాగ ఆమె మనసులో లోతుగా దిగింది. ఆహ్మదాబాదునించి వొచ్చే ప్రతిఒక్క ఊడ్చేమనిషినీ ఆమె ఎంతోఆత్రుతతోధనియాపరిస్థితిగురించి అడుగుతూంటుంది. ధనియా దగ్గరకెడితే ధనియా మళ్ళా ఆమెని ప్రేమతో ఉండనిస్తాడని ఆమెకి తెలుసు, కానీ ధనియా తనని పిలిచినప్పుడే వెళ్ళాలని ఆమె మొండి పట్టు.

ధనియా తనని పిలుచుకెళ్ళాలని ఖేమీ దేముళ్ళకీ- దేవతలకీ మొక్కులు మొక్కుకుంది. అయినా ఇప్పటివరకూ ధనియా పిలుపు రాలేదు. ఇందుచేత ఆమె నిరాశ చెందుతూ వుంది. ఈ నిరాశవల్ల కలిగిన వ్యాకుల పాటుతో ఆమె తన మనసులో మంటనంతా లంచగొండి పురుషోత్తం మీద వెడలగక్కుతోంది. పురుషోత్తానికి కోపం తెప్పించడానికి ఆమె కొన్ని పాటలు కూడా కట్టింది.

ఖేమీ దగ్గిర చీపుళ్ళు కట్టే మంగి పెంట వూడుస్తూ వూడుస్తూ - ''అమ్మి ఖేమీ, కూంతా పదం పాడకూడదా!'' అంది.

ఖేమీ ధనియా గురించి ఆలోచిస్తోంది. విచారంగా, ''నివ్వేపాడ రాదా!'' అంది.

ఖేమీ పాటవంటిది మంగికి రాదు. ''దాని నాలుగోమాట సరింగా లేదెహె.''

''నీకు పాడతం రాదనుకుంట,''

''అయితే సూద్దారి. నివ్వు పాడు.''

ఖేమీ జాగ్రత్తపడి పాడటం ప్రారంభించింది -

''ఇటేపు రావయ్యో కుమ్ముతా గుండెల్లో
ఇటేపు రావయ్యో తన్నుతా కాలిసిరి
ఇటేపు రావయ్యో మోదుతా దండమెట్టి
ఇటేపు రావయ్యో నిలపనా నిమ్మకాయ నీతోకమీద''

''సెప్పు, ఇందులో రాన్దేటుంది!''

''ఐతే ఇది నివ్వు జబర్దస్తీగా కిటించీసినవ్. తోకమీద కూడా నిమ్మకాయ నిలబడద్దా ఏడన్నా?''

''మీసం మీద నిలబెడ్తరు. సరే ఆడికి మీసవుంటే గాదా నిలబెడ్తానికి. ఇందుకే ఆడు తోకమీద నిమ్మకాయెట్టుకుంటడు.'' మంగి పకపక పడి నవ్వింది. ఎఱ్రటి చిన్న నుదురుతో పొడుగ్గా వుండే పురుషోత్తం మొహమ్మీద బూడిదరంగులో చిన్న చిన్న మీసాలు ఉండీ లేనట్టే వుంటాయి.

ఇద్దరూ ఉత్సాహంతో పాడటం ప్రారంభించారు. ఇంతలో పురుషోత్తం వొచ్చేశాడు. తలమీద బొచ్చుటోపీ, కిందనించి కనబడే కమీజు మీద హాఫ్ కోటు, చేతిలో ఒక సన్నటి బెత్తం, దాన్ని ధోవతిమీదుగానే పట్టుకుని తిడుతూ వెడుతున్నాడు. పాడుతున్న పాటని అతను వినేశాడు. పాటలో అతని పేరు లేదు, అందులో అతని గురించి ప్రస్ఫుటంగా ఏమీకూడా చెప్పబడలేదు. అయినా కూడా కావ్యశాస్త్రంలోని ఏదోగూఢనియమంవల్ల అతను అర్థం చేసుకున్నాడు ఈ పాటలో సంకేతం తనను ద్దేశించేనని. 'అంతఃకరణ సాక్ష్యం' అనే సూత్రం జీవతంలోని మిగతా క్షేత్రాలకంటే వ్యంగ్య క్షేత్రంలో అన్నిటికంటే ఎక్కువ వాస్తవమైనది అవుతుంది. పురుషోత్తం అరిచాడు - ''ఓ హరామ్ ఖోర్! పని చెయ్యి పని, రాగం ఎందుకు ఆలాపిస్తున్నావ్?''

మంగి సిగ్గుపడింది, కానీ ఖేమీ జవాబిచ్చింది - ''పాడితే ఏటైందంటా, సేతుల్తో పనిసేత్తన్నాం, కనబడ్తలేదా?''

''హరామ్ ఖోర్! మాట కెదురు చెబుతావ్? నీకన్నా పెద్దవాళ్ళ నవమానిస్తున్నావ్!?''

''కానీ నేనునీ మీద పాడ్తన్నానా?''

''నువ్వన్ని చోట్లా పాడుతూ తిరుగుతావు, నన్నవమానిస్తావు, నాకంతా తెలుసు.''

మంగివేపు అర్థవంతంగా చూసి ఖేమీ అంది - ''సూడే, బాగున్నాదా ఈన, కోసరం పాడ్తన్నానా? నేనే అహమ్మదాబాదు నించొచ్చి రోడ్లు ఊడ్చే వోళ్ల పైసల్దినేసి ఆరోడ్లుఊడ్చే వోళ్ల నాయకుడి మీద పాడ్తన్నాను.''

''హరామ్ ఖోర్, నేనంతా ఎరుగుదును! పెద్ద వాళ్ళ నవమానిస్తున్నావు! మనం మనపై వాళ్ళని గౌరవించాలని నీకు తెలీదూ! పై వాళ్ళతో నోరు చేసుకుంటున్నావ్!''

''కానీ భాయీసాబ్...''

''చాల్చాలు. ఇప్పుడిక వ్యర్థప్రలాపంచెయ్యకు, మాకు వేరే పన్లున్నాయి. దీని మీద వేలి ముద్ర వేసి నీ జీతం తీసుకో.'' పురుషోత్తం దగ్గర్లో వున్న అరుగుమీద రిజిస్టర్ ఎత్తిపడేశాడు. మొదట మంగి వేలిముద్ర వేసింది. మళ్ళా పురుషోత్తం ఖేమీతో వేలి ముద్ర వెయ్యమని చెప్పాడు.

''ముందస్తుగా నాకు జీతం ఇవ్వు, తరవోత యేలి ముద్రేత్తాను.''

''ఏం, నువ్వుషావుకారువాసర్కారుదొంగవా? ప్రభుత్వ నియమానుసారం పనిజరగాలి. ముందు వేలిముద్రెయ్యి, మరి జీతం దొరుకుతుంది.''

''అయితే పట్టు ఇదో యేలు.'' అని ఖేమీ పురుషోత్తంకి వేలు చూపించి రిజిస్టర్ మీద వేలిముద్ర వేసింది. పురుషోత్తం చూస్తూనే వున్నాడు, కానీ దీనిమీద రగడ చెయ్యడానికి సమయం లేదు అతనికి. ఇద్దరి జీతాల్లోంచీ ఎనిమిదెనిమిదణాలు కోసేసి మిగతాతొమ్మిదిన్నర - తొమ్మిదిన్నర రూపాయల్ని అతను నేలమీదకి విసిరేసాడు. మంగి తన డబ్బులు తీసుకుంది. ఖేమీ ''డబ్బులు పూర్తి ఇస్తివా తీస్కుంట లేదూ తీస్కోనంతె,'' అంది.

''తీసుకోకపోతే పడుండనీ, నే పోతున్నా,'' అతను వెళ్ళబోతోంటే ఖేమీ దగ్గిరగావున్న గోడకానించిన పొడుగాటి చీపురు తీసుకుని అతని దారినడ్డగించింది - ''ఇట్టా ఎలా ఎలిపోతవ్?''

ఇంతలో మరో ఇలాకాకి చెందిన రోడ్లుచిమ్మే వాళ్ళు వొచ్చేశారు. చూడబోతే ఖేమీని దాటివెళ్ళలేడు, మళ్ళా మిగతా రోడ్లుచిమ్మే వాళ్ళ ముందు అగౌరవం పాలౌతాడుఅన్నది పురుషోత్తం గమనించి అతను తగాదాని

అపుచెయ్యి డానిగ్గానూ, ''తీసుకో నీడబ్బులు, ఆ ఎనిమిదణాలూ వాపసివ్వు,'' అన్నాడు.

''ముందు రూపాయతియ్యి.''

పురుషోత్తం రూపాయిల్ని కిందికి విసిరేశాడు. ఖేమీ చీపురడ్డు తీసి కిందికి వొంగి పైసలు తీసుకోవడం ప్రారంభించింది. పురుషోత్తం కింద పడున్న ఎనిమిదణాల్ని మళ్ళీ అడిగాడు.

''ఆగుకూంత, ముందస్తుగా లెక్కెట్టుకోనీ,'' మిగతా వాళ్ళవేపు చూస్తూ ఆమెరూపాయలు లెక్కించడం ప్రారంభించింది. పురుషోత్తం ఎనిమిదణాల్ని మళ్ళీ అడిగాడు.

''నాకు దొరుకుతల్లేదు,'' అన్చెప్పేసి ఖేమీ వెళ్ళిపోయింది. పురుషోత్తం కిందికి వొంగి దుమ్ములోంచి ఎనిమిదణాలు తీసుకోవాల్సొచ్చింది.

ఇవాళ ఖేమీ వ్యవహారం ఆమెతోటి వాళ్ళకి ఆశ్చర్యం కలిగించడమే కాదు వాళ్ళ కామె పట్ల ఆదరభావం ఉత్పన్నమైంది. ఖేమీ పాట ఎత్తుకుంది. చిమ్మేవాళ్ళందరూ పాడటం ప్రారంభించారు.

''ఇటేపు రావయ్యో, కుమ్ముతా గుండెల్లో
ఇటేపు రావయ్యో, తన్నుతా కాలిసిరి
ఇటేపు రావయ్యో, మోదుతా దండమెట్టి
ఇటేపు రావయ్యో నిలపనా నిమ్మకాయి నీతోకమీద.''

దారే పోయేవాళ్ళూ, స్టేషన్ నించి వస్తున్న ప్రయాణికులూ ఈ విచిత్ర గీతాన్ని వినడానికి నిలబడిపోయారు. ఇంతలో ఒక స్వరం వినిపించింది – ''ఇదో ఓ ఖేమీ, ఇటువేపు రా!''

ఖేమీ పాట ఎక్కడిదక్కడ ఆగిపోయింది. ఆమె నిలబడిపోయింది. ఏవైపు నుంచి పిలుపొచ్చిందో అటు చూసి ఆవైపుగా వెళ్ళింది.

ఆమె అత్తగారు ఆమెని పిలవడానికొచ్చింది.

## 3

ధనియాకీ, ఖేమీకీ మొదటి మూడు రోజులూ అనిర్వచనీయమైన ఆనందంలో తినడం– తాగడంలో గడిచాయి. నాలుగోరోజు రాత్రి ధనియా, ఖేమీ కబుర్లు చెప్పుకోవడానికి కూర్చున్నారు. ఖేమీ నడియాడ్‌లో తను ఎలా బతికిందో, ఎలా పాటపాడిందో, ఎలా మిగతా ఊడ్చే వాళ్ళని ఆటపట్టించిందో చెప్పింది. అంతా విని ధనియా అన్నాడు – ''ఖేమీ, నీది రాతి గుండే నివ్వు లేక నాకీడ ఏం బాగలేదు. కాని నివ్వేమో ఆడ మజాగా ఉంటివి!''

''నాకూ ఏం బాగలేదు, కానీ నివ్వు ఎప్పటికీ పిలకపోతే నానెట్టా వొత్తాను.''

''నానెలా నిన్ను పిలుత్తాను' తొప్పు నాదే కదా! నా కాళ్ళు లేవలేదు. అమ్మతో సెపుతానే వున్నా, కానీ ఆమెఅంటదీ - ''ఒగిటి రొండు రోజుల్లో వొచ్చేస్తది, సివరికిలా ఎన్నాళ్లుంటది?'' కానీ నివ్వైతే ఇలాఅలిగి పారి పోయావంతే!''

''నీ తప్పే అయితే నివ్వే పిలవాలి కాదా!''

''కానీ భద్రకాళి శానా సత్తెమున్న తల్లి.''

''ఎట్టా?''

''సూడు, మొదట నీను రామదెపేరుకి మొక్కుకుంటిని, కానీ నివ్వు రాలేదు. దాంతరవోత హరఖశా మాతకీ, ఝోంపడేమాతకీ మొక్కు కుంటిని అప్పుడు కూడానివ్వువొచ్చినావు కాదు. మల్లా నేను భద్రకాలి తల్లికి మొక్కుకుని కొంప కొచ్చీ సరికి అమ్మ సెప్పినాది ''ఒరే ధనియా, నివ్వు శానా సిక్కిపోతన్నావు, యేరే మరో పిల్లతో నీకు మనువు సేసేత్తను.'' నీను ఎదురుసెప్పేసినాను ''నాకు యేరే మనువు సెయ్యొద్దు. ఖేమీ వస్తదా సరి, లేదంటే లేదు. అప్పుడు మాయమ్మ నిన్ను పిలవటానికెల్లినాది.''

''నీను కూడా ఎన్ని మొక్కులు మొక్కినాననీ, అప్పుడు మియ్యమ్మ నన్ను పిలటానికొచ్చింది.''

''నివ్వే యేం మొక్కులు మొక్కినవ్?''

''ముందస్తుగానైతే నీనుకూడా రామదెపేరు మొక్కు మొక్కుకుంటిని. మల్లా ఆలోచించా నేడయాడ్‌లో సంతరామ్‌మహారాజ్ మీదపళ్లెం ఇచ్చు కుంటనని దాన్తరవోత మహాకాళి యాత్ర సేత్తానని సెప్పినా.''

''అరె-రె-రె ఖేమీ!'' ధనియామీద పిడుగు పడి నట్టైంది. ''నివ్వు సేసింది బాగలేదు. నీ మొక్కులికి డెబ్బై రూకలవుతయ్, నా మొక్కులికి యాభై, మనువునాటికి సేసిన అప్పురెండు వందలు, రెండువందల యాభై రూపాయిలింకా తలమీద వున్నాది. ఆ పటేలయ్య హమేశా సుట్టూ తిరుగుతన్నాడు. నానెప్పటికి బాకీ మొత్తం సెల్లుపెట్టగలుగుతాను?''

ఏ దేవతకి మొక్కుకోవటం వల్ల ఇద్దరూ కలుసుకోవడం జరిగిందో తెలియదు, అందుచేత అన్ని మొక్కుబడులూ తీర్చుకుంటేగానీ విముక్తి లేదు.

''అరే ఏవున్నాదిందట్లో, నాలుగొందలు నానిప్పుడే సమకూరుస్తను. నానగలమ్మి బాకీ మొత్తం సెల్లించెయ్'' - ఖేమీ సముదాయించింది.

''అవునే, నీకు సెప్పనేలేదు. పంచాయితీల జరిమానాలు కూడా కట్టాలి.''

కులీన జాతుల, నిమ్నజాతుల అనంతశ్రేణులతో నిండివున్న ఈ సమాజంలో ప్రతి జాతికీ తన కన్నా తక్కువగా చూడటానికి ఏదో ఒకటి (జాతి) కావాలి. అహ్మదాబాద్‌కి చెందిన తక్కువజాతి వాళ్ళు కఠియావాడ్ నుండొచ్చిన అదేకులం వాళ్ళని నీచదృష్టితోచూస్తారు. వివాహసమయంలో ధనియాకి అహ్మదాబాద్‌కీ, కఠియావాడ్‌కి చెందిన పంచాయితీల (వారి)కి విందుచెయ్యాల్సొచ్చింది. ఖేమీ వెళ్ళిపోవడంతో కఠియావాడ్ పంచాయితీవారు ధనియాకి దండనగా జరిమానా విధించడానికి ఏకమైనారు. వాళ్ళు మొదటే పరస్పరం చర్చించుకుని, మళ్ళా అహ్మదాబాద్ పంచాయితీతో మాట్లాడారు. అహ్మదాబాద్ పంచాయితీ కూడా వాళ్ళతో కలిసిపోయింది. ఇంతలో ఖేమీ తిరిగొచ్చింది. ఇందుచేత ఇప్పుడు దండన అనే మాటే లేదు. కానీ ఇన్ని రోజులూ తిన్నారు. తాగారు కదా, దాని ఖర్చులకైన డబ్బుని పంచాయితీలు ధనియా తలమీద రుద్దేరు. తమ సమాజంలో జాతి యొక్క ఆనవాయితీలు ప్రకృతి సిద్ధమైన సంఘటనల్లాగే అనివార్యమూ, నిరోధించ శక్యం కానివీ అని భాంచబడుతున్నాయి!

అంతావిని ఖేమీ కూడా భయపడింది. మళ్ళా తనే ధనియాకి ధైర్యం చెప్పింది. మొగవాడు పరాజితుడౌతూండటం చూసిన స్త్రీలో మరింత ధైర్యం వస్తున్నట్టుంటుంది. కానీ ధనియాకి ఊరట కలగలేదు. హతాశుడై అతను ఖేమీ ఒడిలో పడి నిద్రపోయాడు. చింతాగ్రస్తురాలైన ఖేమీ కూడా నిద్రపోయింది. మూడు రోజుల సుఖాన్నను భవించి వాళ్ళిద్దరూ తిరిగి దుఃఖమయమైన సంసార సాగరంలో మునిగి పోయారు.

మరుసటి రోజు ఖేమీ నగలు తీసిచ్చేసింది. వాటినమ్మమని చెప్పింది. కానీ ఖేమీ దయని పొందటం అనేది ధనియాకి ఇప్పుడు కూడా శత్రువు ముందు హీనంగా కనిపిస్తున్న దాంతో సమానంగా అనిపించింది. ఇది అతనికి సహించరానిదైంది. ఇందుకే అతను నగల్ని అమ్మడానికి బదులు తాకట్టు పెట్టాడు. అమ్మేస్తే మంచి రొక్కం వచ్చేది, తాకట్టు పెట్టడంతో రొక్కం కూడా కొంచమే ముట్టింది. చివరికి నగలూమునకేశాయి. కానీ ఇలా ఎందుకయిందో ధనియాకీ అర్థం కాలేదు, ఖేమీకి అర్థం కాలేదు. ఇద్దరూ శక్తి కొలదీ డబ్బు కూడ బెట్టడం ప్రారంభించారు.

ఇంతలో ధనియా తల్లి మరణించింది. ఆమె అంతిమ సంస్కారానికి దగ్గర దగ్గర వంద రూపాయలు ఖర్చయ్యాయి. మూడు నెలల తర్వాత ఖేమీ

గర్భవతైంది. దాంతో ఆమె సంపాదన కూడా బంద్దైపోయింది. గర్భావస్థ కారణంగా ధనియాకి ఖేమీ సముదాయింపు తగ్గిపోయింది. తన వ్యథల నుంచి విముక్తి పొందడం కోసం అతను మళ్ళా మద్యం సేవించడం ప్రారంభించాడు.

ప్రసవం అయిన తర్వాత ఖేమీ చూస్తే ధనియా మళ్ళా తాగుతున్నాడు. ఆమె తిరిగి ధనియాని మందలించింది - చీవాట్లెట్టింది, కానీ ఇప్పుడామె పెట్టే చీవాట్లలో తిరస్కారం లేదు, దయ వుంది. ధనియా స్థితికి బాధ్యురాలు తనేననిపించ సాగిందామెకు. అయినా కూడా ఒక రోజు ఆమె ధనియాని చాలా కఠినంగా చివాట్లు పెట్టింది. ధనియా కాస్త కూడా మాట్లాడలేదు. పైగా రాత్రిఇంటికి తిరిగి రాలేదు. ఖేమీ అతన్ని రిచీరోడ్ ఫుట్ పాత్‌మీద వెతికి పట్టుకుని ఇంటికి తీసుకొచ్చింది. ఖేమీ అతనికి నచ్చజెప్తొంటే జవాబుగా ధనియా నిట్టూర్పులు విడవటం ప్రారంభించాడు. ఖేమీమనసు కూడాకరిగి పోయింది. అందుకే ధనియాకి బోధించడానికి కావల్సినంత కఠోరత ఆమెలో కాస్తంత కూడా మిగలలేదు.

అవి చలిరాత్రులు ఒకరోజు భయంకరంగా చలి వేస్తోంది, కానీ ధనియా ఇంటికి రాలేదు. ఖేమీ ఏడుస్తున్న రెండేళ్ళ పసిపిల్లని ఇంట్లో ఒదిలి అతన్ని వెదకడానికి బయల్దేరింది. రెండు గంటల తరువాత ఆమె నది ఒడ్డున ఇసుకలో ధనియా పడుండటం చూసింది. ఖేమీ అతన్ని లేవదీసి ఎలాగోలా ఇంటికి తీసికెళ్ళింది. రెండోరోజుకి ధనియాకి న్యుమోనియా వొచ్చింది. ఖేమీ మళ్ళా మొక్కులు మొక్కుకుంది. భూతవైద్యుణ్ణి పిలిపిస్తే. అతను మరికొన్ని మొక్కుబడులు చెప్పాడు. కానీ ధనియా మళ్ళీ లేవలేదు. ఖేమీ వితంతువై పోయింది.

## 4

వైధవ్య శోకం ఖేమీ జీవితమంతటా వ్యాప్తి చెందింది. అది తప్ప మరోటిలేదు. కానీ ధనియా తను మొక్కుకున్న మొక్కులు తీర్చకుండానే చనిపోయాడన్న విషయం ఆమెకు చాలా దుఃఖం కలిగించింది. అందువల్లే ధనియా ఆత్మ ఏం క్షోభిస్తుందో అన్న చింతే ఖేమీని పట్టుకుంది. ఈ చింత దూరం చేసుకునే ఏ ఉపాయము ఆమెకి తట్టటం లేదు.

ఒక రోజు ఖేమీ రిచీరోడ్డుమీద ఊడుస్తోంది. ఇప్పుడామె గాతీ కట్టుకోవడం లేదు. చీపురూడుస్తోంటే ఆమెకి ధనియామొక్కుకున్న మొక్కులు గుర్తుకొచ్చాయి. అప్పుడే ఆమెకి ఒక అరుగుమీద ఒక

బ్రాహ్మణుడు కనిపించాడు. అతను పాలభాగం మీద పొడవూ - వెడల్పూ గల మూడు విభూది రేఖల్ని, దాని మధ్య పెద్ద బొట్టునీ పెట్టుకున్నాడు - ముక్కుమీద సన్నని నల్లని రేఖ. కంఠానికి, మణికట్లకీ రుద్రాక్షమాలలు. మారాజు అరుగు శుభ్రం చేసుకుని దానిమీద ఆసనాన్ని పరిచి ఎదురుగా ఒక పలకనీ, కలాన్నీ హస్తరేఖలచిత్రాల్నీ, పంచాంగాన్నీ, దానిమీదఆడుకునే పాచికల్నీ అమర్చివుంచారు. ఖేమీ ఆయనవేపు వెళ్ళింది. ఆమె రావడం చూసి మారాజు సనాతన తిరస్కారంతో ఆమెని దూరంగా ఉండమని చెప్పాడు. ఖేమీ అంది ''మారాజా, నీను కూంత అడగాల.''

''అయితే నాలుగణాలు తీసి కింద మెట్టుమీద పెట్టు,'' మారాజుకి ఖేమీ నీడ అపవిత్రం, ఆమె డబ్బు అపవిత్రం కాదు. ఖేమీ ఒక పావలా ఉంచితే మారాజు నీటిచుక్కలుచల్లిదాన్ని తీసుకున్నాడు. అప్పుడడిగాడు - ''ఇప్పుడడుగు.''

''మారాజా, ఒవురి పెనిమిటైనా మొక్కులు సెల్లించుకోకుండా సనిపోతే, తని ఇంటిది అతని మొక్కులు పూర్తి సేసినట్టైతే ఆటి ఫలితం ఆయమ్మ పెనిమిటికి సెందుద్దా లేదా? బాగంగ సూసి సెప్పండి మారాజా.''

వేళ్ళ కణుపులు లెక్కపెట్టి మారాజు చెప్పాడు - ''ఆ.''

''మంచిది మారాజా'' అన్జెప్పి ఖేమీ వెళ్ళబోతూంటే మారాజు ఆమెని మళ్ళా పిలిచి అన్నాడు - ''కానీ ఆ స్త్రీ మరొకరినెవరినైనా పెళ్ళాడితే మాత్రం చెందదు.''

ఇప్పుడు ఖేమీ మొక్కులు పూర్తి చెయ్యడానికి డబ్బులు మిగల్చడం ప్రారంభించింది. ఖేమీ వయసుడిగి పోతోంది, కానీ ఆమె సౌందర్యం తరగలేదు. చాలా మంది తోటి మొగవాళ్ళు ఆమెని మారుమనువు చేసుకోడానికి ఇష్టాన్ని వ్యక్తం చేశారు. ఖేమీ అందరికీ ఒకటే జవాబిచ్చింది ధనియా మొక్కులు తీర్చిందే ఎవరితోనూ మారు మనువు చేసుకోలేనని. ఒకడైతే మొక్కుల పూర్తి ఖర్చు భరిస్తానని కూడా చెప్పాడు, కానీ ఖేమీ తన సంపాదన నించే మొక్కులు తీర్చాలన్న తన నిశ్చయాన్ని అతనికి చెప్పేసింది.

ఏడు సంవత్సరాల తర్వాత ధనియా మొక్కుకున్న మొక్కులన్నీ పూర్తయినాయి. ఒకతను మళ్ళా ఆమెను మనువాడాలన్న కోరికని వ్యక్తం చేశాడు. ఖేమీ జవాబిచ్చింది - ''లేదు - లేదు, ఉప్పుడిన్ని సంవొత్సరాల తర్వోత నా బతుకుకి అంటుగట్టలేను.''

# 4. దుర్మార్గుడు

**ఝవేర్ చంద్ మేఘాణీ**

ఝవేర్ చంద్ మేఘాణీ (క్రీ.శ. 1897 - 1947) జన్మస్థానం చోటీలా. ఉద్యమం ప్రారంభించినది కలకత్తాలో. అక్కడినుండితిరిగొచ్చి 'సౌరాష్ట్ర'కి పత్రికారచయిత రూపంలో ప్రఖ్యాతినొందారు. జానపద సాహిత్యంలో పరిశోధన, సంపాదకీయం మేఘాణీ గుజరాతీ సాహిత్యానికిచ్చిన మహత్తరమైన కానుక. 'సోరఠ్, తారాం బహేతాం పాణీ', 'తులసీ క్యారో', 'వేవిశాల్' ఈయన వ్రాసిన అత్యంత ప్రసిద్ధనవలలు. 'యుగవందనా' అందరికీ ప్రియమైన కావ్య సంగ్రహం. 'విలోపన్', 'మేఘాణీనీ నవలికావో' భాగాలు 1,2 ఈయన ప్రసిద్ధ కథాసంపుటాలు.



రైలుబండి చక్రాలు మొదటి భ్రమణం పూర్తిచేశాయి. రామ్‌లాల్ అన్నిటి కంటే వెనక పెట్టెలో భార్యని తోశాడు. అప్పటికి చక్రాలు మోత పెట్టడం ప్రారంభించాయి. ముగ్గురు పిల్లల్నీ, అలాగే ట్రంకునీ, చిన్న మూటనీ అదే విధంగా రామ్‌లాల్ కిటికిలోంచి లోపలకి పడేశాడు. రుక్మిణి అన్నిటి తర్వాత చిన్న పెట్టెని ఎత్తి అందుకుని ఒళ్ళో పిల్లల్ని సముదాయిస్తోంటే ట్రైన్ స్టేషన్ యార్డు దాటింది.

ఖాళీ అయిన ప్లాట్ ఫారం మీద ఈ దృశ్యాన్ని చూసిన కొందరు దడదడ రామ్‌లాల్ మీద వ్యంగ్యోక్తులు విసరడం ప్రారంభించారు-

''అందరూ దొరనాకొడుకుల్లా తయారయ్యారు! పంక్చువల్‌గా టైముకి దయచేస్తారు!''

''భార్య బాధ్యత ఎవరికప్పగించాడో కూడ ఒంటి మీద తెలివి లేకుండా అప్పగించాడు!''

ఈవాక్యం విని రామ్‌లాల్ తుళ్ళి పడ్డాడు. బోగిలో ఎవరున్నారు? కాస్త పిల్లల్ని కనిపెట్టుండండేం అని ఎవరితో చెప్పాడు. జ్ఞాపకశక్తి పిండేసినట్టున్న రామ్‌లాల్ ముక్కుకి దేశవాళీ బీడీ తాలూకా పటాటోపపు పొగల దుర్గందం

గుర్తొచ్చింది. చెవులని ఎనిమిది- పది కర్కశమైన కంఠస్వరాలతో పలికిన అశ్లీల వాక్య ఖండాలు ఢీకొన్నాయి. కళ్ళ ముందుకి ఏ స్పష్టమైన ముఖమూ రాలేదు. కానీ కళ్ళల్లో అస్పష్ట ఆకృతులు తిరుగుతున్నాయి. వాట్లలో నల్లటోపి, నల్లగడ్డం, నల్లలుంగీ మొదలైన వాటి నలుపు తనశక్తి నంతటినీ ఉపయోగించి రామ్‌లాల్ మనసు మీద కారు మేఘాల్ని రచించనారంభించాయి. ముందు గేట్లోంచి బయటి కొస్తున్న ఒక పరిచయమున్న సజ్జనుడు రామ్‌లాల్ నడిగాడు – ''పిల్లలతో ఎవరున్నారు రామ్‌లాల్ భాయ్?''

''కూడా వెళ్ళేటందుకెవరూ దొరకలేదు.''

''అప్పుడుమీరుఎవరితోచెప్పారు ఈపిల్లల్నికాస్తకనిపెట్టుండండని?''

''నేను చెప్పడమైతే చెప్పాను, కాని ఎవరితో చెప్పానన్నది నాకే గుర్తులేదు.''

''ఇంత తొందరపాటు కూడదు, పిల్లల్ని రేపు పంపాల్సింది.''

''నిజమే. ఇప్పుడు విచారిస్తున్నాను.''

''మనం రైలు బండిని చూసి ఒక్కసారి పిచ్చి వాళ్ళమై పోతాం. ఎందుకో తెలుసా? పిచ్చెక్కిపోతాం.''

కథియావాడ్ మాండలికభాషలో ఇది ఉండేలుదెబ్బలా తగిలి రామ్‌లాల్ హృదయాన్ని చేదించేసింది. ఈమాటరామ్‌లాల్ వ్యవహారాన్ని ఉన్నదున్నట్టుగా చిత్రం గీసేసింది. నల్లముసుగు చూసి ఎలాగైతే ఆంబోతు కోపంతో కాలుదువ్వుతుందో, ఒంటెనిచూసి ఎలాగైతే గేదె రెచ్చిపోతుందో మిల్లు యజమానిని చూసి ఎలాగైతే నేటి కార్మిక నాయకుడు క్రోధంతో పిచ్చివాడై పోతాడో అలాగే రామ్‌లాల్ గార్డ్ కంపార్ట్‌మెంట్ లాంతరు ఊగటం చూసి పిచ్చి వాడైపోయాడు. ఎంతలా పిచ్చివాడైపోయాడంటే అతను పిల్లల తల్లిని ప్రాణంతో ఉన్న ఆత్మ బంధువుగా చూడ్డానికి బదులుగా నిర్జీవమైన ఒక మూటగా భావించాడు. రామచంద్రా! మనిషన్న వాడు మూటల్ని సైతం. పరిచయం ఉన్నవాడితోనో, విశ్వాస పాత్రుడితోనో పంపుతాడు. ఒకసారి రామ్‌లాల్ తన గ్రామానికి పక్కానికి రాని మామిడి పళ్ళు బుట్ట పంపాల్సి వచ్చింది. అతనికి తనబంధువులొక్కళ్ళ మీదకూడనమ్మకంలేదు. ఎందుకంటే దాంట్లో దార్లో ఒకటో అరో మామిడిపళ్ళు దొంగిలించి తినెయ్యొచ్చు. అటువంటిదిక్కడేం చేసాడు?

మరొకతను దగ్గరకొచ్చి రామ్‌లాల్ చెవిలో ఏదోచెప్పాడు. చెప్పేటప్పుడు ఇప్పుడే ఎక్కడైనా స్టేషన్ గోడలలోనో, నేలమీద పరిచిన రాళ్ళనో తప్పించుకుని చిన్న కత్తితో మొరటుగా పొడిచేసే వాడెవడేనా బయటికొస్తాడేమో అనిభయపడుతున్నట్టుగా అతని కళ్ళునాలుగువేపులా చూస్తున్నాయి.

ఆమనిషి చెప్పిన మాటలివి.

''సేఠ్! ఆ బోగీలో అహ్మదాబాద్ నగరంలో దుర్మార్గుల నాయకుడు సర్దార్ అల్లారక్కా, వాడి జతగాళ్ళు భంగుతాగే వాళ్ళు, గంజాయి తాగేవాళ్ళు, హంతకులు కూర్చున్నారు. నేనక్కడే నిలబడ్డాను. వాళ్ళతోపాటు ఒక బోగంది కూడ వుంది. వాళ్ళందరూ ఆమెని రెచ్చగొడుతున్నారు. భోగం దాన్ని నెట్టి నెట్టి వాళ్ళు అల్లారక్కా మీద విసిరి పడేశారు. ఇదంతా నేను నాకళ్ళతో చూశా. ముప్పైమంది కూర్చునే బోగీ. అయినా కూడ పదిమందీ తప్పమిగతా పదకొండు మంది ప్రయాణీకులూ అందులో లేరు. వాళ్ళ మొహాలు చూసినాక అందరూ ముందు బోగీలోకెళ్ళి కూచున్నారు. సేఠ్! మీరు తెలుసుండీ మీ పిల్లల్ని పులులూ – తోడేళ్ళ మధ్య కెందుకూ విసిరేశారు?''

రామ్‌లాల్ రక్తం చల్లబడింది. ఆ వ్యక్తి మరోసారి నాలుగు వైపులా చూపు సారించి చేత్తో మొహాన్ని మరుగు పరచి తను చెప్పాల్సింది పూర్తి చేశాడు – ''సేఠ్! ఎనిమిది రోజుల్నాడో పదిహేను రోజుల్నాడో అల్లారక్కా ఇక్కడ తిరిగాడు. అతనొచ్చాక రైలు పెట్టెలో ఐదుసార్లు హత్య చేయబడ్డవాళ్ళ శవాలు దొరికాయి, పట్నంలో దగ్గిర దగ్గిర ఏడుసార్లు లూటీ జరిగింది. ఈ మకిలి హస్త లాఘవాలు అల్లారక్కాకి అన్నీ తెలుసు. పోలీసులకి తెలీదా అని మీరడగవచ్చు. పోలీసులకి బాగా తెలుసు, కాని అల్లారక్కా పోలీసుల్నితనతో కలుపు కున్నాడంటాన్నేను. ఇప్పుడు మీరేమంటారయ్యా వాడు గుజరాత్ మొత్తం తన బాబు గాడిదనుకుంటాడు. వాడి వ్యవహారం ఎలా ఉంటుందంటే పని జరగాలంటే ఎవరో ఒకరు పూనుకోవాలి. ఉన్న వాడు రాజవుతాడు లేనివాడు సన్యాసవుతాడు! నీతి – జాతి తగులడి పోయింది. గాంధీ అంతా పాడు చేసేశాడు. ఇటువంటిపరిస్థితుల్లోఏస్వాతంత్ర్యం మాత్రంఎలా దొరుకుతుంది. ప్రతాపమంటే తెల్లవాడి రాజ్యానిదేననుకోండి...''

ఇలా ఎంతగానో తత్వబోధ చేసి తన మనసులో ద్వేషాన్ని వెళ్ళగక్కడానికి ఆరాట పడ్డాడు. కానీ తీరా చూస్తే రామ్‌లాల్ ధ్యానం అతని మాటలు మీద కాకుండా మరెక్కడో వుంది. దాంతో అతనక్కడ నుంచి జారుకొని కొద్ది దూరం పోయి మరొక వ్యక్తితో మాట్లాడసాగాడు. ఇద్దరు పకపక నవ్వసాగారు. వాళ్ళిద్దరూ తమ చేతులు రామ్‌లాల్ వేపు చూపిస్తూ మాట్లాడకుంటూంటే అది దూరం నుంచి చూసేవాళ్ళకి వాళ్ళు రామ్‌లాల్‌ని చవటగా జమకట్టినట్టనిపిస్తుంది.

రామ్‌లాల్ టెలిగ్రాఫిక్ ఆఫీసుకెళ్ళాలి. టెలిగ్రాఫిక్ ఆఫీసు ఎదురు గానే వుంది. కళ్ళు చెదిరేట్టు నియాన్‌లైట్లలో 'టెలిగ్రాఫిక్' ఆఫీస్ అని వ్రాసివుంది. అయినా కూడ రామ్‌లాల్ ఎంత మతిపోయున్నాడంటే అతను పక్కనించి వెడుతున్న అతన్ని అడిగాడు ఆ ఆఫీసుగురించి.

టెలిగ్రాం ఫారం తీసుకుని అతను దానిమీద మెస్సేజ్ వ్రాయసాగాడు. ఈ సమయానికి రైలు బండీ ఎక్కడుంటుందో కూడా వాకబు చేశాడు. అది చేరుతుందనుకుంటున్న స్టేషన్‌లో స్టేషన్ మాస్టర్‌కి మెస్సేజ్ వ్రాశాడు. సాధ్యమైనంత తక్కువ పదాల్లో మెస్సేజ్ వ్రాసి అతను తొమ్మిది అణాల్లోనే పని జరిగిపోతుందనుకున్నాడు. అలా ఆలోచిస్తూంటే అతనికి తన జ్ఞానానికి తనే తిలోదకాలిచ్చు కుంటున్నాడనిపించింది. టెలిగ్రాం ఫారమ్‌ని కౌంటర్ మీద పెట్టి ఒకరూపాయిని ముందుకు జరిపాడు. ''మరోరెండు రూపాయ లివ్వండి'' పోస్ట్‌మాస్టర్ కొంచం తలెత్తి ఆకాస్త చెప్పి ఏదో వ్రాసుకోసాగాడు.

''దేనికీ''? రామ్‌లాల్‌కి కొంచెం కోపమొచ్చింది. ''ఏవిఁటి, ఏమీ తెలినీ వాణ్ణి అనుకొని...''

''ఎక్స్‌ప్రెస్ ఛార్జ్'' పోస్ట్‌మాస్టర్ జవాబిచ్చాడు.

''దేనికీ?''

''లేట్ ఫీ ప్లస్ సండే.''

ఎవరో గాఢ నిద్రలో కుదిపేసినట్టు అనిపించింది. రామ్‌లాల్‌కి. మూడు రూపాయలా? అతను ఏ అవతారమెత్తినా కూడా పర్సనల్ టెలిగ్రాం మీద మూడు రూపాయలు ఖర్చు చెయ్యలేడు. ఏం నిజంగా మూడు రూపాయలు ఖర్చు పెట్టేంత అపద వచ్చిపడిందా? ఏం నాభార్యతనసొంత తెలివి నుపయోగించి పెట్టి మారలేదా? ఏం ఇన్నేళ్ళు నాతో వుండి కూడా ఆమె బుద్ధి వికసించుండదూ? ఎవరెరుగుదురు! ఆడది కదా! ఆడదానికి మెదడు మడమలో వుంటుంది. పొరబాటు చేసేస్తుంది. కానీ ఏ ఆపదన్నా వస్తే ఆమె గొలుసు లాగలేదేవిఁటి? గొలుసు ఆమె కూర్చున్న చోటుకి దగ్గరే వుంటుందా? కానీ గొలుసు సమయానికి పనిచేసే స్థితిలో ఉంటుందా?

రామచంద్రా! ఈ వర్షంలో గొలుసు ఒకవేళ జామ్ అయిపోతే! ఈ రైల్వే వాళ్ళకి ప్రమాదాన్ని సూచించేందుకు లాగే గొలుసుని పని చేసే స్థితిలో సరిగ్గా వుంచాలన్న ధ్యాసెక్కడుంటుంది. కానీ, ఏం నాభార్య కేక పెట్టలేదా? పిల్లలు కేకలెట్టరూ? ఆదొంగ అల్లారక్ఖా పంజా ఆమె నోటిని బంద్ చేసేస్తే...' ఈ మాదిరిగా సాగుతున్న ఆలోచనా శృంఖలాల్ని పోస్ట్ మాస్టర్ రామ్‌లాల్ ఇచ్చిన రూపాయినీ, టెలిగ్రాం ఫారమ్‌నీ బయటికి తోసి భంగం చేశాడు. పైకి

అన్నాడు- ''సేఠ్‌జీ! బాగా ఆలోచించుకుని ఉదయం రండి. అప్పటికి సోమవారమవుతుంది.''

రామ్‌లాల్ మనసులో ఆ క్షణం తనమీద తనకే తిరస్కారభావం ఉత్పన్నమైంది. అతని కల్పనలో - అతని భార్య అడవిలో చీకట్లో ఎంతో నిస్సహాయ స్థితిలో పోతోంది. ఆమె కేక కూడా పెట్టలేకపోతోంది. ఆమె చిన్న కొడుకు ఎప్పుడో గిల గిల కొట్టుకుని మరణించాడు!

''భగవంతుడా! పధ్నాలుగు లోకాల్నీ పాలించే స్వామీ! గరుడగామీ!'' ఒక నిట్టూర్పుతో పాటు అతని నోటి నించి ఈ ప్రార్థన వెలువడింది. అతను టెలిగ్రాంఫారమ్‌ని మళ్లీ కౌంటర్‌లోకి తోసి అయిదురూపాయలు నోటుని గిరవాటేశాడు.

''రిప్లై ప్రీ పెయిడ్?'' పోస్ట్ మాస్టర్ తన పరిభాషలో సంక్షిప్తంగా ప్రశ్నించాడు. ప్రతివ్యక్తి తన ఉద్యోగ పరిభాషే అన్నిటికన్నా గొప్పది అనుకుంటాడు. ఇంకా, మిగతా వాళ్ళంతా దాన్నర్థం చేసుకుంటారను కోవడమూ జరుగుతూంటుంది.

''అవునండీ... అదీ... వొద్దు... అవునండి, అవునండి, రిప్లై అడగండి.'' రామ్‌లాల్ ఎలాగోలా చెప్పాడు.

రామ్‌లాల్ హృదయంలో ఒక ఫిల్టరున్నట్టుగా వుంది. ఈ ఫిల్టర్ చతురత, వ్యవహారికతకి సంబంధించినది. తన ప్రతీ ఆలోచననీ అతను ఈ ఫిల్టర్‌లో వడగట్టాక ఆచరణలోకి తెస్తాడు.

పోస్ట్‌మాస్టర్ ఎనిమిదణాలు జేబులో వేసుకుని కొన్ని పైసలు వాపసు చేసాడు. దాని తర్వాత అనేకానేక విధి - క్రియల్ని జరిపిన అనంతరం రామ్‌లాల్ మెస్సేజ్‌ని టెలిగ్రాఫిక్‌మిషన్ మీద ఖడకడ లాడించసాగాడు. రామ్‌లాల్ కప్పుడు కాస్త ధైర్యం చేకూరింది. బలమైన ఉచ్ఛ్వాస నిశ్వాసాలలోంచి అతని కల్పనం శ్రవణాల్లో పోలీసు బూట్ల శబ్దం రాసాగింది. బేడీల ఝునఝున ధ్వని ప్రతిధ్వనించసాగింది. దుర్మార్గుడు అల్లారక్ఖా చేతులకిపడినబేడీలలో తిరుగుతున్న తాళం చెవి ధ్వని రాసాగింది.

జవాబు కాగితాన్ని కవర్లో పెట్టి టెలిగ్రాఫ్ ఆఫీసు వాళ్ళు రామ్‌లాల్‌కి ఇచ్చాక ఒక్కక్షణం అతనికి ఎంత మనశ్శాంతి కలిగిందో! కవరుచించి చదివితే అందులోఇలావుంది.''ఐదునిమిషాలక్రితమేబండిక్కణ్ణించివెళ్ళిపోయింది.''

ఇంకా ఖర్చుచేసే సాహసంలేకపోగా రామ్‌లాల్ ఈశ్వరుడి సహాయాన్నర్థించాడు. అతను పూర్వకాలపువాడయ్యుంటే ఈ లోపలే కులదేవతకి మొక్కుమొక్కేవాడు కానీ అత్యాధునికుడు యుగానికి చెందితే

పూర్తిగా పురుషార్థాన్ని అనుభవపూర్వకంగా పొందుండేవాడు. కాని అటూ ఇటుకాని స్థితిలో ఉండటం చేత అతను ఇంటికెళ్ళి పక్కమీద వాలిపోయాడు. అతనికి నలువైపులా భయంకరమైన ఆకారాలు తిరగసాగాయి.

నిద్రరావటం లేదు. కానీ మెదడు అలసిపోయి శవంలాగయ్యాడు. జ్ఞాన తంత్రులు ఉత్తేజితమైనాయి. రామ్‌లాల్‌ని ఒక భయానకమైన కథ ఒకటే చెమటలు పట్టించింది. అది స్మృతీ కాదు, స్వప్నం కాదు. ఆరెండింటి మేలు కలయిక.

తను ఏ వ్యక్తితోనైతే ''నా పిల్లల్ని కాస్త కనిపెట్టుండండని చెప్పాడో ఆ వ్యక్తిని ఇంతకు ముందు కూడా ఒకసారి చూసి నట్టనిపించింది.

ఎక్కడ చూశాను?

ఆఁ...ఆఁ గుర్తొచ్చింది. ఒకసారి రైల్లో ప్రయాణం చేస్తున్నప్పుడే చూశాను. ఆ రాత్రి అతను హఠాత్తుగా చిన్నదిగా వున్న మా పెట్టెలోకెక్కాడు. అతని ముఖం భయంకరంగా వుంది. అయినా కూడా తను నాముందు చేతులు జోడించి, ''భాయిసాహబ్! కొద్ది సేపునన్ను దాచేయండి. నా దగ్గిర నాలుగు నల్లమందుగోళీలున్నాయనిఒప్పుకుంటున్నాను. పోలీసులునన్ను వెంటాడు తున్నారు.''

ఆ నల్లటి వ్యక్తి మాటకి జవాబుగా నేను ''వీల్లేదు వీల్లేదు, దుర్మార్గుడా! ఇక్కడ వీల్లేదు. ఫో బయటికిక్కణ్ణించి'' అన్నాను.

తిరిగి అతను నా భార్య రుక్మిణి ఎదుట ప్రాదేయ పడ్డాడు - ''నువ్వు నా తల్లివి, నన్ను దాచెయ్యమ్మా.'' నా భార్య చెప్పేసింది - ''కూర్చోరాదా''. నా భార్యని చివాట్లెట్టి ''పోలీస్! పోలీస్!'' అని కేకలెట్టాను. పోలీసులొచ్చి అతన్ని పట్టుకున్నారు. కోర్టులోనాకుప్రశంస, ఆ దుర్మార్గుడికి మూడేళ్ళ శిక్ష లభించాయి. అప్పుడతను నా వేపు చూసి ప్రతిజ్ఞ చేశాడు - ''రామ్‌లాల్, విడుదలయ్యాక నీ సంగతి చూస్తాను?''

వాడే, ఆ మనిషే వాడు. నా భార్యని విచారిస్తున్నాడు... ప్రతీకారం తీర్చుకుంటున్నాడు... నా భార్య రక్తం తాగుతున్నాడు. హయ్యో! అయ్యో!

రామ్‌లాల్ తను చేసిన ఆహ్ - ఊహ్ శబ్దాలకే మేల్కొన్నాడు.



ఆఖరికి ఉదయం కావల్సిందే కదా, ఉదయం అయింది. దగ్గిర దగ్గిర పదిగంటలకి రామ్‌లాల్‌కి అందరూ హాయిగా, క్షేమంగా చేరారంటూ తన బావమరిదిచ్చిన టెలిగ్రాం అందింది. మూడో రోజు భార్య వ్రాసిన సుదీర్ఘలేఖ

అందేసరికి రామ్‌లాల్ ఆశ్చర్యపోయాడు. రుక్మిణి అంతకు ముందెప్పుడూ చేరగానే ఇంత త్వరగా ఉత్తరం వ్రాయలేదు.

ఉత్తరం ఒక తక్కువ చదువుకున్న విచిత్రమైన స్త్రీ భాషలో వుంది. ఉత్తరం ప్రారంభం 'ప్రియా' అనిగానీ ''నా ప్రియతమా'' అని గానీ ''నా ప్రాణప్రియా ప్రేమస్వామీనాథా'' అనిగానీ మొదలైన వాటి వేటితోనూ కాలేదు. సూటిగా వ్యాపార శైలిలో మామూలు ఉత్తరంగా ప్రారంభమైంది. అందుకే ఆ ఉత్తరం ఇంజన్‌తో శోభాయమానంగా వుండే పాతకాలపు రైలు బండిలా ఉంటానికి బదులు ఇంజన్ లేని ఎలెక్ట్రిక్ ట్రైన్ లాగా బోడిగా, ఒక తీరనేది లేనట్టుగా వుంది. ఇదుగో ఆ ఉత్తరం. ఇందులో కేవలం విరామ చిహ్నాలు మేము జోడించాము.

మీకేమైనా స్పృహ వుందా? నీళ్ళ కూజా తెప్పించి ఇవ్వండి. ఇత్తడిదొద్దు మట్టిది తెప్పించివ్వండి అని ఎంత చెప్పాను. మీలో చలనం లేదు. ప్రతీ స్టేషన్‌లోనూ నీరు దొరుకుతుంది గనక లోటాతో పని జరగదా? అన్నారు. సరే బాగుంది. మీ మాటే చెల్లింది. దారిలో నీళ్ళకి చాలా ఇబ్బందయింది. చిన్న పిల్లలు ఏడవడం ప్రారంభించారు. నాతో తినడానికీ – తాగడానికీ వుంటే అదిచ్చాను. ఇప్పుడు పిల్లాడు ''మంచి నీళ్ళు మంచి నీళ్ళ నడం మొదలెడితే ఒకతను నీళ్ళు తెచ్చిచ్చాడు. అతనేమీ వాకబు చేయలేదు. పైగా తనతో వున్న వాళ్ళతో ''ఈమె భర్తనాతో చెప్పాడు. ఈమెని కనిపెట్టుండండని'' అని చెబుతూ వచ్చాడు.

కనీసం పాతికసార్లైనా అతను ఈమాటే మళ్ళీ మళ్ళీ చెప్పాడు ''ఈమె భర్తనాతో చెప్పాడు. ఈమెని కనిపెట్టుండండని.'' అతను ఇలా చెప్పడం, మనసారా సంతోషించడం!

ఇక విస్తారపూర్వకంగా అన్నివిషయాలు వ్రాస్తున్నాను. బండి బయలుదేరిన తర్వాత వెంటనే అతను ఆవిడని – చెబుతోంటే సిగ్గేస్తోంది- తన ఒడిలోంచి దింపి రెండో వేపు కెళ్ళి కూచోమన్నాడు. కూడా ఉన్నవాళ్ళం దరితోనూ చెప్పాడు – ''ఇక యీ గొంతు చించుకోడాలు, నవ్వులూ ఆపండి, బీడీపొగలు ఇటు రానివ్వకండి. ఎందుకంటే ఈమె భర్త నాతో చెప్పాడు. ఈమెని కనిపెట్టుండమని.''

ఆ తర్వాత అందరూ మెల్లిమెల్లిగామాట్లాడుకోసాగారు. కొద్ది సేపట్లోనే అందరూ నిద్రపోయారు. కానీ అతను మాత్రం అంటాడూ – ''నేను నిద్రపోను. ఈమె భర్తనాతో చెప్పాడు ఈమెని కనిపెట్టుండమని.''

అతను కూర్చునే వున్నాడు. ఏదో వుంది. తప్పకుండా ఏదో గడబిడ

జరుగుతుందని నా గుండె దడదడలాడసాగింది. ఇతనెందుకు మెలుకువగా వున్నాడో యేమో! మళ్ళీ అతను నాతో ''అమ్మా. నువ్వు నిద్రపో'' అంటాడు. కానీ నేనెలానిద్రపోతాను? పడుకునికళ్ళుమూసుకుని దొంగ నిద్రపోసాగాను. బబలీ ఏడవడం ప్రారంభించింది. ఏడవాలి - ఏడవాలి. టపువాకూడా ఏడిచేందుకు సిద్ధంగా వున్నాడు. అతను లేచి నాతో ''అమ్మా, ఏదేనా గుడ్డ ఇవ్వు'' అన్నాడు. ఇప్పుడితను నన్ను దోచేస్తాడనిపించింది. నేను చేతులు జోడించి ఏడుస్తూ చెప్పాను - ''భాయీ! వీరా! ఇదంతా తీసుకుపో! నన్నూ నాపిల్లల్నీ విడిచి పెట్టు.'' అనేసి నేనేమో సామానూ, సమస్తమూ ఇవ్వనారంభించాను. అటు చూసేసరికి అతను నవ్వుతూ నిలబడ్డాడు. గుడ్డ ఉయ్యాల మూటలో కనిపిస్తే అతనే స్వయంగా దాన్ని బయటికి లాగాడు. తాడతని దగ్గిరుంది. పెట్టిలో పైబెర్తుకితాడుకట్టి అతను ఉయ్యాల వేలాడదీశాడు. దానిలో బబలీని నిద్రపుచ్చాడు. ఇప్పుడిక అతను దూరంగా కూర్చుని ఉయ్యాలూపుతూ తన పఠానుభాషలో ఏవేవో జోలపాటలు పాడాడు. నాలో నేనే అనుకున్నాను ''చూడీ మహమ్మారి. శ్రుతి, తాళం తప్పకుండా ఎలా పాడుతున్నాడో!'' ఒక నవ్వు, ఒకదుఃఖం ఈ గెడ్డం మీసాల ఏడు చేతుల రాక్షసుడి లాంటి మనిషి, ఎక్కణ్ణించో ఆడవాళ్ళ కుండేలాంటి కంఠస్వరాన్ని వెలికి రప్పించి పాడుతున్నాడో! పాడుతూ, పాడుతూ అతను ఏడవటం ప్రారంభించాడు. ధారలు ధారలుగా కన్నీరు ప్రవహిస్తోంది. ఎంతో ఏడిచాడు. అనంతరం తనలోతనే అనుకోసాగాడు - ''భార్య బిడ్డలెక్కడ! నువ్వెక్కడ! నేనెక్కడ!''

ఇంక బబలీ ముండని చూడండి. నేను రోజూ దెబ్బలాడి పడుకో పెట్టే దల్లా అక్కడ ఒకే ఉయ్యాల ఊపుకి నిద్రపోయింది. అన్నట్టు, మీరే రోజైనా నా బబలీని ఊపారా? ఏరోజన్నా జోల పాటలో ఒక ముక్కయినా మీ నోటి నుంచి బయటకొచ్చిందా? నేనెంతకని ఖుషామద్ చెయ్యను? మీరు మాత్రం, ''ఇది నాపనికాదు, నేను మొగవాణ్ణి'' అని చెప్పిఊరుకునేవారు. చూడండి, మీరు చూసుండరు. మొగవాళ్ళంటే ఇలా వుంటారు.

సరే పోనివ్వండి. ఇదంతా జరుగుతూండగా రాత్రి మూడుగంట లప్పుడు బండి ఒక జంక్షన్ దగ్గిర ఆగింది. మా పెట్టికి సరిగ్గా ఎదురుగా ఖాకీ యూనిఫారాలు తొడుక్కున్న వాళ్ళు ఏ ఇరవై మందో వచ్చి నిలబడ్డారు. వీళ్ళు మొగట అతను కూచున్న వేపుకెళ్లారు. మళ్ళీ వెంటనే వెనక్కొచ్చి చెప్పారు - ''అమ్మా, ఈ పెట్టె ఖాళీ చెయ్యాలి.'' నేనన్నా - ''ఎందుకూ?''

వాళ్ళన్నారు - ''నీకు తెలీదూ? లోక్ సేవక్ సవారీ వెడుతోంది.''

నేనర్థం చేసుకోలేకపోయానూ. నేనడిగాను - ''మీరు ప్రభుత్వ తరపు మనుషులా?''

వాళ్ళు నవ్వసాగారు. చెపుతున్నారు - ''అవునవును. ఇవాల్టి ప్రభుత్వం తాలుకైతే కాదుగానీ తప్పకుండా రేపటి ప్రభుత్వం తాలుకా వాళ్ళం. పదదిగు. నిన్ను పక్క పెట్టెలో కూర్చోబెడతాం.''

నేను దీనంగా అడిగాను - ''భాయీ, నాపిల్లలు చిన్న వాళ్ళు, నిద్రపోతున్నారు. నాదగ్గర సామాను కూడ ఎక్కువుంది.''

దీని మీద వాళ్ళలో ఒకడంటాడూ - ''సిగ్గు తెచ్చుకోవమ్మా! మిగతా ఆడవాళ్ళు లోక్‌సేవక్ చరణాల ఒక్కొక్కరూ ఒక్కొక్క వస్తువో లేకపోతే వజ్ర వైఢూర్య హారాలో కానుకలిస్తోంటే నువ్వు ఒక్క పెట్టి కూడా ఖాళీ చెయ్యలేక పోతున్నావు. లోక్ సేవక్ మూడో తరగతి పెట్టెలోనే కూచునే వ్రతం పట్టారన్న దింత మాత్రం కూడ తెలియదా? అరే, నీకు ఆ శ్రేష్ఠ భిక్ష అన్న కథేనా గుర్తులేదూ?''

నాకైతే ఏమీ అర్థం కాలేదు. నా నోటినించొచ్చేసింది. ''చావనీ నీ లోక్‌సేవక్‌ని! నా ప్రాణం ఎందుకు తీస్తారు.''

నా నోటినుంచి మాటలిలాగే వచ్చాయి. కానీ వాళ్ళు వినవే విన్నారు. వాళ్ళకోపం వచ్చింది. వాళ్ళలో ఒకడంటాడు - ''దిగకెక్కడిగి పోతావ్?'' - వాడు పెట్టెలోకి దూరాడు. పైకెక్కి బయటికి విసిరెయ్యడానికి నా సామాను తియ్యసాగాడు. నేను ''భాయిసాబ్ - భాయిసాబ్'' అంటూ వుండి పోయాను. ఇంతలో మరోవేపు కూర్చున్న అతను లేచి పైకెక్కిన ఖాకీ యూనిఫారమ్ వాడి పీక పట్టుకుని కళ్ళురిమి చూసి ఇలాగన్నాడు - ''ఆమె భర్తనాతో చెప్పాడు ఆమెని కనిపెట్టుండమని తెలిసిందా?''

ఇది చూసేసరికి బయటి వాళ్ళ కళ్ళు పేలాయి. అతను ఎవడిపీకైతే పట్టుకున్నాడో వాడుమదారీచేతిలోచిక్కిన చందన్‌గోహ్(ఒకరకం చిన్న ఉడుము)లాగా విలవిల్లాడాడు. ఇంకెవరికి దమ్ములుంటాయి మా పెట్టెలో ఎక్కడానికి? లోక్ సేవక్ - లోక్ సేవక్ అంటూ నన్ను దిగిపొమ్మని చెప్పినవాడు వెంటనే - ''భాయియోం! పదండి మరో పెట్టిలో ఎక్కుదాం. జాతీయ సమైక్యతకి భంగం కలిగించడం మంచిది కాదు. మనం ఎక్కడో అక్కడ ముడుచుకూర్చుందాం. పఠానులు మన నిజమైన సోదరులు.''

మళ్ళీ వాళ్ళు ఎవరికో 'జై' చెప్పి 'అల్లా హో అక్బర్' అని నినాదం చేసి వెళ్ళి పోయారు.

అతనొక్కడూ ఉండిపోయాడు. తనలో తనే అనుకోసాగాడు

''నాకు చెప్పాడు. ఈమెని కనిపెట్టుండమని! ఆఁయ్? నాకు చెప్పాడు? నాకు? శభాష్? నాకు చెప్పాడు ఈమెని కనిపెట్టుండమని. శభాష్! ఈ విధంగా బడబడ మాట్లాడుకుంటూ అతను తన శౌర్యాన్ని తనే పొగుడుకుంటున్నాడు. సంతోషంతో పిచ్చి వాళ్ళా అయిపోయాడు.

ఉదయం బండి దిగాను. అతను బబలీని, జయంతి యానీ, టపువానీ ఒళ్ళోకి తీసుకుని ముద్దు చేశాడు. తలమీద చెయ్యుంచి ''సలామ్ అలైకుమ్'' అన్నాడు.

నేను, ''భాయీ, నువ్వు నా పరువు కాపాడావు. ఎప్పుడన్నా బొంబాయి వస్తే మాయింటికి రా. మా ఇల్లు ఫలనా ఫలనా వీధిలో వుంది. జయంతియా తండ్రిపేరు 'ర' తో ప్రారంభమవుతుంది.'' అన్నాను. తిరిగి నన్ను తీసికెళ్ళడానికొచ్చిన మా తమ్ముడితో - తమ్ముడూ ఈయనకి మీ బావగారిపేరు చెప్పు'' అన్నాను. తమ్ముడు ''రామ్‌లాల్ చున్నీలాల్ మహేశ్వర్'' అనిచెప్పాడు. వింటూనే అతను ఉలిక్కిపడ్డాడు. కాసేపతని కళ్ళు మిడిగుడ్లడిపోయాయి. అతను మళ్ళీ నవ్వేసాడు.

తమ్ముడు మన అడ్రసు ఒక కాగితం ముక్కమీద వ్రాశాడు. అది అతనికివ్వబోతే అతను నవ్వేసి తీసుకోవడానికి నిరాకరించి ఆకాశం వేపు వేలు చూపించాడు.

వ్రాసినది రుక్మిణి.

ఉత్తరం చదువుకుని రామ్‌లాల్ తిరుగుటపాలో తన భార్యకీ, బావమరిదికీ ఉత్తరం పోస్ట్ చేశాడు. అందులో అతనిలా అడిగాడు - ''నా అడ్రెసున్నఆకాగితంముక్కని మీరతనికివ్వలేదన్నది ఖాయమైన మాటేనా? ఒకవేళ ఇవ్వకపోతే దాన్ని చింపెయ్యండి. ఇచ్చివుంటే, ధర్మం మీద ఒట్టు, నాకు నిజం చెప్పండి. దాన్ని బట్టి నేను ఇంటి దగ్గర పోలీసు రక్షణ నేర్పాటు చేసుకోగలగుతాను.''

దాని జవాబుగా బావమరిది తన బావగారికి ఆ కాగితం ముక్కనే పంపించాడు. దాన్నతను పొరబాటున తన నోట్ బుక్‌లో పెట్టుంచేశాడు.

ఇంకా కూడా రామ్‌లాల్ తన పొరబాటు వల్లే జవాబు పొందలేక పోయాడు. అతను పోలీసులకి ఈ సంఘటన గురించి సూచనిచ్చాడు. పోలీసు అధికార్లు కూడ, ''ఇది చాలా సీరియస్‌గా తీసుకోవలసిన విషయం'' అని రామ్‌లాల్‌ఇంట్లో రామ్‌లాల్‌ఖర్చు మీదే ఒక సమర్థుడైన చౌకీదార్‌ని నియమించారు.

రుక్మిణి పుట్టింటి నుంచి రాగానే రామ్‌లాల్ ఆమెనెంతో నిందించాడు.

''ఆ దుర్మార్గుడికి నీ ఇంటి అడ్రెసు నివ్వాలన్న తెలివి తేటలెవరు నేర్పించారు?''

నీళ్ళునిండిన రుక్మిణికళ్ళు అల్లారక్కాకి ఆకృతిని కన్నీళ్ళతో అభిషేకిస్తున్నాయా అన్నట్టున్నాయి.

# 5. తల్లి ఒడిలో

సుందరమ్

త్రిభువన్‌దాస్ పురుషోత్తమదాస్ లుహార్ (జననం 1908 క్రీ.శ.) భడౌంచ్ జిల్లాలో అమోద్ నివాసి. అహమ్మదాబాద్‌లో గుజరాత్ విద్యాపీఠ్‌లో పట్ట భద్రులయ్యారు. ఈరోజుల్లో శ్రీ అరవిందాశ్రమం, పాండిచ్చేరిలో ఉన్నారు. కావ్యమంగళా, 'వసుధా', 'యాత్రా' ఈయన ప్రసిద్ధ కావ్య సంగ్రహాలు. 'అర్వాచీన్ కవితా' అర్వాచీన గుజరాతీ కవితల యొక్క వివేచనాత్మక గ్రంథం. 'అవలోకనా' సాహిత్యాత్మకరచనలు, సమీక్షలసంపుటి. 'హీరాకణీ,' 'ఉన్నయన్', 'పియాసీ' కథల సంపుటాలు.



నది ఒడ్డున ఎత్తైన బండరాళ్ళ మీదున్న గ్రామానికి వెనుక భాగం నించి ముగ్గురుమనుష్యులు బయలుదేరారు. ఇద్దరుపురుషులు, ఒకస్త్రీ మొగవాళ్ళు, కాస్త ముందెడుతున్నారు. స్త్రీకి వీడ్కోలిస్తూ వాడలోని యితర స్త్రీలు మంచిది శబూ... ''త్వంలో రా... జాగ్రత్తగా వెళ్ళిరా...'' అని చెబుతున్నారు.

శబూ భర్త, మావఁగార్లు ఆమెని పిలుచుకెళ్ళడానికి వచ్చారు. ఆమె వాళ్ళతో అత్తవారింటికివెడుతోంది. పుట్టింటినించివీడ్కోలు తీసుకుం టున్నప్పుడు ఆమె అడుగులు ముందుకు పడలేదు. పుట్టింటిలో స్త్రీలు వాడలో వాళ్ళు, స్నేహితురాళ్ళు నించి వీడ్కోలు తీసుకుంటూ ఆమె కొంచెం వెనకబడింది. భర్త, మావఁగారు దారిలో మలుపు దగ్గిర కనుమరుగయ్యారు. వాళ్ళని కలుసుకోవడానికి ఆమె వేగంగా ముందుకి అడుగులు వేసింది.

శబూ స్నేహితురాలు ఒకామె మలుపు వరకు కూడా వచ్చింది. మలుపు దగ్గర వీడ్కోలిచ్చి చెయ్యూపుతూ వెడుతున్న శబూని చూస్తూ నిలబడి పోయింది. కొద్దిసేపటికి ఆమె నోటి నుంచి ఒక కేక వెలువడింది. ''అమ్మో!''

వాడలో వాళ్ళు తుళ్ళిపడి అడిగారు - ''ఏమఁయింది? ఏమఁయింది?'' ''శబూ దారిలో పిల్లి అడ్డంగా వచ్చింది.''

కానీ, ఇప్పుడు శబూని వెనక్కి పిలవలేరు. ఆమెని కొంచెంసేపూ

ఆగమని చెప్పనూలేరు. ''ఆజగదంబే అంతా శుభం చేకూరుస్తుంది'' అని అందరూ అనుకుంటూ తమ పనుల్లో నిమగ్నమై పోయారు.

శబూ వేగంగా వెళ్ళసాగింది. గ్రామానికి వెనుకభాగం నించి కాలి బాట కొండ చరియలోకి దిగుతుంది. తండ్రీ కొడుకులు దిగువ నిలబడి చిలుము తాగుతున్నారు. వాళ్ళ నోట్లోంచి వస్తున్న పొగ కనబడుతోంది. వాళ్ళని చూసి శబూ మెల్లిగా నడవసాగింది.

మధ్యాహ్నం అయింది. నదీ తీరంలో నీళ్ళు గలగలమని ప్రవహిస్తూ కనబడుతున్నాయి. నదిలో ఇప్పుడిప్పుడే పొంగు తగ్గుతోంది. నీళ్ళు తగ్గిపోవడం వలన ఒడ్డున బురద కనిపిస్తోంది. బురద అద్దంలా మెరుస్తోంది. ఎవరివో అడుగుజాడలు అందులో పడి ఒక బాటలాగా కనబడుతోంది. శబూ కళ్ళకి చెయ్యి అడ్డు పెట్టుకుని చూసింది. ఎండలో మెరిసే ఆమె కళ్ళు అవతలి గట్టునున్న గ్రామం యొక్క పచ్చని పొలిమేరని చూడసాగాయి.

అత్తవారిల్లు! ఆమెకి సన్నగా వణుకొచ్చింది. ఆమె కనురెప్ప లార్పింది. కింద నిలబడిన మావఁగారు గుర్తురాగానే ఆమె తన పువ్వుల చీర కొంగుని మొహంమీదికి ముసుగువేసుకుంది. ఆమెదృష్టి తన కాళ్ళమీద పారాడ సాగింది. రోడ్డుకి ఇరువైపులా కంచె వేయబడింది. కంచెలో కంధారీ, బడబేరీ, అనూరీ అనే అడవి ముళ్ళ పొదలున్నాయి. కంధారీ పొదమీద గుత్తులుగా నల్లని కంధారీ పళ్ళు ఉన్నాయి. అనూరీలు ఇంకా పచ్చిగా ఉన్నాయి.

శబూ ఆలోచిస్తోంది - ఇంటికెళ్ళాక పండుతాయి. ఆమె కొయ్యడానికి చెయ్యి చాపింది. అప్పుడే కిందనించి ఆమె భర్త కంఠస్వరం వినబడింది - ''అరే ఇంక పద!''

ఆమె ఉలిక్కిపడింది. కంధారీ ముల్లు ఆమె మోచేతిలో గుచ్చుకుంది. ఆమె నెమ్మదిగా చెయ్యిలాక్కుంది.

కొద్ది దూరం వెళ్ళాక ఆమెకి గురవింద గింజలు మందహాసం చేస్తూ కనబడ్డాయి.

''అరిస్తే అరిచారు, గురివంద గింజలు తీసుకోందే నేను వెళ్ళను.'' అనుకుని ఆమె కంచెలాగా వున్న పొదలో చెయ్యి పెట్టింది. ఎలాగైతే ముత్యపు చిప్పలో ముత్యం అమరి వుంటుందో అదే విధంగా గురివింద గింజలు వాటి ప్రకృతి సిద్ధమైన తొడిమల్లో అమరి వున్నాయి. రెండు మూడు గింజలు కోసి ఆమె తన కొంగులో కట్టుకుంది. కిందనించి మళ్ళీ పిలుపు వినిపించింది.

''అరే, వస్తున్నాను, ఎందుకలా అరుస్తున్నావు!'' ఆమె జవాబిచ్చి వేగంగా అడుగుముందుకేసింది. కాళ్ళకేసుకున్నచెప్పులు ధూళి

రేపుతున్నాయి. కాళ్ళ కున్న ఘనమైన కడియాలు మందస్వరంలో ఖన్ ఖన్ మని శబ్దం చేస్తున్నాయి. కొత్త పరికిణీ సాదా చీరనించి గరగర శబ్దం వస్తోంది. చీర కొంగుని సవరించుకోవడానికి ఆమె చెయ్యెత్తగానే ఏనుగు దంతపు గాజులు గాజుతో చేసిన గాజులతో కలిసి 'ఖనక్' మన్నాయి. ఆమె సిల్క్ శాటిన్ రవిక గరగరమంది. రవిక చెయ్యి చివరి భాగం ఎండలో మెరిసింది. ఆమె కాటుక కళ్ళు ఇటూ అటూ చూడసాగాయి. ఆమె ఆగిపోయింది. దారిలో పేడ కుప్ప ఒకటి పడి వుంది – పెద్ద ధాన్యపు రాశిలాగా. శబూ మనస్సులో ఇలా అనుకుంది – ''ఎవరిదో ఒంటరిగా మేసే గేదే వేసి వుంటుంది. లేకపోతే నా సవతులు పంచుకోకుండా వుంటారా?'' పేడని ఎత్తి ఇంట్లో పడేసి రావాలని ఆమెకి అనిపించింది. ఈ దారిలో ఆమె ఎంత పేడ పోగు చేసిందో లెక్కలేదు. ఇవాళ గూడా ఆమె ఆ కుప్పలోనించి పేడ తీసుకోకుండా వుండలేక పోయింది. చెప్పుల కాళ్ళతోనే ఆమె ఒక వేపునించి పేడ కుప్పని కూల గొట్టి దాని మీద మట్టి చల్లింది. ఈ విధంగా పోగు చేసిన ఆ పేడ కుప్పని ఎవరూ తీసుకోలేరని ఆమెకి నమ్మకముంది. ఎవరికేనా అవసరం రావచ్చు కదా, తను అనవసరంగా పేడ పోగు చేసిందే అని కొద్ది దూరం వెళ్ళిన తరువాత ఆమెకి అనిపించింది.

కిందనుంచి మళ్ళీ పిలుపు వినిపించింది. ఆమె తన నడక వేగం పెంచి కొండ చరియలోకి దిగే కాలిబాట మీద ధూళిని ఎగరగొడుతూ వెళ్ళింది. ఆమె కాళ్ళనించిలేచినధూళి 'శబూవెళ్ళిపోయింది, శబూవెళ్ళిపోయింది' అంటున్నట్టుగా గాలిలో ఎగరసాగింది.

కొండచరియలోకి దిగిన తరువాత దారి సమతలం అయిపోతుంది. నదినించివచ్చే చెమ్మ దారిలోదుమ్మును అణిచి వుంచుతుంది. తండ్రీ కొడుకులు తలకి చుట్టుకున్న తలపాగా కొస కొంచెం ముందుకు లాక్కుని, గొడుగులాగా చేసుకుని నడుస్తున్నారు. శబూ చుట్టుపక్కలకిదృష్టి సారించింది. రెండు వేపులా పెద్దా చిన్నా రాతి బండలున్నాయి. రాతి బండల మీద అక్కడక్కడ మేకలు మేస్తూ కనబడ్డాయి. రాళ్ళ మధ్యగా కలుస్తూ మరోచరియ ఏదో ఎదురవుతుంది. ఇంకా పచ్చని గడ్డిలోంచి వంకరటింకర కాలిబాటేదో దూరంగా పోయి కనుమరుగవుతుంది. ఈ రాళ్ళ మీద శబూ ఎన్నో ఏళ్ళ నించి పశువుల్ని మేపుతూ వచ్చింది. ఆమె మనస్సులోనే అనుకుంది – ఏ చెట్టు నీడలోనో కూచుని పొదల్లో ఏరిన రేగిపళ్ళు తింటోంటే ఎంత బాగా వుండేది! అత్తారింటికి వెళ్ళకుండా వుంటే ఎంత బావుంటుంది! పరికిణీ జాకెట్టు తొడుక్కుని రోజంతా తిరుగుతూ వుండవచ్చు!

హఠాత్తుగా శబూకి తన కొత్త బట్టలు, భారీగా వున్న వెండి నగలు బరువుగా అనిపించసాగాయి.

''కాస్త నెమ్మదిగా నడవరాదా!'' అందామె. తండ్రీ కొడుకులు వినిపించుకోకుండా ముందు కెళ్ళిపోతున్నారు. ఒకటి రెండు పొలాలు దాటిన తర్వాత నది ఒడ్డు ప్రారంభమైంది.

ఒక్కసారిగా ఇసుక తగిలేసరికి శబూ నడక మందగించింది. ఆమె ముఖంమీద నించి ముసుగు కొంచెం పైకెత్తింది. నది వేపు నించి వస్తున్న చల్లని గాలి ఆమె మొహంమీద చెమటని ఆరేటట్టు చేస్తోంది. మొహం ప్రసన్నమయింది. శబూ నవ్వ సాగింది. ఆమె ముక్కుకున్న లవంగ మొగ్గ ముక్కు పుడకలో పొదగబడిన రత్నంలో సూర్యుడు తన ప్రతిబింబాన్ని చూసుకోసాగాడు.

ఆమె చుట్టు పక్కలకి దృష్టి సారించింది. చరియనించి వెళ్ళాక ఇరువైపుల కనుచూపు మేర దాకా ఇసుకపఱ్ఱ కనబడుతోంది. ఇసుకలో పశువుల, మనుషుల అడుగు జాడలు చిన్న చిన్న గోతుల రూపంలో ఉండి చిన్న చిన్న తరంగాల్లాగా కనిపించేట్టు చేస్తున్నాయి. ఈ ఇసుక! వెన్నెల రాత్రుల్లో జనమంతా ఇక్కడ పరుగెట్టి పట్టుకునే ఆటఆడ్డానికొస్తారు. ఎలా పరిగెడతారని! ఎలా పరిగెడతారని!

ఆమె కళ్ళలోనీళ్ళు నిండాయి. ఈ రోజు ఇదంతా ఎందుకు గుర్తొస్తోంది? ఆమె మనసు కలత పడసాగింది. దానర్థం, అత్తారింటి కెళ్ళడం ఇష్టం లేదనేగా? ఎన్నేళ్ళ తర్వాత వెడుతున్నానుఅత్తారింటికి!

ఇసుకలో ఆమె పాదం నీరసంగా పడసాగింది. ఆమెకి కాళ్ళలోని కీళ్ళపట్లు వదిలి పోయాయనిపించింది. ఇలా అంతకు ముందెప్పుడూ అవలేదు. జానెడు - జానెడు ఇసుకలో కూడా ఆమె స్నేహితురాళ్ళతో కలిసి గుఱ్ఱం లాగా దూకుతూ తిరిగేది! ఆమెకాళ్ళ నించి చెప్పుల్ని తీసేసి మూటలో దోపేసింది. మూటని తలమీదుంచుకుంది.

ఇసుక వేడిగా వుంది. కాళ్ళలో కొద్దిగా బొబ్బలొస్తున్నాయి. కానీ ఆమె మనసు అంతకన్నా కూడా ఎక్కువ దగ్ధమవుతోంది. అక్కడున్నాయి నీళ్ళు, ఇప్పుడు కాళ్ళకి చల్లదనం దక్కుతుంది. కానీ ఈ పిచ్చి మనసుకి? ఇసుకని అణగదొక్కుకుంటూ ఆమె ముందుకి సాగింది.

అక్కడున్నాయి నీళ్ళు! అక్కడున్నాయి నీళ్ళు! ఆతృత నిండిన ఆమె మనసు మళ్ళీ మళ్ళీ చెబుతోంది. కానీ నీళ్ళు అంత దగ్గరగా కనిపిస్తున్నా కూడా ఎందుకు దగ్గిర పడటం లేదో ఆమెకర్థం కాలేదు - చిన్నప్పుడు మేము ఇట్టే పరుగెట్టి ఒక్కసారిగా నీళ్ళ దగ్గిరకి చేరుకునే వాళ్ళం!

తండ్రీ కొడుకులు నది ఒడ్డుకెళ్ళి నిలబడ్డారు. శబూ కోసం చూస్తున్నారు. ఆమె రావడం చూసి ముందుకి కదిలారు. ముందు బురదుంది. వాళ్ళిద్దరూ బురదలో వెడుతూ అడుసుతొక్కే కుమ్మరి వాడిలా ముందుకీ వెనక్కి తప్పటడుగులేస్తున్నారు.

ముసుగు తప్పించి వస్తున్న శబూ మావఁగారు తన వేపు చూస్తూండటం చూడగానే మొహమ్మీదికి ముసుగులాక్కుంది. కళ్ళలో కనిపించిన ప్రపంచం కాసేపు ముడుచుకపోయింది. బురదతాలూకు నల్లని మెరుపూ నీటి మిలమిలలూ కాసేపు లుప్తమయ్యాయి. ఆహా! ఆమె కాళ్ళకి చల్లదనం లభించింది. ఆమె కాళ్ళ కింద నేల జారుతున్నట్టుంది. బురద ప్రారంభమైంది.

శబూ కళ్ళు తెరిచింది. ఒక వేళ జారిపడితే!

మృదువుగా వున్న బురదలో ఎనిమిది పది అంగుళాలు లోతువున్న గట్టి నేల మీద అడుగులు కూడ దీసుకుని కూడదీసుకుని వేస్తూ వెడుతోంది. అవును, చిన్నప్పుడు గ్రామంలో కుర్రాళ్ళు ఇక్కడ జారుతుండే వారు. వాళ్ళతో పాటు శబూ కూడా జారేది. సముద్రపు పొంగు పోయాక గ్రామంలో పిల్లలు ఈ బురద మీద మొదటి పాదం ఎవరు మోపుతారో అనీ పందెం కాసేవారు. ఇప్పుడు కూడా మొట్ట మొదట ఎవరు వెడతారో వాళ్ళకి మంచి మజా వస్తుంది! కానీ ఇప్పుడు... అదే పనిగా ముందుకి పోతున్న తండ్రీ కొడుకుల మీద ఆమెకి కోపం వచ్చింది. వాళ్ళు తొక్కి తొక్కి బురదని పాడుచేస్తున్నారు. ఈఁయింటి మనుషులేనా వీళ్ళు - ఎక్కడో తద్దినం బ్రాహ్మలు!

''మళ్ళీ పనికిరాని మహీసాగర్ జలాల్ని తలదాల్చకుండానే నీటిలో ప్రవేశించారు.''

తండ్రీ కొడుకులు మోకాళ్ళ దాకా వున్న నీటిని కంగాళీ చేస్తూ ఇంచుమించు సగం దూరం వరకు వెళ్ళిపోయారు. శబూ నీళ్ళ దగ్గిర కొచ్చి నిలబడి పోయింది. కిందకి వొంగి పుడిశెడు నీళ్ళు తీసుకుని తన మీద చల్లుకుని, ''మహీసాగరం తల్లీ! శుభం కలిగించు నాతల్లీ!'' అని చెప్పి నీట అడుగెట్టింది.

''ఛల్‌ల్‌ల్! ఛల్‌ల్‌ల్! మహీసాగరం తల్లీ! మరణిస్తే నీ ఒడిలోనే మరణిస్తాను! ఏదో రోజు నీ ఒడిలోకి ఇలాగే వస్తాను. వస్తాను. నువ్వు నన్ను నీ ఇంటికి తీసికెళ్ళాలి! అరె, ఇలాంటి ఆలోచనెందుకు మనసులోకొస్తోంది. ఈఁరోజు?'' శబూ గుండె దడదడ లాడ సాగింది.

కంగాళీ అయిన నీటిలో ఆమె ప్రతిబింబం వంపులు తిరిగి నట్టు కనబడసాగింది. నది విచారంతో ప్రవహిస్తున్నట్టుంది. ఎందుకంటే శబూ గోచి పోసికట్టుకున్న చీరనీ, చేతుల జాకెట్టునీ, కప్పుకున్న చీర కొంగునీ, నల్లగా సిల్కులా మెరిసే శబూ తనువునీ తను స్పష్టంగా చూడలేకపోతోందని – ఆః నీరు తేటగా వున్నప్పుడు నేను నా స్నేహితురాళ్ళతో పాటు నా మొహాన్ని ఇందులో ఎలా చూసుకుంటూండేదాన్ననీ!

శబూకిచిన్ననాటిస్నేహితులు గుర్తుకిరాసాగారు. మనసు ఉప్పొంగింది – ఒక స్నేహితురాలి పెళ్ళి, నా అత్తారున్న వాడలోనే జరిగింది. ఇప్పుడామెకి ఒక కొడుకు కూడా కలిగాడు. బాగుంది. చేరుతూనే వెళ్ళి వాడి నాడిస్తాను.

ఈ ఆలోచన రాగానే ఆమెకి తన కడుపులో కొంచం స్ఫురణలాంటి అనుభవమయింది. ఎక్కువగా వచ్చిన పొట్ట మీద చెయ్యి ఉంచుకుని ఆమె కాసేపు నీటిలో నిలబడిపోయింది. సరిగా అప్పుడే ఎక్కణ్ణించో ఆమెకి ఎవరో పిల్లాడు ఏడుస్తున్న రోదన ధ్వని విపించింది. ఆమె చెవుల నప్పగించి వినసాగింది. నాలుగు వేపులా నిర్మానుష్య శూన్యత ఆవరించి వుంది. ఐదు క్రోసులు విస్తరించున్న నదిలో చెట్టూ చేమ గానీ, గృహం – గుడిసెగానీ జాడ కూడా లేవు. అయినా కూడా పిల్లవాడేడుస్తున్న శబ్దం వినిపించి ''ఇదేవిఁటి? అంబ! మాతా! రక్షించమ్మా!'' అనుకుని ఆమె ముందుకి సాగింది.

నీటిలోతు ఎక్కువతోంది. నీటి ప్రవాహ వేగం కూడ పెరుగుతోంది. శబూ లంగాని పైకి తీసుకుని కాళ్ళుకూడదీసుకుని ఎంతో జాగ్రత్తగా అడుగులు వేస్తోంది. కిందేదో వచ్చేసరికి ఆమె కాలుజారింది – అయ్యో పడ్డాను! అయ్యో ప్రవాహం! వీళ్ళిద్దరు మూర్ఖులూ రెండో ఒడ్డుకెళ్ళి నిలబడ్డారు. ఇలాంటి వాళ్ళింటికెళ్ళేకన్నా ఈ మహీసాగరంలో మునిగి చావడం నయంగా? ఇప్పుడు ఒక వేళ ఎత్తయిన వరద కెరటాలు ఉరికి వచ్చేస్తే?

శబూ మనసువ్యాకుల పడసాగింది. కానీ ఇప్పుడు మనసు కన్నా కాళ్ళు ఎక్కువ పరిశ్రమిస్తున్నాయి. ఆమె కాళ్ళు జలచరాల్లాగా ధృఢమైన చలనంతో సాగిపోతున్నాయి. ఆమెకి దాహమేసింది. చూసుకోకుండా మహీసాగరం నీళ్ళు తాగబోయింది. మళ్ళీ వెంటనే థూ... థూ మని ఉమ్మేసింది. ఉప్పునీళ్ళు! చవుడు మట్టిలాగా! కానీ నీళ్ళు అంటే అవే నీళ్ళు... అయ్యో రామ! నది మధ్యలో ఉండగా దాహం. ఈ దాహం ప్రాణం తీస్తోంది. నీటిలో నిండిన ఇంత పెద్దనది! కానీ ఎందుకూ ఉపయోగం లేదు. ఇంకో అయిదు క్రోసుల దూరం వరకూ ఒక్క తియ్యని మంచి నీటి బిందువు కూడా

దొరకదు. నది ఒడ్డున దాహంతో చాలా మంది చనిపోతూంటారు.

కానీ ఇటీవలే చలివేంద్రం వెలిసిందని విన్నాను. అందుకే ఎవరూ నీటిని కూడా తీసుకురానివ్వలేదు. అమ్మ పెద్ద బిందె నింపి తయారుగా వుంచింది. కానీ వీళ్ళు, ''కాలి నడకన పోవాలి. నీరెందుకు బరువు చేటు ఘడియలో చేరిపోతుంది కదా'' అన్నారు.

ఆమె నదిదాటి ఒడ్డుమీద నిలబడి వెనక్కి చూడసాగింది.

నది ఒడ్డు, అవతలి ఒడ్డున గల బురద, బురద తర్వాత గ్రామ పొలిమేర, గ్రామం ఇల్లు! ఒక్క అంగలో స్వదేశాన్ని విడిచి పరదేశాన్ని కొచ్చి పడ్డట్టనిపిం చిందామెకి. ఆమె కంఠం దుఃఖంతో పూడుకుపోయింది.

''ఇది పరాయి నేల. నా పుట్టిల్లు అక్కడ ఉండిపోయింది.'' నదిలో నడుస్తున్నంత సేపూ ఆమె పుట్టింటిలోనే ఉన్నట్లనిపించి సంతోషంతో ఉంది. పుట్టిల్లు చల్లని నీడలో వుంది. ఈ ఒడ్డుకొచ్చి నిలబడ్డ వెంటనే తను పరాయి వాళ్ళ చేతిలో పడ్డట్టనిపించిందామెకి. ఈ తటం అపరిచితమైనది. ఈ ఇసుక అంతకుముందు పరియం లేనిది. ఈ తండ్రీ కొడుకులూ? యుములాళ్ళ లాగున్నారు.

శబూ కాళ్ళలో బలం జవాబిస్తోంది. ఎన్నేళ్ళ తర్వాత తను ఈ తీరం మీద అడుగెట్టింది! చాలా చిన్నప్పుడే ఆమెకి పెళ్ళయింది. పెళ్లయిన వెంటనే వీళ్ళు ఆమెని బండిలో కూర్చోబెట్టి తీసికెళ్ళారు. అప్పుడీ ఇసుకలో ఆడుకోవాలనిపించింది. కానీ ఎవరూ బండి దిగనివ్వలేదు. ఇవాళదంతా పూర్వ జన్మలో జరిగినదిగా అనిపిస్తోంది.

తండ్రి బతికుంటే శబూకి ఆ వూళ్ళోనే మరో ఇంట్లో వరుణ్ణి వెతికి చేసేవాడు. కానీ పాపం వితంతువైన తల్లికెలా సాధ్యం! ఏళ్ళ తరబడి తన దగ్గిరెలా ఉంచుకోగలుగుతుంది? కానీ ఎలాగో సామర్థ్యంతో కూతుర్ని ఇంత కాలం దగ్గిర అట్టేపెట్టుకుంది.

ఐతే ఈ మావఁగారు! ఈయన సాక్షాత్తు రాక్షసుడాయె! మనిషిని చంపడం ఈయనకెక్కువ సేపు పట్టదు. అందరూ అనుకుంటూంటారు. ఈయన పెద్దకొడుకు చనిపోతే తన పెద్ద - కోడల్ని ఈ మూర్ఖులు కూడా ఎలాంటివి కూపీలాగుతారో! నాకప్పుడీ విషయాలేవీ అర్థం కాలా - ఆఁ ఈయన కోడలికి ఈయన వల్లే గర్భం వొచ్చిందట. అనంతరం ఆయనామెని చంపేసి నదిలో మునిగి పోయిందని చెప్పి విషయం మరుగు చేశాట్ట, అలా జరిగితే జరుగివుండొచ్చు. కానీ ఈ రాక్షసుడితో నాకేవిఁటి? ఇలాంటి వాళ్ళకి భయపడితే నేను మానాన్నకి కూతుర్నే కాను! కానీ ఎక్కడ ఇరుసు

వదులుగా వుంటుందో అక్కడ వేగం ఎంతకని పెంచగలను? ఈయన నా భర్త... పోనీ, వదిలేయ్.

నాన్న, నన్నిన్నేళ్ళు కాపాడావు, నీ ఆత్మ శాంతించాలి. బతికుంటే నాకు మరొక ఆశ్రయమేదన్నా చూపించుండే వాడు కానీ పాపం నాన్న దారి దోపిడిలో చంపబడ్డారు. నాన్న లూటీ చెయ్యడానికెడుతున్న సమయంలోనే నా భర్తనన్ను పిలుచుకెళ్ళడానికొచ్చాడు. నాన్న ఈయన్నెలా చివాట్లెట్టాడు - ''తండ్రి ముందేమీ చాతకాని వాడివి నా కూతురి కోసం వచ్చావా పెద్ద ధీరుడివి! పదధైర్యముంటే నాతో లూటీకి పద. చూపించు నీ పరాక్రమం అప్పుడు నారెండో కూతుర్నికూడా నీకిస్తాను.'' కాని ఈయన పూర్తిగా నిస్సహాయుడు. ''వీడ్కోలిప్పించి తీసుకురమ్మని మా నాన్న నన్ను పంపించాడు. అవి చెప్పి వేలు చీక్కోడం ఇంకా పోనీ పసివాడిలాగా మొహం వేలాడేసి కూచున్నాడాయన. నాన్నమళ్ళా, ''నాన్న వీడ్కోలిప్పించి తీసుకు రమ్మన్నాడూ! అంటే నీ ఇంటి దాన్ని తీసికెళ్ళాలని నీ అంతట నువ్వు స్వయంగా రాలేదన్న మాట? పో, పోయి పశువుల్ని మేపుకో. మీవంటి వాళ్ళుండే చోటికి నాకూతురు రాదు. ఏం తెలుసు నువ్వు కూడా అలాంటి... అంటూ చీవాట్లెట్టేసరికి పాపం ఎలా వణికి పోయాడో ఈయన! నాన్న ఆయన్ని దోపిడీకి పదమని చెప్పినప్పటికీ కూడ ఈయన వెళ్ళిపోతే పిరికివాడు ఎందుకవుతాడు? అందులో కూడా మరి నాన్నని అడగాల్సుంది కదా.

ఆరాత్రి నాన్నలూటీకి వెళ్ళాడు. ఈ పిరికాయన రాత్రంతా పడున్నాడు...

ఎన్నేళ్ళ తరువాత! నేను కూడా అంతా మర్చిపోయాను. ఓసి పిచ్చిదానా ఈయన నిస్సహాయుడన్నది నిజమేకానీ మరి మొగవాడే! మరి నేను... ఆడది ఆడదే! హత్య జరిగిన నాటి రాత్రి...

మరుసటి రోజు నాన్న మరణించిన వార్త అందే ముందే ఈ పిరికాయన జాడ లేకుండా పోయాడు. ఎప్పుడెళ్ళిపోయాడో. అరె, బాగుంది. కాసేపు నన్ను బయటికి పిలిచి మాట చెప్పవచ్చుగా కానీ అలా జరిగితే నన్ను ఇప్పటి వరకూ కాకుండా ఎప్పుడో తీసికెళ్ళి పోయుండొచ్చును కదా?

సింహంలాంటి నాన్న పోయినప్పుడు ఇతరుల జాలి ఎక్కువవుతుంది కదా. ఆడపిల్ల సంరక్షణ ఎవరు చూస్తారు? అయ్యో నా గురించి లోకులెలాంటి మాటలు విసురుతున్నారు! అమ్మ మాత్రం పాపం ఏం చేస్తుంది? ఆడపిల్ల ఇంట్లో కూచుంది. ఆమె కడుగెయ్యడం కూడా భారంగా వుంది! వచ్చేపోయే వాళ్ళ ద్వారా వాళ్ళ కోడల్ని వచ్చి తీసికెళ్ళమనీ, మేం

పంపిస్తామనీ చెప్పించింది.

ఈ తండ్రీ కొడుకులు ''ఈడర్'' దుర్గాన్ని జయించడానికొచ్చినట్టు వొచ్చారు! ఈయన ముఖం! మళ్ళీ ఈ పిరికి మొహం!... అమ్మ నాపీకెందుకు నొక్కెయ్యలేదు?... నేను కూడ శాంతంగా కూర్చున్నాను. ఆలోచించాను ఎప్పటికైనా ఈయనలోకి త్రాణ వస్తుంది దాంతో మళ్ళీ అంతా సర్దుకుంటుంది అని. కానీ ఈయన మాత్రం పది - పదకొండేళ్ళ తర్వాత కూడా అప్పుడెలా వున్నాడో ఇప్పుడూ అలాగే వున్నాడు. తండ్రి వేలు పట్టుకుని నడిచేవాడు లేకపోతే నేనిప్పటి దాకా ఇలాగే కూచునుండే దాన్నా? ఏం నాకింకెవళ్ళూ దొరకరా? నేను మహీసాగరం నీళ్ళు తాగిన దాన్ని! తల్లీ మహీసాగరం తల్లీ...!

ఆమె కడుపులో బిడ్డ కదిలింది. అంబా మాత పేరుస్మరిస్తూ ముందుకు సాగింది. కొద్ది దూరంలో శుభ్రమైనఇసుకలో తండ్రీకొడుకులు నిలబడున్నారు. వాళ్ళ నోట్లోంచి పొగొస్తూ కనబడుతోంది. అరె, తండ్రీ కొడుకులు వదిలేపొగల్లో సైతం ఎంత వ్యత్యాసముందో!

శబూరావడం చూసి వాళ్ళిద్దరూ నడవసాగారు. ఆమె కొంత దూరం వెళ్ళి ఆగింది. ఆమె కళ్ళ ముందు అంధకారం అలుముకుని వుంది. కళ్ళు తెరిస్తే దూరంగా ఎండమావి వంటిది కనబడింది. తండ్రీ కొడుకులు ఆ మరీచికలో తినడానికి వెడుతున్నారు. శబూ పిలవడానికి ప్రయత్నించింది - ''నాకు దాహమవుతుంది.'' అని కానీ కంఠం నుంచి శబ్దం బయటికి రాలేదు.

ఆమె కాళ్ళలోకి శక్తినంతటినీ కూడ దీసుకుని నడవసాగింది. తండ్రీ కొడుకులు అప్పుడప్పుడు తిరిగిచూస్తూ ఇంకా ఇంకా ముందుకి సాగిపోతున్నారు.

శబూ మళ్ళీ వెనక్కి దృష్టి సారించింది. ఎవరో ఆమెని వెనక నించి లాగుతున్నట్టనిపించింది - ''తల్లీ, తిరిగిరా! తల్లీ తిరిగిరా!'' పుట్టింటి మొక్కలు - వృక్షాలు, నదిలో బురద, ఇంకానైతే నది నీరు కూడా అలాగే నిరంతరం దూరమైపోతున్నాయి. అడుగడుగునా ఆమె కాళ్ళల్లోశక్తినెవరో లాగివేస్తున్నట్టనిపిస్తోంది.

ఇంక వాళ్ళిద్దరూ ఉరుకులు తీస్తున్నట్టు పరిగెడుతున్నారు.

''వినండీ, కాస్తాగండి... నాకు దాహమేస్తోంది.'' శబూ పిలిచింది. కానీ ఎదుటి నుంచి వస్తున్న ఎదురుగాలి ఆమె పిలుపుని పుట్టింటి వేపుకే తీసుకుని పోయింది.

ఆమెగొంతుఎండిపోతోంది. ఆమె చెప్పులు తొడుక్కుంది. చెప్పులలో

ఇసుక నిండసాగింది. ఆమె తటాలున నిలబడిపోయింది. ఎండ తాలూకు భయంకర తాపానికి ఆమె కళ్ళు కాసేపు మూసుకున్నాయి. కళ్ళు తెరిచి చూస్తే నాలుగు వేపులా ఎండమావి. నదికూడా మరీచికలో మాయమై పోయింది. చూపెళ్ళినంత వరకూ సమీపంలో ఎక్కడా వృక్షాలు గానీ, చెట్లు గానీ, పశువులు గానీ, మనుషులు గానీ ఏమీ కనిపించడం లేదు. హోరు - హోరు మంటూ వేడిగాడ్పు ఇసుక జల్లు కొడుతూ పోతోంది. ఒక వేపు పుట్టిల్లు, మరోవేపు అత్తారిల్లు - రెండిటి పొలిమేరలూ నల్లగా కనబడుతున్నాయి. శబూ రెండిటి మధ్యా నిలబడినట్టనిపిస్తోంది. కేవలం ఒంటరిగా వాళ్ళిద్దరూ కూడా వున్నారు. కానీ పారిపోతున్నారు. వెనక్కి తిరిగి కూడా చూడటం లేదు. ఈ పాడుబడిన నిర్మానుష్యంలో నేను చనిపోయినా చూసే వారెవరు?

''ఏవిఁటి నువ్వేమైనా ఒంటరిగా మరణిస్తావా?'' అనడుగుతు న్నట్టుగా కడుపులో బిడ్డ కదిలింది. ఇప్పుడు శబూకి పిల్లవాడేడుస్తున్న ధ్వని మళ్ళీ వినిపించింది. అరె, ఈ ఇసుక ఎడారిలో పిల్లవాడెక్కణ్ణించివచ్చాడు? ఆమెకి విచారం పొంగుకొచ్చింది. తన స్నేహితురాలి బిడ్డడు గుర్తుకొచ్చాడు. వాడే ఏడుస్తున్నట్టున్నాడు... నేను వెళ్ళి వాడి నాడిస్తాను... మళ్ళీ రెండు - మూడు నెలల తర్వాత నా కొడుకు కూడా... అవును కొడుకే! ఇద్దరూ కలిసి ఆడుకుంటారు. ఆమె మనసు ఆనందంతో ఉప్పొంగింది. ఆమె వక్షోజాలలో పాలు ఎగజిమ్మసాగాయి. కోమల హస్తాలతో నిండుతున్న తన స్తనాల నదిమి పట్టింది. ధడక్ - ధడక్! ఈ పిచ్చి హృదయం కూడా ఎలాగవుతోందో! ఆమె కళ్ళల్లో ఆనందాశ్రువులు తొణికిసలాడాయి. వాటిని తుడుచుకోకుండానే ముందుకి సాగింది.

హఠాత్తుగా ఆమెకి నిలబడివున్న తండ్రీ కొడుకులు కనిపించారు. ఆమె ప్రాణంహడలిపోయింది. వాళ్ళిద్దరూ నిలబడి బీడీలు కాలుస్తున్నారు. హఠాత్తుగా ఎవరో వెన్నాడుతున్నట్టని పించిందామెకి. వెనక్కి తిరిగి చూసింది. మావఁగారి అడుగుజాడలులాంటి గుర్తులుకనిపించాయి. రామచంద్రా! ఇదేవిఁటి? కానీ వెనకాల ఎవరూ కనబడ్డం లేదే. ఆమె నడవసాగింది. వెనక నుంచి పాదాల సవ్వడి మళ్ళీ వినవచ్చింది. ఆమె హృ దయం భయంతో కంపించ సాగింది.

తండ్రీ కొడుకుల దగ్గరకు వెళ్ళి నిలబడింది. భర్త క్షణం సేపు ఆమె వేపు చూశాడు. మావఁగారు వీపిటువేపు పెట్టి అటు తిరిగి నిలబడ్డాడు. భర్త ఏదో మాట్లాడాలనుకుంటున్నాడు. కానీ మాట్లాడలేకపోయాడు. శబూ -

''దాహమేస్తోంది. గొంతులో గాజుముక్కలు గుచ్చుకుంటున్నట్టుగా వుంది'' అంది.

''ఇక్కడ చలివేంద్రం ఎక్కడుంది?'' అంటూ లబలబలాడాడు భర్త. అప్పుడే పిల్లవాడేడుపు మళ్ళీ వినిపించింది. శబూ మామగారు కాండ్రించి ఉమ్మేసి – ''ఆఁ ఆఁ చలివేంద్రం ఉంది. నాతోరా.'' అన్నారు.

శబూకి తన భర్త ముఖంలో ఒక విదమైన వ్యాకుల పాటు కనిపించింది. కానీ అందుకు కారణం అర్థం కాలేదు. వీళ్ళు నడుస్తున్నారు. ముందుగా మావఁగారు, ఆయన వెనక భర్త, భర్త వెనక శబూ.

కొంత దూరం వెళ్ళాక వాళ్ళు పిల్లవాడు ఏడుస్తున్న దిక్కుకి వ్యతిరేక దిశగా వెడుతున్నట్టు తోచింది శబూకి. పిల్లవాడేడుస్తున్న ధ్వని క్రమంగా దూరమైపోతోంది.

''ఇటు ఎక్కడికెడుతున్నారు? ఇటు ఎక్కడికెడుతున్నారు? చలి వేంద్రం అటువేపుంది కదా?'' అంది శబూ.

''నీభ్రమ. చలివేంద్రం ఇటువేపే వుంది.'' మామగారు తాము పోతున్న దిశ వేపు చేతితో చూపించాడు.

వాళ్ళింకా వెడుతూనేవున్నారు. పిల్లవాడేడుస్తున్న శబ్దం సన్నగా వినబడుతోంది.

''నీళ్ళు! నీళ్ళు! నీళ్ళు! శబూకి ఊపిరాడటం లేదు – నడవటం ఇక నావల్ల కాదు. నాకు నీళ్ళు తెచ్చివ్వండి.'' శబూ కిందకూలబడింది.

ఆమెకిముందువెడుతున్న తండ్రీకొడుకులు ఆగిపోయారు. మావఁగారు నాలుగువేపులకీ దృష్టి సారించాడు. నాలుగు వేపులా నిర్జనంగా వుంది. కేవలం గాలి ఇసుక జల్లు నెగరేస్తూ పోతోంది.

'నీవల్లకాదా?'' మావఁగారికంఠస్వరం–''అరె చూస్తున్నా వేవిట్రా ?' ఆయన కొడుకుని ఉత్తేజితుణ్ణి చేశాడు.

భర్తఆమెవద్దకొచ్చాడు. ఆమెముసుగుపైకెత్తితలమీద చెయ్యుంచుకుని కూర్చునుంది. పతినీడ ఆమె మీద పడుతోంది. ఆమె ముసుగు నెత్తి భర్త వేపు చూసిందే తడవుగా అతను ఆమె మీద విరుచుకు పడి రెండు చేతులతోటీ ఆమె గొంతు పట్టుకున్నాడు.

ఆమె ఉలిక్కిపడి వివశురాలై దొర్లిపడింది. కానీ వెంటనే ఆమె భర్తని కడుపులో ఒక్క తన్ను తన్నింది. భర్త దూరంగా వెళ్లిపడ్డాడు. అతను నెమ్మదిగా లేస్తున్నాడు. జ్వలిస్తున్న మావఁగారి కళ్ళు తన మొహంమంతా ఆక్రమించినట్టు కనబడిందామెకి. దృఢమైన వేళ్ళు గల తోడేలు పంజాలు

వంటి మావఁగారి చేతులు ఆమె కంఠాన్ని నొక్కేస్తున్నాయి. పళ్ళు కొరుకుతూ శబూ గొంతు నులుముతూ అన్నాడు - ''నీ వల్ల కాదు? నీ వల్ల కాదు? ఇన్నేళ్ళూ వెళ్ళకపోతే ఇప్పుడెలా వెళతావులే మరీ? నేను నిన్ను పచ్చిగా నమిలేస్తాను. పచ్చిగా! నువ్వు నాయింటి కొస్తావూ! కులటా! నువ్విప్పుడు ఇక్కడే... అర్రె ఓ కొజ్జా! చూస్తా వేమిట్రా? పట్టుకో, పట్టుకోదీని కాళ్ళు!''

శబూ కంఠం మీద ఒత్తిడి ఎక్కువై పోతోంది. ఆమె గిల గిల కాళ్ళు కొట్టుకుంటోంది. ఆమె భర్త కాళ్ళు పట్టుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు. శబూ కంఠం ఎండిపోవడం మరింత ఎక్కువైంది. క్షణక్షణకాలం ఆమెకి మహీసాగర జలాల్లో మునిగి పోతోందా అనిపించింది. మూసుకుపోతున్న ఆమెకళ్లు క్షణకాలం పాటు ఒక్కసారిగా తెరుచుకున్నాయి. ఆమె మొహమ్మీద మీసాలతో తోడేల్లాంటి మావఁగారి మొహం ఊగుతోంది. బీడి వాసనొస్తోంది. ఆమొహం వెనకాల ఆకాశం కొద్దిగా కనబడుతోంది. ఏదో గద్ద గాలిలో తిరుగుతున్న మాదిరిగా ఆ ఆకాశంలో శబూకి తన తండ్రి కనబడ్డాడు.

''నాన్నా!'' ఆమె కంఠంనించి ఆఖరి పిలుపు వెలువడింది. ఆమెని సందూకి పెట్టెలో పెట్టి బందిస్తున్నట్టనిపించిందామెకి. దూరం నించి వినవస్తున్న పిల్లవాడేడుస్తున్న శబ్దం వింటూ వింటూ ఆమె కళ్ళు రెపరెపలాడాయి.

మావఁగారు శబూకంఠాన్ని చివరిసారిగా బలంగానొక్కేసి లేచి నిలబడ్డాడు. తనుపట్టివుంచినకాళ్ళు ఇప్పుడొక్కసారిగా శిథిలమై పోయినట్టని పించాయి. శబూ భర్తకి. అతను కాళ్ళు విడిచి పెట్టి నిలబడ్డాడు. శబూ కనుగుడ్లు నాలుగ బయటి కొచ్చాయి.

''దీని ముఖం గుడ్డలో చుట్టి కట్టేయ్''- తండ్రి చెప్పాడు.

కొడుకు ఎలా నిలబడ్డవాడలాగే నిలబడున్నాడు.

''చావు వెధవా'' అనేసి తండ్రి అనుభవమున్న వాడిలా ధృఢమైన మనసుతో, శుభ్రంగా కోడలి ముఖాన్ని ఆమె చీరకొంగుతోనే చుట్టి కట్టేశాడు. కొంత సేపటికి శవాన్ని ఇసుకలో కప్పెట్టేసి వాళ్ళిద్దరూ పిల్లవాడేడుస్తున్న శబ్దం వస్తున్న దిశగా సాగిపోయారు.

చలివేంద్రం దగ్గరకొచ్చి నీళ్ళు తాగారు. తండ్రి చలివేంద్రం పెట్టి నామెని అడిగాడు - ''పిల్లవాడు ఎందుకింతలా ఏడుస్తున్నాడు?''

''ఆడికి కలరాసోకింది - పొద్దుట్నించీ ఏడుస్తానేవున్నాడు. రూపా హోణా!'' - అని చెప్పి మళ్ళీ అడిగింది - ''కోడల్ని తీస్కొచ్చినారేటి?''

''లేదు చెల్లెమ్మా, దాన్ని పంపనేలేదు'' చిలుము నింపుతూ అన్నాడు రూపాహోణా.

'ఆళ్ళిలాగేవస్తారు! ఎన్నెల్లు అట్టేపెట్టేస్కుంటరు, ఈళ్ళునాశనమైం పోనూ!'

''పోన్లే చెల్లెమ్మా! అలా అనకూడదు.'' అంటూ రూపాహోణా లేచి వెళుతూ వెళుతూ చలివేంద్రపామె చేతిలో ఒక రూపాయుంచి - ''తీసుకో, పిల్లవాడికేదన్నా తినిపించు'' అన్నాడు.

ఆ ముసలాడి నించి బండిచక్రం లాంటి పూర్తిగా ఒక రూపాయి నాణాన్ని పొందిన చలివేంద్రపామెకి చాలా ఆశ్చర్యం కలిగింది. వ్యాకుల పడుతున్న కళ్ళతో ఆమె వాళ్ళు వెళ్ళడాన్ని చూస్తోంది.

కాస్త దూరం వెళ్ళాక తండ్రి నోటి నించి దట్టమైన పొగల్ని వదులుతూ కొడుకుతో అన్నాడు - ''మేఘా, నువ్వే చూశావుగా?''

''ఏవిఁటి నాన్నా?'' కంపిస్తున్న మనసుతో కొడుకడిగాడు.

''దాని కడుపులో బిడ్డున్నాడు!''

''అవున్నాన్నా!... కానీ...'' కొడుకన్నాడు. అతనింకేదో చెప్పాలనుకున్నాడు. కానీ ఏదో తెలియని అదృశ్య భీతివల్ల అతను ఏమీ చెప్పలేకపోయాడు. సగం చచ్చిన వాడిలా తండ్రి వెనకే కాళ్ళీడ్చుకుంటూ నడవ సాగాడు.

# 6. నా చంప వరుడు

**ఉమాశంకర్ జోషీ**

ఉమాశంకర్ జోషీ జననం క్రీ.శ. 1911. ఉత్తర గుజరాత్‌లో బామీణా గ్రామ నివాసి, బొంబాయిలో చదువుకున్నారు. గుజరాత్ విశ్వవిద్యాలయంలో గుజరాతీ బాషలో ప్రొఫెసర్‌గా, వైస్ - ఛాన్సలర్‌గా ఈయన సేవ గుజరాత్‌లోని నాగరిక జీవితంలో మహత్తరమైనది. ఉమాశంకర్ కవిత, కథ, ఏకాంకీ, వ్యాసం, అనువాదం, విమర్శ, రిసెర్చ్, నవల - ఈ సాహిత్య క్షేత్రాలన్నిటిలోనూ ప్రసిద్ధులు. 'శ్రావణీమేలో', 'బిసామో' ఈయన కథల సంపుటాలు. 'గంగోత్రీ', 'నిశీథ్', 'ఆతిథ్య', 'ప్రాచీనా', 'బసంత్ బర్షా', 'అబిజ్ఞా', 'మహాప్రస్థాన్' ఈయన ప్రసిద్ధ కావ్య గ్రంథాలు. వీరి 'నిశీథ్'కి జ్ఞానపీఠ్ అవార్డు (శ్రీపుట్టప్పతోపాటు) లభించింది. 'శ్రీ అనే సౌరభ్' సంస్కృత సాహిత్యానికి సంబంధించిన అధ్యయన గ్రంథం. 'సంస్కృతి' మాస పత్రికకి సంపాదకత్వం వహించారు. రాజ్య సభ సభ్యులుగా ఉండిరి.

★ ★ ★

లక్ష్మి ఇంకాఆనందమయ జీవితపు ప్రాంగణంలో అడుగెడుతూండగా ఆమె సౌభాగ్యం నాశనమైంది. హఠాత్తుగా ఆమె భర్త జ్వరమొచ్చి చాలా జబ్బుపడి చివరికి వైవాహిక జీవితాన్ని వొదిలి వెళ్ళిపోయాడు. అతనా ఆనందాన్ని పూర్తిగారెండేళ్ళుకూడా అనుభవించలేదు. లక్ష్మికి ప్రపంచమంతా మిథ్య అయిపోయింది. అంతే, పూర్తిగా వికాసమొందిన ఆమె సౌందర్యమనే చిగురుటాకుకి నాలుగు నెలల చంప వుంది. చంప ఆమెని మృత్యువు నాహ్వానించడం నుంచి నిరోధిస్తుంది.

లక్ష్మి భర్త పూర్తిగా తల్లకిందులుగా ఆలోచించే బుర్రలేని వాడని అంటారు ప్రతి వాళ్ళూ. అతని జాతకంలో లక్ష్మి సాంగత్యంలో సుఖపడే రాతలేదు. ఈ ప్రకారంగా లోకులు మృతుడ్ని నిందించే సాకుతో ఆమె జీవితాన్ని ప్రశంసిస్తారు. ఆమె దగ్గరకొచ్చి రహస్యంగా ''ఎవరో దుర్మార్గులు చేతబడి చేయించుంటారు. లేకపోతే మీ ఆయన గోరులో సైతం ఏ రోగమూ లేదు. అతని సుఖాన్నీ, అదృష్టాన్ని చూసి ఎంత మందికో ఈర్ష్యగా వుంది!''

అని కూడా చెప్పి ఏదో లేనిపోని సందేహం పెట్టిపోతారు.

ఏదైనా గానీ లక్ష్మి పెళ్ళికి ముందు గ్రామంలో ప్రతి వాడూ తన యోగ్యతాయోగ్యతల్నిమర్చిపోయి ఆమెభర్తకావడానికి తయారయా డన్నమాట పూర్తిగా నిజం. ఇందులో దోషం ఎవరిదీ లేదు. ఒకవేళ దోషం లక్ష్మి బంగారు రంగు ఉంగరాలు తిరిగి ఒత్తుగా పొడవుగా వున్న కురులదీ, కళ్ళల్లో వున్న చల్లని తుఫానుదీ, ఆమె పెదవులమీద వికసించి చెక్కుచెదర కుండా వుండే చిరునవ్వుదీ అయితే కావచ్చు. కానీ ఇందువల్ల ఉపద్రవం కూడా చెలరేగుతుంది.

ఏదేమైనప్పటికీ ఆమె భర్త అకాలమరణం చెందాడు! ఆమె ఉంగరాల తలవెంట్రుకలు ఏరోజున అతనివయ్యాయో ఆ రోజునించీ ఆమె తాలూకు ఒక్కొకపాయతో ఉరిశిక్షలాంటి యాతనని పొంది అనేక నిరాశా హృ దయాలు బద్ధలయ్యాయి. కానీ ఆ అభాగ్యుడే ఈ సుఖాన్ని భరించలేక పోయాడు! పళ్ళ చెట్టుమీద అల్లుకుని వ్యాపించివున్న కల్పవల్లిని లాగి అవతలికి విసిరి వేసినట్టుగా ఈ రోజు అవేశిరోజాల్నికత్తిరించిపారేశారు. ఆమె చేతికున్న గాజులు తీసివేయబడ్డాయి. అంతకు పూర్వం ఈ గాజులే ఏ మాత్రం గలగలమన్నా పెద్ద పెద్ద గాలి గోళాలు ఢీకొన్నట్టుగా అనిపించి గ్రామంలో వాళ్ళ హృదయాలు హా హాకారులు చేస్తూ ఆరాటపడేవి.

కానీ అదంతా ముగిసిపోయింది.

లక్ష్మి ఈ వైధవ్యాన్నెలా సహిస్తుందన్నది అందరికీ కూతూహలాన్ని రేకెత్తిస్తోంది. నారీ జగత్తులోఆమెకి తెలిసిన ఏప్రాణో వైదవ్యాన్ని సహించ డానికి ఉపాయం చెప్పడానిక్కూడా ఆత్రుత పడుతుంది. సానుభూతి పరురాలెన విధవెవర్తైనా లక్ష్మి భరించలేక తన బాధని చెబితే ఆమె కూడా ఇలా బాధ పడుతుంది.

''ఎన్ని వ్రతాలూ - ఉపవాసాలు చేసినా చెయ్యొచ్చుకానీ ఈ పసిది ఏం పాపం చేసిందని నాతో పాటు దీన్ని కూడా...''

''ఏం నువ్వు ఏదేనాప్రత్యేకతగల వితంతువువా? ఆడదై పుట్టాక ఎప్పుడో అప్పుడు విధవ కావాల్సి వస్తుంది...''

''సంబాళించుకోవడం రావాలమ్మా! చూడు విచిత్రం. పదమూడేళ్ళ ప్రాయంలోనే అది విధవైపోయింది - మనకళ్ళముందే.ముప్పై ఏళ్ళదై పోయింది. గంగా బహన్ చెబుతూండేది కాదా? నీ చెల్లెలి కూతురు, కాశీ బహన్, మీ పెద్దాడి కొడుక్కోడలు ఎప్పుడు వితంతువులయ్యారు? ఎవరికేనా

తెలుసా? కాలాన్ని బట్టి నడుచుకోవాలమ్మా! మాకు తెలిసిందల్లా ఇదే...''

''మరోమాట దుఃఖం అనేది అందరికీ ఉంటుంది. ఎవరికి లేదు? చూడటం లేదూ, ఎందరో ముత్తైదువులకి సైతం నరకాన్ని గుర్తు చేసేటటువంటి సంకటాలు అనుభవించాల్సొస్తోంది. కొందరు - కొందరు విధవలై కూడా సుఖంగా కాలం గడుపుతున్నారు.''

''ఇక మీరీ పంచాయితీ కట్టి పెడతారా? విదవలూ - సధవలూ అంటూ ప్రపంచంలో మాటలన్నా మూటకట్టుకూర్చున్నారు. ఏడిపించి - ఏడిపించి వెర్రిదాన్ని సగం చచ్చేట్టు చేశారు!''

లక్ష్మి కూడా ముసుగు పైకెత్తి ఈ మాటలన్నామె ఎవరా అని చూసింది. మళ్ళీ మనసులో సమాధాన పడింది - ''ఈమె అందరి నోరూ మూయించడం మంచిదైంది.''

''చూడు తల్లీ ఈ పసిదాని మీద దయచూపించడం, ఏడవడం అనేవి అట్టే చెయ్యొద్దు.''

''సుఖం కాస్తే అయినా జీవితం మాత్రం పూర్తిగా గడిచిపోతుంది.''

'ఏమైనాపనుంటేసందేహించకుండాచెప్పమ్మా, మాకిశోర్నిపంపుతాను.'

''ఇంక వెడతారామహాపనిచేయించిపెట్టే వాళ్ళుతయారయ్యారు గానీ?'' అని ఆ గుండె దిటవుగలామె అందర్నీ చివాట్లెట్టి తరిమేసింది. మళ్ళీ వాళ్ళందరూ ఎలాఏడిచారో అలాగేతనయేడుపు బహుశఃతనకే విచిత్రమనిపించేట్టు రామీ లక్ష్మి భుజం మీద తలవాల్చి వెక్కివెక్కి ఏడిచింది. కొంచెం సేపు నిశ్శబ్దంగా వుండి ఆమె లక్ష్మి ముసుగుని తన చేతులతోనే తొలగించి ఆమె ముఖాన్ని చెతుల్లోకి తీసుకుని ఆమె వేపు రెప్పార్పకుండా చూస్తోంది. లక్ష్మి కంగారుపడి అడిగేసింది - ''వాళ్ళందర్నీ కోప్పడి నోరు మూయించావు. మరి నువ్వా ఇంతలా ఏడుస్తున్నావేమిటి?''

''నీకర్థం కాదు లక్ష్మి!'' అని చెప్పిరామీ కంపిస్తున్న రెప్పలతో లక్ష్మి వేపు చూడసాగింది. ఆమె ముప్పై యేళ్ళ నించి వైధవ్యం అనుభవిస్తోంది. ఆమెకి పిల్లలెవరూ లేరు. ఆమె భర్త చిన్నప్పుడే పోయాడు. ''ఏవిఁటి చూస్తున్నావు?'' అనడిగి లక్ష్మి మళ్ళీకొంచంఉద్వేగంతో అంది - ''ఇంతాశ్చర్యంగా ఆయనకూడా నావేపిలా ఎన్నడూ చూడలేదు.'' ఇలా చెబుతూంటే రామీ మీద లక్ష్మి ముఖంలోని నరాలు పొంగు తున్నాయా అనిపించేట్టు కంపించసాగాయి. రామీ చేతులు తీసేస్తూ అంది - ''అందుకే చెబుతున్నాను లక్ష్మి, ఏడవవద్దు! చూడు, లేకపోతే నాక్కూడా మళ్ళీ ఏడుపొస్తుంది.'' కొంగుతో లక్ష్మి కళ్ళు తుడుస్తూ ఒక్కసారి పురుష

కంఠంలాంటి కంఠంతో మాట్లాడింది.'' విధవ పరిస్థితి విధవకే తెలుస్తుంది. నువ్విప్పట్నించే ఒంటరిగా జీవించాలి. నేనెన్నో సంవత్సరాల్నించి ఒంటరిగా జీవిస్తున్నాను. నువ్వుకాస్తంతకూడా భయపడాల్సిన పనిలేదు.'' అని కాస్త వెనక్కి జరిగి లక్ష్మి వేపు తదేకంగా చూస్తూ చెప్పసాగింది - ''ఇదేం రూపని చూస్తున్నానంతే! తల మీది వెంట్రుకలు తీసేసినాక కూడా నీ అందంలో తేడా లేదు! చేతులు శూన్యంగా వున్నాయి. అయినా కూడా కాస్త కూడా వ్యత్యాసం లేదు. ఏం ఫరవాలేదు. లక్ష్మి! ఏడ్చినందువల్ల ప్రయోజన మేవిఁటి? ఏ మాత్రం భయపడకు. అభాగ్యుడై మీ ఆయన కాలానికి ఆహుతై పోయాడు, కానీ నువ్వు మాత్రం కాలేదు...''

అప్పుడే చిన్ని చంప ఉయ్యాల్లో కాళ్ళూ చేతులూ ఆడిస్తూ ఒత్తిగిలింది. దాంతో ఇద్దరి దృష్టీ అటు మళ్ళింది.

'లోకనిందా? అరే లోకులెవరు? మనవేఁ లోకులం. అందరిళ్ళలోనూ ఉన్నాయి మట్టి పొయ్యిలు. లక్ష్మినెమ్మదిగా అందరిగురించీ నీకే తెలుస్తుంది.'

ఉయ్యాల్లో చంప ఊంగా - ఊంగా అంది. ఇప్పటిదాకా లక్ష్మి రామీ అదుపు తప్పి మాట్లాడిన మాటలకి వ్యాకులపడి నిశ్శబ్దంగా కూచుంది. ఇప్పుడు ఆమె ఉయ్యాలవేపు వేలెట్టి చూపించి కళ్ళు మూసుకుంది. కళ్ళు తిరుగుతున్నట్టుగా.

''ఇది వినవేం? ఎంత పిచ్చిదానివి నువ్వు? ఇది (చంప) కూడా పెద్దదై అంతా అర్థం చేసుకుంటుంది. ఏమంటే...''

చంపా ఉయ్యాలని అటూ ఇటూ కుదిపేస్తూ ఏడుస్తోంది. లక్ష్మి కఠినస్వరంలో ''దాంతో ఏవిఁటి?'' అని లేచి చంపని గుండెలకి హత్తుకుని ప్రేమగా ముద్దు చెయ్యసాగింది - ''అరె బుజ్జీ, నేను పదిహేడు పద్దెనిమిదేళ్ళు దాటిపోయాను. నువ్వా ఇప్పుడే...''

''తరువాత అంతా నెమ్మదినెమ్మదిగా తెలుస్తుంది.'' అని చెప్పి రామీ వెళ్ళిపోయింది.

ఏకాంతంగా లక్ష్మి చంపనికన్నీళ్ళతోనూ, స్నేహంతోనూ స్నానమా డించింది. దాంతో రకరకాల మాటలు చెబుతూండిపోయింది...

''చూశావా నువ్వు, ఆ దుర్గ ముది కబుర్లు చెప్పుకుంటూ తనకిషోర్‌ని నాపనులు చేసిపెట్టడానికి పంపుతనానని తయారైంది! రామీ! దానికి ప్రపంచ మంతటితోనూవిరోధమే. కానీ దానికేం! దానిమాటవింటే నాక్కూడా ఏవిఁటి నువ్వుకూడా బతికుండగానే చచ్చిపోతావు, అవునా!... ఏం మను షులు! నేనేమైనా దీని సలహా అడగబోయానా. నాకు నాయిల్లు మంచిది, ఈ

ఉయ్యాల మంచిది! అంతే. నువ్వు పెద్దదానివైతే మన గౌరవమర్యాదలకి లోటు రాకుండా నీ పెళ్ళి జరిపిస్తాను. నువ్వు నీ ఇంట్లో సుఖంగా వుంటే అంతకంటే నాకేంకావాలి? చూడూ, ఎలానవ్వుతొందో. కాస్త పెద్దదాని వవ్వమ్మా. అప్పుడు మనిద్దరం కబుర్లు చెప్పుకుంటూండాం. ఇల్లు నిండుగా ఉందనిపించేట్టుచేద్దాం. ఇంకవయసు గడుస్తోంటే ఆలస్యం అనిపిస్తుందా!... అరే మళ్ళా అలా గంభీరంగా అయిపోయావేం నువ్వు! చూడూ, ఇకాట్టే వేషాలు వెయ్యకు!... సరేనా? అప్పుడు నాకు తెలీదు. నీకిప్పుడే తెలీదు నేను లక్ష్మిని కాదు, చంపా తల్లిని!'' చంపా తల్లి!

చూసిన ప్రజలన్నారు – ''భయీ, వైధవ్యమంటే ఇప్పటిదాకా ఒక్క లక్ష్మి చూసింది సుమా!''

''భర్త మరణిస్తే లక్ష్మి కూడా మరణించినట్టేనా?''

''ఎక్కడ ఆ రూపానికే రూపమయిన అందాలరాశి – ఎక్కడ ఈ ముదుసలి!'' కనుపాపల మీద రెప్పల పరదాలు పడ్డాయి. అసలు తేజం వాటి వెనుక దాగుండిపోయింది. ఎప్పుడూ దగ్గరకి రాకూడదని అనుకున్నట్టుగా నిరర్థకమైన పెదవులు నిశ్శబ్దంగా తెరుచుకునే ఉంటాయి. నిండి పోయిన బస్సులో పరాయి భార్య, పరాయి భర్త మనసులోనే ఒక ఒప్పందానికి వొచ్చి పక్క పక్కని అంటుకోకుండా ముడుచుకుని కూర్చున్నట్టుగా ఎడంగా వున్నాయి ఆ పెదవులు. అణువు పరమాణువు మొదట ఎక్కడైతే ఒక్కటిగా వున్నాయో అక్కడ జబర్దస్తీగా ఇప్పుడు రెండు – రెండు, మూడు – మూడు విడి విడిగా వున్నాయి, చీరలో శరీరంలాంటిదేదీ లేనే లేనట్టుగా.

దుర్గావాళ్ళ కిషోర్ రెండుమూడుసార్లు చంప యింటికి తిరిగి వెళ్ళిపోయాడు. చేసిపెట్టడానికి పనేమీ లేకపోయేసరికి. రామీ ఎవరికైతే లక్ష్మి బాధ్యత అప్పగించిందో వాళ్ళు కూడా అప్పుడప్పుడు ఒస్తూనే వున్నారు. కానీ లక్ష్మి ఎప్పుడు చూసినా ఇంట్లో కూర్చునో లేకపోతే పశువుల పేడా – పెంటా ఎత్తుతూనో, అదీ కాకపోతే గిన్నెలుతోముతూనో లేకపోతే బియ్యం చెరుగుతూనో కనబడుతూంటుంది. చూసే వాళ్ళకి ఆమె సంపూర్ణ ఆకృతిలో కేవలం నచ్చని అంశమే బాహాటంగా కనిపిస్తుంది. ప్రతి రోజూ ఆమె తన మనసుని ఆలోచనల గానుగలో వేసి పిండుతూంటుంది. మొగవాళ్ళయ్యేది ఆడవాళ్ళయ్యేది మొత్తం ప్రపంచమయ్యేది ఆమెకి లెక్కలేదు! లక్ష్మికి తను మంచిది, తన చిన్నారి కూతురు చంపా మంచిది. ఆమె మానసికంగా చంపాకి సమవయస్కురాలుగా మారి ఆమె తోడిదే లోకంగా బతుకుతోంది. చంపా రెండు మూడేళ్ళవయసుదైతే లక్ష్మి ఇరవైముప్పైఏళ్ళకేముసలిది అయి

పోయింది. రామీ యే ఒక రోజు చిన్ని 'చంపాలీ'ని ముద్దుగా చిన్న చెంప దెబ్బవేసి ''ముండా, నువ్వే లక్ష్మిని తినేశావు!'' అంది.

దాని తర్వాత లక్ష్మి బయటపనికూడా చెయ్యడం ప్రారంభించింది. ఇంట్లో పశువులతో పాటు పశువుగా మారి ఆవులు, గేదెల పాలనమ్మి కొన్ని ఖర్చులు గడుపుతోంది. ఋతువు ననుసరించి బయట గడ్డి, కట్టెలు, ఇప్ప పువ్వులు పోగుచేసి అమ్ముతుంది. కాసిని డబ్బులు కూడబెడుతుంది. ఇతరుల ఇళ్ళల్లో దంపుళ్ళూ - పిండి కొట్టుళ్ళూ సైతం చేస్తోంది.

ఈ మాదిరిగా లక్ష్మి తను స్వయంగా ఎంతగా రెక్కలు ముక్కలు చేసుకుంటోందో అంతగానూ చంపాని.పువ్వులాగా వికసింపజేసే ప్రయత్నం చేస్తోంది. క్రమంగా సంవత్సరాలు ఎలా గడిచి పోయాయో ఆమెకే తెలీదు. తన ఆశలన్నీ కూతురుమీదపెట్టుకుంది. అప్పుడప్పుడు లక్ష్మి ఇలాపని చేసుకుంటూ కూచుంటే చంపాకీ తప్ప మిగిలిన వాళ్ళందరికీ పిచ్చిదాన్లా కనిపించేది. ఏ అబ్బాయి గురించీ ఎప్పుడూ ప్రస్తావించదామె కానీ చంపాకి కాబోయే భర్త గురించి ఆమె తరుచూ ఉల్లాసంతో మాట్లాడుతూంటుంది. చంపా స్నేహితురాళ్ళు ఏకాంతంలో గిల్లి చంపనెంతగా ఏడిపిస్తూంటారో అంతకన్నా ఎక్కువగా సఖీభావంతో లక్ష్మి ఏడిపిస్తూంటుంది. మళ్ళీ ఆమె సంతోషంతో అంటుంది - ''నీ పెళ్ళి కావాలి, అందుకే బతికున్నా నమ్మా.''

ఒకసారి ఎవరో అన్నారు - ''లక్ష్మి చంప నిజంగా నీ కూతురే! పూర్తిగా నీరంగూ, నీరూపురేఖలే వొచ్చాయి!''

చంప వింటోంది. ఆమె తన తల్లివేపు చూస్తోంది. తల్లితో తనని పోల్చడం చూసి మనసులో నిరాశపడింది కూడా.

ఒక రాత్రి లక్ష్మి తను నిద్రపోయేముందు చీకట్లో పడుకున్న చంపని కోప్పడుతోంది - ''ఆఁ -అవును, నలుపే! డెబ్బై సార్లంటాను నలుపేనని! నేను కూడా నలుపు, మీనాన్న కుడా నలుపు. నువ్వెక్కణ్ణించి తెల్లరంగుతో పుట్టుకొస్తావు? గుర్తుంచుకో నీ కోసం నేను నల్లటి కుర్రాణ్ణెవర్నన్నా వెతకాలి.'' గత పదిహేనుళ్ళుగా ఆ వెర్రి తల్లి ఏ పురుషుడి వేపూసరిగా చూడనుకూడా లేదు. ఎవరితోనూ మాట్లాడలేదు కూడా. కానీ ఇప్పుడు అందరూ చంపకి కాబోయే వరుడి గురించి అలసటెరగకుండా మాట్లాడు తోంటే లక్ష్మి ఈ విషయం గురించి ఆలోచించకుండా ఎలా వుండగలదు? కానీ చంపాకి మాత్రం ఆమె నిజమైన స్నేహితురాలు. అందుకే వాళ్ళిద్దరూ పనిపాటల్లో ఎప్పుడు కాస్తంత తీరిక చిక్కినా చంపకి కాబోయే వరుడి గురించి వాదు లాడుకోవడం ప్రారంభిస్తారు. చంపాకిదంతా ఏదోకొత్తగా,

ఉత్సాహభరితంగా, ఉల్లాసపూరితంగా ఉంటుంది. కానీ లక్ష్మికి తన జీర్ణ - శీర్ణ శరీరమనే దుర్గం ఇంకా ఎక్కువ శిథిలమై క్షీణించి పోతున్నట్టుంది.

అప్పుడప్పుడు ముసలి రామీ వొచ్చి వీధి గుమ్మంమ్మీద కూచుంటుంది. కర్కశ స్వరంతో అడుగుతుంది - ''ఏమ్మా అపురూపమైన కూతర్ని కన్న ఓ అమ్మా ఈ అల్లరి దాని బరువు నెత్తినించెప్పుడు దించుకుంటావు?''

కానీ చంపకి కాబోయే వరుడి గురించి లక్ష్మి ఎంతగా ఆలోచిస్తోందో అంతగా చంప కూడా ఆలోచించి వుండదు అన్నది నిజం. తన కాబోయే భర్త గురించి చింత పడటానికీ, తర్క-వితర్కాలు చెయ్యడానికీ చంపకేం అవసరం వుంది! ఆమె హితం గురించి ఆలోచించడానికి తల్లి వుంది! ఇతరులు గప్‌చుప్‌గా సలహా ఇచ్చి లక్ష్మికి సూచన ప్రాయంగా తెలియజేశారు చంప వివాహానికి యోగ్యురాలైందని. చివరకి లక్ష్మి ఆ సూచనని అర్థం చేసుకుంది. తల్లి రూపంలో ఆమె చంప వివాహం మొదలైన వాటి బాధ్యత వహించాల్సి వుంది. కాయ కష్టం చేసి చేసి డబ్బు సమకూర్చింది. అందుకే ఖర్చు గురించి చింత లేదు. కానీ చంపాని అబ్బాయెవరన్నా ఇష్టపడటం అంత తేలికా?

లక్ష్మి చంపకి కాబోయే భర్త విషయంలో స్నేహం, ఇంకా అనేక భావాలు, ఉత్సాహపు పొంగుతో నిండి ఈ విధంగా ఆలోచిస్తోంది ''నా చంప భర్త మంచివాడైవుండాలి!''

చంప చాలాఅల్లరిపిల్ల. కానీ తల్లి ఎదురుగా కాస్త తక్కువ మాట్లాడుతుంది. ఒకరాత్రి తల్లీకూతుళ్ళిద్దరూదీపంఆర్పేసి పడుకో బోతూండగా లక్ష్మి అంది ''ఆ ముసలి కుబేర్ కూడా తన కొడుకు గురించి అడిగించాడు.. 'ఆఁ? ఊఁ చెప్పు?' ఏంచెప్పుతుంది. జవాబు రాకపోయేసరికి లక్ష్మి చంపతలమీద చెయ్యేసి నిమురుతూ అడిగింది. చంపా అనంగీకారంగా తల అడ్డంగా ఊపితే లక్ష్మికి కోపం వొచ్చింది. అంది - ''అలా చెబితే నీకోసం ఎవరేనా కొత్త వరుణ్ణి పుట్టించాల్సొస్తుందే? కాస్త తెలుసుకుని ప్రవర్తించు!''

తల్లిని కలుసుకోవడానికొచ్చే స్త్రీలు చంపతో అంటూంటారు - ''ఓ చంపాలీ, ఇటువంటి తల్లి ఈ కలియుగంలో దొరకడం దుర్లభం - ఆఁ. ఆమె తన జీవితాన్ని కష్టాలకెరచేసుకుని నిన్ను పెంచి పెద్ద చేసింది. ఆమె నీకు తన రూపాన్నంతట్నీ, ఇల్లూ - వాకిల్నీ ఇచ్చింది. కష్టాన్నంతా తనే భరించి నీకంతా మంచే చేసింది. ఆమె ఎలా చెబితే అలా చెయ్యాలి. అలాంటి తల్లి ఇంతవరకూ ఎవరికీ దొరక లేదు. కూతురు కొసం ఎవరింతిలా పడి చస్తారు?

చంప కూడా తెలివైనదీ, బుద్ధి గలపిల్ల.

''అయితే అమ్మా నువ్వే చెప్పు.''

''నేనేం చెప్పను?''

''లేకపోతే ఇంకెవరు చెబుతారు? నువ్వు నా అమ్మవి కావూ?''

''కానీ కూతురువి నువ్వు కదా! పెళ్ళి చేసుకునే దానివి నువ్వా - నేనా!'

ఇద్దరూ నవ్వారు.

శాంతి.

''అయితే నువ్వు నన్నెందుకు పెంచావు?''

''నిన్ను పెంచాను గనకే నేను బతకగలిగాను. లేకపోతే ఏముంది. నేనీ ఇంట్లో మట్టిలో కలిసిపోయే దాన్నేగా? నీ కోసమే నేనీ ఇల్లూ - వాకిలీ పట్టుకుని అట్టే పెట్టాను. అందుకే, ఒకరోజు నువ్వు పెద్దదానివవుతావు. ఏ గౌరవ మర్యాదలున్న వాళ్ళ ఇల్లో మెట్టి సుఖంగా ఉంటావు.''

''మళ్ళీ అదే గౌరవమర్యాదలు గలవాళ్ళ ఇంటి గురించిన మాట!'' చంప చిలిపితనం ధ్వనించే స్వరంతో అంది.

''అదిగో, నేనేం చెబుతున్నానూ! నువ్వడిగావు గనక నేను చెప్పాను. నేను నువ్వు సుఖంగా బతకాలని జీవించి వున్నాను.'' లక్ష్మి గద్గద కంఠస్వరంతో చెప్పింది.

చంపా ముద్దుగా అడిగింది - ''అయితే చెప్పూ!''

'' నా చేతే చెప్పిస్తావా? అయితే సరే. కానీ చిన్న వయసులో వున్న చదువుకోని యువకులంటే భయంగా వుంటుంది. ఆ గౌరీ వుంది చూశావ్, వాళ్ళాయన ఈమధ్యనే భార్యావిహీనుడయ్యాడు - తెలివైనవాడు, ప్రపంచ మంతా తిరిగాడు. డబ్బున్నవాడు కూడా.''

''అంత పెద్ద వాడ్నా?''

''సరే, ఇక మాట్లాడితే అడుగు!... నీకు చిన్నవాడే కావాలంటే పో. సుందరమ్మపిన్ని మరిదికి నిన్ననేకొడుక్కలిగాడు. వాడిని చేసుకో!'' నవ్వులాటకి చెప్పింది కాకపోయినా తల్లీ కూతుళ్ళిద్దరూ కిలకిలా నవ్వేశారు.

గ్రామంలో అందరూ వహ్వా - వహ్వా అన్నారు.

''తల్లంటే అలా వుండాలి. కూతురంటే ఇలా వుండాలి!''

''లక్ష్మి కూతురు జీవితాన్ని చక్కగా తీర్చిదిద్దింది.''

''రెండో పెళ్ళి వరుడికి పెళ్ళి, చాలా సుఖపడుతుంది.''

''పాపంలక్ష్మిఇప్పుడుఒంటరిదైపోయింది. ఇంకఏం బతికుంటుంది!' కానీ లక్ష్మి ఒంటరిది కాలేదు. ఇప్పుడామెకి డబ్బు కూడ బెట్టాల్సిన అవసరం

లేదు. పొద్దున్న - సాయంత్రం తన ఇంట్లో పాలు ఒక మైలు దూరంలో వున్న అల్లుడింటికి పంపిస్తోంది. నెయ్యి - వెన్న ఎప్పుడో అప్పుడు పంపుతూనే వుంది, లేకపోతే తనే స్వయంగా వెళ్ళి ఇచ్చొస్తుంది. అప్పుడప్పుడు అల్లుడు కూడా వొచ్చి తీసుకెడతాడు.

అల్లుడు పూనమ్‌లాల్ మంచి మనిషి చాలా కలుపుగోలు మనిషి. లక్ష్మితో అతనికి రెండు విధాల సంబంధం వుంది. అతని అత్తగారు ఆమే, కానీ ఆమె మంచి బాల్య స్నేహితురాలు కూడా. లక్ష్మి, అతను గౌరీ - చందాలిద్దరి గురించి ఆట్టే చెప్పుకోరు. కానీ చనిపోయిన గౌరి గురించి వాళ్ళిద్దరూ అప్పుడప్పుడు గంటల తరబడి చెప్పుకుంటూంటారు. లక్ష్మి మాటిమాటికీ గౌరి చిన్నతనపు వృత్తాంతాలు వినిపిస్తుంది. ఆమె, పూనమ్‌లాల్ ఇద్దరూ గౌరితాలూకు ఆసుదూరమైన అతీతంలో లీనమవుతారు.

అప్పుడప్పుడు ఆ సందులోంచి పోయే వారెవరో కేకేస్తారు. ''ఏ పుక్కిటి పురాణ కాలక్షేపమవుతోంది లక్ష్మీ? ఎవరొచ్చారు?''

''రె...'' లక్ష్మి రుద్ధమైన కంఠస్వరంతో జవాబిస్తుంది. ''నాచంప వరుడు.''

ఒక రాత్రి కాస్త పొద్దుపోయాక వాడలో కొందరుస్త్రీలు గుమిగూడి కూచున్నప్పుడు ఎవరో అన్నారు కూడా - ''ఇప్పుడు లక్ష్మి ఎంత సంతోషంగా బతుకుతోంది - కూతురి పెళ్ళి చేసేసిందిందుకా?

''లేకపోతే ఇంకేవిఁటి! ఎంత పెద్ద విచారం నించి ముక్తి పొందింది.'' మిగతావాళ్ళు అవునవునన్నారు.

గుంపులో ఆమెవరో వొచ్చి కూచుని అడిగింది - ''లక్ష్మి సాయంత్రం నేను పెంట పారబొయ్యడానికి పోతున్నప్పుడు ఎవరా వున్నది మీ యింట్లో?''

'' నా చంప వరుడు'' లక్ష్మి చెప్పింది.

''ఇప్పుడేడీ?''

''అరె చీకటి పడింది కదా వెళ్ళకపోతే ఎలా?''

''నేను చెప్పానా, కానీ ఎంతకని చెప్పను!''

వొచ్చినావిడ ముక్కుపొడి పీల్చి తుమ్మడమనే మహత్తరమైన కార్యంలో నిమగ్నమైంది.

ఇంట్లో ఏవైనా, చిన్నా పెద్దా పనులుంటే పూనమ్‌లాల్ ఎప్పుడో అప్పుడు వొచ్చి చేసి పెట్టి వెళ్ళిపోతూంటాడు. లక్ష్మి ఇప్పుడు తీరుబాటుగా వుంటోంది. అందుకే ఏదో ఒక కొత్త పని తడుతూంటుంది. చూరు విరిగిపోయింది, కొత్తది వేయించాడు. తలుపు సరిగ్గా పడటం లేదు, దాన్ని

సరిచేయించాడు, కిరాణా కొట్టువాడు ఎక్కువ డబ్బడుగుతున్నాడు, అతని లెక్క సరిచూశాడు. మూడు దంతాలున్న ఒక ఆవు వుంది. దాన్ని మంచి రేటుకి మంచి చోట అమ్మేశాడు.

''ఈ కొత్త చూరు ఎప్పుడు వేయించావు లక్ష్మీ?''

''ఎవరు తీసుకొచ్చి ఇచ్చారు?'' మరొకరు అడిగారు.

''ఇంకెవరు తెస్తారే? నా చంప వరుడు!''

''భాగ్యశీలివి కా బహన్! కాకపోతే ఎవరల్లుడూ ఇలా వుండడు.

అప్పుడప్పుడు వాళ్ళిద్దరూ మాట్లడుకోవడం జరిగితే ఎవరో ఒకరు గుమ్మంలోకి తొంగి చూసి, కించిత్తు మందహాసం చేస్తూ వెళ్ళి పోతూంటే లక్ష్మికి ''నేనెంత సుఖంగా వున్నాను!'' అనిపిస్తుంది. ఎవరేనా వ్యంగ్యపూర్వకంగా నవ్వుతారేమోనని ఆమె కలలో కూడా ఆలోచించలేదు. ఎందుకాలోచిస్తుంది? ఆమెకి తన అల్లుడితో కూడా మనసు విప్పి మాట్లాడుకునే హక్కు లేదా? ప్రపంచం కుటుంబ వ్యవస్థలో ఇటువంటి న్యాయం-ధర్మం లేని అధికారా ల్నెన్నిట్ని స్థాపించి ఉంచాయి? వాటిని చేజిక్కించుకుని ఏది పడితే అది వాగే అధికారంకూడా ఎవరికీలేదు. ఏం గతపదిహేనేళ్ళలో లక్ష్మి ఏ పురుషుడితోనైనా మాట్లాడిందా? పూనమ్‌లాల్ ఆమెకి అల్లుడు – అతనితో ఆమె మాట్లాడుతుంది. తప్పక మాట్లాడుతుంది.

కానీ 'మాట్లాడకు' అన్నది మాత్రం ఎవరు చెబుతారు? లక్ష్మి మాటల్లో బడి తననితాను ఎలా మర్చిపోతుందంటే ఎన్నేళ్ళనించో, ఎన్ని జన్మలనించో తను ఎవరితోనూ మాట్లాడలేదన్నంతగా లక్ష్మి మాటల్లో పడి తనని తాను మర్చిపోతుంది. కబుర్లలో పడితే ఆమెకి సమయం గురించిన ధ్యాసే వుండదు.

''బాగుంది. ఇక నీ మాట పూర్తి చెయ్యినాకాలస్యమై పోతోంది... ఆఁ, నువ్వూ, ఆవిడా మామిడితోపు చేరుకున్నారు. తరువాత?''

''అవును. ప్రతిరోజూ నిన్ను ఆలస్యంగాపంపుతున్నాను. దీనికి అందరూ దోషం నాకాపాదిస్తున్నారు, నీకు కాదు.''

పూనమ్‌లాల్ చాలాహడావుడిగా తయారవుతూ అన్నాడు – ''చీకటయ్యేది, వెలుతురయ్యేది ఇంటికెడితే తప్ప విముక్తేదీ? అవునూ, ఆ మాట...?''

''అత్తారింట్లో వుండడం గొప్పవిశేషం కాదు!'' లక్ష్మి చిలకలా గాయాంత్రికంగా చెప్పింది.

''నువ్వు చెపుతున్నది పూర్తిగా చెప్పేస్తే నేను పోతాను. ఆలస్యమై పోతోంది.''

''అయితేవెళ్ళు. రేపుచెబుతాను. ఇవాళేవినాలన్నంత అక్కరే మొచ్చింది?'' లక్ష్మి జాగ్రత్త పడి అంది. లక్ష్మి అపార్థం చేసుకుందని పించింది పూనమ్‌లాల్‌కి. అందుకే అతను నిశ్చింతగా ఉన్నట్టు నటిస్తూ ఆగిపోయాడు. వాస్తవానికి లక్ష్మి తన బాల్యాన్ని గుర్తు చేసుకుంటూ గౌరి గురించి చెబుతున్న మాటలు వినకుండా అతను వెళ్ళలేడు.

''కానీ నేను ఆగిపోతున్నాను. ఇప్పుడు చెబుతావా?'' లక్ష్మి నవ్వి అంది ''అదేంమాట. రేపు చెబుతాను. లేకపోతే తరువాత నువ్వెప్పుడొచ్చినా చెబుతాను.''

''లేదు - లేదు. చెబుతున్న దాన్ని అర్థంతరంగా వొదిలెయ్యకు... ఆం మామిడితోపు చేరుకున్నారు. ఆ తరువాత?''

''ఆ తరువాత... నేనోరాయి తీసి మామిడి చెట్టు మీద విసిరాను. మామిడి కాయ ఏదీ రాల్లేదు గానీ రెండు గాజులు మాత్రం ఒక దాన్నొకటి కొట్టుకుని విరిగిపోయాయి.

''ఆహాం'' వెళ్ళేతొందరలోనూ, కథలోవిశేషించిఆనందం కలగక పోవడం వల్లా కూడా పూనమ్‌లాల్ 'హూం' అనుకుని - 'తరువాత?' అన్నాడు.

''తరువాత గౌరి కూడా ఒక పెద్దరాయి తీసుకుని విసిరింది. విసిరింది గానీ రాయితగల్లేదు, ధబ్బుమంటూ కిందపడిపోయింది. గౌరి గట్టిగా అరిచింది - ''అయ్యో చెయ్యి జారి పోయిందమ్మో'' అనరిచి కంచెవేపు చూస్తూ కింద కూర్చుండి పోయింది. కంచె కటువేపు ఎవరో పిల్లవాడు వెడుతున్నట్టుంది. కానీ బహుశః అతను వినుండక పోవచ్చు. నేను గౌరి చెయ్యి మర్దనా చెయ్యడానికి ప్రయత్నించాను. కానీ చెయ్యి ముట్టుకోగానే గౌరి కెవ్వుమని కేకపెట్టింది. ఇంతలో రైతు రధా కొడుకు అటుగా రావడం మంచి దైంది. అతను రెండు ఝూడింపులతో దాని చేతిని సరిచేశాడు. నాలుగు మామిడి కాయల్ని కూడా ఇచ్చాడు. కానీ మేమలాగే పోతూంటే ఒక రాయొచ్చి నాఎడమ మోచేతికి తగిలింది. గౌరికీతగిలుండేదే కానీకాస్తలో గురితప్పింది తురైథా కొడుకు చెరువువేపు వెడుతున్నాడు. రాయొచ్చి తగిలింది కంచెకి అటు వేపు నించి. ఆ రోజు నేనెంత ఏడ్చానో దానికి రెట్టింపు గౌరి ఏడ్చింది. ఏడుస్తూనే వెళ్ళాం, కంచెవేపు చూస్తూ, సంఘటన చిన్నదే కానీ గౌరి ఎంతమంచిది!''

పూనమ్‌లాల్ స్తబ్ధుడై నిలుచుండిపోయాడు. అతని మనసులో అపారవేదన కలిగింది... దీనర్థం, గౌరి నాతో అబద్ధం చెప్పిందన్నమాటా?

అతని కళ్ళల్లో జరిగిన సంఘటన మరొక్కసారి మెరిసింది - పూనమ్ లాల్ కంచెవేపు వెడుతూండటం చూసి అతని దృష్టి నాకర్షించడం కోసరం ఉత్తుత్తినే కేక పెట్టిందన్నమాట. ఆ కేకలు అరుపులు ఒట్టినాటకమనీ, అప్పుడుగౌరి ఒంటరిగా లేదనీ గ్రహించాడు. అందుకే అతను మరేం పట్టించుకోకుండా ముందుకి నడిచాడు. కానీ తిరిగి చూడకుండా ఉండలేకపోయాడు. చూస్తే దిబ్బమీద దట్టమైన మామిడి తోపు వెనుక సూర్యుడు దిగిపోతున్నాడు. రంగు రంగుల మబ్బుల నేపథ్యంలో ఏ గౌరితో మరుసటి నెల పూనమ్‌లాల్ పెళ్ళి జరగాల్సివుందో ఆ గౌరే ఒక మామూలు రైతు కొడుకు చెయ్యి పట్టుకుని నిలబడి వుంది. పూనమ్‌లాల్ రక్తం ఉడికిపోయిది. రాయివిసిరి ఆ చేతిని విరగ్గొట్టవచ్చని తట్టిందతనికి. అతను రాయి విసిరి పారిపోయాడు. తర్వాత గౌరి చెయ్యి చెక్కు చెదరకుండా ఉండడం చూసి రాయి గురి తప్పిపోయినందుకు సంతోషించాడు కూడా. ఆ తర్వాత గౌరితో ఈ సంఘటన గురించి చెప్పినప్పుడు గౌరి తన వీపు చూపించి ''రామొచ్చి ఇక్కడ తగిలింది. ఒకవేళ అదొచ్చి తలకి తగిలితే ఎంత బాగుండేది! అప్పుడు పెళ్ళి చేసుకోవడానికి పరుగు పరుగున ఎవరొస్తారు?'' అంది.

ఇదంతా గుర్తు చేసుకుంటున్న సమయంలో పూనమ్‌లాల్ గౌరి గురించి తక్కువగానూ, లక్ష్మిగురించి ఎక్కువగానూ ఆలోచిస్తున్నాడు. నేను పొరబాట్న రాయిచ్చుకుని లక్ష్మిని కొట్టానన్న సంగతి గౌరి ఎందుకు దాచిందీ అన్నదే అతను ఆలోచిస్తున్నాడు. ఆ రోజుల్లో తనకి లక్ష్మివేపు చూసే ధైర్యం కూడా లేదన్న సంగతి కూడా గుర్తువచ్చింది. లక్ష్మి కొకవేళ తెలిసిపోతే ఈ అభిమానవతి ఏం చేసుండేది? అతను ఊహించసాగాడు. గౌరి అతని చిత్తంలోంచి తొలగిపోయింది... అరె, ఇంత అందకత్తె అయిన లక్ష్మిని రాతితో కొట్టాను... ఈ సమయంలో మైలు దూరంలో తన యింట్లో దీపం వెలిగిస్తున్న చంప అతనికి గుర్తురాలేదు. ఆమె దీపపు కాంతిలో అతను ఎంత ఆలస్యంగా తిరిగి ఇంటికి చేరుకోగలడు... ఈ సమయంలో ఆ రాయి విసిరి కొట్టినది నేనేనని ఎలా చెప్పగలను అనిపిస్తోంది అతనికి. విషయం మామూలు విషయమే కానీ ఇంత మహత్తరమైన విషయమింకేదుంటుంది? జరిగిందేమైనా ఆమె అందులో వుంది. సంఘటన మామూలుదే కానీ ఆ సమయం అటువంటిది!

''నువ్వు అబద్ధం చెబుతున్నావు. రాయి దానికే తగిలివుంటుంది. అందుకే అది ఏడిచి వుంటుంది.'' ఏమీ తట్టకపోయేసరికి అతను నోటి కొచ్చింది చెప్పేశాడు.

''కాదు - కాదు. నేను అబద్ధమెందుకు చెబుతానూ? చూడు,

ఇప్పటికీ...'' లక్ష్మి తన జాకెట్ చేతిని కొంచెం పైకి తప్పించి మోచేతికి కొంచెం పైనున్న ఆ దెబ్బ తాలూకు గుర్తుని చూపించింది ''చూడు ఈ గుర్తు ఇప్పటికీ వుంది.''

''రాయి ఏదో కాస్త రాసుకుపోయుంటుంది. పెద్ద గాయంలాగా కనబడటంలేదు.'' కాస్త కూడా అర్థం చేసుకోకుండా మాట్లాడాడు పూనమ్ లాల్.

చీకటి దట్టం కాజొచ్చింది. కానీ కబుర్లలో నిమగ్నమైన లక్ష్మి దీపం వెలిగించలేదు. పూనమ్‌లాల్ గుమ్మం దగ్గిర నిలబడ్డాడు. ఆమె అతని దగ్గర కెళ్ళి ''చూడూ, నేను అబద్ధం ఎందుకు చెబుతాను?'' అనడిగింది. పూనమ్‌లాల్ ఆమెవేపు అడుగేస్తూ ''ఏవిఁటి? మరి గాయమూ లేదు ఏమీ లేదు'' అన్నాడు. లక్ష్మి మోచేతిపైన వెనకభాగంచూపించడానిగ్గానూ చెయ్యి మడిచి నిలబడింది. రెండో చేత్తో ఆమె జాకెట్ చెయ్యి పైకి తప్పించి పట్టుకుంది. శరీరానికి సంబంధించని బయటి వస్తువు దేన్నో పట్టుకుని నిలబడ్డట్టుంది. కానీ గాయం మీద నిమరడానికి పూనమ్‌లాల్ ప్రయత్న పూర్వకంగా వేళ్ళు వేసి నిమిరి – ''లేదు – లేదు. దెబ్బే తగిలింది'' అన్నాడు. లక్ష్మి శరీరంలో అణువణువూ ఈ మాటలు విన్నాయి.

బయట వీధిలోంచి పోతున్న ముసలి రామీ హఠాత్తుగా పిలిచింది – ''లక్ష్మీ!'' మళ్ళీ చాలా హడావుడిలో ఉన్నట్టు లోపలికి తొంగి చూడకుండానే వెళ్ళిపోయింది. హమ్మయ్య!

ఏళ్ళ తరబడి లక్ష్మి తన బతుకునంతా చంపలో నింపుకుని బతికింది. జీవితంలో చివరి సంవత్సరం ఆమె చంప వరుడితో నింపేసింది. గౌరి గురించిన మాటల్లో ఆమె కావలసినంత కాలం గడిపేసింది. కానీ ఇప్పుడు ఆ మాటల సాయంతో ఎక్కువ సమయాన్ని గడపలేకపోతోంది. చంప సహకారం నిజమైనదా, బలమైనదా. చంప పేరుతో, తన జీవితాన్ని నిండుగా ఉంచుకుంది. ఇకిప్పుడు ఆమె తన పేరుతో, తన గురించి ఆలోచించుకునే మాటలతో జీవితాన్ని నింపసాగింది. ఆమె తన మనసుకి సమాజపు ప్రవాహంలో కలిసి ప్రవహించడం అన్నది నేర్పింది. తనకో ఉద్దేశ్యమంటూ లేదు. ఇటూ అటూ వెళ్ళాల్సినకంగారేంలేదు. ఇక సమాజపు మర్యాదన ను సరించి నడుచుకోవలింక. అదిసమాజంఇష్టంఅనుకోండి లేదాదాని అలవాటనుకోండి. దానికోసంలక్ష్మి తననితనునాశనం చేసుకోవాల్సొచ్చింది. చిన్ని పాపని పెంచి పోషించుకోవడంలో నిమగ్నమవ్వాల్సొచ్చింది. మళ్ళీ అదే సమాజం ఆమెకి చంప వరుణ్ణి దానం చేసింది. బాగుందా! లక్ష్మి కనుపాపలలో

కొత్త మెరుపొచ్చింది. దానితో ఆమె రెప్పలు పైకి లేచి వుంటున్నాయి. లోపల్లోపల ఏదో వివాదం జరుగుతున్నట్లుగా ఆమె పెదవులు ఏదో అదృశ్య పవన తరంగానికి కదిలే ఆకుల మాదిరి కంపిస్తున్నాయి.

ముఖం మీది ముడతల నదులలో నీరు ప్రవహిస్తున్నట్టుండి ఆమె ముఖంలో నేవళం తొణికిసలాడుతూ దృష్టి గోచరమవుతోంది.

ఎవరో అనేవాళ్ళున్నారు కూడా:

''కూతురి సుఖంతో సుఖపడే తల్లులు తక్కువమందే ఉంటారు. లక్ష్మి తనకి పెళ్ళి అయినప్పుడు కూడా ఇంత ఆనందంగా లేదు.''

అయినా కూడా అలాచెప్పడం కాస్త అతిశయోక్తి గానే వుంటుంది. 'కాస్త! అందుకే అప్పుడప్పుడు చెప్పడం అల్పోక్తిగా కూడా ఉండవచ్చు. సమాజం ఒక పెళ్ళికూతురు భర్తతో కలిసే సందర్భానికి ఎంత ఉత్సాహాన్నిస్తుందో అంతగా ఒక అత్తగారు అల్లుడితో కలిసే సందర్భాని కెక్కడివ్వగలదు?

అమ్మ నాకు పెళ్ళి చేసిన తరువాత నన్ను మర్చిపోయింది, అనిపిస్తోంది చంపకి. లక్ష్మి చంపని కలవడానికి ఎక్కువ వెళ్ళటం లేదు. ఎవర్ని కలవాలంటే వారు నా గుమ్మంలోకే వస్తారు. సమాజ మర్యాదలో, అధికారపు నీతిలో బతుకుతూ తనని అందులో కలపగలిగితో నేను కలుస్తాను - ఈ విధంగా ఆలోచిస్తోందామె. తనంటే ప్రాణంపెట్టే అమ్మ తననెందు కొక్కసారిగా మర్చిపోయిందో ఆశ్చర్యంగా వుంది చంపకి!

కాన్పుకి చంపని తన ఇంటికి తీసికెళ్ళడానికి లక్ష్మి ఆమె యింటికెడితే చంప తన నిరాశ నిండిన కళ్ళతో తళుకు లీనుతున్న తల్లి ముఖాన్ని అలాగే చూస్తూండిపోయింది. తనరూపాన్నిఅమ్మదోచుకుందా అనిపించింది చంపకి.

ఆరోజుకాకుండా పై సోమవారం చంపుట్టింటికి వెళ్ళడానికి నిర్ణయమైంది. మధ్యలో శనివారంనాడే హఠాత్తుగా ఒక మనిషి రొప్పుకుంటూ రోజుకుంటూ వొచ్చాడు. పూనమ్‌లాల్ అకస్మాత్తుగా జబ్బు పడ్డాడని లక్ష్మికి సూచించాడు. ఒక్క క్షణం కూడా ఆలస్యం చెయ్యకుండా లక్ష్మి కూతురింటికి చేరుకుంది. అల్లుడి సేవా శుశ్రూషలో నిమగ్నమైంది.

''చంపా, ఏడవకు ఏదోపెద్దజబ్బేమీ కాదు. కొద్ది కాలంలోనే నయమవుతుందిలే.'' మందు తెమ్మని చంపకి చెప్పి లక్ష్మి తను పూనమ్‌లాల్ తలదిక్కున కూర్చుని అతని తలపట్టసాగింది. కాని జబ్బు దూరం కాలేదు. అనుక్షణం అందరూ రెప్పకూడా వెయ్యకుండా పూనమ్‌లాల్ దగ్గరే

కూర్చుంటున్నారు.

మూడోరోజు రాత్రి జబ్బు తీవ్ర రూపాన్ని దాల్చింది. పూనమ్‌లాల్ మాట కూడా మాట్లాడలేక పోతున్నాడు. చంప మంచం కొాక అంచున కూర్చుని అతని కాళ్ళు పడుతోంది.

''మాకోర్ భాయీ, నువ్వు ఇతని అత్తగార్లాంటి దానివి కావూ... కానీ చంపా, పెద్దవాళ్ళూ, వృద్ధులముందూ సిగ్గూ మర్యాదా ఉండాలి మంచం మీద కూర్చోక పోతేయేం? తే, అలా వుండనీ, కాళ్ళు నేను పడతాను.''

మాకోర్ బాయి కుంపటి ముందు కూర్చుని కునికి పాట్లు పడుతున్న దల్లా మేల్కొని విచారిస్తూ జబ్బు ఒక్కసారిగా ఎక్కువకాలేదు కదా అని చూడసాగింది. చంప మనసులో మాకోర్ నీ, లక్ష్మిని కోట్లాది సంవత్సరాలు నరకంలో పడి చావండని శపించి ఒక నిట్టూర్పు విడిచింది.

లక్ష్మి రాత్రీ - పగలు నిరంతరం తలదిక్కున కూర్చుని సేవ చేస్తూండిపోయింది. అప్పుడప్పుడు పూనమ్‌లాల్ కళ్ళు తెరుస్తున్నాడు. వేరు వేరు క్షణాల్లో ఒకే ముఖంలో లక్ష్మినీ, చంపనీ చూసుకున్నప్పుడు అతని ముఖంమీద ప్రసన్నత పరుచుకుంటోంది. ఎప్పుడేనా చంప అతని దృష్టిని ఆకర్షించడానికి నెమ్మదిగా పిలవడమో లేకపోతే ఏదేనా చెప్పబోతేనో లక్ష్మి తన రోగిని జాగ్రత్తగా చూసుకునే కర్తవ్యాన్ని ఎంతో సమర్థవంతంగా నిర్వహిస్తూ ''ఇప్పుడే రెప్ప వాల్చాడు... ఎందుకలా...'' అంటూ చంపని మందలిస్తోంది.

తల్లి తాలూకు ఈ అంతులేని లాలనతో చంప వ్యాకుల పడసాగింది. అయిదో రాత్రి భయంకరంగా వుంది. బయటున్న గాఢాంధ కారాన్నంతా పోగు చేసుకుని రూపుదాల్చినట్టున్న ఒకయమదూత అందరికళ్ళల్లోనూ తేలుతున్నాడు.

''చంపా గంగా జలం తీసుకురా త్వరగా.''

''తొందరగా చెయ్యి చంపా. ఆ బంగారపు కత్తి తీసుకురా.''

''ఓసి దౌర్భాగ్యురాలా తులసాకులెక్కడెట్టావ్?''

ఇప్పుడిక ఏది వెతికినా, వెతకకపోయినా అనవసరమే. లక్ష్మి కున్న ఆ సాహసం కూడాసమసిపోయింది. ఆమె శరీరంలోంచి కూడాప్రాణాలు బయటికిపోయాయా అన్నట్టు ఆమెభారంగా దొర్లిపడిపోయింది.ఆమె ప్రాణాలతో మనగలగటానికి ఇప్పుడిక ఆధారం కూడా ఏముంది?

అందరూ కలిసి శవాన్ని నేలమీదికి దించేశారు.

లక్ష్మి రెండోసారి విధవైంది.

''నువ్వు ఏడవకు చంపా! ఏడవాల్సిన దాన్ని నేనున్నాను!'' అవునవును లక్ష్మి నిజం చెబుతోంది. వెళ్ళేవాడు వెళ్ళి పోయాడు. కానీ

ఇప్పుడు ఈ ఇల్లు తెరిచివుంచాలంటే వొచ్చేవాడినిగురించాలోచించు.'' ఎవరో మరొకామె చెప్పింది.

''అవును ఒకవేళ అబ్బాయే కలిగాడంటే అంతా చక్కబడుతుంది. ఏడ్చేడ్చి వొచ్చే ఆ జీవిని చంపకు,'' మూడో ఆమె మాటలో మాట కలిపింది.

ఈ విధంగా రోజూ అందరూ చంపని సముదాయిస్తున్నారు. ఆమెను ఏడవకుండా చూస్తున్నారు. ఒకటే ఏడుస్తోంది. సమాజం ఆమెకి ఏడిచే అధికారం ఇచ్చినా - ఇవ్వకున్నా లక్ష్మిఅదృష్టంలో ఏడుపుతప్ప ఇప్పుడింక మిగిలున్నదేముంది? లక్ష్మి ఏడుస్తూనే వుంది. తిండి లేదు, నీళ్ళు లేవు, విశ్రాంతి లేదు.

''చెల్లీ ఈ దేశంలో ఇలాంటి తల్లి దొరకడం కష్టం.''

''చంప లేకపోతే ఆమె అప్పుడే తన భర్తతో పాటు వెళ్ళిపోయేది.''

''బతికున్నా ప్రాణం లేనట్టే బతికింది.''

''బతికుందంటే అది కేవలం తన కూతురి కోసం. లేకపోతే ఆమె బతికుండే పనేముంది.''

''చంప వెళ్ళిన తరువాత ఎంత సంతోషంగా వుండేదో.''

''బతకాల్సిందే. చంపకోసం వయసుని వృథా చేసుకుందా మరీ.''

''మళ్ళీ చంప దుఃఖం చూడ్డానికేనా ఆమె బతికుంది? మంచి పనే చేశాడు భగవంతుడు. ఆమెకి సమయంచూసి చచ్చేచావు తెచ్చిపెట్టాడు.

''లక్ష్మి వెళ్ళిపోయింది. కానీ అమె లాంటివాళ్ళు మరొకళ్ళుండటం దుర్లభం.''

ఎవరి నాలుకా లక్ష్మిని ప్రశంసించడంలో అలసిపోదు, చంప నిశ్శబ్దంగా అవన్నీ వింటోంది. దుఃఖంతో ఆమె మనసు మెలి తిరిగి పోతోంది. లక్ష్మి తనకి తను, ఇంకాతనవాళ్ళనే, దుఃఖపెట్టుకుందే గానీ సమాజానికెంత మాత్రం దుఃఖాన్నివ్వలేదు. చంప ఇదంతా చూస్తోంది. అమాయకత్వం నిండిన తన తల్లి చాతుర్యానికి ఆశ్చర్య చకితురాలైంది కూడా.

రెండు నెలల తర్వాత చంపకి కూతురు కలిగితే అది ఇరుగుపొరుగు వాళ్ళకి ఆనందం కలిగించలేదు. కానీ - తరువాత అందరూ ముఖం మెప్పు మాటలు మాట్లాడారు - ''కూతురు కూతురే అవుతుంది చెల్లీ, కూతురువల్ల కూడా ఇంటికి వెలుగొస్తుంది.''

వయసులో చిన్నదైన తల్లిని ప్రసన్నత నిండిన వాతావరణం లోకి తెస్తూ చంప కూతురు పెద్దదవుతోంది.

చంప! తన తల్లిమీద ప్రతీకారం తీర్చుకోవడానికా అన్నట్టుగా రెండింతలు స్నేహంతో, ప్రేమతో తన కూతుర్ని పెంచుతోంది.

# 7. ఈ యిల్లు - ఆ యిల్లు

**జయంతి దలాల్**

జయంతి దలాల్ (క్రీ.శ. 1909 - 1970) జన్మస్థానం అహమ్మదాబాదు. స్టేజి, రాజకీయాలు, జర్నలిజమ్, సాహిత్యం వీరి ప్రముఖ కార్యక్షేత్రాలు. 'ప్రవేశ్ పహేలో', 'జవనికా' మొదలైనవి ఏకాంకి సంపుటాలు. 'ఆఫేర్‌పేల్‌ఫేర్', 'అడఖేపడఖే,' 'యుధిష్ఠిర్', ' ఈషత్, మొదలైనవి కథా సంపుటాలు. 'కాయా లాకడానీ నే మాయాలుగడానీ' నాట్య సంబంధమైన రచనల సంపుటాలు. 'గతి' వారపత్రికకీ, 'రేఖా' మాసపత్రికకీ సంపాదకులు. విశ్వసాహిత్యంలోని ప్రసిద్ధ కృతుల నెన్నిటినో అనువదించారు. వాట్లలో 'యుద్ధ అనె శాంతి', 'భూండీ భూఖ్', 'మేఘ పంథ్' మొదలైనవి ఎన్నదగినవి.

★ ★ ★

పటకారులో పట్టి వుంచిన తిరగమోతగిన్నె ఎలా చెదిరి పడిపోయిందో తెలీదు. పప్పులో తిరగబొయ్యాల్సిన మరుగుతున్న నూనె అందుకు బదులుగా నేలమీద పడింది. సవిత కాలిపోవాల్సిందల్లా ప్రమాదం తప్పింది. ఆమె మీద ఒకటో అరో తుంపర్లు మాత్రం పడ్డాయి. కానీ ఆమె ధ్యాస అటు లేదు. చెదిరి దూరంగా పోతున్న గిన్నె చేస్తున్న శబ్దం మాత్రం ఆమె అమాయకపు స్మృతి పథంలో మరి వేరు ప్రసంగాన్ని రేకెత్తించింది.

కాని అది స్టెయిన్‌లెస్ స్టీల్‌గిన్నె. అన్నం వడ్డించేప్పుడు చెమ్చా దానికి తగిలి ఎంత మధురధ్వని వొచ్చిందో. గిన్నె కొత్తది పాత్రలు కొత్తవి. నేను కూడా మరి కొత్తదాన్నే కదా!

సవిత మనసు ఒప్పుకోలేదు. జరిగిపోయిన దాని స్మృతిని సింహావలోకనం చేసుకుంటే అందులో తియ్యదనం లేకపోగా అందుకు విరుద్ధంగా గుండె మండుతుంది. ఇప్పుడు గుండె నింకా యింకా ఎందుకు దగ్ధం చేసుకోవడం?

కానీ... కానీ.. గుర్తువస్తుంటే ఏం చెయ్యడం? మర్చిపో అని తనకి తను చెప్పుకోవడం సులభమే. ఇతరుల కలా ఉపదేశించడం కన్నా కూడా

సులభం. కానీ ఆచరించడం ఎంత కష్టం! మర్చిపోవాలి! ఏం మర్చిపోవాలి? ఎప్పుడు మర్చిపోయేది? ఎన్నని మర్చిపోయేది?

సవిత లేచి గెన్నెని మళ్ళీ పట్టకారులో సరిగా పట్టేట్టుచేసింది కానీ మనసుని పట్టివుంచడానికి, చెలరేగుతున్న స్మృతుల్ని పట్టివుంచడానికి ఎక్కణ్ణించి ఏం తెచ్చేది?

ఆ ఇంట్లో...

ఈమాట మనసులోకి రాగానే శరీరమంతా కంపించింది. ఆ ఇంట్లో! ఎంత విచిత్రమైన విషయం! కాలేజీలో చదివే రోజుల్లో హెడ్ ఆఫ్‌ది డిపార్ట్‌మెంట్ వల్లె వేయించిన అతిశయోక్తి ఇంత ప్రాణాంతకమూ, మర్మభేదీనా? అప్పుడు ఈ యిల్లు 'అది' అయింది. ఇప్పుడు ఆ యిల్లు 'ఇది' అయింది.

గొడుగులా విస్తరించున్న వృక్షం తన శాఖలూ, ఆకులూ తనకి శోభ అనుకుంటుంది, అంతకన్నాఎక్కువగా వాటిని తనకి పరమరక్షగా భావిస్తుంది, కానీ సిగ్గులేని క్రూర పవనుడు ఆ ఆకుల్ని భేదించుకుంటూ వెళ్ళి కొమ్మ కొమ్మనీ ఎలా ఊపి పారేసి చెట్టు మొదలు దాకా పయనిస్తాడో! తేలికపాటిదో లేకపోతే బలమైనదో స్పందనొచ్చి పవనుడు మళ్ళీ మరో వృక్షాన్ని దేన్నో కల్లోల పరచడానికెళ్ళిపోతాడు. కానీ శోభనీ, సహజత్వాన్నీ, రక్షణనీ, సర్వాన్నీ పోగొట్టుకునే ఆ చెట్టేం చెయ్యాలి?

సవితకీ అలాగే అనిపించింది. మనసనేమర్కటం ఎప్పుడు ఏ కొమ్మవొంచి ఎక్కడికొచ్చి దూకుతుందో! ఇలాంటిది కూడా ఎప్పుడేనా ఎవరికేనా సంభవిస్తుందా? ఆమెకి విక్రమ్ గుర్తువచ్చాడు.

ఈ కడుపున పుట్టినవాడే వాడు. నెలలు నిండడానికి ముందే పుట్టాడు. ఎవరికీ తల్లీ - కొడుకూ బతుకుతారన్న ఆశలేదు, కానీ ఇద్దరూ బతికారు. మరి ఈరోజు? విక్రమ్ తనంతట తనే పులిన్ దగ్గిరుండడానికి నిశ్చయించు కున్నాడు. సొంతమ్మకి దూరంగా కొత్తమ్మ దగ్గిర ఇంకేం చెప్పాలి?

''ఆ యింటికెడితే ఈ యింటికి రాలేను, కానీ ఈ ఇంట్లో వుంటే ఆయింటికి వెళ్ళగలను కదూ?''

స్వార్థపరుడని చెప్పాలి వాణ్ణి. ఇప్పుడు కేవలం పదేళ్ళు వాడికి. సవిత పులిన్‌తో ఇల్లు-వాకిలీ ఏర్పరుచుకుని పూర్తిగా, పన్నెండేళ్ళు...

వేధిస్తున్న స్మృతి ఆమెని దగ్ధం చేస్తున్నట్లయి సవిత అంగాంగం కంపించింది. ఎందుకు గుర్తు చేసుకుంటున్నా నిదంతా? ఇంతకు ముందేమైనా తక్కువ మంటని అనుభవించానా ఇంకా ఈ విషనాగు కోరని యిప్పుడు గుర్తు తెచ్చుకోవడానికి?

కానీ మనసుమీద నాకే మధికారముంది?

ఇల్లా - వాకిలీ!

వొద్దు. వొద్దు. వొద్దు. ఇదంతా నేను గుర్తు తెచ్చుకోకూడదు. అంతా అయిపోయింది. ఏదైతే సుఖమనుకున్నానో అది దాటిపోయింది. రాగ ద్వేషాల, అనంద విషాదాలు, తృప్తి, కోరికలు, సర్వం వెళ్ళిపోయాయి. మబ్బులు ఆకాశాన్ని భయపెడుతూ, బెదిరిస్తూ దాన్ని ఒక్కొక్క అంగుళం దట్టమైన మేఘాలతో కప్పేస్తాయి. హృదయం తెరిచి కురుస్తాయి. కానీ దాని తర్వాత ఆకాశాన్ని స్వచ్ఛంగా, నిర్మలంగా, శూన్యంగా, కళంక రహితంగా వదిలేస్తాయి. జీవితంలో మబ్బుల మాదిరిగా అన్నిటినీ క్రీడామాత్రంగా తీసుకోవడం ఎలా సాధ్యం? సంపూర్ణ చైతన్యాన్ని జీవితం ఘోరమైన నల్లని మబ్బులతో కమ్మేస్తుంది. కానీ దానికి మనసారా వర్షించడం రాదు. ఒకటో అరో అశ్రుబిందువులు కురిసినా చాలు! కురిసేటప్పుడు కుంభ వృష్టిగా కనిపించే ఆ వర్ష బిందువులు తపిస్తూ కుంచించుకు పోతున్న ధరణి దాహాన్ని తీర్చినా - తీర్చకపోయినా అలాగే భయపెడుతూ - బెదిరిస్తూ వంగివుంటాయి. నల్లని వీబూదిరంగువీ మబ్బులు, సాహసాన్ని - ధైర్యాన్నీ తెంచివేసే మబ్బులు, చైతన్యాన్ని ఆపివేసే మబ్బులు, వివేకాన్ని మరిపించే మబ్బులు, బుద్ధిని లుప్తంగావించే మబ్బులు...

ఆ రోజుల్లో కూడా మబ్బులు కమ్మేస్తున్నాయి. కష్టాలు అప్పుడూ వున్నాయి. కానీ మనసు యౌవనంతో శోభిస్తోంది. యౌవనానికి శోభనిచ్చే అనురాగపు వెచ్చదనం కూడా వుండేది. పులిన్‌కి కూడా నేనంటే ప్రేముండేది. అన్నిటికీ నవ్వినవాడు నవ్వినట్టుండేవాడు. పులినే ఒక సారన్నాడు ''ఆ పొగడ చెట్టు చూశావా?'' ఆకు ఆకునా పువ్వులు లక్షల్లక్షలుంటాయి. కానీ ఇది కాస్తంత గాలివిసురు కెదురు చూస్తోంది. ...కాస్తంత గాలి విసురు! రాతిలో కూడా ప్రాణాల నూదే జీవితం మొక్క, చైతన్యం యొక్క ఒక్క విసురు...

కానీ నువ్వు మనసుని దగ్ధం చేసే వృత్తి నెందుకు పెట్టుకున్నావు? గతించిన సుఖాన్ని స్మరిస్తే మధురంగా వుంటుంది - మాటల కర్థం తెలీని ఏ మేధకుడో, అనుభవహీనుడో, వాగాడంబరం గలవాడో మాత్రమే ఈ మాటంటాడు. సుఖంలో మునిగిన ఒక్కొక్క స్మృతిలో వందలు వందలు రాజవంశపు కాలసర్పాల కోరల్లో విషం నిండి వుంటుందన్న కఠిన సత్యం తెలియని వదరుబోతెవడైనా ఇటువంటి మాట చెబుతాడు!

గడిచి పోయిందా రాత్రి. అపకీర్తి తెచ్చుకుని ఇంట్లో కూర్చున్న అధికారి ఇంటి గోడలమీదేమున్నా తన అధికార కాలంనాటి చిత్రాలువేలాడ

దీసుంచుతాడా? నువ్వు కూడా అపకీర్తి తెచ్చుకుని పదచ్యుతురాలవై ఇంట్లో కూర్చున్నావు. పులిన్ నిన్ను పదచ్యుతురాల్ని చేసేశాడు. నీ మీద అతని కున్న ప్రేమ పోయింది. లక్షల్లక్షలు పూలని ఉయ్యాలలూగించే కొమ్మ ఎలా వున్నదలా వుండిపోయింది, కానీ 'గాలివిసురు' రాలేదు. అది వేరే వృక్షాల కొమ్మల నుర్రూతలూంగించేందుకు, వాటి పూలని వికసింప జేసేందుకు వెళ్ళిపోయింది. లక్షసార్లు వొద్దనుకున్నా కూడా సవిత మనసులో ఆ ప్రసంగమే తలెత్తుతోంది. నల్లని మబ్బుల నడుమ తేలికపాటి విద్యుత్ రేఖ ఎలాగైతే ఎగసివస్తుందో అలాగ.

కానీ మనసులోని ఏకాంతంలోనే ఆయన్ని గుర్తు చేసుకోనా? విక్రమ్ పుట్టకముందు మాట. వెర్రిదానా, పుట్టడానికి ముందు మాట చెప్పి మాట తప్పించేస్తున్నావా? అప్పటిదే, అప్పటిమాటే కదూ? ఆరోజుల్లో విక్రమ్‌ని కడుపుతోవుంది. చోళీ - ఉడుపు కూడా వేసుకోవడానికి లేదు... మర్చిపో, పూర్తిగా మర్చిపో.

ఆఁ, అప్పుడు పులిన్ నన్ను బిజిలీ అంటూండేవాడు. బిజిలీ అని అంటూ అంటూ 'బీజీ' అనడం ప్రారంభించాడు. (బీజీ - గుజరాతీ భాషలో దీనికి రెండర్థాలున్నాయి. ఒకటి బిజిలీ-మెరుపుతీగ, మరొకటి-రెండవది అని.)

బిజిలీ! కాదు, కాదు, రెండవది, రెండవది!!

కానీ, ఆ తడవ పులిన్ ఏకంగా ఇరవై రోజులు ఇంట్లో లేడు. బయటికెళ్ళాడు. కుంభవృష్టిగా వర్షంకురవ నారంభించింది. నదులూ - కాలవలూ ఏకమై పొంగి పొరలాయి. వంతెనలు విరిగి పోయాయి. ఇళ్ళు కూలిపోయాయి. బళ్ళాగిపోయాయి. కానీ, ఆయన చెక్కు చెదరకుండా ఇంటికి తిరిగొచ్చారు. ఆ రాత్రే ఆయన నన్ను 'బిజిలీ' అన్నారు. బహుశః నేను మొదటే అర్థం చేసుకున్నాననుకుంటా - కాదు, కాదు నాకు అనుమానం కలిగింది. నేను ఆయనతోనే అన్నాను కూడా, అయితే ఆయన మదమెక్కి వున్నారు. ఆయనన్నారు - ''ఏదైతేనేం, కరెక్ట్.'' ఆయనకింకేం వినే అవసరముందీ? ''మరొకళ్ళెవరేనా వుంటే కూడా వొచ్చిన ఇబ్బందేవిఁటి?'' అన్నారు.

''జీవితం ఆఖరి క్షణాల్లో మీరేం కోరుకుంటారు?'' అని అడిగాన్నేను. దాని కాయన నా పెదవుల మీద తన పెదవులనుంచుతూ ఎంత అబద్ధం, తప్పు, కపటం నిండినజవాబిచ్చారో- ''ఇది!'' అప్పుడునాకది బాగానే అనిపించింది?

నీచుడు పులిన్!

తిరగమోత గిన్నె సవిత చేతిలోనే ఉండిపోయింది. జ్ఞాపకం రాగానే గిన్నె పెట్టేసింది. ఆలోచనలో మునిగిపోయింది. అవే విషయాలు. అవే మాటలు. ఎప్పుడు వంట చేసిందో ఎప్పుడు పళ్ళెంలో వడ్డించుకుందో, ఎప్పుడు తినడాని కూర్చుందో, ఆమెకే తెలీదు.

ప్రతీదీ ఇంతేగా? జీవితమే అంత. ఏం వుండింది? ఎప్పుడు వుండింది? వదిలేయ్ అదంతా...

పులిన్ అబద్ధాల కోరు, మోసగాడు, వంచకుడు, దగాకోరు! తమ్మెదల జాతి! అతని వృత్తే! వలలో వెయ్యడం.

''ఏవిఁటిదంతా? ఏం చేస్తున్నారు మీరు?'' అడిగాన్నేను.

''ఏవిఁటి? ఏం చేస్తున్నా నేను?''

''మనీషా ఎవరు?''

''ఎవరా మనీషా?''

''తిన్నగా అడిగితే చెప్పరుగా?''

''అయితే తిన్నగా అడగరాదా?''

''తిన్నగానే అడుగుతున్నాను, ఎవరీ మనీషా? మీతో ఆమెకున్న సంబంధం ఏవిఁటి?''

''నీకే మనిపిస్తోంది?''

సవిత ఒక్కక్షరమ్ముక్క కూడా మాట్లాడలేదు. ఏం మాట్లాడుతుంది? అందుకే అది పులిన్ వంతయింది - ''చెప్పరాదా, నీకేమనిపిస్తోందో? పిచ్చి! 'నా మనీషా ఇక్కడే కూర్చునుంది నా ఎదురుగానే. ఊళ్ళో మనీషాతో నాకేవిఁటి?''

ఇవ్వాళ జవాబివ్వాల్సొచ్చి జబాబిచ్చింది - ''ఇంట్లో పెట్టుకోను'' కానీ అప్పుడు? అప్పుడు పులిన్ చిబుకం పట్టుకుని, కళ్ళల్లో కళ్ళు పెట్టి చూశాడు. సరిగ్గా అప్పుడే విక్రమ్ పరిగెట్టుకుంటూ లోపలికొచ్చేశాడు. కళ్ళు విప్పార్చి - విపార్చిచూడసాగాడు. అతనన్నాడు - ''అరే, మీరూసినిమా చూసొచ్చారేంటి? పిక్చర్‌లో ఇలాగే వుంది. ఆ దీనదయాళ్ మాలతీ దేవి గడ్డం ఇలాగే పట్టుకుంటాడు...''

దీన దయాళ్ మాలతీదేవీ! హుఁ!!

''సవితా, నేను నీతో కొంచెం మాట్లాడాలి.''

సుమారు ఒక సంవత్సరం దాకా మాటల్లేకుండా వున్న తర్వాత పులిన్ నాతో మాట్లాడాడు. నేనన్నాను -

''చెప్పండి.''

''ఈ విధంగా బతికే బదులు మనం విడిపోతే మంచిదని పించటంలా నీకూ?''

''మీకదే మంచిదనిపిస్తే నాకేం అభ్యంతరం లేదు,'' అని చెప్పాన్నేను.

అది నిజం కాదు! తన ఎదురుగానే ఎందుకుకపటనాటకం ఆడుతోందో?

పులినే మళ్ళా అన్నాడు - ''నీకే ఇల్లు నచ్చితే అందులో వుండు. ఈ ఇల్లు కావాలంటే ఇది తీసుకో, అది కావాలంటే అది.''

ఏ ఇల్లు నచ్చితే ఆ యిల్లు! ఇల్లు! చలినించి, ఎండ నించి, వర్షం నించి కేవలం తల దాచుకుందుకు చోటిచ్చే ఇల్లు!

''కానీ అలాగేం బావుంటుంది?'' విలపిస్తున్న హృదయంతో అడిగాను. నా వల్లేమపరాధం జరిగింది? ఏం తప్పుంది నాది? నా మనసు పాడైంది. ఎవరివేపేనా కళ్ళెత్తన్నా చూశానా? వజ్ర వైఢూర్యాలడిగానా? ఎప్పుడన్నా మంకుపట్టు పట్టానా? జవాబివ్వగలరా ఆయన!

కానీ ఆయనొక్కసారి నిష్ఠూర పూర్వకంగా అన్నారు - ''సవితా, నాకు విసుగెత్తింది.''

విసుగెత్తింది. అంటే? మరోచోట మనసు లగ్నమైంది, ఇదేగా? నాలో ఏవిటి లోటు?

''చెప్పు ఏ ఇల్లు తీసుకుంటావ్?''

''నేనీ భవనాలు చూసి వొచ్చానా ఇక్కడికి? ఇటికలు రాళ్ళు, చూర్లు - కిటికీలు చూశానా నేను?

''నగలు, రొక్కం ఎంతెంత కావాలో తీసుకో.''

''మరి విక్రమ్?'' నా నోటి నుండొచ్చేసింది.

''వాణ్ణే అడుగు. వాడిష్టం.''

''మీకేదిష్టం?''

''దేని గురించడుగుతున్నావ్?''

''నన్ను వేరు చేసి...''

''అవును, నీకు చెప్పేస్తాను. నేను మనీషాతో...''

''చాల్చాల్చాలు. ఇంకా చెప్పకండి. మీరు వంచకులు, నీచులు, సిగ్గూ బిడియం వొదిలేశారు!''

విక్రమ్‌ని దగ్గరకు పిలిచి అడిగాం. మా ఇద్దరి మాటల మధ్యా ఎవరైనా వచ్చారంటే, అదివిక్రమ్. కానీవాడు చిత్రంగా తయారయ్యాడు. నన్నడుగుతున్నాడు ''నువ్వెక్కడుంటావు?'' అని.

''చూడూ, ఒకవేళ వీళ్ళు ఇక్కడుండేట్లయితే నేను మంచి ఇంట్లో వుంటాను.'' వీళ్ళు! వీళ్ళు! వీళ్ళు!

''కానీ నువ్వు ఈ ఇంట్లో వుండి, నేనూ ఈ ఇంట్లోనే వుంటే మళ్ళీ ఆ ఇంటికి వెళ్ళడానికి వీలు పడదుగా?''

''పడదు, వెళ్ళడానికి వీలు పడదు.'' నేను వెళ్ళనివ్వను. సిగ్గు లేకుండా అక్కడి కెళ్ళడం ఎందుకూ? సిగ్గూ లజ్జా లేక పోయినా కూడా ఏం ఫరవాలేదు కానీ నన్నిలా దగా చేసి వెళ్ళిపోయే వాళ్ళ దగ్గరకి...''

''పోనీ అమ్మా ఒకవేళ నేను ఆ ఇంట్లో వుంటే అప్పుడిక నీ దగ్గరకి ఈ ఇంటికి రావచ్చుగా?''

ఊఁహూ. నా దగ్గిర జవాబు లేదు. గాలి ధూళి నెగరేసి సుడిగాలిగా గిరగిరతిరుగుతూ పైకెత్తుకుపోతోంది. ఎత్తుకి, ఇంకాఎత్తుకి ఎత్తుకెళ్ళి పోతోంది. అంతలోపల అవకాశం శూన్యమేగా!

నేనీ ఇంట్లోనే వున్నాను - వాళ్ళు ఆ యింట్లో నగలు,. నివాసం, నకదు...

ఎక్కడంటే అక్కడ సంతకం చేశారు. మనసులో ఎంత కోపంగా వుందంటే నేను దహించుకుపోతున్నాను. పనికి మాలిన మనిషి, దుర్మార్గులు, సిగ్గూ లజ్జా లేని మనిషి! ఎలా వెనక వెనకే తిరుగుతున్నారో! విక్రమ్ చెపుతుండేవాడు...

కానీ నువ్వెందుకు గుర్తు తెచ్చుకుంటావిదంతా? నువ్వతని మనసు నించి తొలగిపోయావు. కథముగిసింది. ఆటసమాప్తమైంది. నీకిలాగే జరగాల్సివుంది. చాతకాని కోపం! అందరూ వారించినా కూడా నువ్వీ కళంకితుడి మీద వ్యామోహం పెంచుకుని తల్లినీ, తండ్రినీ, అందర్నీ ఒదులుకుని ఇతనితో పారిపోయొచ్చి ఇతన్ని పెళ్ళాడి కూచున్నావు. ఈ రోజు ఆ సరస సుందరుడే నిన్ను నిలుచున్న పాట్న నడిరోడ్డు మీద వొదిలేసి మరో కొమ్మ మీదికి పోయికూచున్నాడు. ఇదీ అతని ప్రేమ! ఏం ఆ మనీషా నీకన్నా అందమైనదా? ఎక్కువ చక్కనిదా? శరీరసౌష్ఠవం చూసినా అంతంత మాత్రం. ఆఁ, అనాలోచితంగా మాట్లాడడం, ఇతరులని చంపడం వొచ్చు. పూర్తిగా నటి!

బయటినుంచి పిలుపు వినిపించింది – ''అమ్మా...!''

విక్రమ్.

''ఆడుకోవడానికెడుతోంటే దాహమేసింది. అందుకని మనుతో ఈ యింట్లో మంచినీళ్ళు తాగొస్తానని చెప్పొచ్చా.''

వాడు నావైపే చూడకుండా, నే పెట్టినది కాస్తయినా తినకుండా తనే మంచినీళ్ళు తీసుకుని తాగేసి వెళ్ళి పోయాడు.

ఏమిటి, విక్రమ్‌కి 'ఈ యిల్లూ', 'ఆ యిల్లూ' అని వేరు చెయ్యకని నచ్చజెప్పడం సాధ్యం కాదా?

కానీ వాడి మనసెక్కడుంది? ఒకవేళ వాడి మనసు చెక్కు చెదరకుండా వుంటే, ఈ అమ్మమీద ప్రేముంటే...

నువ్వెంత కఠినురాలివయ్యావె! కొడుగ్గురించి కూడా నువ్వెలాంటి వాలోచిస్తున్నావ్? కొడుకు పరాయి వాడయ్యాడని చెబుతున్నావా నువ్వు?

అందరూ సరళంగా, శాంతంగా ప్రవహించే నది నీళ్ళమీద వంతెన కట్టాలను కుంటారు. ఉత్తుంగ తరంగా లెగసే విస్తృతమైన వరద నీటి మీద వంతెన కట్టాలని ఎవరూ అనుకోరెందుకనీ?

వాడు నీ బిడ్డ. నీ రక్తమాంసాలతో రూపొందిందతని శరీరం. నీ రక్తం నించి వాడి రక్తం...

వెనక్కిరా, ఓ మనసూ, తక్షణం వెనక్కిరా!

మనసులోకి ఏ ఆలోచనా రాకుండా వుంటే ఎంత బాగుండును! ఈ మాటలు! మాటలు, నువ్వు దయచేసి ఆలోచనలకి ఆకారమివ్వడం మాను, మానేసెయ్యి.

కానీ నువ్వు ఇతరుల నెందుకిలా వేడుకుంటున్నావు? నువ్వు నీ అధికారం గురించి మాట్లాడకూడదా? ఇతరుల కాళ్ళమీద పడాలా?

అధికారం!

లేదు - లేదు, నేను అధికారం గురించి మాట్లాడను. హక్కుందంటూ దావావేసే మాటకూడా మాట్లాడను. క్రయవిక్రయాల కోసరం నా బతుకున్నేను బజార్న పెట్టుకోలేను.

పులిన్ మీద నీకోపముంది. కానీ అతను నీ మనసు మూలస్తంభాన్ని నాశనం చేశాడనేనా అతను అబద్ధాల కోరయ్యాడు నీకు?

నువ్వు కూడా ఎంత భయంకరంగా ఆలోచిస్తున్నావు సవితా! ఎవరైతే నీ జీవితాన్ని ధూళి పాలు చేశాడో అతన్ని నువ్వు అబద్ధాలకోరూ - దుర్మార్గుడు అని కాకపోతే మరేమని పిలుస్తావ్?

కానీ నువ్వతన్ని... నేను చెప్పలా? నువ్వతని కర్పించని దేముంది? నేనా? ఈ రోజు నువ్వుఅర్పిచండం - పొందడం ఎందుకాలోచించడం ప్రారంభించావ్? జీవితంలో ఎవరు ఎవరికి ఏం ఇస్తారు? ఏం పొందుతారు?

ఏం? నా యౌవనం, నా స్త్రీత్వం, నా మనసు, నా శరీరం, నా సర్వస్వం, నా సంపూర్ణ జీవితం...

ఇచ్చావు. నువ్వు సర్వం ఇచ్చావు. బాగా ఆలోచించి ఇచ్చావు. హృదయపూర్వకంగాఇచ్చావు. ఏమీదాచుకోకుండాఇచ్చావు. ఇదంతా ఇచ్చెయ్యడంనించే ఇవాళనీకు దుఃఖమొస్తోందా? వెర్రితల్లీ! మానసిక ఏకాంతంలో స్వీకరించు! మొదటి దాని గురించి కూడా గుర్తు చేసుకో... అతనూ, మొదటిచూపు ప్రేమికుడు! ఎకాయెకీ నీకెలా అనిపించాడు! అణు-వణువునా ఎవరో వేడిరక్తం నింపుతున్నట్టు! ఎలా రోమాంచితమైంది! ఎంత వ్యాకులపాటుని సహించావు నువ్వు - దేహం నుంచి చిత్తం వరకూ మొత్తం విల్లుకి ఒకే పాశం అనే వింటినారిని సంధించినట్టుగా! అతను నీతో ఏం చెప్పడానికొచ్చాడు? చెప్పడానికి ముందే నువ్వే...

లేదు, ఆయన్ని అబద్ధాలకోరు అనను, సిగ్గులేని వారనను. నా బిడ్డకి తండ్రాయన! నేనాయన్ని నమసారా నా వారనుకున్నాను. అనను ఆయన ధూర్తులని, అనను ఆయన దుష్టులని,

ఇప్పుడు చిక్కావునువ్వు! ఊఁ స్వీకరించు, ఇప్పుడునువ్వు పారిపోలేవు. ప్రపంచంమొత్తాన్నికాదనిఎక్కడికెడతావు? అందర్నీ మరిపించ గలవా? కానీ నిన్ను నువ్వేం చేస్తావు? అక్కడ ఎటువంటి కంచె కడతావు? అక్కడ ఏం అధికారాన్ని మాటు చేసుకుంటావు? అక్కడ ఎటువంటి అంతరాన్నుంచుతావు?

నువ్వతన్ని కోరుతున్నావు. నీ మనసులో అణువణువునా నీ ఆ ప్రేమికుడు నిండి వున్నాడు. నువ్వతన్ని మర్చి పోలేదా సవితా! అతని నఖ - దంత... ఇంతే కాదు, అతనికి సంబంధించిన ప్రతి చిన్న విషయం నీకెంతో బాగుంటుంది. పిసినిగొట్టు డబ్బులాగా నువ్వతన్ని నీ హృదయంలో బంధించావు. అతను నీ ప్రియతముడు నీ తనువుకీ, మనసుకీ స్వామి. నేటికీ, ఈ క్షణం కూడా అతను నీ హృదయానికి స్వామి.

అతను స్వామి మరి నువ్వు? పత్నివి మాత్రమేనా? విసిరెయ్యదగ్గ బొమ్మవా? చీకేసిన మామిడి టెంకవా? పేటలో ఒక సందువా?

నీకు కూడా కొంచెం స్వాభిమానమనే దేమన్నా వుందా లేదా?

అయితే నీస్వాభిమానాన్నయితే నువ్వు చూపించేశావు! స్వాభిమానంతో పాటు నీఅభిజాత్యాన్ని కూడాచూపించేశావు. అతన్ని అవమానించాలన్న మాట కూడా నువ్వాలోచించలేదు. మీ మాటల మధ్యకి ఏ మూడో మనిషినీ రానివ్వలేదు. బాగు లేదూ? చాలా మంచి మాట. నీ మాటా పోయింది - మా ఎద్దూ పోయింది - కథ కంచి కెళ్ళింది. మరి అతను కూడా...

నీకు న్యాయం చెయ్యాలని వొచ్చాను తల్లీ అందుకని అటువేపు కూడా కాస్త చూడు!

అతను నీకు ఈ ఇల్లుయిచ్చాడు. డబ్బిచ్చాడు. నగలిచ్చాడు. జీవితాంతం అవసరమైన సదుపాయాలనిచ్చాడు.

అయితే ఇందులో ఏమయినా అనుగ్రహంతో చేశారా ఆయన? నేను కూడా మరి నన్నునేను త్యాగం చేసుకున్నాను. అతనికి సుఖాన్నిచ్చాను. ఆయన కోసరం ఏం చెయ్యలేదు నేను! ఇంకా నయితే మళ్ళీ ఆయనకి విక్రమ్‌ని కూడా ఇచ్చేశాను...

ఆత్మనింద చేసుకుంటున్న సవిత స్తబ్ధురాలైపోయింది. నేనాయనకి విక్రమ్‌ని ఇచ్చాను- ఆయన నాకు ఇల్లుయిచ్చారు! రూపాయలూ - పైసలూ ఇచ్చారు! నగలిచ్చారు! ఆయనివన్నీ ఇచ్చారు, నేను తీసుకున్నాను!

అప్పుడు నేనేమయ్యాను? నేనెవర్ని?

ఆయన బిడ్డకి తల్లిని!

ఆయన బిడ్డకి తల్లిని కావడానికి బదులు... ఈ యిల్లు! గుండ్రటివెండి - బంగారు నాణేలు! రత్నాలు, వజ్రవైఢూర్యాలు పొదిగిన నగలు! మంచి నీళ్ళు తాగి వెంటనే పారిపోయాడు నా విక్రమ్!

ఇవన్నీ తీసుకుని నేను నన్ను నే నేమని నిర్ధారించుకున్నాను? పులిన్ నాభర్త అనుకున్నాను. ఆయనభార్యనై ధన్యురాల్ని అయ్యాను అనుకున్నాను. ఆయన బిడ్డకి తల్లినయే సమయంలో నా ఆనందాని కంతులేదు. నా దగ్గిరవున్నదేదో, నాది అనుకోదగ్గదేదో దాన్నంతా ప్రేమ పూర్వకంగా సమర్పించుకుంటూ కూడా నన్ను నేను కృతార్థురాల్ని అను కున్నాను. ఇంతవరకన్నా మనః పూర్వకంగా ఒప్పుకో పిచ్చిదానా. ఇది నువ్వు నవ్వుతూ అర్పించానని ఒప్పుకో. మళ్ళీ ఇప్పుడు నువ్వతన్ని కోరుతున్నావు ఇంతా జరిగాక కూడా అతనే నీస్వామి. ఈరోజు, ఇప్పుడు సైతం, అతనుఅంటే... విక్రమ్! మరో విక్రమ్!

ఏప్రేరణతో సవిత తలెత్తిందో తెలియదు. విచిత్రమైననిషా ఆవరించింది. ప్రపంచం మొత్తం విషనాగులు విషపు కోరలతో మనసుని కొరుక్కుని తింటోంటే మనసులో తిష్ఠ వేసుక్కూర్చున్న ఆ రెండో సవిత చివాట్లు కూడా ఈ సవితముందు వ్యర్థమయ్యాయి. రెండవ ఆమె బజారులో కూచుంటే నువ్వు గృహయజమానురాలివై ఇంట్లో కూర్చున్నావు. వహ్వా, ఏం దొంగ నాటకం! ఏం కపటం! పాపీ! కడుపు నిండకపోతే దాన్ని చీల్చివడేయ్. పైగా పైనించి దయాభిక్ష కోరడానికి బయలుదేరింది! సిగ్గూ - లజ్జా లేని

దానా, మానాభిమానాలు లేని దానా, నాటకాల దానా! పులిన్‌ని అప్రతిష్ఠ పాలు చేసి...

లేదు, నేనాయన్ని అప్రతిష్ఠపాలు జెయ్యడానికేమీ ప్రయత్నించలేదు. ఎవరి దయాదాక్షిణ్యాలమీదా బతకడం నాకిష్టం లేదు. ఇంకా నా కాళ్ళూ - చేతులూ ఆడుతున్నాయి. ఆడని రోజున ఈ జీవితాన్నంతం చేసుకుంటాను. నన్నాపే వాడెవడూ?... అయితే నిన్నాపేవాడు కావాలా? లేదు, లేదు. నిన్నెవడూ అలా ఆపాలను కోడు, ఎందుకు నీ ఆత్మహత్యా సమయంలో నీ చిత్రం గియ్యడానికా!

సవితా...

సవిత ఈ లోకంలో కొచ్చింది. అప్పుడామె చిన్నపెట్టెలో నగలు నింపుతోంది. అన్ని నగలూ పెట్టిన తర్వాత ఏ చెక్‌బుక్‌లో మొదటి బ్లాంక్ చెక్‌మీద అతను సంతకం కూడా పెట్టి ఇచ్చాడో దాన్ని కూడా అందులోనే పెట్టింది. కట్టుబట్టలతో ఆమె ఆ యింటినించి బయల్దేరింది. ఇంటికి తాళం వేసి దాని తాళం చెవిని కూడా ఆ పెట్టెలోనే ఉంచి, పెట్టె తీసుకుని రెండో ఇంటివైపు నడిచింది... ఏ ఇంటినీ, రొక్కాన్నీ తీసుకుని ఆమె స్వయంగా తనని తనే హీనురాలిగా, మంచీ - మర్యాదా లేని బజారుదానిగా తయారు చేసే బేరం కుదుర్చుకుందో ఆ ఇంటినీ, రొక్కాన్నీ వెనక్కి తిరిగిచ్చెయ్యడానికి ఆమె మెట్లు దిగి వేగంగా నడిచిపోయింది...

పెదిమల్లోంచి మాటలు వెలువడ్డాయి -

''కానీ నన్నిలా తిరస్కరించేవారు...''

మాటలక్కడే ఆగిపోయాయి.

రెండో సవిత గుచ్చుకునేట్టుగాజవాబిచ్చింది - ''దయాభిక్ష వేడుకుంటున్నావా? అమాయకురాలా, నిస్సహాయురాలా, నిరాశ్రయురాలా, అసహాయురాలివైకూడా జీవిస్తావా? నీ ముఖం చూపించకు! పైనించి స్వాభిమానం అంటూ కబుర్లు చెబుతావ్!''

సవిత ఉలిక్కిపడింది. తనని తనే మరుగుపర్చుకో చూస్తున్నట్టుగా రెండు చేతుల్లో మొహం దాచేసుకుంది. పెల్లుబికి వస్తున్న కన్నీళ్ళని వెనక్కి నెట్టెయ్యాలని ప్రయత్నించింది గానీ అవి బయటికి వచ్చేశాయి. ఆమె చూసుకోలేదు. కానీ అరచేతులు తడిసినప్పుడు తెలుసుకుంది తన కళ్ళల్లో నీళ్ళు కారుతున్నాయని మనసు కింకర్తవ్యతా విమూఢమైంది. బుద్ధి గడ్డ కట్టి హిమాచలమైంది. తట్టటం లేదు, ఏమీ తట్టడం లేదు.

పూర్తిగా యాంత్రికంగా ఆమె చిటికెన వేలితో అశ్రుబిందువుల్ని

తుడుచుకుంది. తనని తను అదుపులో పెట్టుకోవాలని ఒక అశ్రువుని బొటన వేలి సహాయం అందకుండా దూరంగా చిందగొట్టింది. ఆరుతున్న అశ్రువుల్ని కన్నీళ్ళు కారుతున్న కళ్ళతో చూస్తూండిపోయింది. ఒక కన్నీటి బొట్టు! మళ్ళీ మరింత కన్నీటి అజస్రధార... ఏం కన్నీళ్ళకూ్కడా ఏ స్వాభిమానమూ ఉండదా?

సవితకేం పాలుపోలేదు. తనలోపల సాగుతున్న ఈ తీవ్ర యుద్ధాన్నామె తటస్థురాలైన ప్రేక్షకురాల్లా చూస్తోంది. ఎవరూ కూడా ఆమె చెప్పు చేతుల్లో లేరు. ఆమె వాస్తవానికి తనే అసహాయురాలైపోయింది. మనసుమీద అధికారం పోయింది - చైతన్యం, జ్ఞాపకం, పోయాయి, పూర్తిగా కుంటిదీ, అశక్తురాలూ, ఎవరేనా ఇతరుల ద్వారా గడుపుకోవలసినదీ అయిపోయింది. ఆమె తనే చిట్లుతూ విరిగిపోతోంది, క్షణక్షణం చెల్లా చెదురైపోతోంది...

ఎలాగైతేనేం స్పృహలోకొచ్చింది, ఇంతలో రేగిన ఆ గాయం...

నేను విక్రమ్ తల్లినయ్యాను. నేను ఈ ఇల్లు తీసేసుకున్నాను. అడిగి తీసుకున్నాను. రూపాయలూ - పైసలూ, నగలు, తల్లీ, నువ్వయితే శోధన చేశావు. నువ్వే నీకు వెలకట్టి తీసుకున్నావు.

# 8. శబ్దాలు - కాంతులు

**జయంత్ ఖత్రీ**

జయంత్ ఖత్రీ (క్రీ.శ. 1909 - 1968) జననం కచ్ఛ్ లో. బొంబాయిలో విద్యాభ్యాసం చేసి డాక్టరయ్యారు. చిత్రలేఖనంలో అభిరుచి వుండేది! 'ఫోరాం', 'బహేతాం ఝురణాం', 'ఖరా బపోర్' వీరి కథా సంపుటాలు.

★ ★ ★

ఆఖరికి చెప్పులేసుకుంటూ అతను నిశ్చయించుకున్నాడు. బయట పడ్డాడు. గది ద్వారం దాటుతూండగా ఏదో అవుతుందని అనిపించిందతనికి. కానీ ఏమీ కాలేదు. తెరిచివున్న తలుపులలాగే ఉండిపోయాయి. మెట్లమీది కొచ్చి అతను వెనక్కి తిరిగి చూశాడు. అతని ముఖం వికృతంగా అయింది. అతను మెట్లు దిగాడు.

బయటి పెద్ద ద్వారం ముందుకి చేరి అతను దీర్ఘంగా శ్వాస పీల్చుకుని మామూలుగా అయిపోయాడు. ద్వారానికి వెలుపల ఒక పాత మంచం మీద కూచున్న పఠాన్ దృష్టినించి తప్పించుకుని అతను ముందుకి సాగాడు.

సందు కాస్త పొడుగ్గా వుంది. రెడు వేపులా ఎత్తుగా, మురికిగా, రోగ గ్రస్తంగా, ఎముకల గూడుల్లా పెద్ద పెద్ద ఇళ్ళు వరుసగా వుండి ఒక దాని కొకటి ఊపిరాడకుండా చేస్తున్నట్టున్నాయి. ఈ ఇళ్ళ కిటికీల్ని ఢీకొనే గాల్లో గాలి నెగరగొట్టే శక్తి లేదు. ఈ కిటికీల గుండా చిన్న చిన్న కొట్లలో కాంతిని వెదజల్లే ఎండలో వేడి ఉండదు. పగటి వేళచెమ్మ, మురికి, రాత్రివేళలో నల్లులు, దోమలు ఇంకా ఎప్పుడు చూసినా జబ్బుతో వుండే తనువుకీ - మనసుకీ మధ్య ఉంటూ ఈ ఇళ్ళలో నివసించే వాళ్ళ జీవితం ఖాతరు లేకుండా ముందుకి సాగిపోతోంది. జీవితమైతే ఉంది - అయితే జీవనానికి గుర్తుగా కేవలం గమనం ఉంది, గమనానికి గుర్తుగా శబ్దాలున్నాయి.

ఎలాంటి శబ్దాలు?

ఈ సందులో రాత్రయినా సరే పగలైనా సరే - సాయంకాలమైనా సరే, బాగా పొద్దుపోయిన రాత్రయినా సరే- పొద్దున్నయినా సరే అన్ని వేళలా ఎక్కడో అక్కడ ఏదో గ్రామఫోన్ మోగుతూనే వుంటుంది. ఏదో ఒక కలహం

ఉంటూనే వుంటుంది. ఎక్కడోఅక్కడ పిల్లలేడుస్తూనేవుంటారు. పిల్లలూరుకుంటే తల్లులేడుస్తూంటారు. తల్లులూ, పిల్లలూ నిద్రపోతే తండ్రులు నిద్రలో బడబడమని గుర్రు పెడుతూంటారు... రాతి పలకల మీద ఇరవైనాలుగు గంటలూ పంపులోంచి నీళ్ళుకారుతూంటాయి. అర్ధరాత్రప్పుడు కూడా మాసిన బట్టలు బాది బాది ఉతకటం జరుగుతుంది. గిన్నెలు ధన ధనామని చప్పుడు చేస్తూంటాయి. ఎప్పుడైనా నిశ్శబ్దంగా వుంటే జఁయ్‌మని దోమల మోత, బల్లుల అరుపులు, ఎలకల చూ-చూంలతో పాటు నిట్టూర్పులు, బాధతో ఫీత్కారాలు చెవులు మూసుకున్నా వినిపిస్తాయి.

కానీ ఈ రోజు అతనికి ఈ శబ్దాల ప్రపంచమంటే అసహ్యమేస్తోంది. అతను తన నడక వేగాన్ని పెంచాడు. సందు చివరికి చేరి వెనక్కి చూశాడు. ఇళ్ళ కిటికీలన్నీ జంకులేని దృష్టితో రెప్ప వాల్చకుండా అతని వేపు చూస్తున్నాయి. ఆ దృష్టినించి తప్పించుకోవడానికి అతను నెమ్మది నెమ్మదిగా పరుగెత్తసాగాడు. బయటపెద్ద రోడ్డు మీద మెరుస్తున్న కాంతి అతనికి స్వాగతమిచ్చింది.

అతని ధోవతి కుచ్చిళ్ళలో గాలి దూరుతోంది. చక్కగా దువ్వుకున్న అతని తల వెంట్రుకలతో గాలి ఆడుకుంటోంది. హాఫ్ కోట్‌కి రెండు వేపులా వున్న జేబుల్లో చేతులు పెట్టుకున్నాడు. అతనిదుర్బల శరీరపు ఛాతీ ఉల్లాసంతో ముందుకిపొంగుకొచ్చింది. అతను తల పైకెత్తుకు అడుగులేస్తున్నాడు.

అతను సమానగతిలో నెమ్మది నెమ్మదిగా నడుస్తున్నాడు. ఎక్కడికెడుతున్నాడో అతనికే తెలియదు. అతనింక శబ్దాల ప్రపంచంలోంచి వెలుగులు నిండిన ప్రపంచంలో కొచ్చేశాడు. బయటికొస్తూనే వెలుతురు నిషా అతని నరనరానా నిండిపోయింది.

కాసేపటి తర్వాత అతను తన అస్తిత్వాన్ని మర్చి పోయాడు. తన చుట్టుపక్కల, పైనా కిందా గడబిడగా వున్న జీవితాగ్నిలో అతని ధ్యాస లుప్తమైపోయింది. అటూ ఇటూ తల ఊపుకుంటూ నడుస్తున్నాడు.

బయటి వెలుతురు అతనిలోని అంధకారాన్ని కాసేపు పటాపంచలు చేసింది. బయటి ప్రపంచమ్మీద మెరుపుని పెంచుతూ కల్పనకూడా క్షీణిస్తున్నట్టుగా వుంది. మానవత్వంతో ఆరాటపడే భావనలు, విసుగెత్తే భావనలూకూడా సమాధిఅయ్యాయి. వెలుతుర్లకి వశీభూతుడై అతను పశువులాగా అయిపోయాడు. జేబుల్లోంచి అతని చేతులు బయటికి రావటంలేదు. ధోవతీ కుచ్చిళ్ళలోనూ, తల వెంట్రుకలలోనూ గాలీ, వెలుతురూ దూరి రెండూ కలిసి ఆడుకుంటున్నాయి. అతను వెలుతురు

తాలూకు ఒక బిందువునించి మరో బిందువు మీదకి దృష్టిని సారిస్తూ నడుస్తున్నాడు.

కాంతులు తాలూకు చిత్రవిచిత్ర ప్రపంచం విస్తరిస్తోంది. మిలమిల మెరిసే అసంఖ్యాకమైన వెలుగుల కింద కూడా భేల్‌పూరీ వాళ్ళు పెద్ద పళ్ళేల మీద కిరసనాయిలు దీపాలు రెపరెపలాడుతున్నాయి. ఇరానీ హోటల్లో డజనున్నర దీపాలకాంతిలో ఎవరో హోటల్‌కుర్రాడి వీపుమీద కాలితో తంతూ అంటున్నాడు - ''చూడనక్కర్లా? పంది ముండా కొడకా!''

కాస్త దూరంలో కళ్ళు మిరుమిట్లు గొలిపే రెండు పెద్ద పెద్ద కాంతి నయనాల్ని తెరుచుకుని వస్తున్న మోటారు కారుకి 'డబల్ బ్రేక్', పడింది. ఒక అంధుడైన ముష్టివాడు రోడ్డు దాటుతున్నాడు.

అతను నడుస్తూనే వున్నాడు.

కొంత దూరం పోతే అక్కడ కుడి పక్కన, గుల్‌మొహర్ చెట్ల గుబుర్లలో ఒక మలిగిపోయిన మునిసిపాలిటీ లాంతరుంది. ఆ చీకట్లో వికారంగా వున్న ఒక స్త్రీ అందగత్తెలాగా హొయలు పోతూ నిలబడివుంది. చీకటి కారణంగా ఆమె ఈ కపటనాటకం సఫలమైనట్టే వుంది. చివరికి ఎవరో కోరివచ్చి ఆమె చెయ్యి పట్టుకున్నాడు. ఇది చూసి కొంచెం దూరంలో నిలబడ్డ గుర్రబ్బండి వాడు గుర్రాన్ని ఇటువేపు మరల్చాడు. గుర్రం సకిలించింది, కోరి వచ్చినవాడు గొంతు సవరించుకున్నాడు, ఆ స్త్రీ తన కులుకు చూపించింది.

అతని నడక వేగం కొంచెం తగ్గింది. అతని పెదవుల మీదికి ఒక వెకిలి నవ్వు వచ్చి కూర్చుంది. గుల్‌మొహర్ గుబుర్లలోని అదే లాంతరు స్తంభాని కానుకుని నిలబడి అతను సిగరెట్‌వెలిగించాడు. అతని కళ్ళముందు వెలుగుతున్న అగ్గిపుల్లవెనుక సర్వం కొంచెంసేపు అంధకారంలో లుప్తమైపోయింది. అతను ఎంతో షోగ్గా అగ్గిపుల్ల ఆర్పేసి వెనక్కి విసిరేశాడు. పశువు వంటి అతని మనసులో కోరికొకటి ఉత్పన్నమైంది. అతను నవ్వుకున్నాడు. ఆ నవ్వులోని హాస్యం పశుత్వం నిండిన హాస్యంలా విశృంఖలంగానూ, వికృతంగానూ బయటపడింది.

దగ్గరలోవున్న సందులో జొరబడేముందు అతను కిళ్ళీ వేసుకుని పెదవుల్ని ఎరుపు రంగుకి - మనసు రంగు పులుముకుంది ఒక ఆరిపోయిన దీపం తాలూకు కల్పనలో!

ఆ సందులో కాంతులు భయంకరంగా వున్నాయి- భయంకరంగా వున్నాయి. ఈ విషయం అతనికి తెలుసు. అయినా కూడా అతని కాలు ఆగలేదు. ఎత్తయిన ఇళ్ళు ప్రకాశవంతంగా వున్నాయి. ఒక్కొక్క కిటికీ మీద

ఎరుపు, నీలం, పసుపు రంగుల లైట్లు వివిధ వర్ణాల రకరకాల షేడ్స్‌తో వేలాడదీయబడి దేదీప్యమానంగా వున్నాయి. ఈ సందులో ప్రపంచానికి రాత్రి వెలుగులతో తప్ప మరి దేనితోనూ నిమిత్తం లేదు - మరో వస్తువు దేనికీ ఏ విధమైన విలువా లేదు. ప్రతి కిటికీలోనూ నగ్నంగా కనబడటానికగ్గానూ వస్త్రాలు ధరించి, వెలుగు పువ్వులవడానిగ్గానూ వెలుగుల్ని దోచుకుంటున్న స్త్రీలున్నారు.

ఇక్కడ విద్యుద్దీపాల వెలుగులో మాత్రమే కళ్ళు విప్పారుతాయి. ఆ వెలుగారి పోగానే కళ్ళు కూడా మూసుకుపోతాయి - అప్పుడు ఈ సందు వెలుపల సూర్యుడుదయిస్తాడు.

అతని చూపు పరుగిడసాగింది. నగరానికి ఈ మూల ఇంతమంది సుందరీమణులున్నారా? వాళ్ళు 'సుందరీ మణులే', ఒక్కొక్క కిటికీలో నలుగురు నలుగురు. ఒకామెకి జడ, ఒకామె నోట్లో సిగరెట్, మరొకామె కిళ్ళీ నములుతోంది - కానీ అందరూ రంగుల బొమ్మలు. వీళ్ళు ఇతరుల డబ్బుతో...

హఠాత్తుగా అతనెవర్నో ఢీ కొట్టాడు.

''కళ్ళు కనబడటం లేదా?''

మరొకళ్ళ నెవర్నో ఢీ కొట్టబోయి తప్పించుకునే ప్రయత్నంలో అతని కాలు ఒక కుక్కతోకమీద పడింది. కుయ్ కుయ్‌మని అది బిగ్గరగా రోదిస్తోంటే, దాన్నించి ధ్యానం తప్పించబోగా వెండిగాజుల చెయ్యొకటి భిక్షనర్థిస్తూ అతని ముందుకి చాపబడింది. అతను తన నడకవేగాన్ని పెంచాలనుకున్నాడు. ఐతే ఇక్కడ శబ్దాలూ, కాంతులూ రెండిటిలోనూ అసమాన వేగం వుంది. ఇక ఈ వేగాన్నెదుర్కొనే శక్తి అతనిలో లేకపోయింది. అతను కాళ్ళీడ్చుకుంటూ నడవసాగాడు.

అతని నుదుట చెమట పట్టింది. ఫుట్ పాత్ మీద ప్రత్యేకించి గుంపేమీ లేదు. కానీ ఇక్కడ ఎవరికిష్టం వచ్చిన రీతిలో వాళ్ళు వెడుతున్నారు. ఎవరూ కూడా పక్కకి తప్పుకుని మరొకరికి దారివ్వటంలేదు. అతని దృష్టి మొదటి అంతస్తునించి నాలుగో అంతస్తు వరకూ పాకిపోతూ - దిగిపోతూ వుంది.

ఎవరో అతన్ని భుజంతో ఢీకొట్టి పోయారు. అతను వెనక్కి తిరిగి చూస్తే ఒక 'సుందరి' బస్‌స్టాప్ స్తంబాని కానుకుని నిలబడి చూస్తూ వయ్యారంగా నవ్వుతోంది. అతని ముఖం మీదికి నవ్వొచ్చింది, వెళ్ళాడు. ముందుకి సాగుతూ సాగుతూ అతను తన ఆలోచనని మార్చుకున్నాడు. వెనక్కి తిరిగాడు. కానీ ఎదురుగా ఫుట్‌పాత్‌ని చుట్టుముట్టి ఒకర్నొకరు ఆసరా చేసుకుంటూ నడిచి వస్తున్న ముగ్గురు ఎర్రటోపీవాళ్ళని చూసేసరికి

జేబుల్లో అతని పిడికిళ్ళు బిగుసుకు పోయాయి. అతను నిలబడిపోయాడు. ఇంతలో ఒక సైకిలో వాలా అతని దగ్గరికొచ్చిదిగి బీడీవెలిగించుకుని శాంతంగా అతనివేపు చూడసాగాడు. మొదటి అంతస్తునించి ఎవరో తుపుక్కుమని కిళ్ళీ నమిలి ఉమ్మేస్తే అదొచ్చి సరీగ్గా అతని దగ్గిర పడింది. అతనికి పైకి చూడాలని కోరిక కలిగింది కానీ ధైర్యం చాల్లేదు. విమూఢుడిలా నిలబడిపోయాడు.

చాలా రాత్రయిపోయింది. సాధారణంగా ఇక్కడి రాత్రి ప్రతి రాత్రిలాగే వుంది. గుల్‌మొహర్ పువ్వుల వంటి ఎర్రని శరీరాలు. సంపెంగ పువ్వుల్లాగా వికసించుకున్న పచ్చని శరీరాలు, కోమల కుసుమాలు, ప్రవహించే ఆకులు... సర్వం అలంకరించుకుని కిటికీలమీద సవారీ అయివున్నాయి.

ఈ సందుకున్న స్వభావమొకటే - శబ్దాలూ, కాంతులూ. జీవితంలో ఏదేనా కొంచెం ఉందంటే అది ఇక్కడే. పాతశబ్దాలు అంతరిస్తాయి, పాతకాంతులు ఆరిపోతాయి. పాతశరీరాలు కొత్తవిగా కనబడేందుకు శ్రమించడంతో కలిగిన అలసటకి విరిగిపోతాయి, వాటి స్థానంలో కోమలంగా వుండే కొత్త శరీరాలొస్తాయి.

ఆ వేగం అతన్నెక్కువసేపు నిలబడనివ్వలేదు. ఎవరోఅతనిమీద ఉమ్మేరు, ఎవరో అతన్ని గెంటారు, ఎవరో అతన్ని కళ్ళెర్ర చేశారు, ఎవరో అతన్ని సైగ చేసి పిలిచారు. అతనికేం తోచలేదు. చిక్కులో పడిపోయాడు. వెలుగుల నిషా అతని సరసరాన్నీ బలంగా వశపరుచుకుంది.

అతనికి నరాలు లాగసాగాయి. అతను పళ్ళు కొరుక్కున్నాడు. అతని మెదడులోకి రక్తం ఎగజిమ్మింది. అతని కళ్ళు పగిలిపోతున్నాయి.

ఎలెక్ట్రిక్ షాక్ మాదిరిగా అతనికో ఆలోచనొచ్చింది. అతని శరీరం అంత వేగంగానూ సచేతన మైంది. అతను వీపు తిప్పి దడదడా ఎదురుగా వున్న ఇంటి మెట్లు ఎక్కేశాడు. మొదటి అంతస్తులో మొదటి గది ద్వారం దగ్గిర రొప్పుతూ నిలబడ్డాడు. తన రాకకెవరో ఎదురుచూస్తున్నట్టుగా హఠాత్తుగా ద్వారానికున్న తెర తొలగింది. అతనిప్పటికీ ఊపిరి తీసుకోలేకపోయాడు. ఎందుకంటే ఒక కోమల హస్తం అతన్ని భుజం పట్టి లోపలికి లాగింది. ఆమొదటిగదిలో ముగ్గురు సుందరీమణులు అతన్ని చూసి నవ్వారు కానీ వాళ్ళ ఆ ప్రయోగం నిష్ఫలమే అయింది. ఆ చెయ్యి అతన్ని రెండో గదిలోకి లాక్కెళ్ళింది.

ఆ స్త్రీ అతని కోటు తీసేసింది, టోపీ తీసేసింది. అతన్ని మంచం మీద పడుకోబెట్టింది. ఇలా ప్రారంభమైంది - ''సరే, ఎన్ని పైసలు తెచ్చావు?''

బయట గోల ప్రారంభమైంది. ఎక్కడో ఒక పాత గడియారం కీ అయిపోవడం చేత 'టడక్-టడక్' శబ్దంతోపాటు విసుగు చెందిన తీరులో నడుస్తోంది. రాత్రి ఎప్పట్లాగే గడిచిపోతోంది.

కొన్ని ప్రశ్నలూ - జవాబులూ అయినాయి. అతను చాలా తక్కువ మాట్లాడాడు కాని మంచం మీద అలాగే పడున్నాడు. కాలం గడుస్తోంది. ఆ పౌడరూ, వాసన అతనికి నచ్చలేదు. ఆ స్త్రీ శరీరం అతనికి తగిలితే అది బలమైన తోపులాగా అనిపించింది. పోయిన ఆలోచనలు మళ్ళీ తిరిగొచ్చాయి - భావాల వెల్లువ పొంగినట్లయింది. కొత్త భావాలతో పాటు గడిచిన స్మృతులు కూడా దూసుకొచ్చాయి. అతని మనసుకి దుఃఖం కలిగింది. అతన్నుంచి ఒక సుదీర్ఘ నిశ్వాస వెలువడింది.

అతను లేచి నిలబడ్డాడు.

''వెళ్ళి పోతున్నావా?''

''ఆఁ''

''ఏం?''

అతను జవాబివ్వలేదు.

ఆమెమాట్లాడింది- ''అయితే మరి దేనికొచ్చినట్టూ? పైసలెందు కిచ్చినట్టూ?''

అవును, నిజమే - ఎందుకు? కానీ అతనికే తెలీదు ఇది కూడా. అతను చాలా అలిసియాడు. అతని హృదయం మీద సమ్మెటతో 'ధాడ్ - ధాడ్' మని బాదుతున్నట్టుంది. పైసలు పోతే పోయాయి. అతని కళ్ళు ఈ సమయంలో ఏడవాలని కోరుకుంటున్నాయి. కానీ అది ఏడవడానికి చోటు కాదు. కన్నీళ్ళని అతనలాగే ఆపేశాడు.

అతని చేతులు విచిత్రరీతిలో అతని టోపీతో ఆడుకుంటున్నాయి.

''బహుశా మీకుఒంట్లోబాగులేదనుకుంటాను. మంచినీళ్ళు తెచ్చి వ్వనా?''

మంచినీళ్ళు తాగాక కూడా అతనికి స్వస్థత చేకూరలేదు. ఆ స్త్రీ అతన్ని చెయ్యి పట్టుకుని కుర్చీలో కూర్చోబెట్టింది.

''మీరేం పని చేస్తూంటారు?''

అతను జవాబివ్వలేదు.

''మీకు భార్యా బిడ్డలున్నారా?''

అతని మొహంలో కొచ్చిన నవ్వు ఎగిరిపోయింది. అతను బిగుసుకు పోయాడు. ఆ స్త్రీ వేపు చూస్తూ చూస్తూండగా అతని కళ్ళలో శూన్యం నిండింది, అతని నోరు తెరుచుకు నుండిపోయింది. అంధకారం యొక్క

ఒక్క మేఘం అతని కళ్ళ ముందునించి కదలి పోయింది.

''ఉన్నారు.'' అతను నెమ్మదిగాచెప్పాడు - ''అందరూ చనిపోయారు.''

''అరె-రె-రె... ఆమె చాలా అందంగా ఉండేవారా?''

''ఆఁ, చాలా అందంగా ఉండేది. నాకు పద్దెనిమిదేళ్ళూ, ఆమెకి పదిహేనేళ్ళూ ఉండగా మా పెళ్ళయింది. ఇంకా... ఇంకా...''

''ఏవిఁటి?''

''ఏం లేదు,''

''ఆమె మిమ్మల్ని ప్రేమించేదా?''

అతను స్నేహపూర్వకంగా ఆ స్త్రీవేపు చూశాడు. తియ్యటి నవ్వు నవ్వాడు. తలమీద నించి టోపీ తీసి, దాని అంచు మీద వేళ్ళు తిప్పుతూ నిమరసాగాడు.

''ఎంతో మంచి ఇల్లాలైవుంటుంది.''

ఆ శ్రుతిమించిన గోలలోకూడా ఇద్దరి మధ్యా నిశ్శబ్దం అలుముకుంది.

''మీరు రెండో పెళ్ళి చేసుకోలేదా?''

అతనికి మరో ఆఘాతం తగిలింది. ఆ స్త్రీ ముందు అతను చూపులు వాల్చి కిందికి చూశాడు. టోపీ తలమీద పెట్టుకుని జేబులోంచి రుమాలు తీశాడు.

''ఎందుకు చేసుకోలేదు? ఇంకా మీరు యువకులేగా!''

ఆ స్త్రీ వీపు అతనివేపుకి తిప్పి నిలబడి అంది - ''నన్ను పెళ్ళి చేసుకుంటారా?'' అంటూ అంటూ ఆమె ఒక్కూపుతో వెనక్కి తిరిగి నవ్వింది. ఆమె కేవలం తమాషాకి అడిగింది. ఆ ముఖంలోని ధ్వనులూ, వెలుగులూ నవ్వుతున్నాయి. అయినా కూడా ఆ నవ్వు ఆమె 'మేకప్'తో సరిపోవటం లేదు. అతనికి ఈ పరిహాసం నచ్చలేదు. అతను లేచి వెడుతున్నాడు.

ఆస్త్రీ వెనుకనించి చెప్పింది- ''మీరు పైసలు వసూలు చేసుకోలేదు.''

ద్వారం దగ్గిరకొచ్చి అతను వెనక్కి చూశాడు. అతనికి సంతాపం కలగసాగింది. కళ్ళు తిరిగాయి.

కోరుకోకపోయినప్పటికీ అతని ముఖంలోకి మరోభావమేదో వొచ్చింది. ఆ అపకీర్తి గల స్త్రీ మీద వొచ్చిన కోపాన్నతను దాచుకో లేకపోయాడు. అతని పెదవులు బిగుసుకున్నాయి. అతనికళ్ళనించి నిప్పు రవ్వలు దూసుకొస్తున్నాయి.

''మళ్ళీ ఎప్పుడొస్తావు?'' కి జవాబివ్వకుండా అతను మెట్లు

దిగిపోయాడు, కింది ధ్వనులూ, వెలుగుల ప్రవాహంలో ప్రవహించసాగాడు.

''ఈ సమయంలో అతని చూపు దేని మీదా లేదు. ఈ కాంతులు అతని మనసుని ఆర్పేశాయి. అతనిచెవులలో ఆసందులోధ్వనులు ప్రతిధ్వనిస్తున్నాయి.

కాంతులు నిండిన రోడ్డు దాటినాక సందులో దూరే అతను ముక్తి పొందినట్టు నిట్టూర్చాడు. తన నడకవేగాన్ని తగ్గించాడు. ఎక్కడో ఏదో దీపం వెలుగుతోంది. ఎక్కణ్ణించో శబ్దాలు వినవస్తున్నాయి. అలసిపోయిన అతని శరీరంలో ఒక శీతల కెరటం పరుగుతీసింది.

శబ్దాలతన్ని ఆక్రమించాయి.

''మీకు భార్యాబిడ్డలున్నారా?''

''అందురూ చనిపోయారు.''

అతనింక ఆగలేకపోయాడు. కళ్ళలో నీళ్ళని రానిచ్చాడు. వెక్కి వెక్కి ఏడ్చాడు. మనసులో అనుకున్నాడు - ''ఇప్పటికవరకూ అందరూ చనిపోయారు.''

ఏమీ చప్పుడు చెయ్యకుండా అతను పెద్దద్వారాన్ని దాటిపోయాడు. రెండేసి మెట్లెక్కుతూ అతను నాలుగో అంతస్తు చేరాడు. కాస్త సంకోచిస్తూ మెట్ల మీద నిలబడిపోయాడు. ఎదురుగా అతని గది ద్వారం, తలుపులలాగే తెరిచి వున్నాయి.

అతను తల వంచేసుకున్నాడు. ఇక్కడ నిజంగా ఏమీ జరగలేదా ఇదేం ప్రపంచం? అతని చేతిలోంచి ధోవతీ కొస జారిపోయిది.

గదిలో కొచ్చి అతను అటూ ఇటూ చూశాడు. లాంతరు వొత్తిని పెద్దది చెయ్యడం కోసం గాజుల చెయ్యొకటి ముందుకి రావడం అతనికి కనిపించింది. పరుగెత్తుకెళ్ళి అతను ఆ చేతిని పట్టుకుని ప్రేమతో అదిమాడు.

''ఎవరు? మీరా?''

''అవును. అలా వుండనీ, నాకు వెలుతురు వద్దు. అరె బాప్‌రే! నీ చెయ్యి ఎంత వేడిగా వుంది. మళ్ళీ జ్వరమొచ్చిందా?''

జవాబుగా సన్నగా ఏడుస్తున్న ధ్వని వినిపించింది. అతని పంజాలోనించి ఆ బలహీనమైన చెయ్యి గాజుల్ని గలగలలాడిస్తూ వేరైంది. మరో మూల ఎవరో విపరీతంగా దగ్గారు. ఒక పిల్లవాడు ఏడుస్తున్నాడు-''అమ్మా''

గాజులు తిరిగి గల్లుమన్నాయి. అంచుల మీద ఎలకలు ఉరుకులూ పరుగులూ పెడుతూ గాజాకప్పుని నేలమీద పడేశాయి. పాలవాడు తలుపు తట్టాడు.

అతను మంచంమీద పడుకుని తలమీదవెంట్రుకలు పీక్కుంటున్నాడు. మళ్ళీ అదే శబ్దాల ప్రపంచం!

# 9. పునర్వివాహం

స్నేహరశ్మి

ఝీణాబాయీ రతన జీ దేశాయి (జననం క్రీ.శ. 1903) జన్మస్థానం చిఖలీ. ప్రాథమిక విద్యాభ్యాసం అక్కడే. రాష్ట్రప్రేమతో ప్రేరితులై గుజరాత్ విద్యాపీఠంలో పట్టభద్రులయ్యారు. వృత్తిరీత్యా అధ్యాపకురాలు. విఖ్యాత ఎడ్యుకేషనలిస్ట్. సత్యాగ్రహం రోజుల్లో జర్నలిజమ్‌లో అనుభవం సంపాదించారు. 'అర్ఘ్య', 'పన్‌ఘట్', 'సోనేరీ చాంధ్', 'రూపేరీ సూరజ్', కావ్య సంపుటాలు. 'తూటేలా తార్', 'గాతా ఆ సోపాలవ్', 'స్వర్గ్ అనె పృథ్వీ', 'హీరానాం లటకణియాం' కథా సంపుటాలు. 'అంతరపట్' నవల. స్వీయ చరిత్ర మొదటి భాగం ప్రచురితమైంది - 'మారీదునియా'

★ ★ ★

మనిషిలో సాంత్వన నిచ్చే క్షమ ఎంత పరిమితంగా వుంటుందీ అనేది అతనికి అనుభవంలోకి రావటం ఇదేమీ మొదటిసారి కాదు. కానీ ఈ అనుభవం ఈ రోజే మొదటిసారిగా కలిగింది, ఎవరో కాలవసిన స్వజనం మృత్యువు కన్నా కూడా వేదనాభరితంగా వుంది.

పక్కమీద నడుంవాల్చి అతను అటూఇటూ పొత్తిగిల్లుతూనే వున్నాడు. కానీ నిద్రని మాత్రం ఏ విధంగానూ ప్రసన్నం చేసుకోలేక పోయాడు. గదిలో చీకటి అతని వేదనని మరింత పెంచసాగింది. అతను మంచం కిందవుంచే లాంతర్ని వెలిగించాడు. గదిలో వెలుగొచ్చింది, కానీ అతని మనసులోని అంధకారం ఇంకా అగాధమైపోయింది. అతను నశ్యం డబ్బీ తీసి చిటికెడు తీసుకున్నాడు, కానీ చిటికెడూ ఎలా వున్న దలాగే వుండిపోయింది. అతను కిటికీలోంచి బయటికి చూడసాగాడు.

తలుపు తెరిచి బయట అరుగుమీద కొచ్చాడు వాడంతా నిద్ర పోతోంది. చీకటి రాత్రి ఎంత నీరసంగా నిస్తబ్ధంగా వుందంటే తన అఖండ వైభవంతోటి ఎవరికోసమో ప్రతీక్షిస్తోందా అన్నట్టుంది.

అరుగుమీద కొంచెంసేపు అతనలాగే తిరుగుతూ వుండిపోయాడు. నశ్యం డబ్బీ అతని చేతిలోనే వుంది. డబ్బీ ఖాళీ అయిపోయింది - అతని

మనస్థితీ అలాగే వుంది, ఎవరో అతని శరీరం మీది చర్మాన్ని ఒలిచేస్తున్నట్టు ఇంట్లో వున్న ఒక్కొక్క వస్తువుతోనూ అతని కూతురు మనోరమ స్మృతి సంబంధమై వుంది. మనోరమ ఉన్నప్పుడు అతని నశ్యం డబ్బా ఎన్నడూ ఖాళీగా వుండేది కాదు. ఉతకడానికి అతని బట్టలు మరెవరికీ ఇచ్చేది కాదు. అతని కెప్పుడు దాహమయ్యేదీ, ఎప్పుడు బయటికి వెళ్ళాలని మనసయ్యేదీ, ఏం తినాలని కోరుకుంటాడో - అతని మనసులోని ఈ విషయాలన్నీ ముఖం చూసి అవగాహన చేసుకునే మనోరమ వుండగా అతని జీవితం ఎంత లోటు లేకుండా వుండేది!

మరి సవిత! 'నామను' లేకుండా ఒక్కక్షణం కూడా బతక లేకపోయేది, రోజులో ఒకసారి కాదు అనేకసార్లు అడిగేది - నేను దీనికి తల్లినా లేక బిడ్డనా అని. సవిత జీవితంలో మనోరమదెంత మహత్తరమైన స్థానం! ఆమె తల్లికా కూతురు లేక తండ్రికా? ఈ ప్రశ్న ఇవాళ మొదటిసారి పెద్ద ఆఘాతంలో అతని మనసులో తలెత్తింది. అతను స్వయంకృతం చేతనే ఇంతగా చితికిపోతే అందులో ఆశ్చర్యమేముంది, సవిత, పాపం విషం పొట్లంలోనే, ముక్తి అని ఎందుకను కుంటుంది? అరే, మనోరమ చేతిమేతకి అలవాటు పడిన ఎద్దులు ఇవాళ మేత ఉన్నతట్టని వాసన చూసి ఒదిలేశాయి. జంతువుల్లో కూడా ఇంత గ్రహింపు వుంటుందా?

నశ్యం డబ్బీ తెరిచి చిటికెడు తీసుకోవడానికి అతను అనవసరం గానే యాంత్రికంగా అందులో వేళ్ళు పెడుతున్నాడు - అతనికి గుర్తు కూడా లేదు ఖాళీ డబ్బీనే ప్రయత్నపూర్వకంగా వాసన చూస్తున్నాడని! మనిషెంత పరాధీనుడు!

రాత్రి నీరవత అతనికి అసహ్యం కాజొచ్చింది. అతను సవిత గదివేపు వెళ్ళాడు. గదిలో చీకటి, సవిత మేలుకుంటుందేమో, ఈ భయంతో అతను మందగమనంతో గదిలో ప్రవేశించాడు.

''నువ్వేనా?'' చీకట్లో సవితవొణుకు తున్నట్టున్న స్వరంవినవచ్చింది.

''అవును, నువ్వు నిద్రోపోయావో లేదో చూసి పోదామని'' చెబుతూ అతను మనోరమ మంచమ్మీద కూచున్నాడు. సవితలేచింది. లాంతరు వెలిగించింది. దాని వెలుగులో జగ్జీవన్ చూశాడు సవిత కళ్ళు జలజలా అశ్రువులు స్రవిస్తున్నాయి.

జగ్జీవన్ సవిత మంచమ్మీది కొచ్చి కూచున్నాడు. అపారమైన దయతో అతను ఆమె వీపు మీద చేత్తో రాస్తూ ఆమెని దగ్గిరకు తీసుకున్నాడు. ఎన్నో సంవత్సరాల అంతరం, మధ్యనుంచి తొలగిపోయింది, 'ఆసామీప్యం' ఆ

భార్యా భర్తల జీవితం యొక్క ఒక అతనిగూఢ మర్మభేది కథకి రూప మివ్వసాగింది.

ఈ విధంగానే ఈ భార్యా భర్తలు తమ తల్లిదండ్రుల ద్వారా పడిన పెళ్ళి ముడితో పరస్పరం జతగూడారు, కానీ అది పాతిక సంవత్సరాల క్రితంమాట. అప్పుడు ఇద్దరూ కిశోరావస్థలోవున్నారు. అయినాకూడాఇద్దరి మనసుల్లోనూ ఎంత లోతైన అవగాహన, నిష్ఠ, ప్రేమ తలెత్తాయి ప్రధమ దర్శనంలోనే! వాళ్ళకి మొదటి సంతానం కలిగినప్పుడు వాళ్ళ హృదయాలు ఏ విధంగానాట్యంచేశాయంటే నందనవనమే భూమికి దిగివచ్చిందా అని పించింది. పువ్వు వంటి ఆ బిడ్డ తియ్యని కిలకిలలు ఇంట్లో కాంతిని నింపాయి. ఆ కాంతి రెండు సంవత్సరాల తర్వాత కేవలం తొమ్మిది గంటల అనారోగ్యం అనంతరం ఒక్కసారి లుప్తమైపోయింది. అప్పుడు తనకి తగిలిన ఆఘాతాన్ని మనసులోనే దాచుకుని సవితని ఆ క్లిష్టదశ నించి కాపాడ్డం కోసం జగ్జీవన్ ఎంత తపశ్చర్య చెయ్యాల్సొచ్చిందని!

కూతురు మరణించిన కొద్దిరోజుల తర్వాతి ఆరాత్రే అతనికి గుర్తొచ్చింది. సవిత ఏడ్చేడ్చి స్పృహ తప్పి ప్రాణం లేని కట్టెలా పడుంది. అతను సవిత మనసులో వ్యధని దూరం చెయ్యడానికి అన్ని ప్రయత్నాలూ చేశాడు. చల్లబడిన సవిత శరీరాన్ని తన తనువు, మనసు, హృదయాల ఉష్ణాలతో చైతన్యవంతం చెయ్యడానికి అతను తను చెయ్యగలిగినదంతా చేశాడు. స్నేహం, సానుభూతి, కరుణ నిండిన కళ్ళతో చూస్తూ అతను సవిత పక్క దగ్గిర కూచునున్నాడు - ఇంటి శోకాకుల ఏకాంతంలో తన ప్రాణేశ్వరి వేదనకి మూగ, నిర్నిమేష సాక్షిమాదిరిగా రాత్రి చాలా గడిచింది. ఒక గాఢమైన నిట్టూర్పుతో సవిత మౌనం భగ్నమయింది. జగ్జీవన్ ఆమెని తన ఛాతీకి అదుముకున్నాడు, వెక్కి వెక్కి ఏడుస్తూ ప్రచండమైన తుఫానులో వృ క్షం ఆలంబన కోసం వెతికే లతలాగా ఆమె అతన్ని హత్తుకుపోయింది.

ఉదయమైతే ఈ విధమైన అస్పష్టత పగటి ప్రకాశం కోసరం ఆరాట పడుతుంది. జగ్జీవన్‌తో చూపులు కలవగానే ఆమె కళ్ళు వాలిపోయాయి. ఆయ్యో! ఎంత పని జరిగిపోయింది! అమ్మాయి మరణం. ఇంకా ఇంట్లోనే నాలుగు వేపులా తిరుగుతూ వుంది, మనమేమో ఇప్పుడు చేసిందేవిఁటి? సవిత మనసులోని వ్యాకుల పాటుని శాంతింపజెయ్యడం కోసం జగ్జీవన్ 'అమ్మాయి ఈ ఇల్లువదిలి వెళ్ళడానికి వీల్లేదు, అందుకే భగవంతుడికి ఇదే ఉచితమని పించివుంటుంది' అని నచ్చజెప్పాడు. సవిత ఆలోచనలో పడింది. ఆమె అడిగేసింది - ''వెళ్ళే వాళ్ళే మన్నా వెనక్కి తిరిగివస్తారా?''

''ఎందుకు రారు! అలాగైతే నువ్వూ, నేనూ ఈ జన్మలో మళ్ళీ ఎలా కలుసుకోవడం జరిగింది?''

''క్రితం జన్మలో మనం కలిసే వున్నామని నువ్వు విశ్వసిస్తున్నావా?''

''నాకు పూర్తిగా విశ్వాసం ఉంది మనం రాబోయే జన్మలో కూడా కలిసుంటాం.''

ఇది విని సవిత ఎంతో శ్రద్ధతో, ఎంతో ఆవేశంతోటి అతని ఆలంబన కోసం అన్వేషించింది, అతనిలో ఐక్యమైపోయింది.

జగ్జీవన్ సవితకి ఏం దిలాసా ఇచ్చాడో, అది అబద్ధం కాలేదు. కొద్ది రోజుల్లోనే సవిత శరీరంలో దాని చిహ్నాలు కనిపించసాగాయి. దానితోపాటు ఆమె అమాయకమైన మనసులో, వెళ్ళిపోయిన తన కూతురే తిరిగివచ్చిందన్న ముగ్ధత్వం మూర్తీభవించిన నమ్మకం రూపుదిద్దుకోసాగింది. ప్రసవానంతరం, ఆ నవజాత శిశువు పుత్రిక అని విని ఆమె ఆనందానికి అంతులేకపోయింది. కూతురు చనిపోయిందన్న దుఃఖంలో ఆమెకి నమ్మకం కలగలేదు, కానీ ఇప్పుడు జగ్జీవన్ మాట శతప్రతిశత సత్యమనిపించి, ఇదంతా ఆ పరమేశ్వరుని ప్రేరణ వల్లే జరిగిందనుకుంది. నవజాత శిశువుకి ఆమె 'మనోరమ' అని పేరు పెట్టింది.

మనోరమ నిజంగా ఎంతో ముద్దుగా ఉండేది. ప్రతి ఒక్కరి మనసుని చూరగొంది. ఆమెజన్మతో ఈయువదంపతుల జీవితంలో ఆనందపు నూతన కాంతి వ్యాపించింది. ఆమె వికాసానికి సంబంధించిన ప్రతి ఒక్క విషయం మీదా వాళ్ళు చర్చించుకుంటారు. ఆ చర్చని పునరావృత్తం చేసుకుంటున్నా కూడా అలసిపోరు. మనోరమ నాలుగైదేళ్ళ ప్రాయండైంది, అప్పటి వరకూ ఆమె గుడ్డ బొమ్మకూడాసవిత, జగ్జీవన్, వాళ్ళస్నేహితులు, బంధువులకి చర్చనీయాంశమై పోయింది.

మనోరమ తన గుడ్డ బొమ్మకి 'రేఖ' అని పేరు పెట్టుకుంది, కానీ ఆ రేఖ మీదే ఆమెకి కోపం వస్తే ఆమె దాన్ని 'రేఖలీ' అని కూడా అంటుంది. అప్పుడప్పుడామె దాన్ని భయపెడుతుంది, బెదిరిస్తుంది, చెంపమీద లాగి ఒక్కచెంపకాయకొడుతుంది, మళ్ళీదాన్నీ ముద్దుచేస్తుంది-''నా ప్రియమైన చెల్లీ, గట్టిగా తగిలిందా? మరి నువ్వలాంటి పనులుచేసి నాకు కోపం ఎందుకు తెప్పిస్తావు? ఇంకమీద అలాచెయ్యకూడదూ, ఆఁ! ఏడవకమ్మా, ఊరుకో,'' ఇలా ఆమె రోజులో చాలాసార్లు చేస్తుంది. అప్పుడప్పుడు తన స్నేహితురాళ్ళతో ఆడుకుంటూ - ఆడుకుంటూ వున్నప్పుడు హఠాత్తుగా గుర్తొస్తే- ఆమె అంటుంది- ''రేఖకి ఆకలేస్తూంటుంది. ఏడుస్తూం

టుంది.'' అని గుడ్డబొమ్మని తనగుండెలకిచేర్చుకుని జోకొడుతూన్నట్టు అభినయిస్తూ వస్తే సవిత, జగ్జీవన్ ముగ్ధులైపోయి పరస్పరం చూసుకుని మందహాసం చేస్తారు.

కొన్ని రోజుల తరువాత ఆకాలం రివాజు అనుసరించి బాల్యంలోనే మనోరమ పెళ్ళి ఖాయమైంది, మంచి ముహూర్తం చూసి ఆమె వివాహం జరిగింది. సవితకి తన జీవితం ధన్యమైనట్టనిపించింది, కానీ దాంతో పాటే తన ఒక్కగానొక్క సంతానంతో వియోగం కారణంగా ఆమె హృదయం వేదనతో కూడా నిండిపోయింది. అయితే ఈ వేదన కూడా మధురమైనది. ఇందులో ఆమె ముద్దుల కూతురి మాంగల్యం (శుభం) వుంది. ఈ మధురవేదనే మరికొన్ని రోజుల తర్వాత ఒక హృదయ విదారక వ్యధగా మారిపోతుందని ఆ సమయంలో ఆ అమాయకురాలు సవిత ఊహించను కూడా లేదు.

పెళ్ళి తాలూకు మేళతాళాల మంగళధ్వని ఇంకా ఆగనైనా లేదు, మనోరమ వైధవ్యం పొందింది. సవిత జగ్జీవన్‌ల కొండంత యౌవనం ఈ వజ్రాఘాతంతో కూలిపోయింది. బాల్య వితంతువు అయిన పుత్రికని అత్తవారింటినించి తీసుకొచ్చి తమ స్నేహపుస దనంలో అట్టే పెట్టుకున్నారు. ఈ విషయం మీద మరేమీ చర్చించక ముందుగా యోచించి ఏర్పాటేదీ చెయ్యకుండానే జగ్జీవన్, సవిత తమజీవన క్రమాన్నిమళ్ళీకొత్తగా ప్రారంభించ డానిక నిర్ణయించుకున్నారు. ఇల్లు పెద్దది కాదు, కానీ వేరే ఒకగది ఏర్పాటు చెయ్యలేనంత చిన్నదీ కాదు, సవిత, మనోరమ ఇప్పుడు ఒక గదిలో ఉండసాగారు. జగ్జీవన్ పక్క, రెండో గదిలో వేసుంటుంది. సవిత సౌభాగ్యాన్ని సూచించే చిహ్నాలని తప్పించి మిగిలిన శృంగారాలం కారాలన్నిటినీ త్యజించింది. వైవాహిక జీవితం తప్ప తీర్చదగ్గ మిగతా అన్ని కోరికల్ని తీర్చడానికి అనువై వాతావరణాన్ని ఏర్పరచడం కోసం ప్రేమ స్వరూపులైన ఆ తల్లిదండ్రులు శక్తివంచన లేకుండా అంతా చేస్తున్నారు, దేవినల్లనైతే తమ కుమార్తెకి జీవితంలో కష్టాల్ని సహించడానికి తగ్గ శక్తి లభిస్తుందో అదంతా చేస్తున్నారు.

రూపవతియైన తన కుమార్తె నుంచి దోచుకోబడ్డ సౌభాగ్యాన్ని చూసి సవిత హృదయంనించి అప్పుడప్పుడు సుదీర్ఘమైన నిట్టూర్పులు వెలువడ తాయి. ఇదేం ధర్మం? సాంసారిక సుఖం చవిచూడనే లేదు. ఒక అపరిచిత బాలుడి చేతిని మాత్రమే స్పృశించింది, అంత మాత్రానికి ఇటువంటి శిక్షా, ఆమెకి నిర్లక్ష్యంగా వదిలేసినరాయిలాగా జీవితం గడపాల్సిన గతి పట్టింది

కదా? ఈ క్రూరదండన ఏం అపరాధం చేసిందని? సవితలో చెలరేగుతున్న ఈ ప్రశ్నలు జవాబే లేనివి. పునర్వివాహం మాట ఆమె మనసులోకి కూడా రాలేదు. కూతురికి చదువు చెప్పిస్తే జీవితమంతా ఇంకొకళ్ళ దయమీద బతకాల్సిన అవసరం రాదన్న విషయం కూడా జగ్జీవన్ కంఠం నించి అతి కష్టమ్మీద వెలువడింది.

చదువులో మనోరమ గొప్ప పేరు తెచ్చుకుంది. సంగీతం, కుట్లు - అల్లికలు, చిత్రకళ మొదలైన లలిత కళల్లో ఆమెకి తన తరగతిలో మాత్రమే కాదు. కాలేజీ మొత్తమ్మీద మొదటి స్థానం దక్కింది. ఫైనల్ ఎగ్జామినేషన్‌లో ఆమె ఫస్ట్‌క్లాస్‌లో పాసై జిల్లా మొత్తానికి ప్రసిద్ధి పొందింది. జగ్జీవన్‌కి ఇంకా పైకి చదివించాలనుంది, కానీ సవిత రాజీ పడకపోవడంతో ఆ మాట అక్కడితో ఆగిపోయింది.

జగ్జీవన్ మనసులో ఇదీ, ఇంకా ఇటువంటి అనేక సంఘటనలు చలన చిత్రం లాగా క్షణకాలం మెరిశాయి. విరిగిన కొమ్మలాగా పడివున్న సవితకి అపారమైన జాలితో తన శరీరాన్ని ఆసరాగా ఇచ్చి లేవదియ్యడానికి మనసులోనే ఉద్యుక్తుడవుతూ అన్నాడు -

''జరగాల్సిందేదో జరిగిపోయింది.''

''కానీ 'మను' ఇలా ఎందుకు చేసింది?''

''నువ్వు మన ఆ రాత్రిని మర్చిపోయావు...''

సిగ్గుతో సవిత కళ్ళు వాలిపోయాయి. పైకి చూడకుండానే అంది ''కానీ నువ్వు చెప్పేవాడివిగా భగవంతుడే ఇది...''

''నిజమే చెప్పాను, ఆమాటే మళ్ళా చెబుతున్నాను ఇది భగవంతుడు చేసినదే...''

''కానీ భగవంతుడు అధర్మపుపని చెయ్యగలడా?'' సవిత కంఠస్వరం అవరుద్ధంగా వుంది.

''ఎవరు చెప్పారిది అధర్మమని? తారా, మండోదరీ వంటి పతివ్రతల్ని చూస్తే మన మను ఎంతో నిర్దోషి, ఎంతో పవిత్రురాలు...''

''ఇది బాగానే వుంది కానీ లోకులు...''

''లోకులు - లోకులంటూ నువ్వు అమ్మాయి చదువు పూర్తి కానివ్వనే లేదు. లోకుల ఆసరా నీకే విషయంలో అందింది?''

వేదనాయుతమైన మౌనానికి శబ్దరూపాన్నిస్తూ భార్యాభర్తలు మనోరమ జీవితానికి సంబంధించిన అనేక చిన్నా పెద్దా సంఘటనల్ని గుర్తు చేసుకోవడంలో మునిగిపోయారు. జగ్జీవన్ మనోరమ పుస్తకాల్లోంచి

మనోరమ చిత్రాల్ని కత్తిరించి వాటితో తయారు చేసిన ఆల్బమ్‌ని తీసుకొచ్చాడు. మొదటి చిత్రం ఒక అందమైన జంటది. రెండో చిత్రం చిన్న చిన్న పిల్లలతో పాటు గింజలనేరుకు తింటున్న ఒక కోడిది. మూడోదాంట్లో కుక్కపిల్లలతో ఆడుకుంటున్న ఒక ఆడకుక్కంది. నాలుగో దాంట్లో దురాక్రమణ చేస్తున్న డేగ కెదురుగా శరీరాన్ని ఉబ్బించి రెక్కల కింద తన పిల్లల్ని సురక్షితంగా ఉంచుతున్న ఒక పక్షి వుంది. అయిదో దాంట్లో గావి ఆకు మీద పడుకుని వేలు చీక్కుంటున్న బాలకృష్ణుడి ఆకృతి వుంది - ఈ ప్రకారంగా ఒక చిత్రం తర్వాతొక చిత్రాన్ని తిరగేస్తూ జగ్జీవన్ అన్నాడు.

''మను ఈ బొమ్మల్ని ఎంత ఉల్లాసంతో మనకి చూపిస్తూండేది! అయితే మనిద్దరం ఎంత మూర్ఖులం! అది ఈ బొమ్మల ద్వారా తన మనసులో మాటని మనకి తెలియజేస్తూండేదన్న ధ్యాసే మన కెందుకు రాలేదు?''

జగ్జీవన్ నిట్టూరుస్తూ నశ్యం డబ్బీ తీసి చిటికెడు నశ్యం పీల్చాడు. సవిత చూసింది. ఆమె కళ్ళలో ఒక దృశ్యం మెదల సాగింది - ఆ రోజుల్లో మనోరమ ఎంతనిస్వార్థప్రేమతో వాళ్ళిద్దరిజీవితాన్ని సుఖతరంగాల మీద ఊపుతూండేది!

భార్యాభర్తల అంతర్వ్యధకి శబ్దరూపాన్నిస్తూ చర్చముందుకి కొనసాగింది. మధ్య మధ్య జగ్జీవన్ ఖాళీడబ్బీని ముక్కు దగ్గిరెట్టుకుని వాసన చూసేందుకు ప్రయత్నిస్తున్నాడు. ఇది చూడగానే సవితకి నవ్వొచ్చింది. ఆమె అంది - ''ఏం చేస్తున్నావు నువ్వు? ఖాళీ డబ్బీ...''

''ఆఁ అవును, గుర్తులేదు... మరి... మరి చూడు, ఖాళీ డబ్బీయే ఈ మాత్రం పనికొస్తోంటే పరిపూర్ణ యౌవనంలో వున్న శరీరం ..'' వాక్యం పూర్తి కాకముందే సవిత అతని గాఢాలింగనంలో ఇమిడిపోయింది.

యౌవనావస్థ గడిచిపోయాక ప్రౌఢావస్థ నడుస్తున్న రెండు ముగ్ధ హృదయాల ఈ కలయిక ఎన్నో ఏళ్ళ ఇంద్రియ నిగ్రహపు కఠోర బంధానాన్ని ఛేదించుకుని ఎంత ఉత్కంఠతో ఎంత ఆవేగ పూర్ణమై పోయిందంటే ఇదే దాంపత్య జీవితానికి మొదటి రాత్రి కలయికా అనిపించేట్టు. దేహాల మధ్య దూరాలు సమసిపోయాయి - కేవలం భావావేశం, ప్రేమ సమ భావం నిండిన ఒక హృదయంగమ తరంగం వాతావరణంలో విస్తరించింది. కొత్తగా పెళ్ళైన దంపతుల్లా ఆజంటగాఢాలింగనంలోబంధితులవుతూ తమ సహింప శక్యంకాని వేదనని ఒక కొత్త ముగ్ధఆశగా మార్చసాగారు. ఎందుకంటే మరుసటి రోజు జగ్జీవన్ వెళ్ళి మనోరమనీ, ఆమె ప్రేమికుణ్ణీ మర్యాదగా

పిలుచుకొచ్చి, వాళ్ళిద్దరి పెళ్లి ఏ రీతిగా జరగాలనుకున్నారో ఆ రీతిగా వేదోక్తంగా తమ ఇంటి ప్రాంగణంలోనే జరిపించి కన్యాదానం చెయ్యాలని.

జగ్జీవన్ ఉదయం పదకొండు గంటలబండికివెళ్ళి, సాయంత్రం అయిదు గంటల బండికి వాళ్లిద్దర్నీ వెంటతీసుకుని తిరిగిరావాలి. అందుచేత ఉదయం త్వరగా లేవాలన్న చింత లేదు. జగ్జీవన్ ఇంచుమించు రాత్రంతా మేలుకున్నాడు. అందుచేత సూర్యుడుదయించినాక కూడా సవిత అతన్ని లేపలేదు. మెల్లిగా అతని దగ్గర్నించి లేచి వెళ్ళి నిత్యకృత్యాలలో నిమగ్నమైంది. జగ్జీవన్‌కి టీ చెయ్యడానికి దగ్గర్లో వున్న స్టోర్ రూమ్‌లో కెళ్ళిపోయింది.

స్టోర్‌రూమ్‌లో సవిత, కిందభాగం మురికి పట్టిన పటాన్ని చూసింది. దాంతో ఆమెకి మనోరమ మళ్ళా జ్ఞాపకం వచ్చింది. ఈ పటానికి వెనకాల పిచికలు గూళ్ళు పెట్టినప్పుడల్లా మనోరమకీ నౌకరు సీతారాంకీ మధ్య పోట్లాట సాగేది. సీతారాం గూడు కుపయోగించిన గడ్డిపోచలు, ఆకులు, గడ్డీ-గాదం, పత్తి, పుడకలూ మొదలైన వాట్ని పారెయ్యాలనుకునేవాడు, మనోరమ పారెయ్యనిచ్చేది కాదు. చివరికి మనోరమ గెలిచేది, సీతారాం లబలబలాడినా కూడా గూడుని సురక్షితంగా ఉంచాల్సొచ్చేది.

సవిత అత్యంత సరళ భావనతో తివాసీ మీద పడిన గడ్డిపోచలూ - ఆకులూ మొదలైన వాటిని ఏరి పటం వెనకాల కట్టబడుతున్న గూడు మీద పదిలంగా ఉంచింది. గూటిలో ఆడపిచిక, మగ పిచిక లేవు, పిల్లలూ లేవు, గూడ్లూ లేవు. దాని తర్వాత ఆమె, స్నేహభావంతో పొంగుతూ తపించిపోతున్న మాతృహృదయంతో గూటివైపు రెప్పవాల్చకుండా చూస్తూ భవిష్యత్తుని గురించి ఏదో తియ్యని కల కంటోంది. అదే సమయంలో పిచిక ముక్కుతో గడ్డిపోచని తీసుకొచ్చి పటం వెనకాలకి పోయి దాక్కుంది. అలాగే రెండు గడ్డి పోచలు తీసుకుని దాని వెనకే మగపిచిక వచ్చింది.

సవిత నిలువెల్లా పులకరింత ననుభవిస్తూ టీ పెట్టడానికి వంటింట్లో కెళ్ళిపోయింది. జగ్జీవన్ నిద్రలోనే తృప్తిగా, తియ్యగా ఊపిరి పీల్చి పక్కకి ఒత్తిగిల్లేడు.

# 10. నీలిభూతం

## గులాబ్‌దాస్ బ్రోకర్

గులాబ్‌దాస్ బ్రోకర్ జననం క్రీశ. 1909. పోర్‌బందర్ నివాసి. అక్కడే మాధ్యమిక విద్యాభ్యాసం చేసి బొంబాయి వెళ్ళారు. కొంతకాలం రాష్ట్రాభిమానం వేపు ఆకర్షితులయ్యారు. తరవాత శేయర్‌బజార్ దళారీ వృత్తి చేసారు. గత కొన్నేళ్ళుగా అది విరమించుకుని సాహిత్యసేవ చేస్తున్నారు. 'ఊభీ వాటె', 'సూయా', 'వసుంధరా అనె బీజీవాతొ', 'మానవీనాం మన్' మొదలైనవి కథా సంపుటాలు. 'నవాగగన్ నీచె' అనేది యూరప్ యాత్రా ప్రవాస గ్రంథం. 'జ్వలంత్ అగ్ని' ఏకాంకి సంపుటం.



భయాన్ని కలిగించేంత దట్టమైన భీషణమైన చీకటి రాత్రి నలువైపులా పూర్తిగా తన సామ్రాజ్యాన్ని స్థాపించుకుంది. కానీ ఇంట్లో ఒక గదిలో దీపం వెలుగులో కూర్చున్న ఆ ముగ్గురు మిత్రులకీ ఈ అంశం మీద ఏమీ ధ్యాస లేదు. వాళ్ళు తమ కబుర్లలో ఎలా లీనమైపోయారంటే రాత్రి ఒక వేళ వర్షం మేఘగర్జన్ల కన్నా కూడా అతి బీషణంగా, భీతవహంగా వున్నా కూడా పట్టించుకునే స్థితిలో లేరు.

రాత్రి గంటలు ఒకదాని తరువాతొకటి గడిచిపోతున్నాయి. చలి కూడా బాగానే వుంది. ఆ స్పృహ మాత్రం ఉంది వాళ్ళకి ఎందుకంటే గదిలో వేస్తున్న చాప మీద భార్య భర్తలు నిర్మలప్రభోద్ ఒకే శాలువా కప్పుకుని దగ్గర దగ్గరగా కూర్చున్నారు. వారి మిత్రుడు శశి చాపకిచేరువలోనే కుర్చీ వేసుకుని దానిమాద రెండు చేతులతోనూ మోకాళ్ళని దగ్గరకి చేర్చి ముడుచుకు కూర్చున్నాడు.

వాళ్ళు మాట్లాడుతున్న తీరుని బట్టీ, హావభావాల్ని బట్టీ, వాళ్ళ ముఖాల మీద కనబడుతున్న రంగులూ-రేఖల్ని బట్టీ ముగ్గురూ సమానమైన అభిరుచితో మాట్లాడుకుంటున్నట్లు స్పష్టమవుతోంది. తరుచు ముగ్గురూ ఒకే సారి మాట్లాడుతున్నారు. అప్పుడప్పుడు ఎవరైనా మాట్లాడుతోంటే మాట సగంలో ఉండగానే మరొకరు మాట్లాడేస్తున్నారు. కబుర్లు ఒక్క క్షణం కూడా ఆగటంలేదు.

''ఓహ్ అమ్మో! కానీ ఇలా అయితే ఎలా అవుతుంది? మంచిగా ఎలా అనిపిస్తుంది?'' నిర్మల శాలువాలో కప్పడిపోయిన తెల్లని కించిత్తు బలహీనమైన చేతిని బయట పెట్టి అందమైన శరీరాన్ని సరిగా కప్పుకుంటూ అంది. ఆమె స్వరంలో విషాదం కన్నా అసహ్యం ఎక్కువుంది.

తప్పకుండా చలి ఎక్కువగా వుంది. ఎందుకంటే ఒక్కక్షణంలో నిర్మల చెయ్యి తిరిగి శాలువా కింద దాక్కుంది. విషాదం, అసహ్యం కలిగివున్న ముఖం మాత్రమే శాలువా బయటవుంది.

''ఇది నీకు అర్థంకాదునిమూ'' ప్రబోధ్ ఆమెవేపు స్నేహపూర్వ కంగానూ, అభిమాన పూర్వకంగా కూడా చూస్తూ చెప్పాడు – ''నువ్వెలా అర్థం చేసుకోగలవు?''

''నిమూ, నిజం చెల్లీ, మీకలా అనిపించడం సహజం'' శశి చేతులతో మోకాళ్ళని ఇంకాగట్టిగానొక్కుకుంటూ చెప్పాడు – ''మీరెక్కడా? ఆమెక్కడా! ఆమె అచ్చమైన...'' ఆపైన ఏమో చెప్పకుండా అతను 'ఆమె' ప్రయోగించే విశేషణాన్ని సగంలో వొదిలేశాడు. భార్యభర్తలు తన మాటని నిజమని తలచి నమ్మకంతో వింటున్నారో లేదో చూస్తున్నాడు. అందుకే అతనింక ఎక్కువ చెప్పకుండా వూరుకున్నాడు. అతని తెల్లని, స్వచ్ఛమైన, నవ్వు ముఖంమీద విషాదం అయిష్టం, కనపడని, ధిక్కారం ఇంకా ఇలాంటి భావాలెన్నో అలుముకుని వున్నాయి.

''కానీ ఇలా ఎలా జరుగుతుంది?'' నిర్మల మళ్ళీ అంది – ''ఆమెలో స్వాభిమానమన్నది కాస్తంతకూడాలేదాయేం? హిందూ, ముస్లిమ్, స్నేహితుడు, దుష్టుడు, ఎవరైనా సరే... ''మాట సగంలో వదిలేసి, కేవలం ముఖం మీదికి శోకాన్ని సూచించే రేఖల్ని తెచ్చుకుని ఆమె నిశ్శబ్దంగా ఉండిపోయింది.

''మనకేం సంబంధం నిమూ!'' ప్రబోధ్ అన్నాడు. తిరిగి శశివేపు చూసి చెప్పాడు – ''ఆమైతే చనిపోయింది గానీ చావక ముందే పాపం మంగళని సగం చచ్చినవాడిగా చేసేసింది. నీకూ అంతా తెలుసు.''

''అంతా తెలుసు'' శశి చెప్పాడు. మళ్ళీ కొంచెం గంభీరంగా చెప్పాడు ''బహుశ నీకన్నా ఎక్కువే తెలుసు.''

ఇంతా చెబుతూ చెబుతూండగా అతని ముఖం మీద కొచ్చిన భావాన్ని నిర్మల ప్రభోధులలో ఎవరూ చూడలేదు. ఇద్దరూ ఉత్సుకతతో అతని వేపు చూడసాగారు.

శశి మాట్లాడాడు. అతని స్వరం తగ్గింది – ''ఆ కుసుమ లేదూ?

జయ సిస్టర్. ఆమె ఒక రోజు మధ్యాహ్నం ఏదో పని మీద ఆమె యింటికి వెళ్ళిందట. పాపం మంగళ ఆ సమయంలో పని మీద బయటి కెళ్ళాట్ట. నీలి గది తలుపు కూడా పూర్తిగా వేసుకోలేదుట. కుసుమ తోస్తే తలుపు తెరుచుకుందిట. లోపల నీలి మరొక తను ఎవరితోనో చాలా ఘోరమైన భంఘిమలో కూచునుందిట. కుసుమ చూసేసిందిట.

''నీతో ఎవరుచెప్పారు?'' ''మీతో ఎవరు చెప్పారు?'' భార్యభర్తలిద్దరూ ఒకేసారి అడిగారు.

వాళ్ళు ఇద్దరి ప్రశ్నలు విననట్టే కాసేపు మౌనంగా కూచున్నాడు. ఈ మధ్యలో అతని కళ్ళముందు ఒక ముఖం నాట్యమాడుతోంది చిన్నది. కాస్త తెల్లగా వున్నది. చూస్తే నిర్దోషి అని తెలుస్తున్న ముఖం ఆ ముఖం అతనితో చెబుతున్నట్టుగా వుంది – ''మీరు కూడానా! మీకేం అధికారముంది?'' శశి మనసులోనే ఈ ప్రశ్నకి జవాబు ఆలోచిస్తూంటే అతని ధ్యానం భంగమైంది. ఇద్దరూ మళ్ళీ అడిగారు.

''కానీ ఇదంతా ఎలా తెలిసింది?''

''నాకా? కుసుమ జయతో చెప్పింది. జయ నాభార్యతో చెప్పింది.''

''అదుగో నిమూ! మరోకథ!'' ప్రబోధ్ చెప్పాడు.

నిర్మల కూడాఏదోఅంది. కానీ ఆక్షణం శశికి వినబడలేదు. ఎందుకంటే ఆ ముఖం ఇప్పుడు కేవలం ముఖంలాగాలేదు. అది పూర్తిగా శరీరంతో నిలబడింది – దుర్బలంగా, అశక్తంగా వున్నా కూడా మోహం కలిగించేట్లుగా ఉంది. నిర్దోషిలా కనబడే ముఖాన్ని మరింత దోషరహితంగా కనబడేట్టుగా చేస్తోంది. ఆ శరీరం శశిని ప్రశ్నిస్తోంది – ''మీరు కూడానా? చెప్పండి, ఇంకా చెప్పరాదా?''

దాంతో ప్రేరితుడైనట్టుగా శశి ప్రబోధ్ నిర్మలల కబుర్లు కడ్డు వెడుతూ చెప్పాడు – ''అయితే చెల్లీ నిమూ, నీలి ఎంత నిర్దోషిలా కనిపిస్తుందీ. ఇటువంటాడది ఏ పాపమూ చెయ్యలేదని అనిపిస్తుంది. అయినా కూడా ఎంత దుర్మార్గురాలు?''

''ఎంత విషపు మనిషి! మంగళ్ నిమూతో కాస్సేపు మాట్లాడితే చాలు అతని ప్రాణం తీసేది!'' అన్నాడు ప్రబోధ్.

''కావచ్చు మనకేం!'' నిర్మల దుఃఖ పూర్వకంగా చెప్పింది '' చివరికి పాపం చనిపోయిందిగా! దుఃఖాన్ని కూడా ఎంతగా అనుభవించిందో ఆమె!'' ''ఇలాంటి వాళ్ళకలాగే జరుగుతుంది!'' శశి స్పృహలో కొచ్చి అన్నాడు ''తనూ సుఖంగా లేదు మిగతా వాళ్ళనీ సుఖంగా ఉండనివ్వలేదు.'' ఇంకా మొదటిసారి...

అతని వాగ్ధార చాలినంత సేపు ప్రవహించింది. ఒక సంఘటన తర్వాత మరొక సంఘటన, నీలి దోషాలు, ఆ దోషాల్లోంచి ఆమెని విముక్తురాలిని చెయ్యడానికి తను చేసిన ప్రయత్నాలు అతను వినిపిస్తూ పోయాడు. ఒక సమయంలో అతనిలో నీలిలో ఏదో వున్నట్టనిపిస్తుంది. ఆ సమయంలో జరిగిన సంఘటనల నన్నింటినీ నిర్మలా, ప్రబోధ్ ఎంతో ఆసక్తితోటి సానుభూతితోటి వింటున్నారు. మధ్య మధ్యలో తమ స్మృతుల ధనాగారంలోంచి కూడా సరస సంభాషణల్ని ఏరియేరి సరసమైన వాణితో అతని ముందుంచుతున్నారు.

ఈలోపు చాలా సమయం గడిచిపోయింది.

శశి ఎంతగా చెప్పుకుంటూ పోతున్నాడో అంతలోనూ ఉత్తేజితుడై పోతున్నాడు. దానిక్కారణం ఇది - ఒక వేపు విశేషాల పరంపర వర్ణన జరుగుతోంటే మరోవేపు మరో విధమైన సంఘటనల పరంపర అతని స్మృతి పటలం మీద నడుస్తోంది.

ఆఘోర భీషణ రాత్రిలో దీపం కాంతి ప్రసరిస్తున్న ఆ గదిలో అతను నిర్మల ప్రబోధ్‌లతో శారీరకంగా కబుర్లు చెబుతూ ఉన్నాడు. కానీ మానసికంగా కల్పనకి వందల కొద్దీ మైళ్ళ దూరంలో బొంబాయి నగరంలోని ఒక పేటలో తిరుగుతున్నాడు – క్షణాలు, గంటలు, రోజులు ఆలోచన్నలాగానే వేగంగా గడిచిపోతున్నాయి. అతను బొంబాయిలో ఒక స్కూల్లో పనిచేస్తున్నాడు. నీలి భర్త మంగల్ కూడా ఆస్కూల్లోనే పని చేస్తున్నాడు. ప్రబోధ్ మరో వృత్తేదో చేస్తున్నాడు. కానీ నిర్మలతో అతను కూడా ఆ ఉపనగరంలోనే నివసిస్తున్నాడు. ముగ్గురి ఇళ్ళూ కాస్త కాస్త దూరంలోనే ఉన్నాయి. మంగళ్ - నిర్మల, నిర్మల- నీలి, నీలి - శశి, ప్రబోధ్ – మంగళ్ - వీళ్ళందరూ వీళ్ళలో అందరూ ఒకరి కొకరు ఆంతరంగిక మిత్రులైపోయారు. వీళ్ళింత గాఢ మిత్రులవడం చూసి నగరం మొత్తానికి ఈర్ష్య కలగసాగింది.

ఇటువంటి స్నేహోధర్మ స్థితి కొంతకాలం వరకే ఉండగలుగుతుంది. ఒక దాని తర్వాత ఒకటిగా సంఘటనలు చలన చిత్రంలా శశి మనసులో తిరగసాగాయి మంగళ్‌నిర్మలతోఇంతఎక్కువకలుపుగోలుగా ఎందుకుండా లనిపించి నీలికి, నిర్మల మీద ఈర్ష్య కలిగింది. అనేక విధాల ప్రయత్నంచేసి చేసి ఆమె మంగళ్ నిర్మల ఇంటి కెళ్ళడాన్ని ఆపుచేసేసింది.

శశి ఎదురుగా కూడా ఆమె నిర్మలని అనేక మాటలంది. వాటిల్లో ఒకదాన్ని శశి నిర్మలకీ, ప్రబోధ్‌కీ వినిపించారు.

''ఇంకే ఆమెనాతో చెబుతుందీ – ''శశి భాయీ! ఒక వేళ మంగళ్ నిర్మలని ముద్దెట్టుకుంటే ఇందులో నీకేం అభ్యంతరం ఉంటుందీ? ఆయన స్నేహంతోనే ఇలా చేస్తున్నారన్న నమ్మకం నాకుంది'' ఇదంతా ఆమె ఎంత అమాయకంగా చెబుతున్నట్టుంటుందంటే ఆమె మనసులో విషం మనసులోనే ఉంటుంది, బయటికి రాదు.''

''అబద్ధాలకోరు! పచ్చి అబద్ధాలకోరు!'' నిర్మల క్రుద్ధురాల్తై చెప్పింది – ''అలా ఎన్నడూ జరగలేదు.''

ప్రబోధ్ కళ్ళలో కేవలం అసహ్యం నిండివుంది. అతనేం మాట్లాడలేదు. ''అబద్ధాలకోరే ఆమె. తనని వెయ్యిమంది ముద్దెట్టుకున్నా తనకి బాగానే వుంటుంది. తను అలాటిది కావడం చేతనే ఇలాంటి కల్పన కల్పించింది!'' అని శశి చెప్పి ఒక్కక్షణం మౌనంగా ఉన్నాడు.

ఈ కాస్త సేపట్లో పూర్తిగా ఒక సంఘటన అతని మెదడులో తిరిగింది.

నీలి నడవడి కాస్త హీనమైనది. ఈ మాట మిత్ర మండలంతటికీ తెలుసు. ఒకటి-రెండు ఎంతో దుఃఖ పూరితమైన మనసుతో నీలి మంగళ్ ముందు మనస్పూర్తిగా ఒప్పుకుంది శశి ఇవన్నీ ఎరుగును. ఇందుకే ఆ సంఘటన జరిగింది.

ఆ రోజు శశి మంగళ్ నీలితో పాటు వాళ్ళ గదిలో కూర్చునివున్నాడు. ఒక కుర్చీమీద మంగళ్ కూర్చున్నాడు. అతనికి చేరువలో పడక కుర్చీలో శశి కూర్చున్నాడు. శశి ప్రక్కన ఒక చిన్న కుర్చీ మీద నీలి కూర్చుంది.

మంగళ కబుర్ల పోగు. రకరకాల మాటలు చెప్పి ఇద్దర్నీ నవ్విస్తున్నాడు. శశి మనసారా నవ్వాడు. నవ్వుతూ – నవ్వుతూ అతను నీలి వేపు ఒకసారి చూశాడు. నీలి తనవేపే చూస్తున్నట్టు అతని కనిపించింది.

మాటలు ముందుకి సాగిపోతున్నాయి. నవ్వు శ్రుతి మించుతోంది. శశి మళ్ళీ నీలివైపు చూస్తే ఆమె తెల్లని ముఖం నవ్వు కారణంగా ఎర్రగా అవుతోంది. శశి చూపు తనమీద పడగానే నీలి ఇంకా గట్టిగా నవ్వింది. బహుశ శశికి మొదటిసారిగా నీలి సమ్మోహనకరంగా కనిపించింది.

మంగళ్ షికారుకెళ్ళేప్పుడు ఏ చేతి బెత్తం తీసికెడతాడో అది అతని ముందు పడి వుంది. నీలి దాన్ని తీసుకుని దాంతో ఆడుకోసాగింది. దాని వల్ల ముగ్గురి కబుర్లకీ ఏమీ అంతరాయం కలగలేదు.

కొంత సేపటి తర్వాత నెమ్మది నెమ్మదిగా నీలి ఆ బెత్తంతో శశి కాళ్ళలో చక్కిలిగింత పెట్టసాగింది. శశి నవ్వు శ్రుతి మించింది. మంగళ్‌కి నవ్వు వచ్చింది.

ఈ అల్లరికి శిక్షించడానికి శశి నీలి చేతిలోంచి బెత్తం లాక్కున్నాడు. ఆ సయంలో బెత్తాన్ని పట్టుకునే వుండే ప్రయత్నంలో నీలి కొద్దిగా ముందుకి వొంగింది. కాని వొంగేసమయంలో ఆమె ముఖం శశి ముఖం ముందు కొచ్చింది. అది అతన్ని తేరిపార చూస్తోంది. నిర్దోషిగా పేర్కొన బడుతున్న ఆమె నవ్వు శశితో ఎన్నో కబుర్లు చెప్పింది.

ఇవాళ నీలికి వ్యతిరేకంగా చెప్పాలని శశి కెందుకనిపిస్తోందో తెలియదు. నీలి స్వభావం గురించి ఎన్నో విషమమైన విషయాలు చెప్పాక శశి – నిర్మల, ప్రబోధ్‌లతో నీలి ఏ విధంగా ఇతరుల ముందు కూడా మంగళ్, నిర్మలల గురించి అవమానకరంగా మాట్లాడుతూండేదో చెప్పసాగాడు.

''కుసుమతో కూడా ఆమె నీగురించీ మంగళ్ గురించీ చాలా చెప్పింది. మా ఆవిడ దగ్గరనుంచీ అవన్నీ తెలుసుకున్నప్పుడు నాకెంతో కోపం వొచ్చిందంటే...''

అటు శశి మనసులో మరోప్రపంచం పరుగుతీస్తోంది. ఒక సారి బొంబాయి వెళ్ళడానికి నీలి, శశి కలిసి ఒకలోకల్ రైలులో ఎక్కారు. ఒకే పెట్టిలో కూర్చున్నారు. పెట్టిలో రద్దీ బాగా వుంది. ఎలాగోలా వాళ్ళిద్దరూ దగ్గర దగ్గరగా కూర్చున్నారు. శశికాళ్ళు నీలి కాళ్ళని కొద్దిగా తాకుతు న్నాయి. నీలి కాళ్ళు తప్పించు కుంటుందని అతని వుద్దేశం కానీ అది తెలియనట్టే నీలి తన కాళ్ళు నలాగే వుంచింది. శశి కూడ తన కాళ్ళని అవతలకి లాక్కోలేక పోయాడు.

రైలు దిగి ఇద్దరూ బస్సు కోసరం నిరీక్షిస్తూ నిలబడ్డారు. తమకేమీ తెలియకుండానే జరుగుతున్నట్టుగా ఒకరి చేతి నొకరు పట్టుకున్నారు. నీలి చెయ్యి విడిపిచుంకోలేదు. శశీ చెయ్యి విడిపించుకోలేదు. అమాయకంగా కనిపించే కళ్ళని నీలి శశి వేపు తిప్పితే శశి బొంగురు గొంతుకతో చెప్పాడు.

''నీలీ, రేపు సాయంత్రం నువ్వు మాయింటికి రావాలి.''

ఆ రోజుల్లో శశి తనింట్లో ఒంటరిగా వుంటున్నాడు.

''సమయానికి మంగళ్ ఇంటికి తిరిగొస్తే తప్పకుండా వొస్తాను'' నీలి నవ్వుతూ అన్నది.

శశికి తనగొంతు ఇంకా ఎక్కువ బొంగురైనట్టనిపించింది. అది వొణుకుతోంది కూడా. చెప్పాడు – ''ఊహూ నువ్వు ఒంటరిగానే రా.''

''ఎందుకు?'' నీలి అప్పుడే వొచ్చిన బస్సు ఎక్కుతూ అడిగింది.

''అంతే.'' అంతే చెప్పి శశి అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

మరుసటి రోజు సాయంత్రానికి అసంఖ్యాకులైన నీలి ప్రేమికులలో

మరొక సంఖ్యని ఇంకా పెంచానని గుర్తొచ్చిందతనికి. నిర్మల, ప్రబోధ్‌లతో మాట్లాడుతూ అతనన్నాడు - ''నీలి వేశ్య సుమా.''

''ఇక వొదిలెయ్యండి శశిబాయీ! నిర్మల ఆవులిస్తూ చెప్పింది- పాపం ఆమె చనిపోయిందిగా, ఇప్పుడింకేవిఁటి!''

''శశీ ఇవాళ నువ్వు కోపంతో అదుపు తప్పుతున్నావురా! నీ మనసు కూడా నీలి గురించిన బాధతో ఇంతలా నిండి పోయిందని మాకు తెలియదు'' ప్రబోధ్ అన్నాడు.

''ఎంతలా నిండిపోయిందంటే మరి అడక్కు. ఆమె పరిచయంలోకి రావడం కూడా పాపమే!'' శశి కఠినంగా అన్నాడు.

సరిగ్గా అప్పుడే మళ్ళీ అదే ముఖం దోషమెరుగని ముగ్ధ మోహనా కారంతో నవ్వుతూ అడుగుతున్నట్టనిపించిందతనికి - ''అలాగా! మరి మీ పరిచయంలోకి వస్తే నాకు పుణ్యం దక్కిందా, యేం?''

దీంతో శశిలో కాఠిన్యం మరింత పెరిగిపోయింది.

మాట నించి మాట పుట్టుకొస్తోంది. ఒంటి గంటన్నరయింది. వాళ్ళు ముగ్గురూ కబుర్లు చెప్పుకుంటూ అలసిపోయారు కూడా. శశి లేచి నిలబడ్డాడు - ''సరే ఇక వెడతాను. ఇవాళ చాలా ఆలస్యమై పోయింది.''

''సరిగ్గా ఒంటిగంటన్నరైంది.'' ఆవులిస్తూ అంది నిర్మల శశితన అందమైన కోటు కాలర్ని పైకెత్తి తన బలమైన ఛాతీని కోటుతో కప్పుకున్నాడు. కాస్త బద్ధకంగా చేతులు నలుపుకుంటూ అతనన్నాడు - ''ఇంకా నేను చాలా దూరం పోవాలి. ఫూల్ లాగా ఇంతసేపు కూర్చుండి పోయాను.''

''అయితే ఏమయిందేం!'' ప్రబోధ్ కూడా శాలువాలోంచి బయటికొచ్చి నిలబడుతూ అన్నాడు ''ఒకటిన్నర మైళ్ళు నడవడం నీకేమంత పెద్ద విషయం!''

నిర్మల కూడా శాలువా తీసేసి చీర సరిచేసుకుని లేచి నిలబడింది. కిటికీలోంచి బయటికి తొంగి చూసి అంది - ''ఎంత చీకటిగా వుందో!'' మళ్ళీ ఆమె కొంచెం భావుకస్వరంతో అంది - ''శశీ భాయీ, ఈ రాత్రికిక్కడే ఉండిపోకూడదూ! ఇంత చీకట్లో ఎక్కడికెడతారు!''

''లేదు - లేదు'' శశి నవ్వుతూ అన్నాడు - ''ఆ బొంబాయేమన్నా చిన్నదా టెలిఫోన్ చేసి చెప్పడానికి! ఇప్పటివరకూ ఇంటికి చేరలేదు. అక్కడందరూ కంగారు పడుతూంటారు.''

''మన యీ గవర్నమెంటూ!... ప్రబోధ్ మనం ఇక్కడికి అనవసరంగా వొచ్చాం!'' నిర్మల అంది - ''దారిలో బ్లాక్ అవుట్ కారణంగా

ఎక్కడా వెలుతురు లేదు. యుద్ధమంతా ఇక్కడే వొచ్చినట్టు. దీనికన్నా బొంబాయే మన్నా బాగుందా!''

''బొంబాయి! ఎంత జీతముంటే మాత్రం అక్కడ ఎంత మంది షాహీల మాదిరిగా బతుకుతున్నారు!'' ప్రబోధ్ జవాబిచ్చాడు.

నిర్మల ఏదో చెప్పబోయేదే కాని శశి కట్ చేశాడు - ''ఇక ఈ విషయంలోకి దిగామంటే మళ్ళీ మరోగంట పడుతుంది. మనం కొద్ది రోజుల తేడాలో మనకిక్కడ ఉద్యోగాలు దొరకడంతో మళ్ళీ ఇక్కడ కలుసుకున్నాం. ఇది పరమేశ్వరుడి కృప అనుకోండి!''

''పాపం, మంగళ్ భాయి అక్కడే ఉండిపోయారు!'' నిర్మల అంది. ''సరే... మంచిది. నేవెడతానింక'' చెప్పేసి శశి బయల్దేరాడు. గుమ్మం వరకూ దిగ బెట్టడానికి ప్రబోధ్ నిర్మల వొచ్చారు. ప్రశాంతమైన నీరవ నిశీధి నిశ్శబ్దంగా గడిచి పోతోంది. నక్షత్రాల్ని కూడా అంధకారం మింగేసినట్టుంది. కేవలం చలి తన చమత్కారాన్ని చూపిస్తోంది. చీరని శరీరం చుట్టూ బిగించి కప్పుకుని నిర్మల ఆకాశం వేపు చూసి అంది. ''శశిభాయీ ఇవాళ మీరు ఆగిపోండి. రాత్రి బీతావహంగా వుంది. చలి కూడ ఎక్కువగా వుంది.''

''లేదు-లేదు, నేవెళతాను.'' అంటూ శశి ఆమె వేపు చూసి కొంచం నవ్వి గుమ్మం బయటికి వచ్చాడు.

''చూడూ దారిలో నీలి గురించి ఎక్కువ ఆలోచించవద్దు.'' ప్రబోధ్ నవ్వుతూ చెప్పాడు. తలుపేస్తూ నిర్మలతో చెప్పాడు - ''శశి నెన్నడూ పని, చలీ, చీకటి ఈ రోజాపుతాయా? వాడు మొనగాడు. చూడటంలా, ఏం పర్సనాలిటీ వీడిది!''

''నాకైతే ఇలాంటప్పుడు కాస్త దూరం వెళ్ళాలన్నా భయమేస్తుంది బాబూ'' అంది నిర్మల.

వాళ్ళిద్దరూ తిరిగి దీపపు వెలుతుర్లోకి వెళ్ళిపోయారు.

ఇటు శశి ఏకాంత యాత్ర ప్రారంభమైంది.

ఒక్కటిన్నరో, రెండో మైళ్ళదూరం వెళ్ళాలి అతను. మూడు నాలుగు నెలల్నించీ నిర్మలా, ప్రబోధ్ చిన్న పట్టణమైన ఈ కథియవాడ్ కొచ్చి వుంటున్నారు. శశికూడా వొచ్చేశాడు. పట్టణానికి బయట దూరంగా కట్టిన క్వార్టర్స్‌లో ఉంటున్నారు. శశి పట్టణంలో ఉంటున్నాడు. ఇద్దరిళ్ళకి మధ్య ఒకటిన్నరో రెండు మైళ్లో దూరం వుంటుంది. మధ్యలో సుమారు ఒక మైలు దూరం వరకూ ఒక్క ఇల్లు కూడా లేదు. అక్కడ పూర్తిగా పాడుపడింది. పట్టణ ప్రజలు దాన్ని 'రణ్' అంటారు.

అతను వెడుతున్నాడు. అతని అడుగుల చప్పుడు రాత్రి నీరవతలో ప్రతిధ్వనిస్తోంది.

అతని కళ్ళముందు చాలా దూరం వరకూ చీకటి వ్యాపించి వుంది. ముందూ-వెనుకా ఇటూ-అటూ ఎటుచూసినా అంధకారమే ఇంక చలి అంధకారానికి తను మూగవాణ్ణి అన్నట్టుగా తన ప్రతాపాన్ని నెలకొల్పు తోంది.

శశి ముందుకి సాగిపోతున్నాడు. రాత్రి అంధకారం కన్నా కూడా ఎక్కువ దట్టమైన అంధకారం అతని హృదయంలో అలుముకుంది - ''నేనెందుకు నీలికి వ్యతిరేకంగా ఇన్ని మాటలు చెప్పాను? నీలి దోషైతే నేనెక్కడ నిర్దోషినవుతాను?''

''ఏం? ఏం? ఏం?'' అతని హృదయం అతన్ని అడుగుతోంది.

ఈ ప్రశ్నతాలుకాపట్టునించి బయటపడ్డానికి మామూలుగా ఉండ డానికి ప్రయత్నిస్తూ అతనూ చుట్టు పక్కల చూశాడు.

ఎక్కడా ఏదీ కూడా కనబడటంలేదు. కేవలం అంధకార ముంది. ఈ అంధకారం నోరుతెరిచి తనని కూడా మింగెయ్యడానికే నిలబడున్నట్ట నిపించిందతనికి.

అతను తిరిగి ఆలోచనలలో లీనమయ్యాడు. ''గడిచిన కొన్ని గంట ల్లోనూ, నిర్మలా- ప్రబోధ్ చాలా తక్కువ మాట్లాడారు. నేనే మూర్ఖుడి లాగా వాగుతూండి పోయాను. ఏం నేను నీలికి అన్యాయం చెయ్యలేదూ?

''అవును చేశావు!'' నీలి చెబుతున్నట్టనిపించింది. ఉలిక్కిపడి అతను ముందుకిచూస్తేనీలినవ్వుతూఎదురుగా నిలబడిఫిర్యాదు చేస్తున్నట్టని పించింది. కానీ కళ్ళింత విప్పార్చుకుని చూసినా కూడా అతనికేమీ కనబడలేదు. అంతా కేవలం అంధకారం!

అతను వణికిపోయాడు. చలి వల్లే వణుకుతున్నట్టుగా కోటుని తన బలమైన ఛాతీమీద మరింత దగ్గిరగా లాక్కున్నాడు.

ముందుకి సాగాడు. ఆలోచనల పరంపర మళ్ళీ ప్రారంభమైంది. అతనికి తన అడుగుల చప్పుడు ఇంకొకళ్ళ అడుగుల చప్పుడులాగా అనిపించడం ఇంతకు ముందెన్నడూ జరగలేదు. కానీ ఇవాళ అతనికి ఈ అడుగుల చప్పుడు తనని వెన్నాడుతున్న మరెవరివో అనిపించసాగింది. ఆగి కాసేపు నిలబడిపోయాడు. రెండో అడుగుల చప్పుడు కూడా ఆగిపోయింది. అతను వెనక్కి తిరిగి చూశాడు. అక్కడ ఏమీ లేదు. కేవలం అంధకారం!

తనమీద తనకే కోపమొచ్చింది. ''నేను ఎప్పుడూ దేనికీ

భయపడలేదు. మరివాళ ఇదేవిఁటి! ఏవిఁటి నాకే నేను భయపడుతున్నానా? ఇంక నీలి? నేనామెగురించి అబద్ధం కొంచెమే చెప్పాను. నీలి చెడిపోయినదేగా!''

''అవును. ఆమెసరే మరి మీరు?'' మళ్ళీ అదే నవ్వుతున్న ముఖం దట్టమైన అంధకారాన్ని ఛేదించు కొచ్చి అతని ముందు నిలబడి నవ్వుతోంది.

ఆమె చూపునించి తప్పించుకోవడానికి ఇటూ అటూ చూశాడు. అటు కూడా అవే కళ్ళు. అదే నవ్వు, ఆ రూపురేఖలే ఆమెని చూపిస్తున్నాయి.

ఇదంతా భ్రమ అని అతనికి తెలుసు. కేవలం క్షోభిస్తున్న అతని మనసు అతని చుట్టు ప్రక్కల భ్రమాదరణాన్ని ఉత్పన్నం చేస్తోంది. అయినా కూడా ఆ భ్రమ తాలుకా ఛాయల వల్ల అతనికి భయమేస్తోంది.

కోటుని సరి చేసుకుని అతను అడుగు ముందకేవేశాడు.

వెడుతూ వెడుతూ అనుకున్నాడు కూడా మరొక మనిషెవరన్నా వొస్తే ఎంత బాగుండునని! అప్పుడు అతనికి భ్రమ కలగదుగా!

కానీ నాలుగడుగులు వెళ్ళాక మళ్ళీ అవే భ్రమలు అతన్ని చుట్టుముట్టాయి.

''ఎంత చలిగా వుంది?'' అతను కంపిస్తున్న తన మనసుతో అన్నాడు.

''చాలా-చాలా'' జవాబు వినిపించింది.

ఎక్కువ తర్కించుకోకుండా అతను వెనక్కి తిరిగాడు. ప్రబోధ్ ఇంటి నించి ఇంకాఅట్టే దూరంపోలేదు.అతని ఇల్లు పోల్చుకుని తొందరగా అడుగులేసుకుంటూ ముందుకి నడిచాడు.

అక్కడ గూడా చీకటి గానే వుంది. వాళ్ళు దీపం ఆర్పేశారు. కాసేపు అతను ఆలోచించాడు. పిలవనా ఒద్దా అని కానీ మనసుకుదుట పడే క్షణంలో అతని చిత్తంలో సమ్మోహన పర్చే నీలి హాస్యం తిరిగి వినబడే సరికి అతను పిలిచేశాడు.

''ప్రబోధ్! చెల్లీ నిమూ!''

లోపల్నించి నిద్రమత్తు ఒదలని కంఠస్వరం వినిపించింది ''ఎవరు?''

''నేను''

''ఎవరూ? శశిభాయీ?'' లోపల్నించి అడుగుల చప్పుడు వినిపించింది. క్షణం తర్వాత అతను ప్రబోధ్ గదిలో వున్నాడు.

''ఏం జరిగింది శశీ? ఎందుకు వెనక్కి వచ్చావ్?'' ప్రబోధ్ అడిగాడు.

మనుషుల్ని చూశాక శశి భయం దూరమైంది. ''చలి బాగా ఎక్కువుగా వుంది. అందుకని నీ శాలువా కప్పుకుని పోదామని ఆలోచించాను'' అన్నాడు.

వొస్తున్నప్పుడు శశి ముఖం చూసిన కారణం చేతనో మరే కారణం చేతనో నిర్మల మళ్ళీ చెప్పింది - ''నేను మళ్ళీ చెబుతున్నాను. శశిభాయీ, ఇవాళ రాత్రికి మీరిక్కడే ఉండిపొండి. చలీ, చీకటి - రెండూ ఎక్కువగానే ఉన్నాయి.''

''లేదు ఎట్టి పరిస్థితిలోనైనా సరే నేను వెళ్ళాలి'' క్షణ మాత్రంలో తనంత భయ భీతుడెలా అయ్యాడో ఇప్పుడు శశికే అర్థ కావటం లేదు.

నిర్మల మళ్ళీ అతన్ని వుండి పొమ్మని అడిగింది. ప్రబోధ్ కూడా ఆ మాటే అన్నాడు కానీ శశీ ఆగలేదు. అతను శాలువాని తన శరీరం మీద బాగా కప్పుకుని మళ్ళీ బయలు దేరాడు.

మళ్ళీ అదేనిశ్శబ్దం. నిస్తబ్ద రాత్రి అతనికి స్వాగతమిచ్చింది.

కానీ ఇప్పుడతను తన భయాన్ని తరిమి కొట్టేశాడు. ఇక భయపడకూడదని నిశ్చియించుకున్నాడు. ఇదే అనుకుంటూ అంతకు ముందు ప్రబోధ్ ఇంటి వెలుగునించి అంధకారంలోకిప్రవేశించాడు. శశి వేగంగా ముందుకి నడవసాగాడు.

ఇప్పటికీ అతని మనసులో ఆలోచనలు కొనసాగుతున్నాయి. నీలి కూడా ఆ ఆలోచనల్లో పొదగబడి వుంది. అయినా కూడా ఇప్పుడతనికి భయమనిపించటం లేదు.

''నేను భయపడ్డానా?'' అని మనసులోనే అనుకుని నవ్వుకున్నాడు - 'ఇలాంటి చీకటిరాత్రులెన్నోగడిపాను. ఇందులో భయపడ్డానికేముంది?'

నీలి విషయంలో కూడా ఇప్పుడతను మాములుగా అయిపోయి ఆలోచించసాగాడు. ''మిగతా వాళ్ళకామె ఎలాంటిదైనా కావచ్చు కానీ నన్నామె కోరుకుంది! అవును నిజంగా కోరుకుంది.'' ఈ ఆలోచనతో అతని పురుషాహంకారం సంతృప్తి పడింది.

ఇలా ఆలోచిస్తూ ఆలోచిస్తూ అతను బస్తీని దాటి వచ్చేశాడు. ఇక 'రణ్' ప్రారంభమైంది.

చీకటి ఇక్కడ కూడా అంతే వుంది. మొదట కన్నా ఎక్కువ దట్టంగా కనబడుతోంది. చుట్టు ప్రక్కల ఇళ్ళేమో లేకపోవడం చేత నిస్సందేహంగా చలి ఎక్కువగానే వుంది.

''నిన్ను గుర్తు చేసుకుంటూ ఒక వేళ నేను నిర్జనంగా వుండి నీరులేని

ఎడారిలో చచ్చిపోతే ఎంతమజాగా వుంటుంది. ''ఆ నిర్జన ప్రదేశాన్ని చేరుకోగానే అతనికి నీలి అన్న మాటలు గుర్తొచ్చాయి.

''చివరికి పాపం మరణించింది. చనిపోయే సమయంలో నన్ను గుర్తు చేసుకుందో లేదో తెలీదు! కానీ పాపం తీసుకుని తీసుకుని మరణించింది. రాజరోగం క్షయతో చివరి రోజుల్లో నేనామెని చూడను కూడా లేదు. చివరి క్షణాల్లో ఎలా వుండింటుందో?''

అతని కల్పనలో అంతిమ క్షణాల్లో నీలి తాలూకు ఒక భయంకర రూపం ఆకారం దాల్చింది - గుంటల్లో దిగబడిన కళ్ళు, ముఖం భయంకరంగా వుంది. ఈ కల్పనతో అతను కంపించాడు. అప్పుడే అతని నోటి నుంచి ఒక పెద్ద కేక వెలువడింది. అతను ఆగిపోయాడు. అతని కాళ్ళ కింద కేదో వొచ్చింది. వెంటనే అతను తుపాకీ గుండులా ఎగిరి పడ్డాడు. మొరుగుడుని బట్టీ అది కుక్కని గ్రహించాడు. కానీ ఇది తెలిశాక కూడా అతనికి గుండెదడ తగ్గలేదు. ఏదో అసంకల్పితమైన భయం మళ్ళీ అతన్ని బంధించింది.

అతనికి మళ్ళీ ప్రేత ఛాయలు కనిపించసాగాయి.

''ఎలా ఉండుంటుంది ఆనీలి?'' భయపడుతూనే ఆలోచించా డతను. క్షణం క్రితం తను ఊహించుకున్న క్షయ గ్రస్తురాలైన నీలి గురించి చేసిన కల్పన కన్నా కూడా ఎక్కువ భయంకరాకారాన్ని ధరించి నీలి అతని ఎదుటికొచ్చి నిలబడి పెద్ద పెద్ద కోరల్ని బయట పెట్టి భయంకరంగా నవ్వుతున్నట్టనిపించింది.

శశి కళ్ళుమూసుకున్నాడు. ముందుకిసాగడానికిఅడుగు వేయబో యాడు. కానీ పాదం అక్కడే అంటుకుపోయి నట్టనిపించింది. కళ్ళు తెరిచాడు. కేవలం అంధకారం. కానీ ఆ అంధకారం మొదటి కన్నా ఎక్కువ భయావహంగా కనబడింది.

త్వరగా ఇల్లు చేరడానికి అతను పరుగెత్తడం ప్రారంభించాడు. కొంచెం సేపు అలా పరుగెడుతూనే ఉన్నాడు. అతని వెనకనే మరొకరెవరో కూడా పరుగెడుతూ వస్తున్నట్టనిపించింది. కానీ వెనక్కి తిరిగి చూసే ధైర్యం లేదు.

చిన్నప్పటి నుంచీ శశీ అనేక రకాల భయాల్ని చైతన్యం లోంచి చైతన్య రహిత స్థితిలోకి నెట్టేస్తూ వొచ్చాడు. ఇవాళ హఠాత్తుగా అవన్నీ బయట పడి అతి చైతన్యంలోకి రావడానికి పీకులాట ప్రారంభంమైంది.

కాలికి పగుళ్లయితే సరిగ్గా అందులోనే ముల్లు దిగిందట. సరిగ్గా

అలాగే శశి విషయంలో జరిగింది. కొద్ది సేపటి క్రితమే ప్రబోధ్‌తో చెప్పిన వాక్యాలు అతనికి గుర్తుకు వచ్చాయి.

''నీలి మంగళ్‌ని ఎంత సతాయించేదో, భూతమై అతన్నెందుకు పట్టుకోలేదో'' ఇదే ఆశ్చర్యంగా వుంది.

నీలి నిజంగా భూతమైపోతే? ఇవన్నీ ఆమె మాయలే అయితే? శశి అలాంటి భూత ప్రేతాలలో నమ్మకం లేనివాడు. అతనిప్పుడు కూడా ఇదంతా తన మనో విభ్రమేనని గ్రహించే ఉన్నాడు. అయినా కూడా కల్పన అతన్ని కుంటి వాణ్ణి చేసింది.

అతను బలమంతా కూడా దీసుకుని పరుగెత్తాడు. అతనికి చండీస్తోత్రం ఎలా గుర్తుకొచ్చిందో గానీ మనసులోనే ఆ శ్లోకాలని చదువుతూ పోతున్నాడు. పట్టణం దగ్గర పడుతోంది. కానీ స్మృతు లతన్ని వీడటం లేదు.

ఆరోజు సాయంత్రం నీలిశశి దగ్గరకొస్తే శశి అహంకారం కారణంగానే ఆమె శశిని ఆపడానికి ఎంత ప్రయత్నించింది!

''మంగళ మీదొట్టు అలాంటి పని చేస్తే!'' అందామె. కానీ శశి ఏమీ పట్టించుకోలేదు.

''పైగా ఇవాళ మీరే చేతులు కడిగేసుకుని నన్ను కులటని చేస్తున్నారు. ఎందుకు?'' నీలి భయంకరమైన నవ్వు నవ్వుతూ అతని ఎదుట కొచ్చి నిలబడి, ''మిత్రద్రోహీ! మిత్రద్రోహీ!'' అంటున్నట్టు అనిపించింది శశికి .

అతను వేగంగా ఊపిరి పీలుస్తున్నాడు. శాలువాని శరీరం నిండా కప్పుకుని ముందుకి సాగిపోతున్నాడు. హఠాత్తుగా అతనికి ఎదురుగా కొద్ది దూరంలో విశాల వృక్షంలాగా ఏదో నిలబడ్డట్టు అనిపించింది. ఈ జాగాలో అలాంటి దేమీ అంతకుముందు లేదని అతని నమ్మకం. మరిదేవిఁటి? అతను పైకి చూశాడు. ఆ వృక్షంమీదకూర్చున్న నీలి, యవ్వనం, ఆరోగ్యం. సమ్మోహన సౌందర్యం గల నీలి అతన్ని తన బాహుపాశాలలోకి తీసుకోమని పిలుస్తోంది. కళ్ళు మూసుకుని అతను ముందుకి పోసాగాడు. కొంత దూరం వెళ్ళాక అతనికి గుర్తువచ్చింది. అది వృక్షం కాదనీ, మాణక్ చౌక్ తాలూకు స్తంభమనీను. అక్కడ చెట్టుచేమా ఏమీ లేదు. అయినా సరే అతను ఇంటిదాకా పరిగెడుతూ పోయాడు. ఇంటి గుమ్మం ముందు నిలబడి తలుపుతట్టే దాకా కూడా అతని అంగాంగం అలా కంపిస్తూనే వుంది. చెమటతో పూర్తిగా తడిసిపోయింది.

అతన్ని చూస్తూనే అతని భార్య అంది. ''అయ్యో! అయ్యో! మీకు

బాగా చలేస్తున్నట్టుంది! వొళ్ళంతా ఒణికి పోతోంది!'' ''ఏంలేదు. నన్ను నిద్రపోనీ'' అని చెప్పి అతను ధడాలు మని పడక మీద పడిపోయాడు.

శశి నిజంగా భయపడ్డాడు. రాత్రి కూడా అర్థ జాగ్రదావస్థలోనూ అర్థ నిద్రితావస్థలోనూ నీలి ఆలోచనలూ, స్వప్నాలు అతన్ని పూర్తిగా అన్ని వైపుల నుంచి కమ్మేశాయి.

తెల్ల వారింది. అతను ఇప్పటివరకూ అర్థ నిద్రావస్థలోనే వున్నాడు. అతని భార్య అతని తలమీద నీళ్ళలో తడిపిన గుడ్డలు వేసింది. ఎందుకంటే శశికి జ్వరమొచ్చేసింది. రాత్రి కూడా అతను ఒకటి రెండుసార్లు ఉలిక్కిపడ్డాడు.

శశి కళ్ళు సగం తెరిచి ఒకసారి చూసి మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు బలవంతంగా అతను తలమీదనించి భార్య చేతిని తొలగించాడు. ''ఇప్పుడు కూడా నన్ను వెంటాడటం మానలేదు. నాప్రాణం తీస్తావా యేం?''

అతని భార్య గుడ్డ తడిపి తలమీద వేసింది. మృదువుగా తల మీద చెయ్యేసి నిమురుతూ అడిగింది - ''ఏమయిందిది మీకు? నిన్న రాత్రి నించి ఏవిటేమిటో అంటున్నారు. ఇదంతా ఏవిటి?''

శశి కళ్ళు పూర్తిగా తెరిచాడు. అదే ఇల్లు అదే ప్రేమాస్పదురాలైన భార్య చక్కని ఎండ వెచ్చదనం- అంతా చూశాడతను. ఇప్పటిదాకా అతని కళ్ళల్లో నిండిన నీలి తాలుకా ఆ ఆకారం దూరంగా తొలగిపోయింది. అతను మళ్ళీ కళ్ళు విప్పార్చుకుని చూశాడు. నీలి అక్కడ లేదు. విషం కక్కే ఆమె నవ్వు కూడా లేదు. అక్కడ కేవలం ప్రేమ మూర్తయిన తన భార్యుంది. అతనిల్లుంది, సూర్య కిరణాలున్నాయి.

లేచి కూర్చుంటూ అడిగాడు ''నీకేం కనబడలేదా?''

''నాకేం కనబడుతుంది? నాకుమీరేకనబడతారు. అలా చూస్తున్నారేవిటి?'' అతని భార్య అడిగింది.

శశి నిట్టూర్చి అన్నాడు - ''ఏం లేదు.''

రాత్రంతా గదిలో ఏ మూలైతే నీలి అతనికి వివిధ రూపాల్లో కనిపించిందో అటువైపు భయం నిండిన కళ్ళతో చూశాడు. మూలలో ఎప్పటి మాదిరిగానే ఒక సుందరి చిత్రం తగిలించి వుంది.

కళ్ళు మూసుకుని అతను మళ్ళీ పడక మీద వాలాడు.

అతని భార్య కోమల కరస్పర్శ జ్వర తాపంతో ఉడికిపోతున్న అతని శరీరం మీద శాంతిని కురిపిస్తోంది.

# 11. వాత్రక్ నది ఒడ్డున

**పన్నాలాల్ పటేల్**

పన్నాలాల్ పటేల్ జననం క్రీ. శ. 1918. ఈయన జన్మ స్థానం డూంగరపుర జిల్లాలోని మండలీ గ్రామం. అదిప్పుడు రాజస్థాన్‌లో కలిసింది. పన్నాలాల్ నాటకాలు కూడా వ్రాశారు. 'అలప్ ఝులప్' పేరుతో 'జీవనరేఖా' కూడా ప్రచురించారు. అయితే ఆయనకిష్టమైన క్షేత్రాలు రెండే - కథ, నవల. 'వాత్రకనె కాంటె, 'సుఖదుఃఖనాం సాథీ' మొదలైన కథా సంపుటాలు, 'మలేలాజీవ', 'వలా మణాం', 'మానవీనీ భవాయీ' మొదలైన నవలలు ఈయనకి కథారచయితల అగ్ర పంక్తిలో స్థానాన్ని సంపాదించిపెట్టాయి.

★ ★ ★

సంధ్య ఈరోజు ఆకాశానికి పూర్తిగా జేగురు రంగుని పులిమింది. శాంతంగా ప్రవహిస్తున్న వాత్రక్ నది, నీలినీళ్ళు ఎరుపురంగులోకి మారి పోయాయి. అందు కుడివేపు ఒడ్డునున్న ఒక కొండచరియమీద ఇంటి పెంకులమీద బంగారు రంగునీళ్ళు ప్రవహిస్తున్నట్టుగా వుంది. ఆ తీరాన కొండ చరియలో లేస్తున్న గోధూళి కూడా ఒక ఘడియపాటు బుక్కా పొడైంది. ఇంకా పెరుగుతున్న కార్తీక మాసపు చలిని కూడా ఈనాటి సంధ్యా సమయం గులాబీ పువ్వుని చేసేసింది.

కొండచరియమీద తయారైన ఆ ఇంటిముందు గొర్రెలు మేకలు, ఆవులు-గేదెల అరుపుల వల్ల కోలాహలం చెలరేగుతోంది - కానీ ఆ కోలాహలం కాస్త సేపే ఉంది. పెద్ద జంతువులు పశువుల శాలలో కట్టేసి వున్నాయి. గొర్రెల్నీ - మేకల్నీ ఒక ఇరవయ్యేనిమిది ఇర్వై తొమ్మిదేళ్ళ యువతి ఆరుబట వున్న కంచెలోకి తోలింది. కంచెని మూసివేసి ఆమె వీపు తిప్పి నిలబడింది. ఆమె చూపు శనగపొలానికి అవతల నదీ తీరం మీద పడింది.

తన వెలుతుర్ని వ్యాపింపచేస్తూ ఒక చలిమంట అక్కడ వెలిగింది. సిరాలా నల్లని గెడ్డం-మీసాలు, చెంపల మీద వెంట్రుకల కంటె కొంచెం ఎక్కువ పొడవుగా వున్న జటలతో, మెడమీదకి ముడి వొచ్చేట్టుగా నీరుకావి గుడ్డల్ని సగం కప్పుకున్న ఇద్దరు సాధువులు కనిపించారు. వాళ్ళల్లో ఒకతను

కుండలాంటి సొరకాయ డొక్కులో నీరునింపి కుంటుతూ ఒడ్డుమీదకి వొస్తున్నాడు. రెండవ అతను కొలిమి దగ్గిర తన పటకార్ని పాతిపెట్టే ప్రయత్నంలో ఉన్నాడు. అలాగే చలిమంటలో లావుపాటి కట్టెల్ని కూడా వేస్తున్నాడు.

''ఏం చూస్తున్నావు నవల్? వినబడటంలా, ఆవు అరుస్తోంది?'' అరుగుకోమూల కూర్చుని పశువుల కోసం ధాన్యపు నూక వేసి పొంగించిన దాణాని చల్లారుస్తూ ఒక వృద్ధురాలు అడిగింది. కానీ మళ్ళీ తను కూడా నదీ తీరం వేపు చూస్తూ ఆ సాధువుల్ని చూడసాగింది.

''ఏం లేదు. పెద్దమ్మా, చూడు ఈ చచ్చినాళ్ళకి ఇక్కడికే వొచ్చి చలిమంట వేసుకోవాలని ఎందుకోసం తట్టిందో?'' నవల్ స్వరంలో తేలిక భావం ఉంది, సహజత్వం ఉంది. కానీ నదీతటం మీదవున్న నీలి కళ్ళల్లోనూ ముఖం మీది కోమల చర్మం మీదా పూర్తిగా పరుచుకుని వున్న గాంభీర్యం క్షణక్షణం పెరుగుతోంది.

''కావచ్చు. మనకేం! నక్కచావు వొచ్చిందంటే పట్టణం వేపు పరిగె డతారు. క్రితం సంవత్సరం ఒక మదారీ (మదారీ = ఎలుగుబంట్లనీ, కోతుల్నీ ఆడించే ఒకరకం ముసల్మాను ఫకీరు) ఇక్కడే పట్టుబడ్డాడని ఈ మూర్ఖులకి తెలియదులా వుంది. మూడేళ్ళనించి అదేపనిగా ప్రభుత్వం కళ్ళు ఈ యింటి మీద వున్నాయి...''

నవల్ గనక శ్రద్ధగా పెద్దమ్మ మాటలు వినివుంటే బహుశః ఆమెకి నవ్వొ వచ్చివుంటేది – ఈ వెర్రిదానికేం తెలుసు అనుకుంటుంది లావుంది. ఈ యింటి మొగాడు మూడేళ్ళ క్రితం గ్రామాధికారి కొడుకుని ఖూనీ చేసి పారిపోయాడు మరి.

నవల్ ధ్యాసంతా ఆ ఇద్దరు వ్యక్తుల మీదే లగ్నమై వుంది. ముంగిలిలో ఆమె పేడ పోగుచేస్తోంది, యాంత్రికంగా.

పెద్దమ్మ లబలలాడుతోంది – ''ఆ చచ్చినాడు పారిపోనే పారిపోయాడు. వాడు పట్టుబడుంటే ఇటువంటి అమాయకులు ఉచ్చులో చిక్కుకోరు. వాడు మొదటిది (నవల్) ఎదురు చూస్తూ కూచుంటుందని కూడా ఆలోచించలేదు.''

సామాన్యంగా పెద్దమ్మ మాటలు అసంగతంగానేనా వుంటాయి. లేకపోతే తలకిందులుగానేనా వుంటాయి. దాణాతో నిండిన తట్టనెత్తి ఆమె నవల్‌తో అంది – ''తీసుకో ఈ తట్ట. గేదెకి పెట్టు త్వరగా.''

''దౌర్భాగ్యులు, ఇటువంటి మూర్ఖులు బాగా తిరుగుతున్నారు.''

నవల్ చెప్పాలనుకుంది - ''కానీ పెద్దమ్మా వీళ్ళు మన ఇంటి గురించే మాట్లాడుకుంటున్నట్టున్నారు. చూడరాదూ, ఇటువేపే మొహం పెట్టి బీడీలు తాగడానికి కూచున్నారు.'' కానీ ఎందుకో ఇవాళ పెద్దమ్మ ఎదురుగా ఇలా మాట్లాడడానికి ధైర్యం చాలలేదు. పైగా ఇటువంటి మాటల వల్ల ఉపయోగం కూడా ఏముంది!

నవల్ దాణాతట్ట పశువుల శాలలో పెట్టి వొచ్చింది. ఇంకేమీ తోచక అరుగు మీదికి వెళ్ళి కూర్చుంది. పని వొంకన ఆమె పేనుతున్న, పశువుల్ని కట్టే కన్నెతాడు తీసుకుని అందులో ముడులు వెయ్యడం ప్రారంభించింది. కానీ కళ్ళు సరాసరి నదివేపు లగ్నమై వున్నాయి.

ఒకసారి ఆమె ఇదికూడా యోచించింది. ఏమనంటే పెద్దనాన్న వొచ్చుంటే ఆయన్ని పంపించి అడిగించేది. ఇంత ప్రపంచం ఉంది. ఆ తీరాన ఎదురుగానే కాళీమాత గుడీవుంది. గ్రామం వుంది. అక్కడికి పోక వొచ్చి వొచ్చి నాగుండెల మీదే చలిమంట వెయ్యడంలో అర్థమేవిఁటి? లేకపోతే మళ్ళీ ఈ చచ్చినాళ్ళు కూడా ప్రభుత్వం వాళ్ళే (గూఢచారులు) అయుంటారా?

ఇంతలో పెద్దనాన్న వొస్తూ కనబడ్డారు. పశువుల్ని మేపి ఆయన మొదట ఇంటివేపు తోలారు. ఎద్దుల్ని మాత్రం పొలం మీద మేపడానికి వెనక వుంచేశారు. ఇప్పుడాయన గుర్రాల్లాంటి రెండు ఎడ్లతో వొస్తున్నారు. ఆయన్ని చూస్తూనే నవల్ ఆయన ధ్యానాన్ని అటు తిప్పింది - ''చూడు పెద్దనాన్నా, ఎవరో ఇక్కడ విడిది చేశారు.''

కానీ పెద్దనాన్న శ్రద్ధ చూపలేదు - ''చెయ్యనీ. కొద్దిగా తినడానికేదన్నా అడుగుతారు మనల్ని అంతేగా!'' అంటూ ఎద్దుల వెనకే ఆయన ఇంట్లోకి వెళ్ళిపోయారు.

నవల్‌కి ఎంతో ఆశ్చర్యంగా వుంది. ఇవాళ ఆమె ఆ నిర్విచారి, ఆ ఖూనీ చేసిన మనిషిని గురించి ఎందుకు గుర్తు చేసుకుంటోంది? పైగా మూడు సంవత్సరాలు గడిచిపోయిన తర్వాత?... అంతే కాదు, ఎనిమిదేళ్ళ క్రితం కోపమొచ్చి ఎక్కడికో వెళ్ళిపోయిన తన రెండో భర్తని కూడా గుర్తు చేసుకుంటోంది. ఇలా ఇద్దరు భర్తలూ ఒకేసారి గుర్తు రావడం ఎన్నడూ జరగలేదు. పైగా ఇవాళ ఆ ఇద్దరు సాధువుల్నీ చూస్తే ఆమెకి తన ఇద్దరు భర్తలూ ఒకేసారి గుర్తుకొస్తున్నారు. అరే, ఆమె మనసునించి దూరమైన మొదటి భర్త అందగాడు కాదు, రెండో భర్త హంతకుడు. అతను కూడా దూరమైపోయాడు.

పెరుగుతున్న చీకట్లో ఆ ఇద్దరు వ్యక్తులూ తనవేపే వస్తూండటం

చూసిందామె. ఆమె నిలబడింది. చటుక్కున తలుపు దగ్గిరకివచ్చి కాసేపు నిలబడి తరువాత ఇంట్లో కెళ్ళిపోయింది.

ఇరవయ్యేనిమిదేళ్ళ వయసులో ఈ రోజు మొదటి సారిగా నవల్‌కి ఎందుకు భయమేసిందో తెలీదు. ఆమె క్షోభ కంతులేదు. ఇంట్లోకెళ్ళి ఆమె హఠం చేస్తున్న మనసుతో చెప్పింది కూడా – ''నాళ్ళిద్దరూ మంచివాళ్ళు – ఉత్తములు, మిగతా కుర్రాళ్ళలాంటి వాళ్ళు కారు, ఒకవేళ వీళ్ళూ... చూట్టంలా, వీళ్ళలో ఒకతను కుంటివాడే? ఇంక రెండో అతను...అతను బలహీనంగా సన్నగా వున్నాడు, మొదటి వాడెంతో లావుగా వున్నాడు.

పెద్దనాన్న, పెద్దమ్మ ఒక విధంగా నవల్ సంరక్షకులు, మరోవిధంగా ఆమె కాశ్రితులు కూడా. తండ్రి మరణించిన తరువాత నవల్‌కి ఒక ఆశ్రయం అవసరమన్నది అనుభవమయింది. ఇందుకే ఆమె పెద్దనాన్ననీ, పెద్దమ్మనీ తన దగ్గిరకు పిలిపించు కుంది. పెద్దమ్మకి నలుగురు కోడళ్ళు, కానీ ఒక్కళ్ళు కూడా ఆవిడని తమదగ్గిర అట్టే పెట్టుకోలేదు. అందుకే ఆ వృద్ధుడూ, వృ ద్ధురాలూ అనాధలయ్యారు. నవల్ ఆశ్రయంలో బతుకుతున్న కారణంచేత వాళ్ళు నవల్ ఇష్టాయిష్టాల్ని ఆదరిస్తున్నారు. దేనికేనా సలహా కూడా ఇస్తారు. పునర్వివాహంలాంటివి– అదికూడా నవల్ ఇష్టాన్ని గ్రహించి.కానీ ఈ రోజు ఆ ఇంటి యజమానురాలు నవల్ తనే వాళ్ళకి భయపడుతోంది – ముఖ్యంగా పెద్దమ్మంటే.

పాలు పితుకుతూ పెద్దమ్మ అకారణంగా ఇటునుంచి అటూ అటునుంచి ఇటూ తిరుగుతున్న నవల్‌ని చూసి అంది – ''చీకట్లో నువ్వేం చేస్తున్నావమ్మా. దీపం వెలిగించూ.''

నవల్ స్మృహలో కొచ్చింది. దీపం వెలిగించి ఆమె పశువులశాలకీ, ఇంటి గడపకీ మధ్య కట్టిన మోకాలంత ఎత్తు అరుగు మీద ఉంచింది. లోపల్నించి బియ్యం తెచ్చి చెరిగిన తర్వాత దగ్గిరే కట్టిన పొయ్యి ముందు కూర్చుంది. పొయ్యిలోని మంట వెలుగులో బియ్యం ఏరసాగింది.

పాలు పితికే పాత్రలో పాలు పొయ్యడానికి వెడుతూ పెద్దమ్మకి ఇలా చెప్పాలనిపించింది – ''పొయ్యి ముందు కూచునెవరేనా బియ్యం ఏరతారా?'' కానీ ఆమె చెప్పలేదు. బయట కుక్క మొరగడం ప్రారంభించింది. దాని అరుపు విని పెద్దమ్మ మండిపడింది – ''ఈ మూర్ఖపు కుక్క రాత్రీపగలూ మొరగడానికే కాబోలు పడుంది!''

సామాన్య పరిస్థితుల్లో నవల్ తప్పకుండా చెప్పేది – ''అయితే

నువ్వేనా ఏవిఁటి తక్కువ మొరిగేది పెద్దమ్మా! దొంగలూ, మోసగాళ్ళూ పగలు నీకు భయపడతారు - రాత్రి ఈ కుక్కని చూసి!'' కానీ నవల్ ఇప్పుడు సమాధిలో వున్న యోగుల మాదిరి ఈ ధ్యాస లేకుండా ఉంది. నదీ తటం మార్మోగేటట్టు కుక్క మొరుగుతున్నది కూడా ఆమెకి వినిపించడం లేదు.

చిన్న వంటగిన్నెలో బియ్యం పోస్తున్న నవల్ చెవుల్ని సూటిగా ఆమె హృదయం మీదుగా ఒక శబ్దం తాకింది.

వాకిట్లో రాళ్ళ మీద టక్-టక్ మంటూ లాఠీ శబ్దం. ఒక వ్యక్తి తాలూకు చెప్పుల శబ్దం వినవస్తే నవల్ చూడకుండానే గ్రహించింది, కుంటి సాధువు చెప్పులు వేసుకోలేదని. మొదటి వ్యక్తి కంఠస్వరం వినబడింది ''జై సీతారాం కాకా!''

ఒక్కసారిగా ఆమె అంతరాత్మ చెప్పింది - ''ఇద్దరిలో ఒకరు ఆయనే ఇది ఆయన కంఠస్వరమే!''

పెద్దనాన్న తలుపు దగ్గిర పడేస్తున్న మంచాలమధ్య చలిమంట రగిలిస్తున్నారు. సాధువులకి స్వాగతం పలుకుతూ అన్నారు - ''రండి స్వామీజీ! దయచేయండి.''

ఒక సాధువు మంచాన్ని ఎత్తి ఎదురుగా వేసి చలిమంటకీ, తలుపుకు అభిముఖంగా కూచుని చెప్పాడు - ''ఇక్కడే ఒకదానిమీదే ఇద్దరం కూచుంటాం'' కుంటి అతను కూడా అదే మంచమ్మీద కాళ్ళు పెట్టుకునే వేపు కూచున్నాడు.

బయట మేకల మంద వున్న కంచె కెదురుగా కట్టేసిన కుక్క మొరగడం మాని కోపంతో గుర్రుమనడం ప్రారంభించింది. ఇంట్లో పెద్దమ్మ వాగుడు కూడా ప్రారంభమైంది - ''చూడు సీతారాం అనడం మాత్రం వొచ్చు! ఇంకోళ్ల సంపాదన మీద బతకడం, తిరుగుతూండటం...!''

నవల్ చెవులు బయటే లగ్నమయ్యాయి, మర్చిపోయి పొయ్యిలో ఎక్కువగా కర్రలు వేస్తూ వింటోంది - వాళ్ళిద్దర్లో ఒకతన్ని తన మొదటి భర్త అని అనుకుంటోంది. పెద్దనాన్నని అడుగుతున్నారు - ''కొడుకులెందరు?.... నలుగుర్లో ఒక్కడు కూడా ఇక్కడ లేడా?... ఏ కోడలూ తన దగ్గిరుంచుకోదూ?... చాలు మీరిద్దరేగా?... బాగుంది. ఈ ఇంటి యజమానురాలు వరసకి మీకు కూతురవుతుందా?... ఆమె ఒంటిరిదా?...''

పెద్దమ్మ గుమ్మంలో పిల్లిమాదిరిగా కళ్ళు తిప్పుతూ నిలబడింది. ఆమె

అడక్కుండా ఉండలేకపోయింది - ''ఇదంతా నువ్వు దేనికోసరం అడుగుతున్నావు బాబాజీ?'' అడుగుతూ ఆమె నడుము మీద చెయ్యుంచుకుని ఆ సాధువు కెదురుగా వెళ్ళి నిలబడింది.

''కారణమేదీ లేదమ్మా... కా... కానీ సంసారులతో మరేం మాటలు మాట్లాడగలం?'' సాధ్యమైనంత తియ్యని స్వరంలో చెప్పాడు సాధువు.

కోపాన్ని అణుచుకుంటూ నిలబడ్డ పెద్దమ్మ గొంతు పెంచుదామనుకుంది గానీ ఈ కాస్త మాటతో సాధుబాబా ఆమెని అవరోధ పరిచాడు. ... దాంతో ఆమె చలిమంట దగ్గిర కూలబడి మాట్లాడసాగింది.

''పొయ్యిలో పడినట్టే వుంది అవతారాలూ, ఈ ప్రపంచమూను! బాబాజీ భగవంతుడింట్లో వంద మణుగుల తైలముండీ చీకటే కాకపోతే...'' రెండు తలుపుల మధ్యవున్న చీకటి నుపయోగించుకుని వొచ్చి కూర్చున్న నవల్ వేపు వేలు చూపిస్తూ చెప్పింది - ''ఇది మా నవల్ అయిదుగురు అన్నగార్లు మరణించిన తర్వాత ఒంటరిదైంది! తల్లి చిన్నప్పుడే చనిపోయింది. ఇంక తండ్రి ఎలాంటివాడు దొరికాడంటే గ్రామం గ్రామంతోనే విరోధం పూనాడు. మరి నువ్వే చెప్పు బాబాజీ కూతురి కిక బైట సంబంధమే చూడాలిసి వస్తుందిగా? మరిపోతే ఇల్లరికం ఎవరొస్తారు? ఎక్కడా పెళ్ళవని వాడన్నా రావాలి లేదా అనామత్తు ఇంటికి చెందిన వాడైనా రావాలి! ''పెద్దమ్మ కళ్ళు విప్పార్చుకుని కొంచెం దూరం చూస్తోంది, మళ్ళీ చెప్పింది - ''ఇంకదే జరిగింది. నాతల్లి నెత్తిమీద మొదటి వరుడు పనికిమాలిన వాడు పడ్డాడు...''

''ఎందుకు పనికిమాలిన వాడయ్యాడు తల్లీ?'' మొదటి సాధువు అడగాల్సివచ్చింది.

''ఎందుకేవిఁటి? వాడి తల్లి ఎవరో తెలీదు. తండ్రి ఎవరో తెలీదు. మేనమామ ఇంట్లో వుండే వాడని చెబుతారు. మా అమ్మాయి చెప్పింది అతను ఏదో సంతలో మా నవల్‌ని చూశాడని...'' ఒక్కసారి ముసలామె కనుబొమలు ముడిపడ్డాయి - ''మూర్ఖపు చచ్చినాడు, సిగ్గులేని వాడు! సిగ్గూ, లజ్జా వొదిలేసి ఇక్కడికి ఇల్లరికపుటల్లుడై ఒచ్చేశాడు. ఇప్పుడు నువ్వే చెప్పు బాబాజీ పనికిమాలినవాడు కాకపోతే ఇక్కడి కొచ్చి పడుంటాడా? ఇంకా మళ్ళీ ఒక పనీ లేదూ పాటా లేదు. కబుర్లుంటే చాలు. మా రైతు కుటుంబాల వాళ్ళకి ఒకటిన్నర శేర్ల చెమట ధారపొయ్యాల్సొస్తుంది. పైనించి ఠాకూర్లవంటి ఇనాందార్లు! ఇటువంటి వాణ్ణి మా చెల్లిలి భర్త ఎలా భరిస్తాడు? మళ్ళీ ఇంత ఖర్చు పెట్టి పోషించేవాడు కూడాను! తెల్లారుతూనే ఒక రూపాయి కావాలి వాడికి నల్లమందు మింగడానికి, ఇందుకే మామా అల్లుళ్ళ

మధ్య ఘడియపాటు కూడా పొసగలేదు. ఆఖరికో రోజు ఇద్దరూ పోట్లాడుకున్నారు. మామ గారు చెయ్యెత్తాడు. అల్లుడు ధూ-ధూ అనుకుంటూ బయటికొచ్చేశాడు. దీని మీద కూడా ఆ మూర్ఖుడు చాలా కోపగించుకుని ఆ రాత్రే ముఖం మీది కెత్తుకుని ఎక్కడికో వెళ్ళిపోయాడు. వాడి మేనమామ ఇంట్లో కూడా కనుక్కున్నారు, కానీ వాడక్కడుంటేగా! మూర్ఖుడు పాతాళంలోనే కలిసిపోయుంటాడు!

మొదటి సాధువు ఒకసారి దీర్ఘంగా నిట్టూర్చాడు. కానీ కుంటివాడు కించిత్తు క్రోధంతో ఆమె వేపు చూడసాగాడు. కోపంతో ఒళ్ళు మరిచి అనేసాడు - ''అతనే ఈ ఆటంతా నడిపాడా!''

''అవును బాబాజీ!'' అవకాశం వచ్చిందే తడవుగా అవునని చెప్పి సంతోషించి ఆ ముసలావిడ అతని వేపు ఆపేక్షగా చూసింది. కానీ మొదటి సాధువు కుంటివాణ్ణి మోచేత్తో పొడిచి అతను మాట్లాడిన మాట బాగులేద న్నట్టుగా మొహం పెట్టాడు. కుంటతను సంబాళించుకున్నాడు.

ముసలావిడ తన ధోరణిలోనే వుంది - ''అయినా కూడా బాబాజీ మా నవల్ ఇవాళొస్తారు రేపొస్తారు అనుకుంటూ పూర్తిగా నాలుగేళ్ళు వాడి రాక కోసం ఎదురు చూసింది...'' తలూపుతూ స్వగతంలో అనుకుంటు న్నట్టుగా కొనసాగించింది - ''ఓడిపోయి చివరికి మరొకణ్ణి పెళ్ళాడింది. కానీ ఆ మూర్ఖుడు కూడా బయటూరివాడే. ఆ చచ్చినాడికి బంధువులెవరో ఉన్నారు. వాడికి ఏడుగురు అన్నదమ్ములున్నారనీ, తల్లిదండ్రులు ఇప్పటికీ బతికే వున్నారనీ ఎవరో చెప్పారంటారు. కానీ స్వభావమెలాంటి దంటే అన్నదమ్ములతో ఏదో విషయం మీద దెబ్బలాటొచ్చి ఇంటినించి వెళ్ళిపో యాట్ట. అలా తిరుగుతున్న వాణ్ణి వాడి గ్రహ నక్షత్రాలు ఇక్కడికి తీసు కొచ్చాయి. మా చెల్లెలి భర్తని మంచి చేసుకుని ఇక్కడ భాగస్వామై ఉంటానికి ఇక్కడి కొచ్చాడేమో తెలీదు! మరుసంవత్సరమే భాగస్వామల్లా ఇల్లరి కపుటల్లుడై కూచున్నాడు!''

'వాణ్ణి కూడా బాబాజీ, నేనొక్కసారే చూశాను.'' ముసలావిడ ముఖం మీద కాస్త ఆనందం పులుముకుంది - ''నేనైతే చూడగానే అర్థం చేసుకున్నాను పనికొచ్చేవాడేనని కానీ తిండిపోతు - రాక్షసుల్లాగా తినిపోతాడు. నాలుక చూస్తే కాస్తంత! రెండు మాటలకి ఒక్కమారే జవాబిస్తాడు! మరి నువ్వే చెప్పు నవల్ తండ్రికి ఎందుకు నచ్చడో?''

''బాగానే వుంది.'' మొదటి సాధువు గర్జించాడు. దాంతో పాటు

నిట్టూర్పునూ నిట్టూర్చాడు.

ముసలావిడ ఇప్పుడు కూడా తన ధరణిలోనే వుంది "మరి మహారాజ్! మా నవల్ ఎంత ఉత్తమురాలంటే గుంజకు కట్టేసినా సరే అలాగే ఉండిపోతుంది. అది స్వతహాగా మంచిది. దాని చేతిలో పని మంచిది, నల్లమందు వ్యసనమున్న తన తండ్రికి ఎంతో చాకిరీ చేస్తుంది. ఇద్దరల్లుళ్ళు ఇంట్లో వున్నారు. కానీ ఇది వాళ్ళలో ఒక్కడితో కూడా ఎన్నడూ దెబ్బలాడెరగదని చెప్పుకుంటూంటారు." ముసలావిడ కంఠం రుద్ధమవసాగింది "కానీ మూర్ఖపు భగవంతుడే చేతులు కడుక్కుని దీని వెనకాల పడ్డాడు. ఇన్నిన్ని ప్రయత్నాలు చేసిన తర్వాత కూడా వాడు దీన్ని సుఖమన్నది చూడనివ్వలేదు. తెలీదు ఎందుకనో ..." మరింక మాటల బదులు రోదన ద్వారా ఆమె తను చెప్పాల్సింది చెబుతోంది.

పెద్దనాన్న కూడా కళ్ళు తుడుచుకోసాగాడు. తలుపుల వెనుక కూర్చున్న నవల్ కళ్ళయితే ఎప్పట్నించి కరిగి ప్రవహిస్తున్నాయో తెలీదు. ఎవరైనా చూసుంటే బహుశః కుంటి సాధువు నీళ్ళు నిండిన కళ్ళు కూడా కనబడుండేవి.

మాట తమాయించుకోలేని ఆ సాధువు కూడా బాధపడ్డాడు - "అహఁ, తరవాతేంజరిగింది. పూర్తిగా చెప్పమ్మా?"

"ఏవిఁటి పూర్తి, ఏవిఁటి అసంపూర్తి, బాబాజీ!" లబలబ లాడుతూ పెద్దమ్మ పెద్ద నిట్టూర్పు వొదిలింది. తిరిగి ప్రారంభించింది - "ఎదుటి గ్రామం నాయకుడు మా మరిదిగారి మనిషి నొకణ్ణి చంపేశాడు. అందుకే అతనితో పాత కక్ష రగులుతోంది. ఇరవయ్యేళ్ళుగా ఇద్దరికీ బద్ధవైరం పైగా... గ్రామనాయకుడి మూర్ఖపు కొడుకు తన గ్రహచారం చెడి మూడేళ్ళ క్రితం నాలుగు నెలల కోసారి జరిగే సంతలో నవల్‌ని వేధించాడు."

పెద్దమ్మ దీర్ఘంగా నిట్టూర్చి తన జీర్ణశీర్ణమైన నిప్పు నూదే గొట్టంతో మంటని ఊది చెప్పింది - "ఆ రాత్రి నవల్ తండ్రి రెండు చేతులతోనూ గుండె బాదుకుని పెద్దగా ఏడిచాడని అంటారు, విన్నవాళ్ళు. ఆ రాత్రి తెలికపాటి వర్షం పడుతోందనీ, ఆ చీకటి రాత్రిలో ముసలాయన ఏడుపు నదీతీరంలోని అడవి ఏడుస్తున్నట్టనిపించిందని ఈ రోజుకీ చెబుతారు. ఇటు పోయిన తన అన్నగార్ల కోరిక తలుచుకుని నవల్ కూడా ఏడుస్తూండేది... నవల్ ఏడవటంలేదనీ, వాత్రక్ నదే పొంగి పొరలి ఏడుస్తున్నట్టుందనీ అంటుంటారు."

ముసలావిడ మళ్ళీ స్వగతం చెప్పుకుంటున్న తీరులో తలూపడం

ప్రారంభించింది. చెప్పింది – ''అలాగే జరిగుంటుంది. అప్పుడే ఆ అల్లుడికి – ఆ పరాయి మగాడి – మనసులో కోపం వచ్చుంటుంది. అతను సంతనించి తిన్నగా వెళ్ళి పోయాడనీ, ఆ కటిక చీకట్లో అతను నది నీటిని కూడా ఖాతరు చెయ్యలేదనీ చెప్పుకుంటారు. గ్రామనాయకుడింటి మిద్దెమీద నిద్రపోతున్న తన శత్రువుని లేపి చంపేశాడనీ, ఇంటికొచ్చి మామగారికి ఆనందాన్ని కలిగించే ఆవార్త చెప్పసాగాడనీ కానీ ఇంతలో నవల్ అతని నోటికి చెయ్యడ్డం పెట్టి అతన్ని దారి మళ్ళించి అడవి వేపుకి నెట్టి – ''వెళ్ళండి, భగవంతుడు మీకు మేలు చేస్తాడు'' అంటూ పంపేసింది. అంతే ఆ రోజు నించి ఆనాడు, నాటినించి ఈ రోజు!

నిట్టూర్చి పెద్దమ్మ మళ్ళీ చెప్పింది – ''ఇటీవల మూడేళ్ళనించి పంటలు తగ్గిపోయాయి బాబాజీ! ఆ పిరికివాడి జాడా లేదు, నవల్ ఇల్లు నిలబెట్టుకోవాలనీ ఆలోచించటం లేదు...''

అప్పుడే వేగిరపాటుతో నవల్ కంఠస్వరం వినిపించింది – ''అర్ధరాత్రయి పోయింది. తిండెప్పుడు తింటాన్ పెద్దమ్మా!'' పెద్దమ్మ ఉలిక్కిపడి లేచింది. ''వీళ్ళకి శేరు బియ్యం ఇస్తే ఇచ్చి ఇక్కణ్ణించి బయటికి పంపించు'' అందామె (నవల్).

సాధువులు ఆగ్రహం చెందలేదు. బియ్యం దొరికిన మీదట కూడా వాళ్ళు లేవలేదు.

నవల్ పెద్దనాన్నని కూడా భోజనానికని లోపలికి పిలిచింది. అయినా కూడా ఆ తృప్తిలేని మనుషులు లేవలేదు.

నవల్ బయటికి వచ్చి వాళ్ళ ముందు నిలబడి చెప్పాల్సొచ్చింది – ''మృత్యుముఖంలో ఎందుకూర్చున్నారు?''

''మేం నీతో కొంచెం మాట్లాడాలి. కొన్ని అడగాలి...'' సంతోషంతో మొదటి సాధువు అన్నాడు. అతనింకా ఇంకా ఇలా ఆలోచిస్తున్నాడు – చలిమంట వెలుతుర్లో ధూప ఛాయవంటి నవల్ కళ్ళతో చూపులెలా కలపాలి.

మరోవేపు కుంటి సాధువు కళ్ళు చంచలాలయ్యాయి. అవి నవల్ దేహలతని కొలుస్తున్నాయి. అతను చెప్పాలనుకున్నాడు – ''కానీ నువ్వు కడుపునిండా తింటున్నావా లేదా? చూడెంత చిక్కిపోయావో'' కానీ అతని నోటినించి వెలవడింది – ''నన్ను పోల్చావో లేదో నువ్వు ముందు చెప్పు...?''

ఆ అమాయకమైన మంచితన మొలికే కంఠస్వరం వేపు తిరిగి నవల్ కళ్ళలో స్నేహం నిండిన ఒక వెల్లవ వొచ్చింది. తిరిగి శాంతించింది. కొంత దయతోనూ, కొంత దుఃఖంతోనూ నిండిన కళ్ళతో చూస్తూ ఆమె అడిగింది

– ''ఆఁ, కానీ ఈ కాలెక్కడ పోయింది?''

''వాడే పోగొట్టాడు...'' అతనికి తొందరగా వుంది తన ప్రశ్నకి జవాబు తెలుసుకోవాలని. చెప్పాడు – ''ఆ హత్య జరిగిన నాటి రాత్రి పారి పోతూండగా, కానీ నువ్వు ముందు నీ విషయం...''

నవల్ క్రూరంగా మారింది – తన గురించే కాదు వాళ్ళిద్దరి గురించి కూడా స్నేహ భావంతో వున్న వాళ్ళ ప్రశ్నల్ని గొడ్డలితో నరికినట్టు చెప్పింది – ''ఇదంతా వొదిలెయ్యండి. మీరు లేవండిక్కడి నించి. నా మాట వినేట్టయితే మీ ధోరణిలో పోకుండా, ఇక్కణ్ణించి వెళ్ళిపొండి తిన్నగా...'' తిరిగి ఆమె కుంటిసాధువు వేపు చూసి నెమ్మదిగా చెప్పింది – ''ఇక్కడ అన్ని వేపులా ప్రభుత్వ గూఢచారులున్నారు. అందుకే... వాక్యం సగంలోనే వొదిలేసి తనే తలుపు వేపు వెడుతూ చేత్తో సంకేతం ద్వారా చెబుతోంది – ''వెళ్ళండి, లేవండి, పారిపొండి...''

మొదటి సాధువు సాహసం చేసి లేచి నిలబడ్డాడు – ''కానీ... కానీ మేం ఇక్కడ చావడానికే వొచ్చాం. ఒక చిన్నమాట నిన్ను అడగాలి...''

కుంటి సాధువు అతన్ని కసురుకున్నాడు – ''అరే మంచి మనిషివే! ఇందులో ఈమె నడగడాని కేముంది? నేన్నీతో ఏం చెప్పానో అదే...''

ఒక్కసారిగా నవల్ వెనక్కి తిరిగింది – బహుశః ఈ తిరుగుడేమిటో తెలుసుకోవాలనా లేక కాలయాపన చెయ్యడానికా ఆమె ఒక్కసారిగా మంచం దగ్గర కొచ్చి నిలబడి అడిగింది – ''కానివ్వండి, అడగండి ఏమడగాలో?''

మొదటి సాధువు నిజంగా భయపడ్డాడు. ఇది ఏదో రూపాయల – పైసల వ్యవహారం కాదు వెంటనే లెక్కచెప్పి కూచోడానికి అందుకే అతను సందేహించాడు – ''అడగాల్సిందేమంటే... నువ్వు కాస్త స్థిమితంగా కూర్చుంటే...''

ఈ విధంగా అతను నంగి నంగిగా మాట్లాడ్డం అసహ్యమేసింది. అతనన్నాడు – ''అన్ని విధాల అటూ ఇటూ తిప్పి చెప్పే బదులు...'' మళ్ళీ తనవేపు చూస్తున్న నవల్‌ని అతనే అడిగేశాడు – ''నే చెప్పేదేమంటే ఇక్కడుండేది ఇతనా నేనా...''

నవల్ కంగారుపడింది – ''అయ్యో రామా! మీరా లేక ఈయనా? ఎవరైనా వుండొచ్చు. కానీ పోలీసులు పట్టుకుని తీసుకుపోతారు. చిక్కేమిటంటే పోలీసులు ధూర్తులు, గ్రామంలో ఎవడూ మిమ్మల్ని పోల్చుకోలేరు. అందుకే ఎవరు దొరికితే వాడే దొంగ. అందుకే నేను మీకు చేతులు జోడిస్తున్నాను.'' నవల్ నిజంగానే చేతులు జోడించింది. మళ్ళీ

మొదటతని వేపు చూస్తూ- ''ఇక లేచి వెళ్ళడమే చెయ్యండి...''

''అరె నేనేం చెబుతున్నానూ? పోలీసుల దగ్గర కెళ్ళి నాకు నేను లొంగిపోతానన్న మాటే నేను చెబుతున్నాను. మళ్ళీ ఇతన్నెవరు...'' కుంటతని మాటని మధ్యలోనే తుంచి మొదటతను నవల్ వేపు చూస్తూ చెప్పాడు – ''అలా జరగటానికి వీల్లేదు. ఇతను కుంటి వాడయ్యాడు గనక ఇతన్నెవరూ పోల్చలేరు. నేనే పోలీసుల దగ్గర కెళ్ళి నేరస్థుడనై...''

కుంటతను తన ధోరణిలోనే వున్నాడు, అయితే వ్యాకుల పడు తున్నాడు. తనమాటే కొనసాగిస్తూ అతను నవల్ముందు ప్రాధేయపడ సాగాడు – ''మంచి మాటే! ఇద్దరు భర్తలుండి కూడా నువ్వు ఈ అడివిలో ఒంటరిగా...? అందుకే...''

''బయటికి పద నువ్వు!'' అంటూ మొదటతను నిలబడ్డాడు – ''నేనిప్పుడే ఠాణాకి వెడుతున్నాను...''

కుంటతను ఇది విని మండిపడ్డాడు – ''ఈ మాట నువ్వు మర్చిపో. ఖూనీ చేసింది నేను – పట్టుబడేది నువ్వా! ఇది కలలో కూడా జరగదు.''

నవల్ మతి అసలే అస్తవ్యస్తమైపోతోంది. పైపెచ్చు ఇద్దరూ సాధుహఠం పట్టుకున్నారు. ఆమె ఎంతో వ్యాకుల పడి అంది – ''తల బద్దలు చేస్తున్నారు!'' అని నిజంగానే తల వ్రయ్యలై పోతున్నట్టు విల విల్లాడుతూ ఏడుస్తూ ఆమె ధనా – ధనామని అడుగులేసుకుంటూ వెళ్ళిపోయింది.

పెద్దమ్మ తలుపుదగ్గిర నిలబడి ఈ ఆటని చూస్తోంది. ఆమె లబలబలాడుతూ బయటికొచ్చింది – ''చావండి మూర్ఖుల్లారా. పారిపోరెం దుకని?'' ఇంకా దగ్గిరికొచ్చి చెప్పింది – ''మీ అన్నయ్య (పోలీసు) వొచ్చాడంటే ఇద్దర్నీ పట్టుకుపోతాడు. అందుకని దయచెయ్యండి.'' అనేసి ఆమె కూడా వెనక్కొచ్చింది.

కానీ ఏం తట్టిందో గానీ మళ్ళీ వెనక్కొచ్చి మొదటి సాధువు చెవిలో ఇంచుమించు గుసగులాడుతూ చెప్పింది – ''చెయ్యడం చెయ్యకపోవడం అన్నది నీ మనసుకి సంబంధించిన విషయం. అందులో నవల్ నడిగేదేముంది, మంచి మనిషివే?'' అని వెడుతూ వెడుతూ కుంటతనితో కూడా చెబుతూ వెళ్ళింది – ''ఏం చెయ్యాలనుకున్నావో అదే చెయ్యి. తంటా వుండదు.''

తలుపు భడాక్మని మూసుకుంది. స్తంభించి పోయి చూస్తున్న ఇద్దరు వ్యక్తులకీ అక్కణ్ణించి లేవక తప్పలేదు.

ఏటవాలులోకి దిగుతూ దిగుతూ వాళ్ళలో సంప్రదింపు లయినాయి.

తమ ధోరణిలోకే వస్తూ ఇద్దరూ ఒక నిర్ణయానికొచ్చారు – ''పోలీసులు ఎవర్ని పట్టుకుని తీసుకుపోతే వాళ్ళే నిజమైన నేరస్థులు.''

వాస్తవానికి కుంటతని కంఠంలోంచి ఈ మాట రావడం లేదు. కానీ ఏం చేస్తాడు? మొదటతను వాడికి నవల్ మీద ఒట్టేసి అతని నోరు మూయించాడు. 'నువ్వు నవల్‌ని నా కన్నా కూడా ఎక్కువ సుఖంగా వుంచగలవు' అని మొదటతను అతనికి నచ్చజెప్పాడు కూడా. కుంటతను ఈ మాటకంగీకరించాల్సొచ్చింది.

కానీ జరిగిందేమంటే మరుసటిరోజు ఆర్మీ కమాండెంట్ కోసం కోడిని వెతుకుతూ వొచ్చిన ఒక ఆర్మీ పోలీసు దృష్టి ఈ రెండు కోళ్ళ మీదా పడింది. ఇద్దరూ ప్రాంతీయ భాషలో మాట్లాడుకోవడం, పెద్దమ్మ – పెద్దమ్మ అనడం చూశాడు. వాళ్ళిద్దర్నీ పట్టుకుని తీసుకుపోయాడు.

చాటున కూర్చున్న నవల్ ఆ సమయంలో తన ఏడుపుని ఎంతో కష్టం మీద ఆపుకుంది. వాళ్ళమీద ఎంతో కోపం కూడా వొచ్చింది. తన కోపాన్ని పెద్దమ్మ ముందు వ్యక్తం చేసింది కూడా – ''ఆఖరికి నా గుండెలమీది కొచ్చి...'' ఆపైన ఆమె మాట్లాడలేకపోయింది.

కానీ పెద్దమ్మకి ఒక విధమైన ఆనందం కలిగింది – ''ఏమైనా కానీ ఈ సమస్యకి ఏదో పరిష్కారముంటుంది.'' ఇంకా ఆమె ఏమీ అర్థం కానట్టుగా, ఇద్దర్లో ఎవర్నీ గుర్తు పట్టకలేక పోయినట్టుగా ఇలా చెప్పింది – ''మా బాగా అయింది. చచ్చినాళ్ళు ఆశ్రయం ఏర్పరుచుకుంటారేం. తిండడుక్కోవడం బందయింది. ఆ 'జై సీతారాం' జైల్లో కూచుని అనుకుంటే సరి.'' మనసులో లెక్కేసుకోసాగింది ఆ ఇద్దర్లో ఎవరు పనికొచ్చేవాడు, ఎవరు పనికిమాలిన వాడు అని.

కానీ నవల్‌కి ఇలా పక్షపాతం చూపించడం కష్టసాధ్యం. వాత్రక్‌కి తన రెండు తీరాల్లో ఏదంటే పక్షపాతం? నవల్‌కి మాత్రం ఎడమవేపు విరిగినా చెడే, కుడివేపు విరిగినా కూడా చెడే – కళ్ళు రెండూ తనవే కదా!

అందుకే పోలీసు ఠాణాలో ఆమె ప్రతీదానికీ 'తెలీదు' అని చెబుతూండేది – ''ఈ జీవితంలో నేనెప్పుడూ ఇటువంటి సాధువుల్ని చూడలేదు, ఇంక వీళ్ళని గుర్తించే మాటేవిఁటి సాహెబ్?'' కానీ ఆరునెలల తర్వాత కుంటతను విడుదలయ్యాడు, నిర్దోషైన మొదటతనికి యావజ్జీవ కారాగార శిక్ష పడింది. పెద్దమ్మ ఈ మాట వినిపిస్తున్నప్పుడు నవల్ మనసుకి అనుభవ పూర్వకంగా తెలిసింది తనకి మొదట తనంటే ఎక్కువ ప్రేమని అతని కోమలత్వం, రసికత, అతని ఉగ్ర స్వభావం... అతని ప్రతీదీ ఆమెకి

మంచిగా కనబడింది.

తన కన్నీళ్ళని ఇప్పుడామె ఎక్కువ సేపు ఆపలేదని తెలుసుకుంది. అందుకే కుండ తీసుకుని ఇంటినించి బయట పడింది. చావిట్లో ఆమె కుంటిభర్త దయనీయమైన ముఖమేసుకుని జలజల కురుస్తున్న కళ్ళతో ఆమె వేపు చూస్తూ కూర్చున్నాడు. కానీ నవల్ అతనివేపు చూడను కూడా లేదు. వేగంగా వెడుతూ ఆమె కొండ చరియ నించి కిందకి దిగిపోయింది.

నదీతీరం చేరుకునేలోగానే ఆమె కన్నీటికి కట్టిన అడ్డుకట్ట విరిగి పోయింది. నీటిని చేరుకునే వరకూ బిగ పట్టిన ఆమెపెదవులు విచ్చుకున్నాయి. మళ్ళీ విలపిస్తూనే నవల్ తనని తను తిట్టుకోసాగింది - ''అయ్యయ్యో అభాగ్యురాలా! ప్రపంచంలో నీకతను ఒక్కడే!... ఇన్ని సంవత్సరాల తర్వాత నీ గుమ్మంలో కొచ్చాడు... పెట్టడం, తాగించడం దూరమైతే అతని సుఖ దుఃఖాల గురించి రెండు ముక్కలన్నా అడిగావా నువ్వూ...''

నిర్భాగ్యుడు కుంటతను! నదీ తీరంలో ఇదంతా జరుగుతుందని అతనికేం తెలుసు! లేకపోతే అతను నవల్ వెనకాలే వొచ్చేవాడే కాదు. ఏకాంతంలో అతను తన భగ్నహృదయాన్ని విప్పి చెప్పాలనుకున్నాడు. ''కోర్టులో నేను చాలా ప్రయత్నించాను. కానీ ఆ వాగుడు మనిషి నన్ను మాట్లాడనివ్వలేదు. ప్రభుత్వం వారు కూడా నా మాట వినలేదు. ఉన్న లోటు ఈ విరిగిన కాలు భర్తీ చేసింది... నేను నిజం చెబుతున్నాను. జీవితంలో నేనేదీ మంచిపని చెయ్యలేదు బహుశః చెయ్యను కూడానేమో. కానీ...''

ఇందులో అతనెంత చెప్పగలుగుతాడో ఎవరికి తెలుసు. కానీ ఇందులో కాస్త కూడా అతను చెప్పలేడు. అయినా కూడా కన్నీరు నిండిన కళ్ళతో దైన్యం ఉట్టిపడే అతని ఆకారమేమన్నా తక్కువ చెబుతోందా?

కానీ అయ్యో! ఇటు నవల్ ఇదంతా చూడలేకపోయింది, ఇటు సిగ్గుతో కుమిలిపోతున్న ఆ మనిషీ ధైర్యం చెయ్యలేదు. ధైర్యం చెయ్యడం ఎలా? అన్నల కోర్కెలు తీర్చాలని ఏడిచే నవల్ ఆ రోజు కేవలం అతని మతి చెడగొట్టింది. కానీ ఈ నాటి ఈ విలాపం అతని హృదయాన్ని కూడా బద్దలు చేసింది.

అతను నదీ తీరంలో లేచిన మోదుగచెట్టు కొమ్మని పట్టుకున్నాడు. అతని రెండోకాలు కూడా విరిగినట్టనిపించిందతనికి. అతని అంగాంగాలూ... లేదూ, అతని ఆత్మ వరకూ కంపించింది, పొరబాటున అతని కాలు పువ్వులా కోమలంగా వున్న ఏ బిడ్డమీదో పడితే అయినట్టుగా అతని నోటినించి వొచ్చింది - ''అరె-రె-రె-రె పొరబాటయింది.''

ఈ భయంకరమైన పొరబాటుని సరిదిద్దుకోవటానికా అన్నట్టుగా చివరి ఉపాయంగా అతను విరిగిన కాలు నెత్తి వెళ్ళిపోతున్నాడు. నదీతీరంలోని ఆ మోదుగ చెట్టుతో 'రాం-రాం' చెప్పి అతను చివరిసారిగా వీడ్కోలు తీసుకున్నట్టుంది.

నదీ నీళ్ళలో కూర్చుని ఇప్పుడు కూడా కన్నీళ్ళు కారుస్తున్న నవల్‌తో ఎవరు చెబుతారు - ''చూడు నీ చేతి కొచ్చిన సౌభాగ్యం ఇదుగోపోయింది!'' అని.

అతను నది మలుపుని దాటాడు... కుంటుకుంటూ కొండమీది కెక్కాడు... రెండో వేపుకి దిగుతున్నాడు... ఇంకా... ఇంకా అదిగో, దిగిపోయాడు!

ఇంకా ముందుకెళ్ళిన మీదట అతనికి పశువుల్ని మేపుతున్న నవల్ పెద్దనాన్న కలుస్తారనీ, అతన్ని తిరిగి ఇంటికి తీసుకెడతారనీ ఆశ కలిగింది.

# 12. రక్త సంబంధం

**ఈశ్వర్ పేటలీకర్**

ఈశ్వర్ పేట లీకర్ జననం క్రీ.శ. 1916. జన్మస్థానం ఖేడా జిల్లాలోని పేటలీ గ్రామం. మాధ్యమిక విద్యాభ్యాసం చేసి అధ్యాపకులయ్యారు. దాని తర్వాత సమాజ సేవకునిగా, పత్రికారచయితగా గణుతికెక్కారు. 'గ్రామ చిత్రోం'లో వీరు గ్రామీణ మానసికస్థితి యొక్క అపూర్వమైన గ్రహింపుని చూపించారు. 'జనమటీప్' నవల వీరి కీర్తిని మరింత పెంచింది. 'లోహీసీ సగాయీ,' 'పేటలీకర్‌నీ శ్రేష్ఠ వర్తావోం', 'పేటలీకర్ వార్తావైభవ్' మొదలైనవి వీరి ప్రసిద్ధ కథా సంపుటాలు.

★ ★ ★

లోకులు బాగ్ మంగూని పిచ్చాసుపత్రిలో చేర్చమని అమరత్‌కాకీకి సలహాయిస్తే ఆమె కళ్ళు జలజల కన్నీళ్ళు కారుస్తాయి. అందుకామె ఒకటే ప్రత్యుత్తరమిస్తుంది - ''నేను తల్లినై వుండి దీనికి సేవచెయ్యలేకపోతే పిచ్చాసు పత్రిలో వాళ్ళు మనసులో మాత్రం దీని విషయంలో ఏముంటుంది? అది కుంటి పశువుల్ని పశువుల శాలలో విడిచి రావడం మాట.''

అమరత్ కాకీ మనసులోని ఈ మాట స్పష్టమైనాక ఇప్పుడింకెవరూ ఆమెతో అలాంటివి చెప్పటంలేదు. జన్మతః పిచ్చిది, మూగదీ అయిన తన కూతురికి ఆమె ఏ విధంగా సంరక్షణ చేస్తోందో, ఏ విధంగా సేవ చేస్తోందీ, ఏ విధంగా ముద్దు చేస్తోందీ చూసి ప్రజలు పిచ్చిదైన కూతుర్ని అమరత్ కాకీ ఎంతో బాగా సంరక్షించుకుంటోందని ప్రశంసించారు కూడా. ఇదే ఇంకొక ఇంట్లోనైతే ఆకలికీ - దాహానికి గురై ఎప్పుడో చచ్చిపోయిఉండేది. బతికున్నా కూడా శరీరం ఇలా పుష్టిగా ఉండేది కాదు.

మంగూ కాకుండా అమరత్‌కాకీకి సంతానం మరో ముగ్గురున్నారు. ఇద్దరు కొడుకులు ఒక కూతురు. కొడుకులు చదువుకుని పట్టణంలో ఉద్యోగాల్లో చేరారు. కూతురు పెళ్లి అయి అత్తవారింటికెళ్ళిపోయింది. అమరత్ కాకీ మిగిలిన ముగ్గుర్నీ మర్చిపోయిందా అన్నంతగా తన సంపూర్ణ మాతృత్వంతో మంగూని చూసుకుంటోంది. శెలవులో కొడుకులింటికి వస్తే

ఆమె యిల్లు మనమలూ మనమరాళ్ళు కిలకిల నవ్వులతో నిండిపోతుంది. అప్పుడు కూడా నాయనమ్మ రూపంలో అమరత్ కాకీ ఆనందాన్ని పొందలేక పోతుంది. ఎప్పుడో గానీ ఆమె పిల్లల్ని దగ్గరకు పిలవదు, వాళ్ళకి బువ్వ తినిపించదు, ముద్దు చేయదు.

తమపిల్లల్ని సరిగా చూడదని కోడళ్ళు అమరత్‌కాకీ మీద అన్యాయంగా నిందవేస్తారు. ఆమె వ్యవహారం కూతురు పిల్లల పట్ల కూడా అలాగే వుంటుంది. కానీ తేడా ఎక్కడుందంటే కోడళ్ళు తమ భర్త ఎదుట లబలబలాడుతూంటారు. ఆమె కూతురైతే తల్లి ముఖం మీదే అనేస్తుంది - ''మంగూని అతిగా గారాబం చేసి నువ్వే దాన్నింకా ఎక్కువ పిచ్చిదాన్ని చేసావు. అలవాటు చేస్తే జంతువులు కూడ మలం - మూత్రాలు ఎక్కడ విసర్జించాలో ఎక్కడ కూడదో అర్థం చేసుకుంటాయి. ఎంత పిచ్చిదైతే మాత్రం పన్నెండేళ్లు వచ్చిన పిల్ల అలవాటు చేస్తే ఆమాత్రం తెలుసుకోలేదా? అది మూగది. చెవిటిదేం కాదు చెబితే వినకపోవడానికి. ఒకసారి మర్చిపోయినా రెండు లెంపకాయలేస్తే తర్వాత దానికే గుర్తుంటుంది.''

కూతురింకేదన్నా చెప్పకముందే అమరత్‌కాకీ కళ్ళువర్షిస్తాయి. కూతరిక్కూడా దుఃఖంతో గుండె బరువెక్కుతుంది. కానీ మనసు మీద బండరాయి వుంచి ఆమె తన మనసులోని అక్కసునంతా వెళ్ళ గక్కుతుంది - ''గాబరా చేసి కూతుర్ని సుఖంగా ఉంచుతున్నాననుకుంటున్నా వేమో, నువ్వే దానికి నిజమైన శత్రువ్వి. నువ్వు ఎప్పటికీ ఇక్కడే కూచుంటాననుకున్నావా? వదినల పాలబడిందంటే రోజూ దీని మలమూత్రాలు కడిగే ఝుంఝూటాన్నెవరూ పెట్టుకోరు. దాంతో అది ఏడుస్తూ కూచోవాలి.'' కాస్త ఆగి ఆమె మెల్లిగా చెప్పింది - 'పరాయమ్మే బాగుచెయ్యగలదు' అన్న సామెత అబద్ధం కాదు. పిచ్చాసుపత్రిలో కూడా సదుపాయంగా ఉండదంటే పోనీలే కానీ మలమూత్రాలూ, బట్టల సంగతీ దానికి తెలియాలి కదా. అన్నయ్యల ఇళ్ళలో భగవంతుడు తిండికి లోటు లేకుండా బాగానే ఇచ్చాడు. వొదినలు కూడా గడవని ఇళ్ళనించేం రాలేదు. తినడానికింత పెట్టకపోవడానికి.''

పిచ్చాసుపత్రిని పశువుల శాలతో పోల్చాక ఇతరులిక అలాంటి మాట అమరత్ కాకీ దగ్గిర చెప్పలేక పోయారు. కానీ ఆమె కూతురు మాత్రం చెప్పేస్తూంటుంది - ''పిచ్చాసుపత్రి పశువుల శాలలాంటిదే, మంగూ అక్కడికెళ్ళి చచ్చిపోతే మాత్రం ఏమయింది? కుటుంబానికి విముక్తి కలుగుతుంది.''

అమరత్‌కాకీ కూడా మంగూ మరణిస్తే విముక్తి అనే అనుకుంటుంది, నిర్లక్ష్యం చేస్తూ అంతా తెలిసివుండీ, చావు వేపు నెట్టే ఆలోచనంటే ఆమె

కసహ్యం. స్వార్థంతో అందరూ సొంత వాళ్ళే అవుతారు. నిస్వార్థ భావంతో వున్న సొంతవాళ్ళే నిజమైన ఆత్మబంధువులు. కొడుకులు సంపాద పరులయ్యారు. కూతురు అత్తవారింట్లో హాయిగా తుల తూగుతోంది. ఇంక ఈ తల్లి మరణిస్తే మాత్రమేం? కానీ మంగూకి నిజమైన తల్లిగా వుంటాను. అప్పుడే దాంతో నీకున్న రక్త సంబంధం నిజమైన దవుతుంది. అందుకే కూతురు చెప్పినా కొడుకు చెప్పినా అమరత్ కాకీ మంగూని పిచ్చాసుపత్రికి పంపించి చావు వేపు నెట్టడానికి సిద్ధపడలేదు.

కొడుకులు తల్లి మనసులోని భావాన్ని గ్రహించారు. అందుకే వాళ్ళు అలాంటి మాటలేవీ మాట్లాడరు. దాని గురించి ఎక్కువగా బాధపడీ ప్రయోజనం లేదు. ఎందుకంటే ముగ్గురు అనుభవజ్ఞులైన ఇంగ్లీషు డాక్టర్లు ఏకాభిప్రాయాని కొచ్చి చెప్పారు మంగు రోగం కుదిరే అవకాశం లేదని కొడుకులకి మనసులో ఒక నమ్మకముంది. బహుశః ఎవరైనా శిక్షణ పొందిన నర్సు పర్యవేక్షణలో గానీ డాక్టరు పర్యవేక్షణలో గానీ ఉంచినట్లయితే అలవాటు పడిన మీదట మంగుకి మలమూత్రాలు, విషయంలో క్రమశిక్షణ లభిస్తుందని ఇంట్లో అటువంటి ఏర్పాటు చెయ్యలేరు. అందుకే వాళ్ళు మాట్లాడక ఊరుకున్నారు.

అలాగే అమరత్‌కాకీ తన శ్రద్ధ ననుసరించి ఉపచారం చేస్తోంది. నయంచేసే వాళ్ళు పిలవకుండానే వొచ్చి పడతారు. మంగూ పిచ్చిది. ఇది వింటూనే ఇంగువ లేక శిలాజిత్తు అమ్మేవాళ్ళు మందు తయారు చేయడం ప్రారంభిస్తారు. ఎందుకంటే వాళ్ళు మందెరుగుదురు. వెయ్యి ఉపచారాలు చేస్తే అందులో ఒక ఉపచారమన్నా పని చేస్తుందని అమరత్ కాకీ ఉద్దేశం. అందుకే ఇతరులకి మూర్ఖత్వంగా కనిపించే మాటల్ని సైతం ఆమె చాల శ్రద్ధగా వింటుంది, శ్రద్ధగా వాటిని అమలుపరుస్తుంది. జ్యోతిష్యులు, తంత్రగాళ్ళు కూడా యదాశక్తి సాయం చెయ్యడానికి పరిగెట్టుకొస్తారు. వొచ్చే మార్గ శిర మాసంలో మంగూ గ్రహదశ మారుతుందనీ, అందుచేత అప్పుడు మంగూకి నయమవుతుందని ఒకజ్యోతిష్యుడు చెప్పాడు. అంతే అప్పట్నించి మార్గశిర మాసం దేవతైంది.

మార్గశిరానికి మంగూ పధ్నాలుగేళ్ళదవుతుంది. అందుకే మరత్ కాకీ ఎటువంటి ఊహలు చేస్తోందో ఎవరూ అర్థంచేసుకోలేరు. అంటుందీ – ''పదిహేనో ఏడు దాటుతుంటే కమూకి పెళ్ళి చేస్తాను. మంగూ తెలివైనదైతే ఈ రోజుకి దీనికూ్కడా పెళ్ళి నిశ్చయం చేసివుందును. చూడు మార్గశిరంలో దీని రోగం పోతే... అప్సరసలాంటి రూపం కదా, పిల్లవాడు దీన్ని చూడగానే అంగీకరిస్తాడు.''

మంగూకి నయమైపోయినట్టే ఆమె పెళ్ళి ప్రయత్నాలు కూడా చేస్తోంది అంటుంది – ''కమూ పెళ్ళి సమయంలో ఇంటి పరిస్థితి ఇంత బాగుండలేదు. ఇప్పుడైతే ఇద్దరన్నగార్లూ పట్నంలో చాలా డబ్బు గడిస్తున్నారు. నీళ్ళ మాదిరిగా ప్రవహిస్తోంది డబ్బు. మరి నేను మంగూ పెళ్ళి తక్కువుగా ఎందుకు చేయాలి.''

ఒకసారి మంగూజ్ఞానమున్నదానిలా కాలవలో లఘుశంక తీర్చుకోవ డానికి కూర్చుంటే అమరత్ కాకీ ఎంత ఆనందం పొందిందంటే రోజుల తరబడి అందరి ఎదుటూ అదే పారాయణం చేసేది – ''జ్యోతిష్కుడి మాట నిజమవుతుంది. ఇప్పటి దాకా ఇలా జరగలేదు. ఇవాళ మొదటి సారి మంగూ తనంతట తనే లఘుశంక తీర్చుకోవడానికి కూర్చుంది.''

వినేవాళ్ళకి ఈ మాట మీద విశ్వాసం ఏర్పడటం కష్టం. ఎందుకంటే వాళ్ళెదురుగానే మంగూ లఘుశంక తీర్చుకున్నాక తడిమట్టిని వేలితో గీకుతూంటుంది. అమరత్ కాకీ కనుక అదిచూస్తే జ్ఞానం వున్న అమ్మాయికి నచ్చజెబుతున్న ఊహతో చెబుతుంది – ''మంగూ, అలా మురికి చెయ్యకు తల్లీ!''

మంగూ ముందుకి వచ్చి నిలబడితే ఆవిడకి చెప్పడానికి ఇంకో కొత్త విషయం దొరుకుతుంది. ''నేను పిలవగానే బుద్ధి మంతురాలూ, జ్ఞానం ఉన్న దానిలా లేచి నిలబడింది.''

ఈ విధంగా అమరత్‌కాకీ ఆశలు నింపుకున్న మార్గశిరమాసం వొచ్చింది. అయినా కూడా మంగూ సరిగా అవలేదు. పైగా పట్టణంలో కన్యా విద్యాలయంలో చదువు కుంటున్న ఈ గ్రామం పిల్లే అయిన కుసుమ అనే ఆమెకి పిచ్చెక్కింది. మంగూలాగే ఆమెకి మల మూత్రాల విషయంలో జ్ఞానం లేదు. అమరత్ కాకీకి బాధ కలిగింది. దాంతో పాటు మామూలుగా వున్న పిల్లకి మతిపోతే అందులో ఆశ్చర్యమేముంది, పుట్టకతోనే పిచ్చిది మంగూకి పాపం మతేలేదుకదా అని సంతోషపడింది.

కుసుమని పిచ్చాసుపత్రిలో చేర్చడానికి నిర్ణయమైందని తెలిసి అమరత్‌కాకీకి అది సరైన పనిగా తోచలేదు – ఇవాళదాని తల్లే బతికుంటే దాన్ని పిచ్చాసుపత్రికి పంపేదికాదు. ''తల్లి లేకపోతే అంతా శూన్యమే'' అని ఎవరన్నారో గానీ అది నిజం. ఆమె కళ్ళు మూసుకోగానే మంగూ అన్నగారు మంగూని పిచ్చాసుపత్రిలో పడేసి వస్తాడేమో అన్న ఊహకలిగి ఆమె కంపించిపోయింది.

ఒకనెల తర్వాత కుసుమకి కాస్త గుణం కనిపించిందని కబురు తెలిసింది. మొదట ఆమెనికట్టిపడవేసి వుంచాల్సివచ్చింది. ఇప్పుడామె స్వేచ్ఛగా తిరుగుతోంది. ఇంకేమీ అల్లరి చెయ్యటం లేదుట. మల మూత్రాల విషయంలో పూర్తిగా క్రమశిక్షణ అలవడిందట. ప్రస్తుతం పిచ్చిగా పాటలు పాడటం ఒకటే చేస్తోందిట. డాక్టర్లనడం మరోనెలకి ఇదికూడా తగ్గి పోతుందని

తరువాతి నెలకి కుసుమకి పిచ్చితగ్గిపోయింది. అయినా కూడా మరొక నెలో నెలన్నరో అక్కడే వుంచితే మంచిదన్నారట డాక్టర్లు. అందుకని మూడోనెల కూడ కుసుమ అక్కడే వుంది. ఇంటికి తిరిగి రాగానే ఆమెని చూడ్డానికి గ్రామమంతా విరగబడింది. అందరికన్నా ముందున్నది అమరత్‌కాకీ!

కుసుమకి మతిరావడం చూసి అందరూ అమరత్‌కాకీకి సలహా ఇవ్వసాగారు – ''కాకీ నువ్వొకసారి మంగూని పిచ్చాసుపత్రికి పంపి చూడు. ఆమె తప్పకుండా బాగుపడుతుంది.''

అమరత్ కాకీ పిచ్చాసుపత్రి గురించి చెబితే వ్యతిరేకించ లేదు. అలా ఆమె వ్యతిరేకించకపోవడం ఇదే మొదటిసారి. మాట్లాడకుండా వాళ్ళ సలహాని వింటోంది. మర్నాడు ఆమె కుసుమని ఇంటికి పిలిచింది. ఆమెని దగ్గర కూర్చో బెట్టుకుని పిచ్చాసుపత్రి గురించిన వాస్తవాన్ని అడిగింది. కుసుమ మాటల వల్ల ఆమె మనసులోని చిక్కుముడి విడిపోయింది. తల్లి దయార్ద్ర హృదయంతో సేవ చెయ్యలేకపోతే డాక్టర్లు, నర్సులు మాత్రం చెయ్యలేకపోరు. ఇది తెలుసుకున్నాక ఆమెకి పిచ్చాసుపత్రి పట్ల శ్రద్ధ కలిగింది. ఏ పిచ్చి వాడైనా చెంపకాయ కొట్టినా నర్సులు గానీ డాక్టర్లు గానీ అతని మీద కోపం తెచ్చుకోరనీ, అతన్ని కొట్టరనీ తెలుసుకుంది. మంగూ అదృష్టంలో పిచ్చాసుపత్రికెళితే బాగయ్యే రాతరాసుందేమో ఎవరికి తెలుసు – అన్న ఆశ ఆమె మనుసులో కలిగింది. ఇన్ని వైద్యాలు చేయిస్తే ఒకటి కాకపోతే ఒకటన్నా పని చెయ్యదా? బాగుపడకపోతే తిరిగి యింటికి తీసుకరావచ్చు కదా!

చివరికి అమరత్‌కాకీ మంగూని పిచ్చాసుపత్రికి పంపించడానికి నిర్ణయించుకుంది. అందుకోసరం పెద్దకొడుకుని ఇంటికి పిలిపించడానికి ఉత్తరం వ్రాయించింది. మళ్ళీ ఈ నిర్ణయం తీసుకున్నప్పట్నించి ఆమెకి కంటి మీదా కునుకు లేకుండా పోయింది. అన్ని విదాలా పరాజయం పొందాకనే కదా తను ఈ పని చేస్తోందని పించింది. తన తల మీద పెద్ద భారమేదో పెట్టినట్టు అనిపించసాగిందామెకి పిచ్చాసుపత్రి మీద శ్రద్ధ కలగడం అన్నది

ఒకసాకు. మిగిలే అగాధంలో మరొక కారణం తలెత్తడం ఆమెకి కనిపించింది.

మంగూ పెద్దదవుతోంది. అమరత్‌కాకీకి వృద్ధాప్యం పెరిగిపోతోంది. కోడళ్ళు మంగూకి సేవ చెయ్యరని ఆమెకి తెలుసు. ఎందుకంటే ఇప్పటిదాకా ఇద్దరు కోడళ్ళులో ఏ ఒక్కరూ కూడా ఆమెని తమ వద్దకు వొచ్చి ఉండమని పిలవలేదు. పైగా ఆమె ప్రతీ ఇంట్లోనూ ఈ నాటి మొగపిల్లలు భార్యల అధీనంలో వుంటున్నారన్నది చూస్తూనే వుంది. అందుకే కడుపున పుట్టిన కొడుకుల మీద కూడా ఆమె కెక్కువ ఆశలేదు. ఈ స్థితిలో పరమేశ్వరుడి కృప వల్ల మంగూకి బాగుకావాలనీ, బాగుకాకపోయినా స్వయంగా ఆమెని పిచ్చాసుపత్రిలో చేరిస్తే కూతురికి సేవ చేసేవాళ్ళు ప్రపంచంలో ఎవరో ఒకరున్నారు చాలన్న తృప్తితో మరణించే సమయంలో తన మనసుకి ఒక విధమైన శాంతి వుంటుందన్న యోచనతో అలా కోరుకుంటోంది!

ఇదంతా ఆలోచిస్తోంటే వక్క తడిసిపోయేంతగా అమరత్‌కాకీ కళ్ళునించి నీళ్ళు ప్రవహించాయి. ఆమె హృదయం కేక పెట్టింది - ''సాకు ఏదైనా కానీయ్. అసలు విషయమేమంటే నువ్వు కూతురి సేవతో అలసిపోయావు.'' అమరత్‌కాకీ నిద్ర నుంచి మేలుకుని అంటోంది - ''ఏవన్నావ్? నేనలిసిపోయానా?'' హృదయం రెట్టింపు గట్టిగా అంది - ''ఒకసారి కాదు వెయ్యిసార్లు కాదు!''

తను కొడుక్కి ఉత్తరం వ్రాయించడం తప్పయిందనుకుంది అమరత్ కాకీ. శీతాకాలపు చలిలోదీన్ని పిచ్చాసుపత్రిలోకి నెట్టేంత తొందరే మొచ్చిపడింది? రాత్రుళ్ళు నేను దీనికెన్ని సార్లు కప్పుతానో. పిచ్చాసుపత్రిలో ఘడియ ఘడియకీ దీనికెవరు కప్పుతారు? వేసవికాలంలో పంపితే మంచిది.

కానీ కొడుకు ఉత్తరంఅందంగానే వొచ్చేశాడు. పిచ్చాసుపత్రిలో చేర్చడానికి మేజిస్ట్రేట్ దగ్గర్నుంచి ఆర్డర్ కూడ పట్టుకొచ్చాడు. ఒక వారం తర్వాత మంగూని పంపించాలని నిశ్చయించుకున్నారు. కొడుకు పిచ్చి చెల్లెల్ని పిచ్చాసుపత్రిలోకి నెట్టితన మీది భారాన్ని దింపుకోవాలనుకుంటున్నాడన్న నమ్మకం కలిగిందిప్పుడు. అమరత్ కాకీకి కాళ్ళూ అలా కాకపోతే ఉత్తరం అందిందే తడవుగా వెంటనే ఎందుకొచ్చేస్తాడు? కాళ్ళూ చేతులూ విరగ దొక్కుకుని వెంటనే డాక్టరు దగ్గర్నించీ, మేజిస్ట్రేట్ దగ్గర్నించీ ఆర్డర్లు తీసుకు రావడంలో అర్థం? మంగూ నిప్పుడు కాక వేసవుల్లో పంపాలని ఆమె కోరిక. కానీ కొడుకు దగ్గిర ఈ మాట చెప్పడానికి నోరు పెగలదు. వీడు కష్టం మీద సెలవు తీసుకుని వచ్చి వుంటాడు. చేర్పించడానికి ఏర్పాట్లు కూడా చేసేశాడు. ఇప్పుడు గనక వారిస్తే అమ్మకింకేం పనిలేదని పిస్తుంది వాడికి.

మంగూని పిచ్చాసుపత్రికి తీసికెళ్ళే రాత్రి అమరత్ కాకీకి అసలు నిద్రపట్టలేదు. ఉదయం నేను దానితో వెళ్ళకుండా వుంటేనే మంచిది అనుకుంది. పిచ్చాసుపత్రి వాళ్ళు పిల్లని నానుంచి వేరు చేస్తే భరించలేను. కానీ పిచ్చాసుపత్రిలో ఏర్పాట్లెలావున్నాయో నా కళ్ళతో నేను చూసే వరకూ శాంతి ఎలా వుంటుంది?

అందుకే మంగూని విడిచి రావడంకోసం తయారైంది ఆమె కూడా. మంగూని తీసుకుని బయటికి వెళ్లే సమయంలో కళ్ళ నించి శ్రావణ మేఘాలు కురవసాగాయి.చూపు మంగూ మీదే ఉండిపోయింది. కళ్ళు తిప్పుదామనుకున్నా తిప్పుకోలేకపోయింది. మంగూ తను కట్టుకున్న కొత్త బట్టల రంగుల్ని కన్నార్పకుండా చూస్తోంది. సంతోషపడినట్టుగా ఆమె అమరత్కాకీ వేపుచూసి నవ్వింది. ఇది చూసిన అమరత్కాకీ హృదయం కంపించింది. పశువులుకూడా కట్రాలున్నించి విప్పి ఎవరైనా తీసుకు పోతూంటే కొత్త యజమానింటికి వెళ్ళేటప్పుడు వెనక ముందాడుతాయి. మంగుకా మాత్రం కూడా తెలియదు. ఇది చూసి అమరత్కాకీ ఇంటి గడప మీద స్పృహ తప్పి పడిపోయింది. పాపం అర్థం చేసుకోలేని కూతురికి ప్రపంచంలో ఎవరూ లేరు. సొంత తల్లికూడా ఈమెది కాకపోయింది! కొడుకు మనసు దుఃఖంతో నిండింది. తల్లివేపు చూడ్డానిక్కూడా అతనికి ధైర్యం లేదు ఎంత ఆలస్యమవుతోందో అంతగానూ బండినందుకునే సమయం తక్కువైపోతోంది. సందు బయట బండికి పూన్చిన ఎడ్లు వెళ్ళే తొందరలో కదం తొక్కుతున్నాయి. కొడుకు తల్లి వేపు చూడకుండా తొట్రుపడుతున్న కాలెత్తి అడుగేస్తూ అన్నాడు - ''ఆలస్యమైపోతోంది. ఇంక నడవాలి.'' సందులోంచి బయటి కొచ్చే సమయంలో అతను ధోవతీ కొసతో కళ్ళు తుడుచుకున్నాడు.

ఇరుగుపొరుగు ఇల్లాళ్ళు మంగూ చెయ్యి పట్టుకుని ఎడ్లబండి వరకూ తీసుకొచ్చారు. కొందరు స్త్రీలు అమరత్కాకీకి కూడ ఆసరాయిచ్చారు. ఆఖరికి చేదుని లోపల్లోపలే దిగమింగుకుని మోకాళ్ళ మీద చేతులుంచుకుని ఆమె లేచి నిలబడింది. ఇద్దరు పట్టుకుని ఆమెని ఎడ్ల బండి ఎక్కించారు.

రైలు బండిలోని ప్రయాణీకులకి మంగూ పిచ్చిదని తెలియగానే వాళ్ళకి కాలక్షేపానికి మసాలా దొరికింది.

''అందంగా పుష్టిగా వున్న ఇటువంటమ్మాయిని పిచ్చాసుపత్రిలో వేశారంటే నెలల తరబడి ఎండిపోయి కట్టె పుల్లయిపోతుంది! ఏ విధంగా పశువుల్ని మేపుతారో అదే విధంగా అక్కడ తినడానికిస్తే అంతటితో ఇక సరి!''

''మా వూళ్ళో ఒక ముసలమ్మ గత అయిదేళ్ళనించీ తనకొడుకుని పిచ్చాసుపత్రిలో వుంచింది. ఐతే ఇప్పటికీ ఏమీ ఉపయోగం లేదు. ఊర్నించి కలవడానికి ఎవరేనా వెడితే పాపం ఏడుస్తాడు. కాళ్ళు పట్టుకుని నన్ను ఇక్కడనుంచి తీసుకుపో అంటుంటాడు.

కొడుకులైతే మంచివాళ్ళేకానీ ఈరోజుల్లో కోడళ్ళే! టిప్‌టాప్‌గా తయారయి బలాదూర్ తిరగాలని కోరుకుంటారు. అందుకే మరెవరైనా ఇంట్లో ఉండటం వాళ్ళకి నచ్చదు.''

''ఈ పిల్లకి తల్లిలేదా?''

ఈ దెబ్బకి అమరత్‌కాకీకి అసహ్యమేసింది కళ్ళ వెంట నీళ్ళొచ్చాయి కంఠం అవరుద్ధమైంది. సిగ్గుతో తలవాలిపోయింది. దాంతో ఆమె పిల్ల తల్లి అని విశదమై పోయింది.

అరె నువ్వు తల్లివయ్యుండీ ఈమెని తోసేస్తున్నావా? ఇంక పిచ్చాసుపత్రి ననుకొని ఏం లాభం?''

అమరత్‌కాకి ఒంటరి దయిపోతుంది. కూతురికి నచ్చదన్న భయం లేదు. లేకపోతే తిరుగు బండిలో మంగూని తీసుకుని తిరిగి వచ్చేది. కానీ ఉపాయమేమిలేదు. అందుకే బరువెక్కిన హృదయంతో అడుగులు బరువుగా వేస్తూ పిచ్చాసుపత్రిలోకి ప్రవేశించింది.

రోగులూ, బంధువులు కలుసుకునే సమయం. అందుకే మధ్య హాల్లో రోగులు, వాళ్ళ రక్త సంబంధీకులూ వేరువేరుగా కూర్చున్నారు. చాలా మంది స్వజనం తెచ్చిన భోజనాన్ని తింటున్నారు. కొందరు పళ్ళుతింటున్నారు. ఒక పిచ్చిది భర్తతో ఇంటిగురించి పిల్లల గురించి మాట్లాడుతోంది. మరో పిచ్చిది కలుసుకోవడానికొచ్చిన భర్తని అంటుకుపోయి దగ్గర నిలబడున్న పరిచారకల మీద ఫిర్యాదు చేస్తోంది – ''ఈ భూతాలు నాకు కట్టుకోవడానికి మంచి గుడ్డలు ఇవ్వటం లేదు. మంచి భోజనం పెట్టటం లేదు. తలకి రాసుకోవడానికి నూనెనివ్వటం లేదు.''

అమరత్‌కాకీ పరిచారికల వేపు చూస్తోంది. ఆస్త్రీ తాలుకు పరిచారిక నవ్వి అంది – ''ఇప్పుడు నేన్నీకు అన్నీ ఇస్తాను. మీ వారు నీ కోసం మంచి మంచి వస్తువులు తినడానికి తెచ్చారు. ఒక్కసారి తిను.''

ఆ పిచ్చిమ్మాయి వయ్యారం పోతూ అంది – ''నేనింకా మొహం కూడా కడుక్కోలేదు. నేనింకా పళ్ళుకూడా తోముకోలేదు.''

అమరత్‌కాకీ చూస్తే ఆమె ముఖం కడిగేవుంది. అయినా కూడా పరిచారిక మండిపడకుండా నీళ్ళున్న లోటా తెచ్చి ముఖం కూడా కడిగింది.

తువ్వాలుతో ఆమెముఖంతుడిచింది. అమరత్‌కాకీ మనసు చల్లబడింది. ఎందుకంటే ఇక్కడ పనిచేసేవాళ్ళు మమత గలవాళ్ళు.

డాక్టరు మహిళావార్డు మేట్రన్ వొచ్చారు. అమరత్‌కాకీ కొడుకు మేజిస్ట్రేటిచ్చిన కాగితం వాళ్ళకిచ్చాడు. తల్లిని సంతోషపెట్టడానికి ఆమె వినేట్టుగా వాళ్ళతో బాగా చూసుకోవాలని చెప్పాడు. దానికి మేట్రన్ అంది - ''ఈ విషయం గురించి మీరేమీ చింతించకండి.''

అమరత్‌కాకీ మధ్యలోనే అందుకుంది - ''సోదరీ! చింతెందుకంటే ఇది పూర్తిగాపిచ్చిది. ఎవరేనాదగ్గిర కూర్చోబెట్టుకుని తినిపించకపోతే తినదు...'' చెబుతూ చెబుతూండగా ఆమె కంఠం పూడుకుపోయింది. వాక్యం పూర్తికాలేదు.

దూరంగా నిలబడివున్న పరిచారికలు పరుగున దగ్గరకొచ్చి - ''అమ్మ గారూ, మీకే విధమైన చింతా వొద్దమ్మా. ఈమెకి మేము మా చేత్తో తినిపిస్తాం.

అశ్రువిగళిత కంఠస్వరంతో అమరత్‌కాకీ చెప్పింది - ''దీనికి మల మూత్రాల విషయంలో కూడా ఏమీ తెలియదు. అందుకే బట్టలు పాడుచేసుకుంటే చూసుకోవాలి. లేకపోతే ఇది తడిగుడ్డల్లోనే నిద్రపోతుంది. న్యుమోనియా వొస్తుంది. నేను చెప్పాల్సిందింతే సోదరీ.''

రెండో పరిచారిక చెప్పింది - ''రాత్రి నాలుగైదు సార్లు చూడ్డం జరుగుతుందమ్మా.''

''రాత్రి దీపం వుంటే దీనికి నిద్రరాదు.''

''నిద్రరాని వాళ్ళకి మేము నిద్రమందు ఇస్తాము.''

''చూడండి. అల్లరి చేసే మిగతా రోగులు దీన్ని కొట్టడం, గుద్దడం చెయ్యగూడదు.''

''గోల చేసే వాళ్ళని వేరే ఉంచుతాం. రాత్రి అందర్నీ వేరువేరు గదుల్లో పడుకోబెడతాం.''

కలుసుకోవడానికొచ్చిన వాళ్ళు వెళ్ళిపోయిన తర్వాత రోగుల్ని లోపలికి తీసుకెళ్ళడానికి లోపలి భాగానికి తీసుకు వెళ్ళే ద్వారం కొద్దిగా తెరుచుకుంటుంది. అదను చూసుకుని అమరత్ కాకీ రెండు మూడు సార్లు లోపలికి దృష్టి సారించింది. ముగ్గురు నలుగురు స్త్రీలు చెదిరిన జుట్టుతో అస్తవ్యస్తంగా వున్న బట్టలతో లోపల తిరుగుతూ కనిపించారామెకి. ఒకామె అమరత్‌కాకిని చూసి గుండెలు బాదుకోసాగింది. భయపడినట్టుగా కనబడు తున్నాయామెకళ్ళు. అందుకే ఆమె లోపల ఉండే జాగా ఎలా వుంటుందో చూడాలన్న కోరిక కలిగింది. ''మంగూని ఏ గదిలో ఉంచుతారో దాన్ని నన్ను చూడనివ్వండి'' అంది.

మేట్రన్ చెప్పింది-'' లోపలికెవర్నీ పంపించడానికి అనుమతిలేదు'' గాభరా కలిగిస్తున్న ఈ కొత్త ప్రపంచాన్ని చూస్తూ మంగూ అమరత్‌కాకీ ఒడిలోకొచ్చి దాక్కుంది. మంగూ తల మీద చెయ్యేసి అమరత్‌కాకీ ప్రేమగా 'తల్లీ!' అనబోయింది. కానీ ఆమె గొంతు జీరబోయింది. దానిస్థానే ఒక మరణాంతకమైన, సుదీర్ఘమైన నిట్టూర్పు వెలువడింది. ఆసుపత్రి మొత్తం ఆమె రోదనల్లో మునిగి పోయింది. కొడుకు కళ్ళనించి కూడా కన్నీటి ధారలు స్రవించాయి. ఇలాంటి ఏడుపుల కలవాటు పడిన డాక్టరు, మేట్రన్, పరిచారికల హృదయాలు కూడా దుఃఖపూరితాలయ్యాయి. ఏ పిచ్చిదాన్ని ఇంతగా ప్రేమించే రక్త సంబంధకుల్ని నేటి వరకూ చూసి వుండలేదన్నట్టుగా గోడలు కంపించాయి.

ఒక పరిచారిక చేతిలో రుమాల్ని ఊపుతూ మంగూ ధ్యానాన్ని తన వేపుకిమరలించుకుని అంది - ''తీసుకో కావాలా నీకు?''

మంగూ రుమాలు తీసుకోవడానికి తల్లివొడిని వొదలి లేచి నిల బడింది. రుమాలు పట్టుకుని పరిచారిక మంగూ చెయ్యి నిమురుతూ మాధుర్యం నిండిన మాటలతో ఇలా అంది- ''నువ్వు నా దగ్గిరుంటావు కదూ? నీకు మంచి మంచి వన్నీ తినడానికిస్తాను. కొత్త కొత్త గుట్టలు వేసుకుందువుగాని'' మంగు ఆమె ముఖాన్ని తేరిపారజూస్తోంది. ఆక్షణాన్ని ఉపయోగించుకుంటూ పరిచారిక, ''పద, ఇస్తాను'' అంది. అంటూనే ఆమెని తనతో తీసుకుపోయింది. సగం తెరుచుకున్న ఆ ద్వారం మూసుకు పోయింది.

''మంగూ... మంగూ...!'' గుండెలు కంపింపజేసేకేక అమరత్‌కాకీ నోటి నుంచి వెలువడింది.

డాక్టరు ఓదారుస్తూ అన్నాడు - 'ముసలమ్మా!'' దగ్గిర నిలబడ్డ ఆమె కొడుకుని చూపించి - ''నన్ను కూడా మీయీ కొడుకు లాంటి వాడి ననుకో. అమ్మాయిని హాస్పటల్‌లోకాదు, అమ్మాయి సొంత ఇంట్లో విడిచి వెడుతున్నావనుకో.''

చిన్నతనంలోనే వితంతువై ఈ కార్యక్రమం చేపట్టిన నడివయసులో వున్న మేట్రన్ కూడా ధైర్యం చెపుతూ అంది - ''ఇప్పటి వరకూ మీరొక్కరే ఆమెకి అమ్మ ఇవ్వాల్టి నుంచీ నేనామె క్రొత్త అమ్మనయ్యాను.''

అమరత్‌కాకీ వెక్కిళ్ళు పెడుతూ చెప్పింది - ''దానికి మూగ జీవానికుండే జ్ఞానం కూడా లేదు. నేనింత వరకూ దాన్ని నానించి దూరంగా ఉంచలేదు. కుసుమ మీ ఆసుపత్రి కొచ్చి బాగుపడింది. అందుకే మనసు

రాయి చేసుకుని...'' ఆసుపత్రికొచ్చి బాగుపడింది. అందుకే మనసు రాయి చేసుకుని ... ఆమె కంఠం అవరుద్ధమైంది.

మేట్రన్ చెప్పింది - ''కుసుమ లాగేఈమె కూడా కొద్ది రోజుల్లోనే బాగవుతుంది.''

అమరత్ కాకీకి వెక్కిళ్ళు ఆగిపోయాయి. ఆమె దృష్టి మూసిన తలుపుల్ని ఛేదించుకుపోయి మంగూని చూస్తోంది. మళ్ళీ మంగూని గుర్తు చేసుకుంటున్నట్టుగా అంది - ''అది ఎండిన రొట్టె తినదు. సాయంత్రమప్పుడు రొట్టెని పాలలో నానేసి ఇవ్వండి. పాలు లేకపోతే పప్పులో నానేసి ఇవ్వండి.''

జాలిగొలిపే అమరత్‌కాకీ కళ్ళవేపు చూడ్డానికి మేట్రన్‌కి శక్తి చాల్లేదు. కిందకి చూస్తూ ''మంచిది'' అంది.

''దానికి పెరుగు చాలా ఇష్టం. రోజూ వీలు కాకపోతే, రెండేసి మూడేసి రోజులకోసారైనా తినడానికి వెయ్యండి. ఇటువంటి పై ఖర్చులేమన్నా అయితే, మేము భరిస్తాము. దాని సేవ చేసే వాళ్ళని కూడా సంతోష పెడతాం.''

అమరత్‌కాకీ, ఆమె కొడుకు మంగూని వొదిలి పిచ్చాసుపత్రి నించి బయటికొస్తూంటే ఇద్దరి ముఖాల మీద శోక ఛాయలలుముకున్నాయి. నిశ్శబ్దంగా ఇద్దరూ బయట నిలబడివున్న గుర్రబ్బండీ ఎక్కారు.

రైలు కంపార్ట్ మెంట్లో అడుగెడుతూంటే అమరత్ కాకీకి గుర్తొచ్చింది - ఆసుపత్రిలో పడుకోవడానికి చాపలిస్తారో లేదో మంగూ నేల మీదెప్పుడూ పడుకోలేదు. మంచం లేకపోతే అది నిద్ర పోదు. లోపలికెళ్ళుంటే ఈ మాట చెప్పడం మర్చిపోయేదాన్నికాదు. గదిలో మంచం లేకపోతే వెంటనే గుర్తు వచ్చేది.

పిచ్చాసుపత్రిలో పని చేసే వాళ్ళు మమతున్న వాళ్ళు. మంచివాళ్ళు. కానీ ఆమెని లోపలికెళ్ళనివ్వలేదు. అందుకే బహుశః లోపల చూస్తే బాగుండని అంశాలేమన్నా వున్నాయేమో అని సందేహం కలిగిందామెకి. ఇంకా సందేహానికి బలాన్నిస్తోంది సగమే తెరిచి వున్న ఆద్వారం. మురికి కొడుతూ అస్తవ్యస్తంగా వుండి ఆకలితో మాడుతూ భూతాల్లాగా తిరిగే పిచ్చెక్కిన స్త్రీలు.

దాంతోపాటు మంగూ తనకోసం బెంగెట్టుకునేడుస్తోందేమోనని కూడా అనిపించిది. అమరత్‌కాకీకి ఆమె కళ్ళనించి అశ్రువులు ప్రవహించాయి. దగ్గర్లో కూర్చున్నామె అడిగింది. ''ఏం జరిగిందమ్మా

ఏడుస్తున్నావెందుకు? ఎవరేనా చనిపోయారా?''

రాత్రి పావు తక్కువ పన్నెండిటికి వాళ్ళు ఇంటికి తిరిగొచ్చేసరికి ఇరుగు పొరుగు స్త్రీలు ఆమెకి సంబంధించిన స్త్రీలు వాళ్ళ కోసం మెలకువుగా వుండి ఎదురుచూస్తున్నారు. వంట చేసివుంచారు. కానీ ఇద్దరూ భోజనం చెయ్యడానికి నిరాకరించారు. సొంత వాళ్ళు చనిపోయినప్పుడు తగిలిన దెబ్బ రేగినప్పుడేవిధంగా ఊరడించేవాళ్ళ ముఖాలు వాడిపోతాయో అదే విధంగా ఇప్పుడు ఇరుగు పొరుగు యిల్లాళ్ళు ఎక్కువ బలవంతం చెయ్యలేకపోయారు.

అమరత్‌కాకీ హృదయంలో ఒకటే తంబురా మోగుతోంది - మంగూ ఇప్పుడేం చేస్తూంటుంది? క్షణక్షణం ఇదే ఆమె మనసుని వేధిస్తోంది. ఎంత చలిగా వుంది! దానికి కప్పి వుంటారా? మూత్ర విసర్జన చేస్తే దాని పరికిణీ పక్క మార్చివుంటారా?

మంగూ తను చెప్పేది వింటున్నట్టుగా ఊహించుకుని ఈ విధంగా విలవిల లాడింది - ''తల్లీ, ఉచ్చపొయ్యకూ. దుప్పటి తీసి విసిరెయ్యకూ.'' ఇవే ఆమె నిద్రలో కూడా కలవరించింది. రాత్రి మంగూ మూత్రవిసర్జన చేస్తే వెంటనే పరికిణీ, పక్కామార్చేది. మంగూ పెద్ద దైనప్పటికీ కూడా ఆమెని తన దగ్గరే నిద్రపుచ్చేది. ఎందుకంటే ఆమె మూత్ర విసర్జన చేస్తే వెంటనే తెలుస్తుందనీ, వెంటనే లేచి ఆమె తడిలో పడుకోకుండా చూడవచ్చనీ.

అమరత్‌కాకీ లేచింది. పక్క శూన్యంగా కనపడింది. మనసులోనే ప్రశ్నించుకుంది - ''నాదగ్గిర పడుకోవడం అలవాటుదానికి ఒంటరిగా నిద్రపడుతుందా?'' దాంతో పాటు మంగూ భయంతో తనని వెతుక్కుంటు న్నట్టు అనిపించింది. మంచప్పట్టీ కేసి తలబాదుకుంది - ''నేను తల్లినై వుండీ దాన్ని పిచ్చాసుపత్రిలో నెట్టి వచ్చానా?'' వెక్కివెక్కి ఏడిచింది.

బయటి గదిలో పడుకున్న కొడుక్కి కూడా నిద్రరాలేదు. మంగూ మీద తల్లికెంత మమకారం వుందో అందులో నూరోవంతు కూడా అతని మనసులోలేదు. అయినప్పటికీ అతని గుండెల మీద వేదననే ఒక పెద్ద కఠోరమైన బండరాయొచ్చిపడింది. తల్లి వెక్కిళ్ళు వింటుంటే అతని కళ్ళ లోంచి కూడ కన్నీళ్ళు ప్రవహించసాగాయి. నాకే ఇంత బాధగా వుంటే అమ్మకింకెంత బాధగా వుంటుందీ? అమ్మ మనసుని ఇంత క్రూరంగా కోత పెడుతున్న అవ్యథ కొడుక్కి జీవితంలో మొదటిసారి సాక్షాత్కరించింది. అతని హృదయం. ''అమ్మ దుఃఖం ఎలాంటి దైనాసరే దాన్ని దూరం చెయ్యాలి'' అని ఘోషించింది. కొడుకునై వుండీ నేనీ మాత్రం చెయ్యక పోతే నాజీవితం వ్యర్థం! దాంతో అతను మనసులోనే ప్రతిజ్ఞ చేశాడు - ''నేను

మంగూని జీవితాంతం బాగా చూసుకుంటాను. నా భార్య దానిమల మూత్రాలు కడగడానికి సిద్ధంగా లేకపోతే నేను కడుగుతాను.'' తరువాత వ్యధ అనే ఆ భారీ పాషాణం అతని గుండెల మీంచి తొలగిపోయింది.

అమరత్ కాకీ వెక్కిళ్ళు మళ్ళీ వినిపిస్తే కొడుకు అప్పటికప్పుడు వెంటనే లేచి వెళ్ళి తనప్రతిజ్ఞ నామెకి చెప్పి ఊరడిద్దామనుకున్నాడు. కానీ అతనికామె నిద్రపోతున్నట్టనిపించింది. అందుకే ఉదయం చెప్పడం మంచి దనుకున్నాడు. అలా అనుకుని అతను నిద్రపోవడానికి కళ్ళు మూసుకున్నాడు. కొంచెం సేపట్లోనే నిద్రపట్టింది.

తెల తెల వారుతూండగానే గ్రామంలో తిరగలి విసరడం, పాలు కలియబెట్టడం మొదలైన చప్పుళ్ళు మారుమోగుతూండగా అమరత్ కాకీ పెడుతున్న కేకలు గ్రామం గ్రామాన్నే చీలుస్తూ వినబడసాగాయి - ''పరి గెత్తరానాయనా - పరిగెత్తు... నా మంగూని చంపేశార్రా...''

కొడుకు ఉలిక్కిపడి పక్కమీద ఎగిరి పడ్డాడు. ఇరుగూ పొరుగూ పరిగెట్టుకుంటూ వొచ్చారు. తిరగలీ, కవ్వాల శబ్దాలు ఆగిపోయాయి. విన్న వాళ్ళంతా అక్కడికే పరిగెట్టు కొచ్చారు. వొచ్చిన వాళ్ళంతా స్తబ్ధులై ఉండి పోయారు. అమరత్ కాకీకి మంగూ గతే పట్టింది.

# 13. గాలి తగిలిన కోయిల

**చునీలాల్ మడియా**

చునీలాల్ మడియా (1922 - 1969) జన్మస్థానం గుజరాత్‌లోని ధీరజీ గ్రామం. అహమ్మదాబాద్‌లో కామర్స్ చదువుతూ పత్రికారచనలో కూడా నిమగ్న మయ్యారు. వీరి మొదటి కథా సంపుటి 'ఘూఘవతాం పూర్'కి అసాధారణమైన స్వాగతం లభించింది. 'వ్యాజనోవారస్', 'వీలుడీధరతీ', 'వేలావేలానీ ఛాయండీ' మొదలైనవి వీరి ప్రసిద్ధ నవలలు. 'ఘూఘవతాం పూర్', 'అంతఃశ్రోతా', 'చంపా అనెకేల్', 'క్షణార్ధ' మొదలైనవి కథా సంపుటాలు. 'రంగదా' వీరి సుప్రసిద్ధ ఏకాంకి సంపుటి. 'శూన్యశేష', 'రామలోరోబినహుడ్' మొదలైనవి సఫలపూర్వకంగా వెయ్యబడిన వీరి మూడంకాలనాటకాలు. 'శాహమృగ-సువర్ణమృగ', 'కశలోక', 'వార్తా విమర్శ', మొదలైనవి సాహిత్యాత్మక రచనల సంపుటాలు. 'రుచి' అనే సాహిత్య పరమైన మాసపత్రికకి సంపాదకత్వం వహించారు.



గత సంవత్సరం రవాపటేల్‌కి మనసు పడ్డ సేద్యం చేసే అవకాశం దొరకలేదు. ఇందుకే ఈ సారి అతను ధైర్యం చేసి నాలుగు ఎకరాల్లో రెండేసి అంకురాలున్న చెఱుకు కణుపుల్ని నాటాడు. అచ్చేపేటే లోని నిరంతరమూ నిండుగా జలధారలతో ఉన్న చిన్న చెరువు నించి నీటిని తోడి తోడి చెఱుకుని తడిపాడు. నవరాత్రులు దగ్గిరపడుతూండగా నాలుగేసి అంగుళాల చెఱకు పాదుల నుంచి బయటి కొచ్చి అర్ధ చంద్రాకారంగా వొంగసాగాయి. దీపావళి నాటికైతే పొడవాటి లాఠీలంతేసి చెఱకుగడలు ఎదిగి పడిపోవడానికి సిద్ధంగా వుంటే వాటికి నాలుగువైపులూ వెదుళ్ళతో అడ్డుకట్టాల్సి వచ్చింది.

పట్టుకోవడానికీ చేతిలో ఇమడనంతటి లావుపాటి చెఱకు గడల్ని రసం తియ్యడానికి బదులు కొనేసి దగ్గర్లో వున్న నగరంలోని కూరగాయల సంతలో అమ్మి రమ్మని రవాపటేల్‌కి చాలా నచ్చచెప్పారు, వ్యాపారులు. కానీ రవాపటేల్ చివరి వరకూ తన నాలుగెకరాలలో వేచిన చెఱకుని రసం తియ్యాలన్న పట్టు మీదే నిలబడ్డాడు.

పట్టణంలోని బజారులో లభించే లాభాన్ని వదులుకుని ఇంట్లోనే నాలగెకరాల చెఱుకుని గానుగాడించి రసం తీయించాలన్న పట్టుదలైతే లేదు కానీ అసలు విషయమేమంటే రవాపటేలు వృద్ధుడూ అంధుడూ అయిన తన తండ్రి నేణసీభగత్ వెల్లడించిన అపూర్వ కోరికని పూర్తి చేస్తానని ప్రతిజ్ఞ చేసి వున్నాడు.

నేణసీ భగవత్‌కి రవాపటేల్ తప్ప మరో సంతానం లేదు. రవాపటేల్ వయసు కూడా ముదురుతోంది. కానీ మొదటి ఇంటామె వల్ల కలిగిన సంతతీ తప్ప మరే సంతానం కలగలేదు. రవాపటేల్ మూడేసి పెళ్ళిళ్ళు చేసుకున్నాడు. కానీ మొగబిడ్డ ముఖమైనా ఎరగడు, ఇందు చేత సంత నే సర్వగుణ సంపన్ను రాలైన కూతురు గానూ కుమారుడిగానూ సర్వం ఆమే అనుకుని సంతోష పడాల్సి వచ్చింది. నేణసీ భగత్ కళ్ళు పోతున్నాయి. శరీరంలో వృద్ధాప్యం వచ్చేసింది, సంతీ జన్మించిన తర్వాత ఆయన ఏకైక పుత్రుడు రవాపటేల్ ఇంట్లో ఏ శుభకార్యం జరిపే అవసరం రాలేదు. ఆయన సామాజిక బాధ్యతల్ని పైన వేసుకుని నిర్వహించే వ్యక్తి, ఈ వూరి సేలలోనే పండిపోయిన వృద్ధు, పరస్పర సహయోగం ఆధారంగా నిలబెడుతూ వచ్చిన సమాజ రచనని పూర్తిగా అనుసరిస్తూ వచ్చిన వాడు. అనేక రకాల ఋణాల బరువు చేత అణిగిపోయాడు. ఆ ఋణాల్ని తీర్చాల్సిన అవసరం ఆయన దగ్గిరకి రావటం లేదు. ఆయన మనసులోనే కృంగిపోతున్నాడు.

ఇందుకే సరైన సమయం చూసుకుని రవాపటేల్ చెఱకు నాటేడు నేణసీ భగత్ వైశాఖమాసంలో జరగబోయే సంతీ మనుగుడుపు సందర్భాన్ని చెఱుకు గాను గాడే సందర్భంతో జోడించాడు. ఈ ప్రకారంగా పుత్ర విహీనుడైన రవా పటేలు ఇంట కొడుకు పెళ్ళి అనిపించేట్టుగా సంరంభం జరిగింది.

నాలుగెకరాల్లో విస్తరించిన చెఱకు పచ్చిఆకు పచ్చని ఆకులు తమ మీదుగా ఉత్తర దక్షిణ గాలి వీస్తూంటే ఒకదానితో ఒకటి కౌగిలి బంధంలో నిలిచిన చిలుక రెక్క రంగు సాగరంలో సముద్ర కెరటాల వంటి తరంగాలు ఉత్పన్న మవుతున్నాయా అన్నట్టుంది. చూసే వాళ్ళ దృష్టి వాటి మీద నిలిచిపోతుంది. ఇంకా వాళ్ళంటారూ - ''భూమి కూడా హృదయం తెరిచి వుంచేసింది. ధూళిలోంచి ధాన్యాలు పండుతున్నాయి.''

రవాపటేల్ కూడా మనసారా అతిథుల్ని ఆహ్వానించాడు. కుటుంబం లోని సమస్త బంధు-బాంధవులకి, రక్త సంబంధీకులకి వియ్యాల వారికీ, అల్లుడికీ విందు చెయ్యడంతో పాటు రెండేసి శ్రేష్ఠమైన ఎడ్లని వెంటబెట్టుకు

నొస్తానని చెప్పేశాడు. చెఱకురసం తియ్యడం కోసరం ప్రారంభించిన అతి పెద్దదిగా కనుపడే గానుగ ఒకేసారి నాలుగెద్దులు చేత లాగిస్తే పని చేస్తోంది. దాన్నించి రెండు ధారలుగా కురుస్తున్న తేనెవంటి తియ్యని రసాన్ని వండి బెల్లం తయారు చెయ్యడానికి రవా పటేలు చాలా దూరం ప్రసిద్ధుడైన గోవా, హలవాయీకి భారీ మొత్తం ఇచ్చేట్టుగా ఒప్పందాని కొచ్చి పిలిపించాడు.

గోవా యువకుడు. అతనిలో కేవలం యౌవన రసికత, అనురాగ హృదయం మాత్రమే కాదు. మీదు మిక్కిలి తరుణ వయస్సులోనే సాధన చేసి సంపాదించిన బెల్లం వండే అద్భుతమైన కళాదీప్తి కూడ అతని సంపూర్ణ వ్యక్తిత్వంలో వన్నె తెస్తూ ప్రతీతి నొందుతోంది. అతను కుండల్లోని రసాన్ని బాణలిలోకి దిమ్మరిస్తున్నా, చెఱకు గడల సారం పోయిన పిప్పిని తట్టల్లో నింపి భట్టీలో పారవేస్తున్నా. మూసలో దగ్గర పడిన బెల్లాన్ని పారతో సులభంగా అద్భుతంగా పెల్లగిస్తున్నా, అతని ప్రత్యేకత గల ప్రతి కదలికలోనూ నిహితమైన ఒక మంచి పాకశాస్త్రి యొక్క నైపుణ్యానికి చెందిన చాతుర్యం అందర్నీ ముగ్ధుల్ని చేస్తోంది.

అంధుడైన నేణసీ భగత్ చెఱకుకి దగ్గరున్న మడిలో ఒక విరిగిన పురాతన మంచం మీద, నడుం వాలుస్తూ – కూర్చుంటూ ఇరవై నాలుగు గంటలు రామనామం జపిస్తూంటాడు. గ్రామ ప్రజలు ''భగత్ చెఱకైతే వేసినందుకు సరిగానే పండింది. కానీ ఇంత తియ్యని రసం రాకపోతే ధనాన్ని ధూళి చేసి తినాల్సొచ్చేది.''

''రసం శ్రేష్ఠమైనది వొచ్చిందా లేదా?'' భగత్ వెనక్కి తిరిగి అడిగాడు.

''అరే, ఎంత శ్రేష్ఠమైనదంటే అద్వితీయమైన మైసూర్ పాక్‌ని కూడా మించిన శ్రేష్ఠమైన బెల్లం తయారవుతోంది.

''బాగుంది భాయి, బాగుంది. తిన్నవాళ్ళు ఆశీర్వదిస్తారు. తినండి, తాగండి పండుగ చేసుకొండి. ''సీతారామ్‌జీ! సీతారామ్‌జీ!''

సంతీ చిన్నప్పటి నుంచీ తనతాతకి సేవ చేస్తూ వస్తోంది. ఇందుకే భగత్‌కి తన విరక్తావస్థలో కూడా ఆ పిల్ల సేవ ఎలా అలవాటయి పోయిందంటే మనుగడుపు అయిపోయి సంతీ అత్తారింటికెళ్ళి పోయే ఘడియ ఆసన్నమైనప్పటికీ ఆమె లేకపోతే ఆయనకి తన రుద్రాక్ష మాల కాలి చెప్పులు, చేతి బెత్తం నల్ల మందుండే శుభ్రమైన డబ్బీ వెతుక్కోవడం ఇబ్బంది అను భవమతోంది.

రవాపటేలు సంతీని కూతురుగా కాక కొడుకు లాగా అల్లారు ముద్దుగా పెంచాడు. ఇందుచేత అప్పుడప్పుడు ఆమె ఎక్కువ స్వతంత్రం

తీసుకున్నా కూడా ఏమీ అభ్యంతరం పెట్టలేదు. ఆమె చిన్నప్పటి లాలన - పాలన చూసి గ్రామస్థులు రవాపటేలుకి సంతీకి కాస్త కూడా కష్టం కలగ నివ్వటం లేదు. ఇంకా ఆమె కోరిక ప్రతిదీ తీర్చడానికి సిద్ధంగా ఉంటూంటాడు. కాని స్త్రీ జాతిని ఇంత మురిపెంగా చూస్తే ఏదో వొక రోజు పశ్చాత్తాప పడాల్సొస్తుంది అంటూండేవారు. సంతీకి లభించిన స్వతంత్రం చాలా మంది కళ్ళకి కంటకమైంది. ఇంకా వాళ్ళలో ఎవరైనా వృద్ధాప్యపు యోగ్యతతో రవా పటేల్‌కి భవిష్యత్తు గురించి చెబితే రవాపటేల్ నవ్వేసి అంటాడు - ''సంతోనా కూతురు కాదు. అది గాలికి కొట్టుకొచ్చిన కోయిల, పూర్వ జన్మలో ఇచ్చి పుచ్చుకునే ఋణముండిపోయి ఉంటుంది. అందుకే నా ఇంటికి ఎగిరి వచ్చింది. ఒక విచారకమైన రోజొస్తుంది. దీని అత్తారు మనుగుడుపు జరిపించడానికి దీనిని తీసుకెళ్ళి పోతే నాయీ కోయిల ఎగిరిపోతుంది...''

ఈ చివరి మాటని రవాపటేలు ఆకాశం వేపు చూసి చెబుతోంటే అప్పుడప్పుడు అతని కళ్ళు జలజలా కురుస్తాయి. కానీ జరిగిందిది. గ్రామస్థులు రవాపటేల్ వాత్సల్యంలోని ఈ సూక్ష్మాన్ని గ్రహించ లేకపోయారు. పై పెచ్చు చాలా మంది రసికశిఖామణులు తమ యోగ్యతా యోగ్యతల గురించి ఆలోచించకుండా సుదీర్ఘమైన ఆశలతో సంతీని ప్రేమించే ప్రయత్నం చేసారు. రవాపటేల్ కల్లాకపటం లేని భావంతో చెప్పిన మాటలు ( గాలి వాటు కోయిల) లోనించి కేవలం 'కోయిల' శబ్దాన్ని పట్టుకుని దాన్ని సంతీపేరుకి జోడించారు.

గ్రామంలోని నవయువకులు కవితలల్లలేరు. వాళ్ళుచేసిన ఈ నామ కరణంలో సంపూర్ణకావ్యం ఇమిడివుంది. సంతి తెల తెల వారుతూండగానే పొలంమీద కెళ్ళడానికి బయలుదేరుతుంది. లేదా మధ్యాహ్నం చల్దిఅన్నం తీసుకెడుతుంది లేదా సంజవేళ తలమీద బరువెత్తుకుని తిరిగొస్తుంది. ఆమె పాదాల సవ్వడిచే గ్రామం పొలిమేరల యౌవనం జాగృత మవుతుంది. అంగాంగం నుంచి అనాఘ్రాత యౌవన దీప్తి విరజిమ్ముతూ ఆసుకుమారపు దేహలత పొలిమేరల వాతావరణాన్ని ఆహ్లాదంతో నింపేస్తుంది.

ఒక చైత్ర మాసం నాటి మాట. పొలాల కెళ్ళే దారిలో ఉన్న మామిడి తోపులో వృక్షాలు మామిడి కాయలతో కొమ్మల్ని కప్పేసిన కారణం చేత వొంగిపోయివున్నాయి. పన్నెండేసి నెలలు కాసిన తర్వాత మామిడి చెట్టుమీద పండబారిన ఫలాలొస్తే వాటి తాపాన్ని శమింపజేయ కోయిలలు ''కుహూ - కుహూ''మంటూ జాలిగొలిపే గీతం పాడుతూ ఫిర్యాదు చేస్తున్నాయి. ఆ రోజు మూడోఝాము సమయంలో సంతీ నేణసీ భగవత్‌కి నల్లమందు

ఇవ్వడానికి వెడుతూ తనంతట తనే పాడుతోంది.

''సంపెంగ పూసింది చైత్రం రాగానే
ద్రాక్షలు దానిమ్మలు పండే మెండుగానే
మరి యీ కోయిలెందుకోగున్న మామి కొమ్మనెక్కి
కుహూఁ - కుహూఁ మంటూ కూయ సాగింది.''

ఒక మామిడి కొమ్మ మీద కుహూకుహూ మని కూస్తున్న కోయిలని వేళాకోళం చేయడానికోసం సంతీ నోటి నుంచి కూడా కుహూ కుహూ అన్న శబ్దం వెలువడింది. కానీ గ్రామంలో పోకిరీ కుర్రాడు వీర్యా దొంగ చాటుగా ఆమె వెనుకే వస్తున్నాడనీ, వాడీ సమాచారాన్ని వూళ్ళో గజ్జి కుక్కల దాకా అందిస్తాడనీ గ్రామం రసికతచేసిన కోయిలనామకరణం సార్థకమై పోతుందనీ ఆమె ఎరగదు.

చెఱకు గానుగ ఆడటం ప్రారంభమైన దగ్గరనుంచీ పొలాలల్లో రాత్రి - పగలు శోభాయమానంగా వుంటోంది. రవాపటేల్ పొలంలో నాలుగు మంచెలు మొదట్నించీ వున్నాయి. అయిదు చిన్నా పెద్దా మంచెలు వేయాల్సొచ్చింది. ఇంకా రెండు గుడిసెలు ఎయ్యాలి. మంచి మంచి జాతి ఎద్దులు పది జతలు వచ్చాయి. ఇందువల్ల గానుగ ఎడతెరిపి లేకుండా సాగి పోతోంది. పైగా ఉదయం నుంచి సాయంకాలం వరకూ రసం తాగడానికొచ్చే వాళ్ళ పంక్తికీ అంతులేకుండా వుంటోంది.

మొదట్నించీ నేణసీభగత్ దానధర్మాల విషయంలో విశాల హృదయుడని పేరు పొందాడు. రవాపటేల్ చెయ్యి కూడా ఆ విషయంలో పెద్దది కావడం చేతా, ఉన్ముక్త స్వభావం కలవాడైన కారణం చేత జనం అతన్ని కూడా పెళ్ళికొడుకు అని పిలుచుకుంటూ ప్రశంసిస్తారు. పొలానికి నీరు పెట్టే సమయంలో ఎవరైనా అపరిచితన వ్యక్తి వస్తే కూడా అతను రవాపటేల్ పొలం నుండి దోస,శనగ, అనపగుగ్గిళ్ళు గానీ చెరకు గానీ తినకుండా మాత్రం వెళ్ళలేడు. అందుకని గానుగ ఆడే మహదవకాశం వచ్చిన మీదట రవాపటేలు పొలం, ఇల్లూ - వాకిలీ అంతా అతిధుల దర్బారై పోయింది.

మండపమేమో కుశల ప్రశ్న లడగడానికి వచ్చే వాళ్ళతో కిక్కిరిసి నిండి పోయుంటోంది. రవాపటేల్ అతిధుల కోసం ఆసనాల్లాంటి మంచాలు, ఎన్నో చాపలూ వేయించాడు. ఇంతే కాదు, అతిథి జనం చెఱకు గడల్ని పాడుగాటి ముక్కలుగా చీల్చి పళ్ళతో నమిలి తింటారని అతను గడ కత్తెర్లని తెప్పించి వుంచాడు. అలా చెఱకు గడల్ని తినలేని వారికి తాగ డానికి రసమివ్వడా నిగ్గానూ లోటాలు, గిన్నెలూ సిద్ధంగా వున్నాయి. రసానికి పైన చల్లడం

కోసం శొంఠి గుండుకూడా తయారుగా వుంది.

మండపంలో చస్–చస్ శబ్దంతోపాటు చెరకుముక్కలు రసం తీస్తుంటే గటగట రసం తాగుతున్న సంతుష్టులైన జనాన్ని చూసి రవాపటేల్ కళ్ళు తృప్తి నొందుతున్నాయి. అంధుడైనప్పటికీ నేణసీ భగత్ కళ్ళ గుంటల లోంచే ఆ దృశ్యాన్ని తాగేస్తూ, ఆ తృప్తిననుభవిస్తున్నాడు. గుడ్డి కళ్ళతో సంకేత మిస్తూనే తృప్తి నిండిన ఉద్వేగాన్ని వ్యక్తం చేస్తున్నాడు – ''తాగు భాయీ! తాగు! కావల్సినంత తాగు! ఇదంతా ధరణిమాత మాయ! దీంతో భూమి పుత్రులు తృప్తి పొందక పోతే మరెవరు పొందుతారు? భూమితల్లి ఎంత తాగేస్తే, అంతా తాగండి రేపెలా వుంటుందో ఎవరికి తెలుసు!''

ఇలా చెబుతూ నేణసీ భగత్ రెండు వేళ్ళని ముక్కు దగ్గిర పెట్టుకొని వాసన చూశాడు, అలా వాసన చూసి పూర్తి వాతావరణం యొక్క సహజ త్వాన్ని పరీక్ష చేసి సంతుష్టుడై తన జపమాల తిప్పుకోవడం ప్రారంభించాడు.

ఎందరో భగత్ జ్ఞానిగా భావిస్తారు. ఆయన ప్రపంచంలో వుంటూనే సాధువు మాదిరి బతుకుతున్నాడు. అందుకే ఆయన సిద్ధ సాధుకుడై ఉండవచ్చని చాలా మంది ప్రజల విశ్వాసం. కళ్ళు లేకపోయినప్పటికీ భగత్ కేవలం వేళ్ళు వాసన చూసి మనిషిని గుర్తు పడుతూండటంచేత అనేక మంది నాస్తికులకి కూడా ఆయన మీద శ్రద్ధ కలిగిది.

క్రితం సంవత్సరం వేసవుల్లో ఏ విధంగానైతే ఘోరంగా ఎండ కాసిందో, ఏ విధంగా వర్షాకాలం నాలుగునెలల్లో కుంభ వృష్టిగా వర్షాలు పడ్డాయో, అదే విధంగా ఈ శీతాకాలంలో ఒక్కసారిగా గడ్డ కట్టించి, కొంకర్లు పోయేట్టు చేసే దుర్భరమైన చలి వచ్చి పడింది. కానీ రవా పటేల్ ఇంట్లోనూ, పొలంలోనూ నెలకొన్న ఆనంత కోలహలం ఉష్ణం నుంచి ఎటువంటి వెచ్చదనం వ్యాపించిందంటే మకర సంక్రాంతి నాటి ఎముకల్ని వొణికించే చలిని కూడ ఎవరూ లక్ష్యపెట్టటం లేదు.

సంతీ మనుగుడుపు జరిపించడం కోసరం అత్తవారు ఇర్వై మంది పెర పక్షము వారిని తీసుకుని వచ్చారు. అందుచేత ప్రత్యేకమైన పనేదీ లేక సంతీ పొలంలోకి రావటం లేదు. భగత్ నల్ల మందు డబ్బాల్లో నల్లమందై పోయినప్పుడు దాన్ని నింపాల్సొచ్చినప్పుడు ఆమెకి రావడం పడుతోంది! లేకపోతే సాయంత్రం వంటింట్లో ఆలస్యమైపోయో, నౌకరు తొందరగా వెళ్ళిపోవటమో జరిగితే సంతీ భగవత్‌కి భోజనం ఇవ్వడానికి వస్తుంది. సంతీ కొద్ది రోజుల తర్వాత పుట్టిల్లు విడిచి పెట్టాల్సొస్తుందన్న దుఃఖం, అత్తవారింటికి వెడతాననే సంతోషం కలగలిసిన భావనా ప్రవాహంలో సంతీ

కొట్టుకుపోతోంది.

ఆమె అత్తవారింటికి వెళ్ళడానికి ముందు రోజు సాయం కాలం వేళ యింట్లో కథాకాలక్షేపం చేయించడానికి నిర్ణయించారు. ఆ రోజు చెఱకు గానుగ పని నిలిపివేయ నిశ్చయించారు.

సరిగ్గా ఆ సాయంత్రమే నేణసీ భగత్‌కి గుర్తువచ్చింది. నల్లమందు తెప్పించుకోవటం మర్చిపోయానని. అందుకని ఒక కూలి వాణ్ణి పంపించి కబురు చెప్పించాడు. చెఱకు గానుగ పని ఆపెయ్యడానికి సిద్ధంగా వున్న సమయంలో సంతీ ఆయనకు నల్లమందు ఇవ్వడానికొచ్చింది. కానీ ఒక చెఱకు మడిలో సగభాగం చెఱకు గడలు నరకబడ్డాయి, మిగతా సగభాగం మిగిలిపోయింది. అందుచేత కొంచెం ఆలస్యమైనా సరే పూర్తిగా కొట్టెయ్యాలన్న యోచన కలిగాక కూలీలు చాలా చురుకుగా పనిలో నిమగ్న మయ్యారు. ఒక వేపు మడిలో చెఱకు గడలు మరోవేపు వాటి చివరున్న ఆకులు కోసేసి వేరు చేస్తున్నారు. మూడో చోట నరికిన చెఱకు గడల్ని కొయ్య నమ్మెటతో మోది మోది అణిగేట్టు చేస్తున్నారు. అప్పుడు వాటిని సులభంగా గానుగలో తోసెయ్య వచ్చు. సంతీ కూడా వెంటనే పరికిణీ కుచ్చెళ్ళు దగ్గరకు తీసుకుని అక్కడే చెఱకు గడల్ని అణగ గొట్టడానికి కూర్చుండిపోయింది.

దగ్గర్లోనే పని చేస్తున్న ఒక శ్రామిక వనిత సంతీతో అంది - ''ఏం సోదరీ సంతీ, ఇవాళ గరగరలాడుతూ కొత్త పరికిణీ కట్టావే!'' హర్షాతిరేకంతో సంతీ నోటి మాటలతో చెప్పటానికి బదులు తన అలవాటు ప్రకారం పాటగా జవాబు చెప్పడమే సరైన పద్ధతని నిర్ణయించుకుంది -

''శుక్రవారం నాడు కుట్టించుకున్నాను
ఆకుల పూలతో రాజిల్లు పరికిణీ
కట్టినానమ్మ ఈ రోజు కట్టకుంటా నత్త వారింట గూడ
ఎందుకో చెప్పుకోవమ్మా, కానున్నదమ్మ మనుగుడుపు నాకు.''

మార్దవం నిండిన స్వరంతో వినిపించిన ఈ పంక్తుల్ని విని దాపునే వున్న మండపంలో గానుగ మీద నించి బాణలి దింపి మూసలో బోర్లిస్తున్న గోవా చెయ్యి ఆగిపోయింది. చెవులు నిక్కబొడుచుకున్నాయి. అతను విస్మితుడై సంతీ వేపు చూశాడు. నవనవలాడుతూ మెరిసిపోతున్న ఎర్రని ముఖం మీద ఎదురుగా వున్న రావిచెట్టులోంచి అస్తమయ సూర్యుడి అంతిమ కిరణాలు పడి మెరుస్తున్నాయి. గోవా వంటి రసిక యువకుడికి ఈ దృశ్యం నిర్లక్ష్యం చెయ్యడానికి శక్యం కానిదైంది. అతను కూడా అలాగే తియ్యని కంఠస్వరంతో పాడటం ప్రారంభించాడు.

''ఓ అనురాగ రంజనీ కోయిలా
నా మావితోటలో మధుర ఫలములున్నవి
ఓ అనురాగ రంజనీ కోయిలా
ఫలించిన మధుర భారముతో తరువులు వొంగి వున్నవి!''

అప్పటికి సూర్యుడు ఎదురుగా వున్న క్షితిజం మీద అస్తమించాడు. పని వాళ్ళందరూ వాళ్ళ పని ముగించుకుని వెళ్ళి పోయారు. గోవా పారచేతి లోకి తీసుకుని బెల్లాన్ని మూసలో వెయ్యసాగాడు.

సంతీ మనసులో 'ఓ అనురాగ రంజనీ కోయిలా' తిరుగుతోంది. వాతావరణంలో అలుముకున్న సంధ్య మత్తెక్కించే ఉత్తేజాన్ని వ్యాప్తి చేస్తోంది. సంతీ ఆ మత్తు వల్ల ప్రేరితురాలైనట్టు చిన్న చెరువు దగ్గరకెళ్ళి నిలబడి పెదవుల మీద కొచ్చిన పాట పాడనారంభించింది -

''ఓ గొల్లవాడా, బావి గట్టున మొగలి పూసింది
ఈ మొగలి సురభిళ మెంత మధురమొ చూడరా
ఓ గొల్లవాడా, ఈ మొగిలి వూగిపోతోంది.''

గోవా చేతిలో పార ఎక్కడిదక్కడే ఉండి పోయింది. అతనికి క్రోసుల కొద్దీ దూరంలో వున్న తన యిల్లు, యవ్వనంలో వున్న తన భార్య - అన్నీ గుర్తువచ్చాయి, వాటికి బదులు ఈ పరాయి వూరు, పరాయి పొలం, పరాయి మనుష్యులు అంతా మర్చిపోయాడు. భావనలు అతన్ని బంధ విముక్తుణ్ణి చేశాయి -

''ఓ అనురాగ రంజనీ కోయిలా! నేనొక పరదేశ చిలుకని
ఓ అనురాగ రంజనీ కోయిలా! నాట్యామాడు నెమలివి నీవు
ఓ అనురాగ రంజనీ కోయిలా! రెక్కలు చాచిన నెమలిని నేను
మగనెమలిని నేను.
ఓ అనురాగ రంజనీ కోయిలా! శుభ్ర సరోవర వూత జలము నీవు
ఓ అనురాగ రంజనీ కోయిలా!ఏ తెంచిన పరదేశపు పులుగును నేను
ఓ అనురాగ రంజనీ కోయిలా! పులుగులతో ప్రేమ కూడదువినుము
ఓ అనురాగ రంజనీ కోయిలా! ఎపుడో ఎటకో ఎగిరెగిరిపోవును
ఓ అనురాగ రంజనీ కోయిలా! నిలువవులే అవి ఎగిరిపోవును.
ఓ అనురాగ రంజనీ కోయిలా! ఎగిరిపోయిన మరల తిరిగి రావు!''

దూరంగా చెఱకుకి దగ్గర్లో తన మంచమ్మీద పడుకున్న నేణసీభగత్ ఆతృతతో సంతీ కోసరరంరెండు మూడుసార్లు పిలిచాడు. జవాబు రాకపోయేసరికి ఆయన వ్యాకుల పడి అలవాటు ప్రకారం వేళ్ళని ముక్కుదగ్గిర

పెట్టుకుని వాసన చూస్తున్నాడు.

వృద్ధుడి పిలుపు వినడానికి సంతీ అంత దగ్గర్లో లేదు. దగ్గర్లోనే వుంటే పాట పాడటానికి ముందు ఏదైనా వినడానికి అవకాశమేది ఆమెకు!

''మంచె మీదకెక్కి వడిసెల పడతానురా

వడిసెల చేపట్టి పులుగుల పారద్రోలేనురా.''

పాడుతూ సంతీ గోవావున్నమండపం దగ్గరకు చేరింది. సంతీ అందమైన గులాబిరంగుముఖంమీద అస్తమయ సూర్యుడి అంతిమకిరణాలు పడి ఆమె ముఖానికి బుక్కాని అద్దినట్టుంటే గోవా కొద్ది సేపు ధ్యాన నిమగ్నుడిలా అలాగే చూస్తుండి పోయాడు.

పెరటి నుంచి గుడారం మూలని కొంచెం పైకెత్తి, సంతీ అంది ''ఒంటరిగా బెల్లం తయారు చేస్తున్నావా? ఒంటిరి మన్నివాడా!''

గోవా వెనక్కి తిరిగి చూశాడు. అతను హత ప్రభుడయ్యాడు. ఏం చెప్పాలో తోచలేదతనికి. అప్పటికి కూలిజనం, నౌకర్లు చాకర్లూ మొదలైన వాళ్ళందరూ భోజనం చెయ్యడానికెళ్ళిపోయారు. ఘడియ క్రితం జనం కోలాహలంతో నిండిపోయిన పొలం ఈ సమయంలో ఒక్కసారిగా ఖాళీ ఖాళీగా కనిపిస్తోంది. కేవలం చెఱకు పొలం వేపునించి భగత్ దగ్గుతున్న శబ్దం వినవస్తోంది. గోవా వినమ్రతా పూర్వకంగానూ, అర్థ పూర్ణంగా జవాబిచ్చాడు. ''ఒంటరి మనిషి ఒంటరి మన్ని మనిషే అవుతాడుగా! రెండో పొట్టని ఎక్కణ్ణించి తెస్తారు?''

అది వినడంతోనే సంతీ సిగ్గుపడింది. ఏమంటే అతని మనసు తెలిసింది. దాంతో ఆ అపరిచిత వ్యక్తి నించి పారిపోవాలని, పరిగెట్టుకుంటూ పోయి మంచం మీద పడివున్న తాత దగ్గిరకి చేరుకోవాలని అనిపించింది. పుష్టిగావున్న ఆమెగుండెలు దడదడలాడసాగాయి. ఏ విధంగా నైతే గాలిరెక్కల మీద తేలిపోతూ పరుగులు తీసే లేడిపిల్ల హఠాత్తుగా ఎదురుగా వేటగాడొస్తే భయపడి పోతుందో అదేవిధంగా ఆమె గోవా ఉనికి వల్ల భయపడింది. వ్యాకుల పడి కుంచించుకుపోయి ఆమె అక్కణ్ణించి శీఘ్రంగా వెళ్లిపోవడం కోసం పరికిణీ దగ్గరకు పట్టుకుని భట్టీ మీదుంచిన బాణలికీ దాని దగ్గరే నిలబడున్న గోవాకి మధ్య నుంచి సాగుతోంటే చేతిలో పాడవాటి పార పట్టుకున్న గోవా చెయ్యి ఆచ్ఛాదన లేని సంతీ నడుముని స్పర్శించింది. సంతీగ గుర్పాటు చెందింది. గుండెలో భయాన్ని, దేహంలో గగుర్పాటునీ తగ్గించు కోవడానికి ఆమె మూసలో చల్ల బడుతున్న బెల్లం వైపు చూసి ఏదో మాట్లాడాలని మాట్లాడింది.

''బెల్లం బంగారు ఉంగరంలా అందంగా తయారయింది.''

పొలాల్లో సంజ చీకట్లు వ్యాపిస్తున్నాయి. ఎదుటినించి వస్తున్న మత్తు కలిగించే వెన్నెల సంతీ చేతుల మీద మొహం మీద ఆడుకుంటోంది. గోవా మత్తుగా అన్నాడు. ''తినేవాళ్ళు తక్కువ అందంగా వున్నారా?'' పిడుగు పాటు ఊపుకి వెనక్కి నెట్టబడినట్టుగా సంతీ ఒకడుగు వెనక్కి వేసింది. భయంనుంచి పుట్టిన ఒక తీవ్రమైనవణుకు ఆమె అంతరాంతరాల్ని చీరుకుంటూ పోయింది. గోవా మాటలు విని సంతీ చూపులు వాల్చుకుని సహజ భావంతో తన చేతి మీద మణికట్టు నించి మోచేతి వరకూ పొడిచిన పచ్చబొట్టుని చూసుకోసాగింది.

గోవా ఆమె బాహువుని రెప్పార్పకుండా చూస్తూ అడిగాడు - ''పచ్చ బొట్టులో ఏయే చిత్రాలు పచ్చపొడవబడ్డాయి?''

ఇటువంటి సహజమైన ప్రశ్నని విన్నాక సంతీ మనస్సులోని భయం, వ్యాకులత శాంతించాయి. ఆమె అమాయకంగా జవాబు చెప్పింది - ''నేను చిన్నదానిగా ఉండగా నలుగురు జబర్దస్తీగా నన్ను పట్టుకుని కూరలమ్ముకునే దాని చిత్రం పచ్చపొడిపించేశారు. పచ్చ పొడిచే వాఘరీ జాతమ్మాయి బల్లెం వంటి మొనదేలిన సూదిని మంజిష్ఠాకు పసరులో ముంచి ఖచ్ - ఖచ్ మని పొడిచేసింది. ''చెబుతూ చెబుతూ'' ఉండగా సంతీ గళం నుంచి తేలికపాటు వెక్కిళ్ళు వెలువడ్డాయి.

గోవా కొంచెం సాన్నిహిత్యాన్ని అనుభవిస్తూ అన్నాడు - ''చాలా నాజూకైన గువ్వ అన్నమాట, సూది మొనని కూడా భరించలేక పోయావన్న మాట నువ్వు!''

సంతీ మనస్సు విప్పి చెప్పింది - ''అవును భాయీ, మా ఇంట్లో అటువంటి నాజూకైన గువ్వలున్నాయి. పచ్చపొడిచే ఆమె సూది పొడుస్తూ పోతూంటే నొప్పెట్టి నేనేమో కళ్ళు మూసేసుకున్నాను. తర్వాత నాకాళ్ళూ చేతులు వొదిలేశాక నేను కళ్ళు తెరిచి చూసే సరికి చెయ్యంతా రక్త బిందువులు పొటమరిస్తున్నాయి. నేను చేతి మీద రక్తాన్ని తుడిసి చూస్తే చేతి మీద ఒక చిన్న చక్కని కూరలమ్మే మనిషి కూచునుంది!''

సంతీ గోవాకి చేరువుగా వెళ్ళి చేతిని చాపుతూ పచ్చపొడిచిన బొమ్మని చూపించింది.

గోవా కుతూహలంతో ఆ చేతిని దగ్గరకు లాక్కుని వెన్నెల వెలుగులో పచ్చబొట్టు చిత్రాన్ని చూశాడు.

మకర సంక్రాంతి చలి రక్తాన్ని గడ్డ కట్టించే మంచు కురిపిస్తోంది.

అయినప్పటికి చంద్రుడొచ్చి ఎక్కువ సేపు కాలేదు, కానీ శీతకాలపు రాత్రులు సుదీర్ఘంగావుండేకారణంచేత వాతవరణం అర్థ రాత్రి అయినట్టుగా తోస్తుంది.

గోవా తన చేతి మీద కూడా పచ్చ పొడిపించుకునే విషయం సంతీతో మాట్లాడుతున్నాడు.

నల్ల మందు వేసుకోవాల్సిన సమయం దాటిపోయింది. దాంతో భగత్ నరాలు తెగిపోతున్నాయి. శిరస్సు దిమ్మెకుతోంది. ఆయన సంతీ కోసం చాలా సార్లు పిలిచాడు, కానీ అప్పుడెవరూ పలక లేదుగా! చెలుకుకి కాపలా కాసే వాడు చాలా పొద్దుపోయిన తర్వాత వస్తాడు, కానీ పొలంలో రాత్రీ పగలు ఉండేవాళ్ళుకూడా ఇంకా భోజన పానీయాలు పూర్తి చేసుకుని రాలేదు. భగత్‌కి సంతీ గురించి భయం పట్టుకుంది. ఆయన రెండువేళ్ళు ముక్కు దగ్గరపెట్టుకుని సమస్తవాతావరణపు లోతుపాతుల్ని కనిపెట్టడం ప్రారంభించాడు.

రవాపటేల్ ఆ సాయంత్రం హల్వా చేయించాడు, అందుకని రాత్రి భోజనం చాలా ఆలస్యమైంది. మీదు మిక్కిలి మనుగుడుపుల పెళ్ళి వారికి విందు! అతిథులకి వడ్డించిన తర్వాత ఇంట్లో వాళ్ళకి ఇంట్లో వాళ్ళ తర్వాత వియ్యాలవారి బళ్ళవాళ్ళకీ, నౌకర్లు చాకర్లు మొదలైన వాళ్ళకీ పెట్టడం అయ్యేసరికి చాలా ఆలస్యం అయిపోయిది.

మనుగుడుపులకి ఉదయండున్న ఒక ముహూర్తం మంచిదని పండితుడు చెప్పాడు. అందుచేత రవాపటేల్ వియ్యాల వారి ఎద్దుల్ని, బళ్ళనీ సిద్ధం చేయిస్తున్నాడు. రేపుదయం కుమార్తెసెలవుతీసుకోవడం జరుగు తుందున్న దుఃఖం అతనిముఖంమీదఅలుముకుని వుంది. పెళ్ళివారు తిని తాగి సందులో తమకోసరం చాపల మీద రెండేసి పరుపులు వేసుకుని నడుం వాల్చారు.

ఇంట్లో ఆ సమయంలో సంతీ మనుగుడుపుల బట్టలు సర్దుతున్నారు. ఒక ప్రత్యేకమైన ఖరీదైనవల్లెవాటునింకాపెట్టలేదు. ఎందుకంటే సంతీ స్నేహితురాళ్ళుచెప్పారు ఆవల్లెపాడు ఉదయం సంతీ నీబండిలో కూచోబెట్టే టప్పుడు కప్పాల్సుంటుందని. హఠాత్తుగా ఒక స్నేహితురాలు సంతీ గురించి అడిగితేపొలంలోఉండేవాళ్ళు సంతీబహన్ భగత్‌కి నల్లమందివ్వడానికి పొలం మీదికి వెళ్ళి వుండవచ్చని చెప్పారు.

ఇది విని ఇంట్లో జనం విస్మితులయ్యారు. కానీ రవాపటేల్ వాళ్ళని మందలిస్తూ చెప్పాడు – ''సంతీకి ఇంట్లో అందరి కన్న తన తాత దగ్గిర చేరిక ఎక్కువ. ఇవాళ వెర్రిది తనివిదీరా తాతని చూసిరావడానికి వెళ్ళింది.

రేపీపాటికినాకోయిల ఎక్కణ్ణించెగిరి ఎక్కడికి చేరుకుంటుందో తెలియదు... అది గాలికి కొట్టుకు వచ్చిన కోయిల.''

యౌవనంలో ఉన్న సంతీ స్నేహితురాళ్ళు ఇదివిని ఒకర్నిఒకరు చూసుకుని చాటుగా నవ్వుకున్నారు. ఒకామైతే రవాపటేల్‌కి వినబడేట్టుగా కూడా అంది - ''రేపైతే ఈ సమయానికి సోదరి మజాలో - అప్పుడిక మనందరం గుర్తే రామనుకుంటాను...''

రవాపటేల్ విషయాన్ని మారుస్తూ పొలంలో వుండేవాళ్ళని పొలానికి పంపుతూ వాళ్ళతో సంతీని వెంటనే ఇంటికి పంపమని చెప్పాడు. పొలంలో ఉండేవాళ్ళు రోజూ మాదిరిగానే గోవాకోసం భోజనం తీసుకుని పొలం వేపు వెళ్ళిపోయారు. వెన్నెల బాగా కాస్తోంది. ఆ సమయంలో పొలాలన్నీ శాంతిగా వున్నాయి. సంతీని పలుమార్లు పిలిచినా జవాబేదీ కూడా రాకపోవడంతో భగత్ మిన్నకుండిపోయాడు. వేళ్ళని మళ్లీ మళ్లీ ముక్కు దగ్గర పెట్టుకుని వాసన చూస్తున్నాడు. సంజవేళ వరకు కలవరం చేస్తున్న పక్షులు ఇప్పటి దాకా నిశ్శబ్దంగా గూళ్ళు చేరి కూర్చున్నాయి. బావిలో పడుతున్న బిందువులు టపాక్ - టపాక్ శబ్దం చేయడం కూడా ఆగిపోయింది. ఇద్దరు మనుష్యులు అగాధపు గోడల సందుల్లో ఒకరినొకరు అతుక్కుని నిద్రపోతున్నారు. కేవలం నుయ్యే కాదు, పొలాలన్నీ కళ్ళులలో నిద్రలో పడ్డాయి.

తూర్పు వేపునించిపొలంలోకి రాకపోకల కోసం రెండువైపులా గుంజలు పాతిన రస్తా మీద ఎవరో కాండ్రించి గొంతు సవరించుకున్నారు. పాదాల సవ్వడి వినబడటంతో సంతీ ఒక్కసారిగా లేచి కూచుంది. భగత్ దగ్గర కెళ్ళడానికి పరిగెత్తింది. ఇప్పుడామెకి గుర్తొచ్చింది ఆమె ఏ నల్ల మందు ఉండని తాతకివ్వాలని వొచ్చిందో అదింకా తన రవికలొనే ఉండిపోయిందని. వెంటనే ఆమె ఆ పొట్లాన్ని బయటికి తీసి డబ్బీలో నల్లమందు వేసి డబ్బీని భగత్ చేతి కందివ్వడం కోసరం ఆయన దగ్గరకు చేరుకుంది.

అంధభగత్ సంతీలో ఇవాళ ఏదో ఆకస్మికమైన మార్పుని పనికట్టాడు. రోజూ అయితే సంతీ యొక్క నవపల్లవిత మోంగలే పువ్వు వంటి అనాఘ్రాత దేహలత లోంచి శుభ్రమైన భూమి మీద వర్షబిందువు పడ్డాక వచ్చే తేలికపాటి సుగంధ సువాసన వస్తూండేది. కానీ ఇవాళ దాని బదులు భగత్‌కి మొదటి సారిగా చెమట వాసన వచ్చింది. ఆయన వేళ్ళు ముక్కు దగ్గిర పెట్టుకొని మళ్ళీ వస్తు స్థితి యొక్క లోతు తెలుసుకోవడానికి ప్రయత్నించాడు.

రహస్యం బయటపడిన మీదట సిగ్గు, పశ్చాత్తాపం, భయం, అపరాధికి కలుగుతాయో - అలాంటి సిగ్గు పశ్చాత్తాపము, భయము సంతీకి కలిగాయి.

యాంత్రికంగా ఆమె ఒకడగు వెనక్కి వేసింది.

భగత్ నల్లమందు అందుకోవడానికి చెయ్యి చాచాడు. కానీ సంతీ అక్కడలేదు. ఆయన మళ్ళీ వేళ్ళు వాసన చూశాడు.

సంతీభయం ఎన్నోరెట్లు పెరిగిపోయింది. ఆమెహృదయం బద్దలవ సాగింది. తాత ఎదురుగా హతాశురాల్లా నిలబడిపోయింది.

భగత్ కొంచం ముందుకి జరిగి నల్ల మందుకోసం చెయ్యి చాచాడు. కానీ సంతీ ఇంకా వెనక్కి జరిగింది. భగత్ కేమీ అవగాహనలోకి రావటం లేదు. మళ్ళీ వేళ్ళు వాసన చూడటం ప్రారంభించాడు.

సంతీ ఇంక భరించలేకపోయింది. ఆమె అంత స్సంఘర్షణతో ఆయన పాదాల దగ్గిరున్న చిన్న కుండలోంచి గిన్నెలోకి కొద్దిగా నీళ్ళు వంపుకుని నల్ల మందు ఉండని దానిలో కరిగేట్టు కలిపేసింది.

కొంత సేపటకి భగత్ అడిగాడు – ''తల్లీ సంతీ, నల్ల మందు తెచ్చావా లేదా?''

సంతీ కళ్ళలో ఒకవర్ణించినలవికాని మెరుపువచ్చింది. మళ్ళీ పోయింది. ఆమెజీవితానికి మార్గంగోచరమైంది. ఆమె సాహసంతో జవాబిచ్చింది – ''తాతా, నల్లమందుతేవడం ఇవాళనేను బొత్తిగా మర్చిపోయాను.''

ఇంతే చెప్పి దూరంగా నిలబడే కరిగిన నల్లమందున్న గిన్నె పెదవుల కానించి గట గటా తాగేసింది. మళ్ళీ మరో అక్షరమైనా పలక్కుండా ఖాళీ గిన్నెని విసిరేసి వేగంగా ఇటి వేపు వెళ్ళి పోయింది.

రెండోరోజు గ్రామస్థులు ఒకటి కాదు, రెండుకాదు మూడు ఆశ్చర్య కరమైన విషయాల్ని తెలుసుకోవడం జరిగింది.

అందరూ ఆలోచిస్తూండిపోయారు. ప్రభాతశుభ ముహూర్తం లో రవాపటేల్ కుమార్తె సంతీ మనుగుడుపుకుద్దేశించిన వల్లెవాటు ధరించి అందమైన వస్త్రాలతో అలంకరించిన రథం మీద కూర్చుని వెళ్ళాలి కదా కానీ అందుకువిరుద్ధంగా నలుగురు మనుషులు భుజాల మీద సవారీ అయి మనుగుడుపుల వల్లెవాటులో సంతీ కళేబరం ముద్దాయి రూపంలో బయలుదేరింది.

మూడో ఝూ ములో పొలిమేరా నించి తిరిగొస్తూ మజ్జిగ – చద్దన్నం తీసికెళ్ళి స్త్రీలు అన్నారు అందుడు నేణసీ భగత్‌కి ఏ అశుభముహూర్తంలోనో మతి చలించిందని ఆయన రాత్రంతా నిద్రపోలేదు. ఇంకా గొంతు చీరుకుంటూ అరుస్తూనే వున్నాడు. పొరుగు పొలాల్లో ఉండేవాళ్ళు సంతీ గురించి ఆయన శోకాన్ని ఉపశమింప జెయ్యడానికి దగ్గర

చేరినప్పుడు భగత్ మతి స్థిరం లేని మాటలు మాట్లాడసాగాడు - ''దేవరాజు ఇంద్రుడి అప్సరస యోగిని వేషంతో ఈ మృత్యులోకంలో ఆడుకోవడానికి వచ్చింది. కుంకుమ ప్రతిమవంటి అప్సరసతేజోరాశి రూపాన్ని చూసి మానవ దేహుడైన మనిషెవరో కళ్ళు మూసుకుపోయి పొరబాటున ఆమె కొంగుని తాకాడు. వాడు తాకినంతనే ఆ కుంకుమ ప్రతిమ బూడిద కుప్పయి రాలిపడింది. ఛిం ఛీః ఛీః పూర్తిగా తెల్లని బూడిద! విభూతి అనుకో. స్మశానంలో చితి కాలిపోయాక శవం యొక్క పూలరాశివుంటుంది చూశావా? అంతకన్నా కూడా ఎక్కువ కాంతి వంతమైన తెల్లని బూడిద! అవునవునవును! ఖచ్చితంగా రోగపు బూడిద!''

ఎరిగున్న వాళ్ళు భగత్ ప్రలాపాన్ని విని నిన్న సాయంకాలమే ఏ సమయంలోనో భగత్‌కి మతి చలించి వుండవచ్చునన్నారు.

ఈరెండో కుతూహలంనుంచి గ్రామస్థులు బయటపడేలోగానే మూడో సమాచారం తయారుగా వుంది. బెల్లం తయారు చేసే గోవా ఎక్కడా జాడలేదని.

# 14. కురుక్షేత్రం

**సురేష్ జోషీ**

సురేష్ జోషీ జననం క్రీ.శ. 1921. దక్షిణ గుజరాత్‌లోని గ్రామం నుండి బొంబాయి వచ్చి విద్యాభ్యాసంచేశారు. వృత్తిరీత్యా అధ్యాపకులు. 'గృహ ప్రవేశ్', 'బీజీ థోడీక్', 'అపియ', 'న తత్ర సూర్యోభాతి' కథా సంపుటాలు. 'ఛిన్న పత్ర' చిన్ననవల. 'కించిత', 'కథోపకథన్', 'కావ్యచర్యా' మొదలైనవి విమేచనగ్రంథాలు. 'జనాంతికె', 'ఇదమ్‌సర్వమ్' సృజనాత్మకవ్యాసాల సంపుటాలు. 'ప్రత్యంచా' కావ్య సంపుటి. 'మనీషా', 'క్షితిజ' అనే రెడు సాహిత్యాత్మక మాసపత్రికలకి సంపాదకత్వం అన్యులతో కలిసి నెరపారు.

★ ★ ★

రాత్రి రెండింటికి నేను ఇంట్లో అడుగుపెట్టాను. కళ్ళలో నిండిన వీధిలోనివిద్యుద్దీపాలకాంతి తునుకలు ఇంట్లో చీకట్లోకి చొరబడుతున్నాయి. ఇంట్లో ఒకమూలతగ్గించి వున్నలాంతరు బత్తినికాస్త పైకితోశాను. విరిగిన గాజు చిమ్మీలోకి గాలి పోయేసరికి దాని మంట రెపరెప లాడుతోంది. దాని కంపంతో వస్తువుల నీడలన్నీ కూడా కంపిస్తున్నాయి. ఇల్లంతా తుఫాన్‌లో చిక్కుకున్న ఓడలాగా ఊగిపోతున్నట్టని పించింది. పైన బట్టలారేసు కోవడానికి కట్టిన దండేన్ని పట్టుకుని కొంచెంసేపు అలాగే నిలబడిపోయాను. నగరపు వీధుల్లో పచార్లు చేసే అంధకారం, ఊపిరితో పాటు లోపలికి పోయి మెల్లి మెల్లిగా బరువెక్కుతూ శరీరంలో ఎక్కడో అట్టడుగున తిష్ఠ వేస్తోంది. ఆ భారం వల్ల నా పాదాలు తొట్రు పడుతున్నాయి. ఒకటో అరోసిగరెట్ కాల్చాలి అనిపించింది. కానీ ఒక్క సిగరెట్ కూడా మిగల్లేదు. పడక దగ్గిర నింపిన లోటాలో నీళ్ళు తాగాను. పడక అంచుమీద కూర్చుని ఇటూ అటూ చూశాను. రెండో గదిగుమ్మంలో ముదుసలి కాళ్ళుబారజాపి ఇంకాస్సేపటికి పాడెకట్టి తీసుకుపోవడానికి సిద్ధంగావున్న శవమాఅన్నట్టుగా ముఖాన్ని ధోవతితోకప్పుకుని నిద్రపోతున్నాడు. తన జీవితంలోని ఎత్తు పల్లాల్ని, తన అర్వై ఐదేళ్ళని చితిలో పేర్చే కర్రల మాదిరిగా ఒకదాని మీదొకటి పేర్చినాక తనే స్వయంగా దాని మీద శయనించినట్టుగా ఉన్నాడు. వంటింటి చెమ్మనించి

వచ్చే దుర్వాసన మధ్య అమ్మ, వదిన నిద్రపోతున్నారు. అన్నయ్య కివ్వాళ నైట్, అందుకని ఈ రోజు మధ్య గదిలో గృహస్థాశ్రమ భోగాన్ని నేను అనుభవించవచ్చు. నిద్ర అనే దుశ్శాసనుడు వదిన వస్త్రాల్ని అస్తవ్యస్తం చేసేశాడు. దంత విహీనమైన అమ్మ బోసినోటి డబ్బీ, ఆమె ముక్కుపొడి డబ్బీ లాగే సగం తెరుచుకునుంది. నా పక్కన భార్య నిద్రపోతోంది – 'భార్య' అనే ఇంత చిన్న శబ్దం తాలూకు భారాన్ని సైతం ఎత్తలేనట్టుగా. ఆమె దిండు మీద 'సోమవార వ్రత కథ' పుస్తకం పడివుంది. నోరు, కళ్ళు సగం సగం తెరిచివున్నాయి. ఆమె చిత్తం మాత్రం చిత్తుగా నిద్రపోతోంది. మరణిస్తే ఈమె ముఖం ఇలాగే వుంటుంది – అప్పుడీమె నోరు, కళ్ళూ నేనే ముయ్యాల్సివస్తుంది – దీని మొహం మండా ఇలాటి ఆలోచనెందు కొచ్చిందో నా మనసులో.

నేను బయటినించి తీసుకొచ్చిన చల్లదనం గదిలో వెచ్చదనంలో లుప్తమైపోయింది. లాంతరుతగ్గించి పడకమీదవాలాను. దగ్గర్లో నిద్రపోతున్న భార్య అమాయకమైన మొహాన్ని చూస్తూంటే నవ్వు వొచ్చేసింది. ఏమీ తెలియని తనంలోనే ఈమె ఎన్ని ఉన్నత సాహసాలు చెయ్యడానికి తయారయిందో. క్షణక్షణం వేలాదివేలుముక్కల్లోముక్కలు ముక్కలవుతూ తిరిగే నాకు ఆమె తన చిన్ని కడుపులో దాచుకుని నన్ను తిరిగి ఉత్పన్నం చెయ్యాలని కోరుకుంటోంది. ఎంత నిశ్చింతగా నిద్రపోతోంది! ఆమె సోమవార వ్రతాన్ని ఆసరా తీసుకుని నిశ్చింతగా వుంది.

లాంతరు మంట తగ్గించడం వల్ల అది ఉడుము నాలుక లాగా రెప రెపలాడుతోంది. కొద్ది సేపటికిఎలుకలు సాహసించి వాటిపని ప్రారం భించాయి. నేను కళ్ళు మూసుకున్నాను. రోజంతా చూసిన అనేక దృశ్యాల తునుకలు ఇట్నించి అటు ఇరుసులేని గ్రహాల మాదిరిగా తిరుగుతూ ఒకదాన్ని ఒకటి ఢీ కొంటున్నాయి. రోజంతా విన్న అనేక ధ్వనులు కూడా మెల్లి మెల్లిగా వినబడుతున్నాయి. ఇదంతా నాతోనే ఉంటుంది. నిద్రలో కూడా ఇదంతా నా చుట్టు పక్కలే తిరుగుతూంటుంది. కానీ నా చుట్టు పక్కల నడిచే కబుర్లని వింటున్నప్పుడూ వాటిల్లో పాల్గొంటున్నప్పుడూ మాత్రం నా ధ్యాస వాటిల్లో ఉండదు. నా మనసు వాటినుంచి దూరంగా పోతుంది. అందుకే నేను కావాలనే కృత్రిమ ఆవేశంతో పిడివాదనల జడివాన్నై పోతూంటాను. చిన్న చిన్న విషయాలకూ్కడా పడిచచ్చేవాడినై యుద్ధం చెయ్యడం నాకలవాటై పోయింది – ఒక గ్లాసు మంచి నీళ్ళు తాగాల్సి వచ్చిన సరే!

ఇందు కోసరమే ఈరోజు నేను మనుభాయ్ మాస్టర్ వాళ్ళు

చంద్రకాంతకి చెంబదెబ్బిచ్చాను. గౌరీ గీతాలు వ్రాస్తున్నాను. అందుకని ఆమె నాకు ఆత్మ సమర్పణ చేసుకుంటోంది. నేను కొన్ని శబ్దాల్ని... ఫాల్గుణం - శ్రావణం, రాధా-శ్యామసుందరుడు, ఇలా కూర్చి, వాటిల్లో ఇంకా నా ఆకలిని కూడా దాచివ్రాస్తూంటాను. చంద్రకాంత ఆ గీతాల్ని పాడుతోంటే బాగుం టుంది. మళ్ళీ నా అలవాటుని అనుసరించి భావాల్ని మరికాస్త జోరుగా లాగుతాను - పదమూడేళ్ళ కాంతచిబుకం పట్టుకుని చెబుతాను - ''చంద్రా, నువ్వింత మధురంగా పాడతే నీ ముందు గీతాల్ని రాశి పోస్తాను. పారిజాతపుష్పాలి రాశిపోసినట్టుగా'', చంద్రకాంత ఈఆకస్మిక ప్రణయోక్తిని విని చేష్టలుడిగి, నోరు తెరుచుకుని నా వేపు చూస్తూండిపోతుంది. ఆమె స్నేహితురాళ్ళు కిందఎగురుతూ, ఉరుకుతూ ఉంటారు. నాట్యం చేస్తారు, దూకుతారు. ఇంక చంద్రకాంత, కింకర్తవ్యతా విమూఢురాల్లా కూచుని వుంటుంది. ఆమె ఏకంగా నా ఒళ్ళో తల పెట్టుకుని తన కళ్ళతో నా వేపు చూస్తుంది. ఇక ఎందుకో తెలియదు నాలో భయం చెలరేగుతుంది. ఆమె ఈ వేళా పాళా లేని ప్రేమ చేష్ట వల్ల నాకు జుగుప్స కలుగుతుంది. ఎలెక్ట్రిక్ షాక్ తగిలినట్టు నేను లేచి నిలబడతాను. చంద్రకాంత కాళ్ళ మీద పడుతుంది. నా కాళ్ళు పట్టేసుకుంటుంది. నేను కిందకి వంగుతాను - ఆమె చెయ్యి పట్టుకుని లేవదియ్యడానికి. కానీ ఆమె కళ్ళలోని విహ్వలత, ఆమె చేతిపట్టులో వ్యాపించే ఆశ నన్ను ఉత్తేజితుణ్ణి చేస్తుంది. నేను ఆమె నొక్క చెంపపెట్టు పెట్టి చక్కా వస్తాను.

లాంతర్లోని బలహీనమైన మంట మూసుకున్న కళ్ళలోని కనుపాపల మీద నాట్యమాడుతోంది. ఆ చంద్రకాంత విహ్వల కరం మాదిరిగా అంటుకునివుండిపోయింది. నేనుఉండలేకపోయాను. లాంతరుని ఆర్పేస్తున్నాను. అంతే, ఇప్పుడు నోట్లో సిగరెట్ ఉండుంటే ఇంకా మజాగా ఉండుండేది - దాని నిప్పురవ్వల్ని చీకట్లో చూస్తూంటే బాగుంటుంది. కానీ పక్కమీద పడుకునేప్పుడు నా భార్య చెయ్యి నా వీపుకింద వుంది. 'హేవ్ మోర్'లో కేతకీ మెహతా కప్పుల్లో టీ పోస్తున్నప్పుడు తెరిచివున్న ఆమె చెయ్యి ఏ విధంగా వొణికిందో గుర్తొచ్చింది అతనికి! ఆ చేతికున్న మృదువైన రోమాలు, మోచేతి పై భాగాన మసృణమాంసలత... కొద్ది పాటి శ్రమకే ఆమె ముఖంలో పరుగుతీస్తోంది అరుణిమ. నేను టీ ధారని చూస్తున్నాను. దీపం కాంతిలో తడిసిపోతున్న ఆమె చేతిని చూస్తున్నాను. టీ లోంచి వస్తున్న ఆవిరితో పాటు కనబడుతున్న ఆమె సిల్క్ చీరలోంచి వస్తున్న సుగంధం ఆహ్లాదాన్ని తెస్తోంది, అంతే కాదు ఏదో వ్యక్త పరుస్తోంది కూడా. మళ్ళీ ఆమె

చెయ్యి చీరలో దాక్కుంది, నేను అన్యమనస్కంగా ఉండిపోయాను. ఏ స్త్రీనైనా నేను ఆపాద మస్తకం చూడలేను. ఆ స్త్రీ వ్యక్తిత్వం ఆమె శరీరంలో ఏదో ఒక అంగభాగంలో ఉన్నట్టుఅనిపిస్తుంది. నేనెంత పరీక్షగా చూస్తానంటే ఏ స్త్రీనైనా చూడగానే నాకాఅంగం తెలిసిపోతుంది. ఒకరుకాళ్ళు ఊపుతారు. ఒకరు అకారణంగా మెడవంచి తరుచు తిరిగి చూస్తారు. ఒకరు ఉండుండి జుట్టులో వేళ్ళుంచి కదుపుతారు. ఒకరికి పెదవులు కంపిస్తాయి. అంతే ఆ! నేను ఆ స్త్రీలో ఇంకేమీ చూడను. కానీ నా భార్య నిద్రలో తన భర్త స్పర్శ తాలూకు ఆనందాన్ని పొందలేకపోతోంది. ఆమె మాతృహీనురాలైన పసిబాలికమాదిరి అస్పష్టంగా ఏదో కలవరిస్తుంది. మళ్ళీఒత్తిగిలి నిద్ర పోతుంది. భర్తని వశపరుచుకు నుంచుకునేందుకు ఆమె స్నేహితులు చెప్పిన సలహాలు నిద్ర వల్ల వ్యర్థమైపోతున్నాయి. పైగా ఆమె కిశోరావస్థ సృష్టించిన కలల్లో విహరిస్తూంది. చీకట్లో ఆమె తనూరేఖల కొద్దిపాటి కాంతి కనబడుతోంది. అందుకే కాబోలు చీకట్లో నా కల్పన ఎక్కువ క్రియారూపం దాలుస్తుంది. ఎంతో షోకుగా కట్టుకున్న రీటా పోనీ టెయిల్, రేఖా కబుర్లు, మాట చెబుతూ చెబుతూ ఆగిపోవడం కళ్ళు రెప్పలార్పుతూ మళ్ళీ ఏం కబురు చెప్పాలా అని దాని సూత్రం వెతికే ఆమె తీరు – ఆమె కంఠస్వరం – అంతా నాకు గుర్తు రాసాగింది. నేను రేఖ మాటల్ని కేవలం ఆమె కంఠస్వరం మీదున్న ఆ పేక్షకొద్దీ వింటూవుంటాను. ఆమె మాటల్లోఅర్థమేమీ ఉండదు. ఆమె కంఠస్వరం మధురంగా ఉంటుందని చెప్పడానికి వీల్లేదు గానీ అయినా కూడా బాగుంటుంది. ఆ స్వరం ఒక వాతావరణాన్ని ఏర్పరుస్తుంది. ఆ స్వరాన్ని వింటూంటే ఆమె తన నలువైపులా ఒక అర్ధ పారదర్శకంగా వున్న తెరని వేసుకున్నట్టు అనిపిస్తుంది. ఆ స్వరంలో ఒక రసానుభూతి వుంటుంది – కానీ మాధుర్యమూ వుంటుంది, సముచితమైన కాఠిన్యమూ వుంటుంది. అందుకే ఎక్కువ రాణిస్తుంది. రేఖా కంఠస్వరం, మీనల్ మిత భాషణలో ముడుచుకునే కనుబొమలు, శీలూ శరీరాన్ని అకారణంగా గాలికి ఏ వృ క్షశాఖలో ఊగుతున్నట్టుగా కదపడం... చీకట్లో ఈ తునియల్నన్నిటినీ పోగు చేస్తున్నాను. వీటన్నిట్లోంచీ నేను ఒక నారీ మూర్తిని చిత్రిస్తున్నాను. నా దగ్గిర పడుకున్న నారీశరీరంలోని రేఖలతో ఈతునియల్ని జోడించి చూడాలని పిస్తోంది. చెదిరిన నిద్ర మూసుకున్న కళ్ళని మండిస్తున్నట్టుంది, రక్తనాళాల్లో రక్త ప్రవాహం తగ్గిపోతోంది, నా దగ్గిర పడుకున్న నారీ శరీరంలోని గుండె చేస్తున్న లబ్-డబ్ శబ్దం వినవస్తోంది. వాకిట్లో రాళ్ళు పరచి, నిశ్శబ్దంగా చదును నేల మీద నా పాదాలు ధన్ ధన్మని చప్పుడు చెయ్యసాగాయి. శబ్దాలు కూడా అప్పుడప్పుడు వెంటపడతాయి. తేనెతుట్టెనికదిపితే

తేనెటీగలు నాలుగువేపులా చుట్టుముట్టి ఝుంఝుమ్మని అంటూ వుంటాయి.

నిద్ర భారంతో బరువెక్కిన భార్యని నావేపు లాక్కుని అటు తిరిగాను. ఆమె కాళ్ళొకటి నిద్రలో సగం పైకెత్తి వుంది. కాసేపు అదే స్థితిలో వుండి ఆకాలు నావేపు పడసాగింది – చివరికి ఒక్క ఊపులో అది నామీద పడింది. నా మనసులో పోగేసిన ఆ తునియల్ని మళ్ళీపరిశీలించాలనిపించింది – ఆకారణంగా గాలిలో ఊగే వృక్షశాఖ వంటి శీలూ ఊగే శరీరం – కానీ ఆకాలు ద్వారా ఆ దేహం మీద బరువుగావున్న నిద్రభారం నా మీదకూడా పడసాగింది. నేను వివశుడిలా ఆ తరువాత బరువెక్కుతూ కాలుకింద పడుండి పోయాను. అప్పుడే ముదుసలి దగ్గుతూ లేచి కూర్చున్నాడు. బయటికెళ్ళే తలుపుతెరుచుకుని బయటికెళ్ళాడు. బయటి గాలి లోపలికొచ్చింది, సందులో విద్యుద్దీపాల కాంతి కూడా ద్వారం మీద ఇటూ అటూ వొంగుతూ పడి లోపలి కొచ్చింది. మీదపడి వున్న ఆమె కాలిని తొలగించే సాహసం చేశాను.

ద్వారం మళ్ళీ మూసుకుంది. బయటికి పారిపోవాలనుకున్న గాలి ఇంట్లోనే బంధీ అయిపోయి తలపట్టుకు కూర్చుండిపోయింది. లోపల వేడి మళ్ళీ పెరుగుతోంది. ఆ వేడిగాలితో పాటే నా భార్య తలలోంచి అగరు వొత్తి సుంగంధం వొచ్చి నా శ్వాస ఆగిపోయింది. ఈ విధంగా నేను అనేకమంది శత్రువులతో ఒంటరిగా యుద్ధం చేసేపౌరాణిక మహారథుల మాదిరి పడకమీదే ఎగిరి పడుతూ యుద్ధం చేస్తున్నాను. నేను యుద్ధం చేసే విసురులో పక్కనే పడుకున్న భార్య శరీరాన్ని కుదిపి కుదిపి ఒదిలిపెట్టాను. ఆమె మళ్ళీ గొణిగింది – ''అఁ అఁ... ఎవరు?'' చెప్పాను – ''నేనే''. ఆమె తిన్నగా లేచి కూర్చుంది. నేనడిగాను – ''ఏం చేస్తున్నావు?'' ఆమె అంది – ''మీ కోసరం పాలువుంచాను. తీసుకురానా?'' నేను ''ఉండనివ్వు. నేను తాగను'' అన్నాను.

ఆమేదో మాట్లాడబోయింది. కానీ నేను హఠాత్తుగా ఆమె చెయ్యి పట్టుకుని గుంజి దగ్గరకులాక్కున్నాను. చీకట్లో నాముఖంమీద పరుచుకున్న ఉత్కంఠభావం ఆమెకికనిపించలేదు, అందుకే ఆ అమాయకురాలు ఇది ప్రేమ క్రీడ అనుకుంది. ఆమె నా దగ్గిరకి జరిగింది. అసహాయ శిశువులాగా నా వక్షస్థలంలో దాక్కుంది. ఆమె దగ్గిరకు రావడంతో పాటే తాపం తీవ్రత కూడా పెరగసాగింది నా శ్వాస అవరుద్ధమవసాగింది. బయటికి సందులోకి పరుగు తియ్యాలన్న కోరిక కలిగింది. కానీ ఇప్పుడామె రెండు చేతులూ నన్ను అటూ ఇటూ గట్టిగా పట్టుకున్నాయి – ఊళ్ళో దారి కిరువేపులా వున్న చెట్టు కొమ్మ

పట్టుకుని ఊపే చేతులు, నూతినించి నీళ్ళు తోడే చేతులు, పిడకలు చేసే చేతులు. అప్పుడే పక్కింటి దామూకాకాకి దగ్గుతెరవొచ్చింది. ఉమ్మేశాడు. పుక్కిలించి ఉమ్మేసి, నాలుగుసార్లు ''హేప్రభు'' అన్నాడు. అప్పుడు మళ్ళీ శాంతి నెలకొంది.

ఆ అంధకారం, నిస్తబ్దత - దాని అడుగున చెర్లాడుతున్న రెండు జీవులు మేమిద్దరం కాస్త చల్లబడకోరుతున్నాం. నేను చితికిపోయిన సంసారం నించి తెంచీ - జోడించీ కాస్తంతేమన్నా రచిద్దామను కుంటున్నాను, కానీ సృష్టి అంధకారగర్భంలోనే రచింపబడుతుంది. శిశువు తల్లి గర్భాశయంలో పోషించ బడుతుంది. నా దగ్గిర అంత అంధకారం లేదు. ఇందుకేనేమో మళ్ళీ మళ్ళీ అంధకారాన్ని తేరిపార జూస్తాను. నా దగ్గిర వున్న ఆ నారి నా ఛిన్నా భిన్న అంశాల్లోంచి రక్తం పిండుకుని దానికి తన గర్భంలో ఏదో ఆకారాన్నివ్వ గోరుతోంది. తల్లి గర్భాశయంలో అంధకారానికేం తక్కువలేదు. అది అనేక జన్మలనించీ అలావస్తోంది. నాకు అంతా మసకగా అనిపించ సాగింది. గర్భంలో అంధకారంలో కూడా కలియక ఆమె శరీరంలోని ఒక్కొక్క రక్తనాళాన్నీ ఛిన్నాభిన్నం చేసివేసేటటువంటి పదునైనముక్కలని ఆమెకిస్తాను. ఇటువంటి ఉన్మాదంతో నేను నా శరీరాన్ని ఆమె వేపుకి జరిపాను. ఈ యింటి మౌనాన్నీ, ఈ యింటి సంతాపాన్నీ, ఈ యింట్లో తునియల మాదిరిగా చెదిరిపోయిన జీవుల్నీ - అన్నిటినీ గుర్తు చేసుకుంటూ నా శరీరాన్ని ఆమె కప్పగించాను. అమ్మ నీళ్ళు తాగటానికి లేచింది. నా భార్య రెండు చేతులతో నా శరీరం మీద జలగ లాగా అంటుకుపోయింది. మా ఇద్దరి మధ్యా అదమడం - రాపిడి వల్ల వేడంటే ఇంకా ఎక్కువ అసహ్యమేసింది. ఆ వేడి శరీరమంతాప్రవహిస్తోంది. కళ్ళు ఇంకా ఎక్కువ మండసాగాయి. వర్షాకాలంలో బయటి కొచ్చే సహస్రపదీయ జీవుల మాదిరిగా నా శరీరం వేలకు వేలు పాదాలతో నడుస్తోంది. నిద్ర వచ్చిన వాడిలా వరద ఎదురుగా కట్టిన అడ్డుకట్ట ఒక్కసారి విరిగి పడ్డట్టుగా అతను జారిపోయి దొర్లిపడ్డాడు.

ఆ నిద్రమత్తులో నామనసుకి ఎదురుగా ఒక చిత్రం రూపొంద సాగింది. విశాలమైన రణక్షేత్రంలో పడివున్న శరీరాల కుప్పల మధ్య నేను పడివున్నాను. నేను సంపూర్ణంగా లేను. ఒక చెయ్యి ఇక్కడుంది. శిరస్సు మరోచోటికి పోయి మాయమైంది. అప్పుడే దివిటీ వెలిగించి నా భార్య నన్ను వెతుకుతూ నా దగ్గిర కొస్తోంది. ఆమె నా అంగాల్ని పోగు జేస్తోంది. ఆమె పాపిట్లో సింధూరముంది. ఆమెచేతుల్లో కుంకుమవుంది. ఆమె తన చేతులతోచితి వెలిగిస్తోంది. నన్ను ఒడిలోకితీసుకునిఅందులో ప్రవేసిస్తోంది.

మండుతున్న జ్వాలలు మమ్మల్ని చుట్టుముట్టాయి. నేను కాలిపోతున్నాను. ఆఖరికి సహించలేక కళ్ళు తెరిచాను. బయట ఎండ. దాని తీక్ష్ణమైన కత్తులు నా కళ్ళమీద పరుచుకున్నాయి. లేచి కూర్చున్నాను. కళ్ళు ఇప్పటికీ మండుతూనే వున్నాయి. లేచి వంటింట్లోకి వెళ్ళాను. అమ్మ నా కోసరం కలిపి వుంచిన టీని వెచ్చ చేసి నాకు ఇచ్చింది. అందులో పొగ చూరిన రుచి వుంది. అమృతం మాదిరి తాగుతూ కూర్చున్నాను. కంచెలో పడిన కుంపటి బూడిదమీద చెదిరిపోతున్నఎండతాలూకు మెరుస్తున్న తునియల్ని చూస్తున్నాను. ఎకాయెకిన కవితకి పంక్తిస్ఫురిస్తోంది - కురుక్షేత్రం మీద పంధొమ్మిదవ రోజు సూర్యుడు ఉదయించాడు. ఖండించ బడ్డ సౌభాగ్యవతి కంకణంలా వెలుతురు చెదిరిపోయింది. సహగమనం చేసే సతి చేతుల్నుంచి పడుతున్న కుంకుమ మాదిరి అతను తూర్పు క్షితిజపు అర చేతిలోంచి జారిపడుతూ సాగుతున్నాడు...

బయట చదువుకునేందుకు కూర్చున్న నా తమ్ముడు ఎక్కాలు వల్లె వేస్తున్నాడు. వాడి కంఠస్వరంలో నా కావ్య పంక్తులు చిక్కుకుపోతున్నాయి. నా చిన్న కవితని చుట్టుపక్కల వున్న శబ్దాల మధ్యనించి బయటికి తీసుకుపోతూంటే ఎవరేనాకుంటబ్బాయిని తీసికెడుతున్నట్టుగా అనిపించింది. ఎందుకంటే నా కవిత ఇంకా నడవడం నేర్చుకోలేదు.

బయటి తీక్ష్ణమైన వెలుగులో దానికళ్ళుతెరచుకోవు. కళ్ళు మూసుకున్న ఆ కవితని మనసులోనే ఎక్కడో దాచుకుని మళ్ళా పాడుపడిన రాత్రి అంధకారం కోసం ఎదురు చూస్తూంటాను. ఆ అంధకారంలో నా కవిత కళ్ళు తెరుస్తుంది, ఈ ఉత్సాహంతో నేను పగలుకి రెండో అంచుని చేరటానికి ధైర్యాన్ని సమకూర్చుకుంటున్నాను.

# 15. మీరు వస్తారుగా?

చంద్రకాంత బక్షీ

చంద్రకాంత బక్షీ జననం క్రీ.శ. 1932. పాలన్ పుర్‌లో ఉత్తర గుజరాత్ నివాసి కానీ ఎన్నో ఏళ్ళ నించి కలకత్తాలో వున్నారు. అక్కడ వ్యాపారం చేశారు. కొంతకాలం బొంబాయిలో ఒక కాలేజీలో హిస్టరీ లెక్చరర్‌గా వున్నారు. నవల కథ ఈయన కిష్టమైన, ప్రముఖ సాహిత్య క్షేత్రాలు. 'ఏక్ సాంజనీ ములాకాత్', 'మీరా', 'మశాల్' మొదలైనవి కథాసంపుటాలు. నవలల్లో 'ఆకార్', 'పెరేలిసిస్' పేర్కొనదగినవి.

★ ★ ★

అయిదుంబావు ట్రామ్‌లోమిమ్మల్ని చాలాసార్లు చూశాను, ముఖ్యంగా చలిరోజుల్లో. చలిరోజుల్లో మొదటి ట్రామ్ ఇంచుమించు ఖాళీగా వుంటుంది. మీరు మెషిన్ రో దగ్గర్నించి ఎక్కుతారు - చాలాసార్లు పరిగెడుతూ కూడ. ఎస్ ప్ల నేడ్ దగ్గరదిగిపోతారు. మీరు నన్ను చూసి వుండక పోవచ్చు. లేకపోతే చూసివుండనూ వచ్చు. కానీ గుర్తు పట్టలేరేమో, ఎందుకంటే ఉదయంపూట మీరు కళ్ళజోడు పెట్టుకోరు. పైగా నేను సెకెండ్ క్లాస్‌లో ఉంటాను. నా మూడు నయాపైసలు మిగులుతాయి. పాలవాళ్ళ కారణంగా కిటికీలు మూసేసిన ఆ పెట్ట వెచ్చగా కూడా ఉంటుంది. మీకు నవ్వు వస్తోందా? కానీ నా దగ్గిర కూర్చుని ఎవరైనా ఆవులిస్తూ వుంటేనాలో వెచ్చదనం వచ్చేస్తుంది. దీనికి కారణం నాకు తెలీదు...

మీరు నన్ను చూడలా? పోన్లెండి, ఫర్వాలేదు. రెండేళ్ళ నుంచి నేను ప్రతిశీతాకాలంలోనూ ఇదేట్రామ్‌లోవస్తున్నాను, పొగమంచులో పరిగెడుతున్నాను. పొట్టగడుపుకోవడంకోసరంకాదు. పొట్టయితే నాదంటూ లేనేలేదు. కేవలం ఆకలివేసినప్పుడు తెలుస్తుంది, ఒక పొట్ట భగవంతుడిచ్చాడని. కానీ నాకు పరిగెట్టడం సరదా. సంవత్సరాల తరబడి పరిగెడుతున్నాను. ఎలాగైతే మీకు మెమోరియల్ దగ్గరున్న సరోవరం ఒడ్డున కూర్చోవడం సరదానో నాకూఅలాగే. మీమానాన్న మీరక్కడ కూర్చుంటారు, పొగమంచులో టాక్సీలు నిలిపి వుంటాయి, గాలి కారణంగా శరీరంమీదరోమాలు

నిలబడిపోతాయి, చాలాకొద్దిగా నీడలు కనబడుతూంటాయి. వాటిరంగు ఒకేలావుంటుంది. రంగులు మారిపోతూంటాయి - ఎండవచ్చిం తర్వాత గడ్డీ, ఆకులూ మెరుస్తూంటాయి ఇంకా వాటి మీంచి ధరధర మని చప్పుడు చేసుకుంటూ కుక్కలుపార్క్‌దగ్గిరున్న బళ్ళకిందనించి బయటికొస్తూంటాయి. జనం చెవుల మీదుగా తలమీదనించి కట్టుకున్న మఫ్లర్లు విప్పి మెడలో చుట్టుకుంటారు. నా దుర్బలమైన కళ్ళలోంచి కారే నీరు ఆరినట్టుంది. మీరన్నీ ఎరుగుదురు...

పదండింక లేద్దామా? రెడ్‌రోడ్ లోంచి వెడుతున్నాం. ఏ విధంగానైతే మధ్యాహ్న సమయంలో డల్హౌసీ ఎక్వేయర్ ఆఫీసులో ప్రపంచం వేడిగా వుంటుందో అదే విధంగా రెడ్‌రోడ్ తెలతెల వారుతూనే వేడిగా వుంటుంది. మేమ్‌సాహిబాలు కారునడపడం నేర్చుకోవడానికి ఇక్కడికి వస్తారు. యోగసాధన చేసేవాళ్ళు గన్‌మెటల్ గుర్రాల మీద సవారీ అయిన కిచనర్, ఆడ్‌ట్రమ్ ప్రతిమల కింద నిర్మించిన మెట్లమీద శీర్షాసనం వేస్తారు. సేఠ్‌లు వణికే చేతులతో పేపరు తెరచి శేర్‌బజార్ ధరవరలు చదువుతారు. లావుపాటి ట్రక్ డ్రైవరెవరైనా నిండిన ట్రక్‌ని ఆపి మైదానంలో రెయిలింగ్ వైపు వెడుతున్నట్టుగా నటిస్తూ ట్రక్‌కిరెండోవేపుకివెళ్ళి లఘుశంక తీర్చుకోవడానికి కూర్చుండిపోతాడు...

నేను ఈ వైవిధ్యం కోసరం ఇక్కడికి రాలేదు. మొదటషార్ట్స్ వేసుకుని హాకీ ఆడటానికొచ్చే ఒక ఆంగ్లో - ఇండియన్ అమ్మాయి రోజూ ఇక్కడ నన్ను కలుసుకుంటూ వుండేది. కానీ ఇప్పుడు నాకు ఆమె ముఖం గుర్తులేదు. మీ ముఖం నాకు గుర్తే. ఎందుకంటే మీ ముఖం ఆ అమ్మాయి ముఖం కన్నా ఎక్కువ ఆకర్షణీయంగా వుంది. మొగవాళ్ళ మొహంలోనే ఇంత ఎక్కువ వైవిధ్యం ఎందుకుంటుందో? నాకు అన్ని పులులూ ఒకలాగే కనిపిస్తాయి - చిత్రాల్లోవీ, సర్కస్ లోవీ, జూలోవీ. నారింజలు కూడా అన్నీ ఒక్కలాగే ఉంటాయి. పిల్లల ముఖాలు కూడా ముఖాల్లో అంతరం ఆలోచనల మీద ఆధార పడివుండవచ్చని నా ఉద్దేశ్యం. మనిషి ఎంతెంత పెద్దవాడవుతూ పోతే అంతలా అతని ముఖం మారిపోతూవుంటుంది. అవునా? పులి, నారింజ, గులాబీల పూచిన పూలు - ఇవన్నీ ఆలోచించలేవు. అందుకే వీటిలో పరివర్తన కలగదు. మీ ఉద్దేశం ఏవిఁటి?

ఆహాఁ నేను మనస్తత్వ శాస్త్ర పండితుణ్ణి కాను. కళాకారుణ్ణి కూడా కాదు. కళాకారుడంటే ఎవడైతే సౌందర్యాన్ని చూడగలుగుతాడో అతనా? చూడండి, నాకు సౌందర్యంలో ఎప్పుడూ క్రూరత్వం కనబడింది. ఏ

అమ్మాయి ముక్కుఅయినా కాస్త తక్కువ పొడుగుంటే ఆమె బూచి అవుతుంది, కురూపిగా ఎంచబడుతుంది. ఆమెని చూస్తే మీకు ప్రేరణ కలగదు. ఇదంతా క్రూరం కాదూ? కానీ నా మటుకు క్రూరత్వం విషయంలో ప్రత్యేకమైన ఆ క్షేపణ ఏదీ లేదు...

నా మటుకు చాలా విషయాల గురించి ఆక్షేపణ లేదు. సరే, మీరు నాతో విసుగుచెందటం లేదూ? విసుగు అంటే వినమ్రతా పూర్వకమైన విరోధం. వినమ్రత లేక నపుంసకత. నపుంసక విరోధమా? లేకపోతే సభ్య విరోధమా? ఇవన్నీ ఒకటే మళ్ళా వేరు - వేరు కూడా. ఇప్పుడు మరోవిషయం, విసుగు ఆరోగ్యానికి గుర్తా లేక అనారోగ్యానికా? దీనివల్ల మీకు లాభమా-నష్టమా? ఇది దేనికోసరం కలుగుతుంది? దీని ఆవశ్యకత? మన 'నెర్వస్ సిస్టమ్'తో దీని కేమిటి సంబంధం? పెంపుడు పశువుల క్కూడా విసుగు కలుగుతుందా? ఇంకా అరణ్యంలో జంతువులకీ? పిల్లలకీ?

మీకు విసుగెత్తలేదు. ఇదీ మంచి మాట. విసుగు గురించి నాకే ఇంకా తెలీదు. నాకు స్వయంగా దీని గురించ వైజ్ఞానికంగా స్పష్టమైన సమాచారమేదీ దొరకలేదు. కానీ ఇది ఆకర్షణీయమైనది, ప్రియమైనది, మనోహరమైనది. కానీ ఇతరులకి, అప్పుడు, ఆః!

రెండురోజులనుంచి వర్షాకాలంలాగా వుంటోంది. ఎక్కడో కురుస్తున్నట్టు కనిపిస్తోంది లేదా ఇప్పుడు కురుస్తుందిలా వుంది. ఈ ఋతువులో వర్షంలాంటిది పడదు కానీ ఋతువు కాని ఋతువులో కురిసే వర్షం కలిగించే ఆనందం దారివేరు. మిగతావాళ్ళ కైతే అది విసుగు కలిగిస్తుంది, కానీ నాకు...

చూడండి, నాకో స్నేహితుడు వుండేవాడు. హాస్టల్‌లో మేం కలిసి వుండేవాళ్ళం. రోజూ ఉదయం లేచి నేను అతనికి రాత్రి వచ్చిన కలల్ని చెబుతూండేవాణ్ణి. నాకు రోజూ రాత్రి కలలు వస్తూనే వుంటాయి, మంచివి కానీండి చెడ్డవి కానీండి. చెడ్డవి ఎక్కువ వస్తాయి. మీకు కలలు రావా? నిజంగా? మనస్తత్వ శాస్త్రం చెబుతుంది పిచ్చివాళ్ళకి నిద్రలో కలలు రావని మీరు భయపడ్డారా? పోనివ్వండి, కానీ పిచ్చివాళ్ళకి కలలు రావన్నది నిజం. బహుశః వాళ్ళు మేలుకుని వుండే కలలు కంటూ వుంటారు. హో... హో... హో...

చెడ్డకలలు మానసిక ఆరోగ్యానికి చాలా అవసరం. చెడ్డవి, అంటే అవంటే మీకు భయమేస్తుంది. చనిపోయినట్టు, మునిగిపోయినట్టు లేదా కాలిపోయినట్టు- భయంకలుగుతుంది. స్వజనం ఎవరేనా బాధ పడుతున్నట్టుగా చూస్తాం. లేదా ఎప్పుడైనా బురదలో చిక్కుకున్నట్టు

చూస్తాం, లేకపోతే లైంగిక విజ్ఞానంగురించి కలలు కంటాం - ఎలాంటివంటి లేచాక మీకు సిగ్గేస్తుంది. సిగ్గు పడకండీ, దాదాపు ప్రతి ఒక్కళ్ళకీ ఇలాంటే కలలు వస్తాయి. ఈ ప్రపంచమంతా ఇలాగే వుంటుంది.

అవును, మనం ఏం మాట్లాడు కుంటున్నాం చెడ్డకలలు. ఆఁ సరే. నా స్నేహితుడి కూడా కలలు రావు. నేను అతన్ని ఆట పట్టిస్తూండేవాణ్ణి నువ్వు పిచ్చివాడివైపోతావని మీరునమ్ముతారోలేదోగానీ, వాడునిజంగా పిచ్చివాడై పోయాడు.

తర్వాత ఒసారి నేను పిచ్చాసుపత్రికి కలుసుకోవడానికి వెళ్ళాను. వాడు కొట్లాడేవాడు కాడు. నేను ప్రత్యేకించి సెలవుతీసుకుని వాణ్ణి కలుసుకోవడానికి వెళ్ళాను. కానీ కలిశాక నాకు దుఃఖ మొచ్చింది. బయట సూపరింటెండెంట్ నాతో చెప్పారు మీ ఫ్రెండ్ 'నార్మల్'గా అవుతున్నాడు గానీ ఇప్పుడే మధ్య మధ్య ఆగ్రహాన్ని నిగ్రహించుకో లేకపోతున్నాడు. నేను అడిగాను - ''ఎలా?'' ఆయన జవాబిచ్చారు - ఒకరోజు సాయంత్రం బట్టలన్నీవిప్పేసి, నగ్నంగాతయారైఅతనుకిటికీలోంచి బయటికి చూస్తు న్నాడు. బట్టలెందుకు విప్పి పారేశారని అడిగితే, నేను భగవంతుడు రూపొం దించిన జగత్తునుచూస్తున్నాను. పక్షులు, చెట్లు, ఆవులు గడ్డి, ఆకాశం, రాళ్ళు - అన్నీ నగ్నంగా వున్నాయి. నేను మాత్రం బట్టలు తొడుక్కున్నాను. నేనూ వాటన్నిటిలాగా సామాన్యంగా వుండాలి అని జవాబిచ్చాడని. సూపరింటెండెంట్‌తో పాటు నాకూనవ్వువచ్చేసింది. ప్రపంచంలో నవ్వడం కూడా నేర్చుకోవాలి. నవ్వుని కూడా సహించాల్సి వుంటుంది. మరేం చెయ్యాలి?

మీరు అలిసిపోయినట్టువుంది. రండిచెరువుగట్టుకెళ్ళి కూర్చుందాం. ట్రాంస్టాప్ దూరంగా వుంది. చెరువు గట్టుమీద చల్లగా వుంటుంది. కానీ ఆ లావుపాటి వాళ్ళు ఇప్పుడిప్పుడే లేచారు, అక్కడ స్థలం ఇంకా వెచ్చగా వుంటుంది. కూర్చోండి, ఆశ్చర్యంగా వుంది. మీకు నామాటలు నచ్చాయి. ఇది ప్రమాదం.

సహజంగా నేను ఎవరితోనూ మాట్లాడలేను. వినేవాళ్ళు కాసేపు విని వెళ్ళిపోతారు. దాని పరిణామ మేమంటే నేను స్పష్టంగానూ, ధారాళంగానూ మాట్లాడలేను. మాట్లాడ్డం ఒక గొప్ప కళ. ఇంక మరి మాటలు వినడం అనేది ఈశ్వరుడిచ్చిన వరంలాగా కనబడుతుంది. మనం మళ్ళీ మనప్రస్తుత విషయాని కొస్తున్నట్టు వున్నాం. పోనీ, వదిలెయ్యండి.

నేను కొద్దిగా చదువుకున్నాను. 'కొద్ది' అంటే చాలా ఎక్కువ. అంతా

ప్రారంభించి వదిలేశాను. ఏడేళ్ళువరకూ చదివాను. ఒక్క డిగ్రీ కూడా రాలేదు. జ్ఞానం అపూర్ణ మవుతుంది కదూ?

అయినా జ్ఞానం పనేమిటి? మనిషి యొక్క అపూర్ణతని తెలియ జెప్పడం నన్ను నా అపూర్ణత అనుగ్రహించింది. అందుకే నేను చదువు వదిలేశాను. తిరగడం ప్రారంభించాను. బ్రహ్మచర్యాశ్రమానికీ, గృహస్థా శ్రమానికీ మధ్య మరొకఆశ్రమం అవసరం కూడావున్నట్టు నాకు అనిపిస్తుంది. ఇందులో తిరుగుడు కూడా వస్తుంది, స్త్రీల పట్ల పెరుగుతూ వచ్చే ఆకర్షణ కూడా. సరే నేను చాలా తిరిగాను. 'చాలా' అంటే 'కొంచెం!' మీరు నావేపు అలా చూస్తున్నారెందుకనీ? నాలో మీకేదేనా విడ్డూరం కనబడుతోందా? 'చాలా' కి అర్థం 'కొంచెం' కూడా. ఇంతపెద్ద ప్రపంచంలో, ఐన్‌స్టీన్ చెప్పిన 'సమయం' యొక్క పరిమాణాన్ని దృష్టిలో పెట్టుకుని నేను దేన్నయితే 'చాలా' అని చెబుతున్నానో అది ఎంత 'కొంచెమో!' కాంతి సంవత్సరాలతో పోలిస్తే నా కొద్దిపాటి సంవత్సరాలు ఏపాటి!

నేను కొంచెం తిరిగాను. అలిసిపోయాను. నేను మేధస్సుతో పని చేపట్టాను. అలసటకీ మేధస్సుకీ సంబంధం ఏమిటి? అదే ఫ్లవర్‌వాజ్‌లో నీళ్ళకీ, దానిలో పడేసిన పూల సుగంధానికీ వున్న సంబంధమే. ఇది నా దృష్టి కోణం. ప్రపంచంలో అన్నీ వ్యక్తిగత మైనవి, పైగా అన్నీ 'రిలెటివ్' (సాపేక్షం) ఐన్‌స్టీన్ శుభ్రమైన పని చేశాడు. ఆయన 'రిలెటివ్' శబ్దాన్ని బాగా తెలియ జెప్పాడు. అయితే శాస్త్ర పరిజ్ఞానం ద్వారా నేను 'రిలెటివ్' శబ్దాన్ని సైకాలజీ ద్వారా తెలియ జెబుతాను.

ఈ 'రిలెటివ్' మీ కర్థమయిందా? చాలాసార్లు అనిపించింది కాలేదని మీరు ఒక దృష్టాంతం చూడండి. నల్లపిల్ల. లియొనార్డోడావిన్సీ లేక బోటీ షెలీ లగాయితు రివేరా లేక మీరో వరకూ అందరు చిత్రకారుల్లోనూ (చిత్రాల్లోనూ) నల్లపిల్లల్ని వెతకండి. ఒకచోట నల్లగా వుంటుంది. మరోచో నీలంగా, ఇంకో చోట ఎర్రగా... పిల్ల ఎక్కడుంటుంది - ఎక్కడుండదు. ఒకచోట కేవలం రేఖలు, ముక్కలు, మచ్చలు, చుక్కలు... రంగులు ఇంకా రంగుల్లేకుండా కానీ నల్లపిల్ల మీరెక్కడ వెతికినా దొరకదు. కళాకారుడు చూసిన దానిలోంచి ఏప్రభావాన్నిగ్రహిస్తాడో, దాన్నేమీరు చూడాల్సివస్తుంది. కళాకారుడిదృష్టి ఎలావున్నాకూడా అతను ప్రభావితుడనడం, కొంచెం ప్రభావితుడయ్యాడా లేక అసలు ప్రభావితుడు కాలేదా ఇదంతా వ్యక్తిగతమూ, సాపేక్ష దృష్టి కోణానికీ సంబంధించిన విషయం. మాడల్ ఒకటే, కేవలందృష్టిసాపేక్షం. దృష్టికోణాలు సాపేక్షమవుతాయి. ఎందుకంటే

ధ్యేయం ఒకటే గనక.

నేను మీతో చెప్పానుగా నాకు ధారాళంగా మాట్లాడ్డం రాదని. ఈ 'అంతా' 'కొంచెం', 'కొంత' అన్నీ సాపేక్షం. హృదయం, పైసా, సౌందర్యం అన్నీ సాపేక్షం - మనిషిని గుడ్ల గూబని చెయ్యడానికి రోజర్ బేనిస్టర్‌కి ఒక మైలునాలుగు నిమిషాల్లో, రోగిష్టి ముసలాడి కెవరికేనా అయితే అరగంటలో! ఒక రూపాయంటే ఎంత? నాలాంటి పనికిమాలిన వాడికి మూడు వందల నయాపైసలు, మీకు ఏభై పైసలు, డాంజ్‌గాడీ నడిపే వాడికి పది నయాపైసలు! మీరే చెప్పండి, ఈ వందన యాపైసల కల్పన మనిషిని గుడ్లగూబని చెయ్యడానికి చేసినది కాదూ? రిక్షావాలాకి వెయ్యి నయాపైసలు కూడా రూపాయి కాదు. ఒక సంవత్సరం అంటే మూడు వందల అర్వై అయిదు రోజులు కాదు. ఒక గంటంటే అర్వైనిమిషాలుకాదు. చంద్రుడు, సూర్యుడు, గ్రహాలు, కోట్లాది నక్షత్రాల మీద సంవత్సరాలకీ, గంటలకీ వేరవేరు పరిభాషలుంటాయి. అరే, మీరు సౌందర్యం వంటి మామూలు విషయం తీసుకోండి! యూరప్‌లో బ్లాక్ బాల్, ఇక్కడ గోల్డెన్‌బాల్, అమెరికాలో పొడుగాటి పాదాలు, చైనాలో తొడలు, జపాన్‌లో మెడ, లాటిన్ అమెరికాలో వక్షాలు, మన యీ దేశంలో కళ్ళు... స్త్రీ సౌందర్యం గురించి ఎన్ని రకాల విశ్వాసాలు. సౌందర్య, ప్రతిష్ఠ, నైతిక విశ్వాసాలు - అన్నీ సాపేక్ష దృష్టితోనే చూడబడతాయి. మనిషి తెలివైన వాడు కానీండి. నేనింత వరకూ చెప్పగలను - పిచ్చివాడు కానీండి - ఇది కూడా ఎంతవరకూ సరిగా చెప్పడం సాధ్యమవుతుంది? దాన్ని కూడా సాపేక్ష...

మీరు నవ్వగలుగుతున్నారు. ఇది మంచిదే. కానీ, నవ్వు వంటి దోషరహితమైన దానిలో కూడా నష్టం వుండవచ్చును. ఫేషన్ ప్రపంచంలో తెలిసిన వాళ్ళు నవ్వడం వల్ల కళ్ళ కొసల దగ్గిర, చెంపల మీద ముడతలు పడతాయనీ, దానివల్ల మొహంలోస్వచ్ఛతతగ్గిపోతుందనీ, మొహం అందంగా వుండదనీ, ముసలితనం వచ్చేస్తుందనీ చెబుతారు. మీ ఉద్దేశ్యమేమిటి?

ఇప్పుడు నేను నా అసలు విషయాని కొస్తాను. నేను సూటిగా పోవడం లేదు కదూ? దానికో కారణం ఉంది. నేను ఒకేసారి మూడు నాలుగు రకాల విషయాలు ఆలోచించ గలుగుతాను. నేను శతావధానిని కాను. మళ్ళానైతే ఒకే సమయంలో ఒకే పని కూడా చెయ్యలేను. చూస్తున్నారుగా, నా విషయం చెప్పడం కూడా నాకు రావడం లేదు. కానీ రకరకాల విషయాల్ని ఒక్కసారే ఆలోచించినా నాకేం కష్టం లేదు. మీరు ప్రయత్నించండి, అలసిపోతారు. మీ కనిపిస్తుంది ఇలా ఎలా జరుగుతుందని, సరే, చూడండి. దీనికి మీకో పద్ధతి

చెబుతాను. మొదట మీరుతిన్నగాకూర్చోండి, నిశ్శబ్దంగా, మెదడుని శుభ్రంగా వుంచండి - అంటే ఆలోచనలన్నిట్నీ బయటికి పారద్రోలండి. దీన్ని యోగా అనుకోండి, జైనిజమ్ అనుకోండి, బుద్ధిజమ్ అనుకోండి, ఏదైనా అనుకోండి, కానీ మూలధ్యేయమంటే ధ్యేయమంటూ దేన్నీ అట్టేబెట్టక పోవడం. ఏ వస్తువు గురించీ ఆలోచించకూడదు. ఎంత పెద్దమాట ఇది! ఆలోచింకనే పోవడం! ఇది ఈ శరీరంలో రక్త ప్రసారాన్ని ఆపెయ్యడం వంటి కష్టతరమైన పని, కానీ సాధ్యమే ఆ పని చెయ్యడం. మీరు ప్రయత్నించండి.

ఆఁ, నేను చదువుకున్నాను, తిరిగాను, ఇంకానేనుపెళ్ళి చేసుకోలేదు. పెళ్ళిచేసుకోలేదు, దీని అర్థం ఏవిఁటి? సంబంధమైతే అందరూ కలిసి ఒక మంచి అందమైన అమ్మాయితో నిశ్చయం చేశారు. అమ్మాయిని ఇష్టపడటంలో ఇబ్బంది కలిగించే పరీక్ష చెయ్యడం కూడదు. రేస్ గుర్రాన్ని కొనడాని కెళ్ళినట్టో లేకపోతే ఏదేనాకంపెనీని 'కార్నర్' చెయ్యడానికెళ్లినట్టో చెయ్యకూడదు. కంపెనీలో ఆత్మ వుండదు, గుర్రంలో తెలివివుండదు. ఆడపిల్లకి ఆత్మా, తెలివీ రెండూ వుంటాయి. కానీ, నాతో పెళ్ళికి ఏ పిల్లతోనైతే సంబంధం నిశ్చయమైందో, ఆమెలో ఆత్మ వుంది అంతే తెలివిలేదు.

నాకు ఆమెలో తెలివి తాలూకు కొద్దిపాటి మెరుపు కేవలం ఒకసారి తోచింది. ఆ సంబంధం నిశ్చయమై మూడేళ్ళు కావస్తోంది. అప్పుడామె మళ్ళీ నేను మిమ్మల్ని పెళ్ళి చేసుకోలేను అని చెప్పింది. ఆ తర్వాత నేను పెళ్ళి చేసుకోలేదు. నా స్థితి ''తినడం, తాగడం, రాజ్యం చెయ్యడం'' లాగా అయిపోయింది.

మీరు సిగరెట్ తాగుతారా? నేను తాగుతాను. మీకు అభ్యంతరం లేకపోతే ఒకటి ముట్టించనా? అభ్యంతరం మీకెందుకుంటుంది? కోట్లాది మంది జనం తాగుతున్నారు. మరొక్క మనిషి తాగితే ప్రపంచానికీ, మీకూ ఏమీ నష్టం లేదు. హైడ్రోజన్ బాంబు పొగలే సహింప శక్యమవుతున్నాయి. కానీ, సిగరెట్ పొగ మాత్రం ఇప్పటికీ సహింప శక్యం కావటంలేదు. హో...హో...

ఇవాళ వర్షంవచ్చేట్టుంది. రాదంటారా మీరు? నా వుద్దేశం కురుస్తుందని. మైదానంలో ఆడుకుంటున్న ఆ పిల్లల్ని చూస్తున్నారుగా? వాళ్ళంతా బాగా కేరింతలు కొడుతున్నారు, నవ్వుతున్నారు. అందుకే వర్షం వొస్తుంది. పిల్లలకి వర్షం అంటే చాలా యిష్టం.

మీరు వర్షంలో కూడా పచార్లు చెయ్యడానికి వస్తారా? మేనెల్లో కూడా? భలేవారు. మీరు పచార్లు చెయ్యడానికెందుకొస్తారు? ఆరోగ్యాన్ని

వృద్ధిచేసుకోవడం కోసమా? చెడ్డలవాట్లవల్ల ఆరోగ్యం ఎలాగైతే పాడవుతుందో అదే విధంగా మంచి అలవాట్ల వల్ల ఆరోగ్యం బాగుపడుతుంది. కానీ శరీరం కోసరం అలవాట్లు అలవర్చుకోవడం మంచిది కాదు. పచార్లు చెయ్యడానికి ఉదయం త్వరగాలేవడం అలవాటు చేసుకోవాల్సి వస్తుంది. నాకే ఆచారంలోనూ విశ్వాసం లేదు.

పచార్లుచెయ్యడానికిగత రెండేళ్ళ నించి నిరంతరం ఇక్కడికి వస్తున్నాను. ఎవరితోనూ మాట్లాడే వాణ్ణి కాను. పచార్లు చేసి వెళ్ళిపోయేవాణ్ణి. సుఖం - దుఃఖం ఇప్పుడుఏదీకూడా కలగదునాకు. ఇప్పుడు దుఃఖానికీ-సుఖానికీ మధ్యస్థితి మెదడుకి 'నార్మల్ టెంపరేచర్.'

ఇవాళ చాలా ఆలస్యమైంది మీకు. టీ తాగాలిలావుంది. ఇంటికే వెడతారుగా? పేపరు చదివారా? నాకైతే నిన్న సాయంకాలం పేపరుకీ, ఇవాళ పొద్దుటి పేపరుకీ పెద్ద తేడా ఏమీ కనబడదు. పదండి. ఇప్పుడు మనం మాటలు ఆపు చేస్తున్నాం. మీరూ, నేనూ తిరిగి వెళ్ళేదారులు వేరు వేరు. నేనైతే రోజూ వస్తాను. ఇవాళ నా అభిరుచికి తగిన వారిని కలిసి చాలా సంతోషం కలిగింది. కానీ ఒక్కమాట చెబుతా పోతూ - పోతూ. నేనుమీతో ఒక తప్పుడు మాట చెప్పాను. అబద్ధంచెప్పేశాను. మీతోనేను నా స్నేహితుడొకడు పిచ్చివాడై పోవడం గురించి చెప్పానే, అదంతా అబద్ధం. అది నాకు సంబంధించినదే. అందుకే, ఏ అమ్మాయితో నాకు సంబంధం నిశ్చయమైందో ఆమె నన్ను పెళ్ళి చేసుకోవడానికి నిరాకరించింది. హో...హ...హ్హో...

అరె, ఒక్కసారిగా అలా లేచి నిలబడ్డారేం? కానీ మాట, రేపు నేను ఇక్కడే మీ కోసరం ఎదురు చూస్తూంటాను...

మీరు వస్తారుగా?

# 16. బ్రాకెట్‌కి లోపలా కాదు - బ్రాకెట్‌కి బయటా కాదు

**సరోజ్ పాఠక్**

సరోజ్ పాఠక్ జననం క్రీ.శ. 1929. జన్మస్థానం జఖవూ (కచ్ఛ్) వృత్తిరీత్యా వీరు అధ్యాపకురాలు. రంగస్థలం అంటే అభిరుచి వుంది. 'విరాట్‌టపకు', 'తథాస్తు', 'ప్రేమ్ ఘటాఝుక్‌ఆయీ' మొదలైనవి కథా సంగ్రహాలు. 'నాఇట్ మేయర్' పేర్కొనదగ్గ నవల.



''...రాబోతున్నారు!''

అందరూ కిలకిలమని నవ్వుతున్నారు. నవ్వుల్లో ఎన్నో మాటలు దొర్లిపోతున్నాయి. అలాగే ఇంటికి నవ్వుతూ గీతి వచ్చింది, సుమీతి వచ్చింది, నీతి వచ్చింది, ఆఖర్న సునీతి వచ్చింది. కిలకిల నవ్వులు, మందహాసాలు, మూగహాస్యాలు వాతావరణంలో, రక్త సంబంధీకుల్లో, స్నేహితుల్లో, దివ్య, శుచిల మొహాల మీద - మనసుమీద పరుచుకున్నాయి.

దివ్య తరుచూ ఈ విధంగానే వొచ్చి చెబుతూంటాడు.

''ఆఫ్రికానించి నగీన్‌చంద్ర రాబోతున్నాడు. నువ్వు గుర్తు పట్టగలవో లేదో, కానీ...'' అని గానీ లేకపోతే ''నా స్నేహితుడి ప్రేమికురాలు పారుల్ వస్తోంది.'' లేకపోతే ''సుందర్ వస్తున్నాడు.'' అదీ కాకపోతే ''జీతూ వస్తున్నాడు.'' ఇంకా ''సంతోష్ బహన్ వస్తోంది'' లేకపోతే ''వసుమతీ బహన్ వస్తోంది...''

ఎవరో స్నేహితులు, ఎవరో పొరుగువాళ్ళు, ఎవరో బాల్యమిత్రులు ఎవరో పరిచితులు, ఎవరోపరిచితులకి పరిచితులు, ఎవరో ఒకరు రాబోతున్నారు...

''ఎవరో రాబోతున్నారు'' అన్న వాక్యం అనేకసార్లు ఇంట్లో మారు మ్రోగింది. శుచి ఈ మోతని ఎన్నోసార్లు సహించింది. కేవలం భోజనం కోసరమా? బతుకు తెరువు కోసరమా? ఎన్ని రోజులు? ఎన్ని గంటలు? ఎప్పుడు? ఎందు కోసరం? ఈ ప్రశ్నలన్నీ ఏ చింతనీ వ్యక్తం చెయ్యవు, ఇందుకు భిన్నంగా అవి ఆనందాన్ని స్వంతం చేసుకుని సుఖంగా వున్న ఈ

కుటుంబానికి మిగతా రోజుల్లో లాగానే సభల్లాంటి కార్యక్రమాలుగా రూపుదాలుస్తాయి. శుచి నవ్వు ఎన్నడూ మాయం కాదు. నవ్వుతూండే ఆమె ముఖం ఎన్నడూ ముడుచుకు పోదు. ఆమె శరీరంలో చైతన్యం ఏ మాత్రం తగ్గదు. ఆమె స్నేహం, దాని ప్రసన్నతా, స్వాగతమిచ్చేటప్పుడుండే ఆమె లావణ్యం, ఎప్పుడూ కూడా అప్రియంగా గానీ, అపరిచితంగా గానీ ఉండదు. కాస్త ఇలాగే కనబడింది. కబుర్లు చెవుల బడుతూనే ఉన్నాయి.

''రాబోతున్నాడు.''

''ఎవరు?''

''పేరు, వ్యక్తి, పరిచయం... వివరాలు తెలుస్తాయి, విషయం స్పష్టంగా తెలుస్తుంది. శుచి ''అలాగా'' అనేసి తన పనిలో నిమగ్నమై పోతుంది - ''సరి, ఇంతేనా విశేషం? ఓహ్! నేనేమనుకున్నానంటే... అరె, ఏం లేదు, ఏం లేదు. వీళ్ళు రాబోతున్నారు, ఇంతేనా? అయితే ఏమిటయిందిట! ఏమైనా కానీ, మన ఇంటికనువైనట్లు, కులాచార - వంశాచార ప్రకారం, మన సంస్కారానికి తగ్గట్టు ఇష్టమున్నా లేకపోయినా స్వాగతమే ఇవ్వాలి.''

శుచి ప్రతీ ఒక్క అతిథికీ, ఆగంతకుడినీ విశేషమైన రీతిలో పిలిచి, కూర్చోబెట్టి, భోజనం చేయించి, కొత్త కొత్త వ్యవహారాలతో సంతోషపరచి అలసి పోతుంది. ''హమ్మా'' అని అలసటని వ్యక్తం చేస్తుంది - ''నేనేం చెయ్యను! ఇలాగే అలవాటై పోయింది. మా దగ్గరలాంటిది లేదు... ఇల్లు తెరిచి వుంటుంది ఎవరొచ్చినా సరే...''

''తల్లీ గీతీ, ఇవాళ బేడ్మింటన్ ఆడటంలో ఆలస్యం చెయ్యకేం, ఆఁ? సుగీతీ, చూడూ నువ్వుకాస్త బజారు తిరిగి రావాల్సివుంటుంది. వింటు న్నావా? టెలిఫోన్ చెయ్యి, సరేనా? మతి మరుపెక్కువ నీకు! గజారా, ఓ గజరీ ఈః - ఈః, ఎక్కడికి పోయావ్? ఇవాళ సాయంత్రం నువ్వు ఎక్కువ సేపు వుండాల్సుంటుంది. అన్నం ఇక్కడే తినేయ్, ఏం! మాకు అతిథులొ స్తున్నారు. ఏయ్, ఇక్కడైతే ఒక సుఖం వుంది. ఇంట్లో కూర్చొని నిశ్చింతగా ఏర్పాటు చేసుకునే వినోదం ఇది. ఏవిఁటి నీతీ? ఎందుకు కేక లేస్తావ్? రెండు జడలేసుకో చెల్లీ, ఆఁ? కొత్త బట్టలు కట్టుకోవాలి. మురికి చేసుకోకు, ఆఁ? నా సోన్‌పరీ? బొమ్మమ్మా నాతల్లీ... ఆఁ, అజయ్ పెద్దనాన్న చూస్తే ఏమంటారూ? కైడవరీ కావాలా? సునీతీ, తలకినూనె రాసుకోకుండా వుండే నీ ఫాషన్ నాకు కాస్తంత కూడా నచ్చదు. పారుల్ బహన్ ఏం చెబుతూండేదీ? కళ్ళు దెబ్బతింటాయ్. ఏం, ఇవాళ నూనె రాసుకో. బయటి వాళ్ళెదురుగా పొడి జుట్టేసుకు తిరక్కు. అరె, వింటున్నావా నువ్వూ? సిగరెట్ పేకట్ ముందే

తీసుకరా. ఆఁ, నాకిదెంత మాత్రం ఇష్టం లేదు. అతిథులయ్యేది మరెవరయ్యేది, ఆడపిల్లల చేత ఇటువంటి పని చెయ్యనివ్వను నేను. ఒకసారి చెప్పడం అయింది, ఈ మాటెప్పుడూ గుర్తు పెట్టుకోండి. నవ్వక్కర్లేదు. గుర్తుంచుకోకపోయారో... నేను జేబులు వెతికి చూస్తాను. గీతీ, గుర్తు చెయ్. ఆఁ తల్లీ, నువ్వూ నా కూతురువంటే. గుర్తు చెయ్యీ, మనం పప్పాని దారిలో పెట్టేద్దాం, ఆఁ!''

ఈ ప్రకారంగానవ్వూ, ఆనందాల పొంగూ ఒకప్పుడు పెరుగుతుంది, ఒకప్పుడు మామూలుగా అవుతుంది. ఇంట్లో కోలాహలం చెలరేగుతూనే వుంటుంది. ఇంత పెద్ద కుటుంబం... వంటింట్లో నిత్యం దూకుడు చెలరేగుతూనేవుంటుంది. అతిథులు రానప్పుడుకూడా సమావేశంలో పచ్చీసు, పేక, క్యారమ్స్, వ్యర్థ సంభాషణ, పిచ్చాపాటీ, గీతాలు - సంగీతాలు, ఏదో ఒకటి సాగుతూనే వుంటుంది. మొత్తం వాతావరణాన్ని ఇంటా బయటా, జనాల ఉవ్వెత్తున విరజిమ్మే నవ్వు ఫౌంటెన్ ముంచెత్తేస్తుంది, తడిపేస్తుంది. ఆ పెనుప్రవాహంలో ఎన్నోవిషయాలకి సంబంధించిన మాటలుంటాయి, ఆనంద పూర్వకంగా వినడం జరుగుతుంది. అదంతా ఎంత సహజంగా ఉంటుందంటే అసలేమీ జరగనట్టే ఉంటుంది -

''ఏమన్నావ్? పెళ్ళి చేసుకుందా? పొండి, కథ కంచి కెళ్ళింది. పాపం చాలా వ్యాకుల పాటుతో ఉండేవాడు.''

''ఢిల్లీ ట్రాన్స్‌ఫర్‌అయిందా? ఇక్కడిల్లులమ్మేశాడా? ప్రమోషనొచ్చిందా? అలాగా?''

''చందూ మూడోసారి ఇంజనీరింగ్ ఫెయిలయ్యాడా? వాళ్ళ నాన్న వినిపించు కోకపోతే ఏం చెయ్యడం? ఈలైన్ పాపం వాడికి సరిపడదుట. ఆఁ, ప్రస్తుతం బరోడాలో ఉన్నాడు.''

''లవ్ మారేజ్ భాయ్, లవ్ మారేజ్! భార్య అందంగా వుంటుంది. ఇది కూడా కాకతాళీయం, రాజు ఇష్టపడినదే ఆ రాణి!''

''ఏవిఁటి పేయింగ్ గెస్ట్‌గా ఉంటున్నాడా? అతని భార్య చాలా జబ్బుతోవుందని అంటున్నారు? ఊఁహుఁ ఆవిడ శుభ్రంగా వుంది. కుటుంబానికి డబ్బు అవసరమవుతుందిగా.''

''మాచ్ చూడ్డాని కెళ్ళాడా? తండ్రి దగ్గిర బాగా డబ్బుంది కదా! ఇంటరెస్టింగే, చాలానూ..., కానీ జేబులో...''

''నాకు మను మామా చెప్పాడు. ఆయనా ముసలాడు, అందుకే నేనెక్కువ అడగలేదు, మనకెందుకు!''

''ఓహ్! హౌ లవ్లీ! నేను గ్రెగరీ పెక్ పిక్చర్స్ ఒక్కటి కూడా చూడకుండా వొదల్ను. డిటెక్టివ్ పిక్చర్? ఓహ్, ఆయామ్ క్రేజీ!''

''మా టీచర్ పెళ్ళి. మా క్లాసులో రెండేసి రూపాయలు చందా వేసుకుని బహుమతినిస్తున్నాం.''

''ఈసారి కాశ్మీర్ తప్పకుండా తీసికెళ్ళాలి, పప్పా, నేను తప్పక వెడతాను, ఆఁ! ఇప్పుడునేనుపెద్దదాన్నయ్యాను. నాతల నేనే దువ్వుకుంటు న్నాను. ఆఁ, అందంగా బాబ్ చేయించాలి. మరి నేను కాశ్మీర్ వెడతానంటే వెడతానంతే.''

''మమ్మీ, ఫెమినాలో ఫుల్ ఓవర్ కొత్త డిజైన్ చూశావా? నాకెంత చదివినా అర్థం కావడం లేదు.''

''... రాబోతున్నాడు. అరె, ఎవరేనా వింటున్నారా?''

ఒక రోజు ఇలాగే కోలాహలం మధ్య దివ్య చెప్పాడు. ఆ సమయంలో శుచి నవ్వు మొహంతో 'ఆ డిజైన్‌లో ఎలాంటి రంగులు వేశారో, ఏ విధంగా తను మరోరకంగా స్వెట్టరల్లిందో చెబుతోంది. స్వయంగా తయారు చేసుకుంది. ఏదో చాలా పెద్ద జోక్ లాగా ఆమె ఈ మాట చెప్పి నవ్వుతోంది. ఎవర్నో భాగ్యవంతుణ్ణి చేసినట్టూ, అతన్ని సంపన్నుణ్ణి చేసి అందరూ ఎంతో ఆనందం పొందినట్టూ, ఎంతో జోరుగా ఆ నవ్వు కెరటం పరుగు తీసింది. ఆ నవ్వులో దివ్య మాట ''... రాబోతున్నారు'' మునిగిపోయింది.

''అరె పిచ్చివాళ్ళులారా, వినండీ. తర్వాత అంటారు ముందు చెప్పలేదని.''

శుచి నవ్వి నవ్వి సంతోషం పట్టలేకపోయింది. అందుకే ఆమె కళ్లలో నీళ్లు నిలిచాయి. వాటిని తుడుచుకుంటూ అంది.

''అలాగే నండీ, అలాగే, రాజమాన్ రాజాశ్రీ, విన్నాం. మీ 'ప్రేత' మెవడో వస్తున్నాడు, అంతేగా?''

శుచి హాస్యంకోసరం అతిథిని 'ప్రేతం' అనీ, అతను భోజనం చెయ్యడానికి జరిగే ఆడంబరాన్ని 'ప్రేత భోజనం' అని అంటూంటుంది. అందుకే ఇటువంటి అతిథుల కోసరం తయారు చేసే భోజనాన్ని ఆమె విశిష్ట భోజనంగా భావిస్తుంది. కబుర్ల వొంకతో తిరిగి కబుర్లలోకి ప్రవహించడాని కుద్యుక్తురాలవుతున్న శుచిని చెయ్యిపట్టుకుని తనవేపు లాగుతున్నట్టుగా దివ్య చెప్పాసాగాడు.

''కానీ ఆ 'ప్రేతం' భోజనం చెయ్యడు, అర్థమైందా? కేవలం రైలులో ఈ స్టేషన్ మీదుగా వెడతాడు. అందుకని దేవీ, నేను మీరు స్టేషన్‌కి రావాలని

కోరుతున్నాను, అర్థం చేసుకున్నారా తమరు? అతను నీకు పరిచయస్తుడే. చూడూ, రిక్వెస్ట్ చేసి అతన్ని బండినించి దింపి ఇంటికి తీసుకొద్దామంటాను నేను. అతను చాలా గొప్పవాడు. అతనికి చావడానిక్కూడా తీరికుండదు. కానీ! నువ్వు చెబితే అతను రాకపోవడమా!''

ఆమె కిలకిలమని నవ్వుతోంది. పరిహాసంలో హఠాత్తుగా ఎవరో వీపు మీద గుద్దినట్టనిపించింది శుచికి. రోజూలాంటి పరిహాసమే అనుకుని ఆమె నవ్వసాగింది. కానీ, మరుక్షణం గుద్దు పడినచోట చర్మంమంటపెట్టి బాధతో నిండిపోయింది. గుప్తంగా తగిలిన ఈ దెబ్బ అనుభవమైంది కానీ, తడుముకున్నా కూడా అదెక్కడ తగిలిందో ఆ స్థలం తెలియటం లేదు. ఇదే శుచికి జరుగుతోంది. శుచి దివ్యవేపు వొంగింది. మాటమీద ధ్యాస నిలిపే క్షణం. చెవులుకూడా పూర్ణతత్పరతతో తెరుచుకున్నాయి, ఆఁ-ఆఁ, ఇప్పుడు చెప్పండి, ఏం చెప్పారో? శుచికి ఆలోచనాశక్తి తిరిగి వచ్చింది.

''... వస్తున్నాడు... రైలులో ఈ వూరు మీదుగా వెడతాడు... మనం అతన్ని కలవడానికి స్టేషన్ కెళ్ళాలి... చాలా గొప్పవాడు... నీ పేరుతో... చావడానిక్కూడా తీరికుండదు...''

''ఎవరు?''

''ఎవరు?''

''ఎవరు?''

''... రాబోతున్నాడు.''

హాస్యం, ఆనందాల గోడల్లో బీటలు పడ్డాయి. ఇటుకలు, సున్నం, ధూళి తాలూకు చెత్తంతా, అందంగా సర్దిన డ్రాయింగ్ రూమ్‌లో చెదిరపోయి పడడంతో అన్నీ చెదిరిపోయాయి.

శుచి మనసు బుస కొట్టింది.

''ఆఁ? కథ కంచి కెళ్ళిందన్నట్టుగానే చెప్పారు రాబోతున్నాడని! ఎన్నిసార్లు చెప్పాను... నా కిదంతా ఇష్టం లేదని. సగం జీవితం ఈ ప్రేతాల్ని మేపడంతోనే సరిపోయింది. ఇక నేను అలిసిపోయాను. (వొస్తే రానీ అతన్ని ఓసారి! తెలుస్తుంది...) శుచి స్వాగతమివ్వడానికి తయారవసాగింది. (ఇక్కడికొస్తే సరి! చూడు చూడు చూడు హరామ్ ఖోర్! నేనెంత బీదదాన్నో చూడ్డాని కొస్తున్నావా? ఎలా ఏడుస్తున్నానో? ఎలా ఎండిపోయానో? ఒకసారి కాదు వందసార్లు చూడు. నా యీ శరీరం నలుగురు పిల్లల్ని కన్న తర్వాత కూడా రాయిలాగా వుంది. ఇందులో రాయిలాంటి నీ మనసుని సైతం ముక్కలు చేసే శక్తివుంది ఇంకా. అవునవును, నాకు నా దివ్య కావాలి. అతని

ఇల్లు, అతని రక్తబంధువులు, అతని పిల్లలు. ఈ పిల్లల్నందర్నీ చూడు! మూర్ఖుడా, చెవులు తెరుచుకుని అందరి పేర్లూ విను! బహుశా నువ్వు పొరపాటుగా ఆలోచిస్తున్నావేమో పిల్లల్లో ఎవరి కైనా నీ పేరు... ఛీ పో! వీళ్ళా నలుగురే పిల్లలు. ఒక వేళ అదే పనిగా పన్నెండు మంది పుట్టినా సరే అలాంటి పేరు పెడతావా యేవిఁటి? నీ పేరులో ఒక్కక్షరాన్ని కాదు కదా ఒక్క మాత్రని కూడా అందులోకి రానివ్వను. తెలిసిందా?) ఇంక దివ్య, నువ్వీ విధంగా ఎందుకు క్రోధంతో పిచ్చివాడివై పోతావు? ఇక్కడ కూర్చో నాదగ్గిర. కాస్త ఓర్పుతో విను.'' శుచి ఎంతో స్నేహ పూర్వకంగా దివ్యవేపు చూసింది. ఆమె కెంతో ప్రేమ కలిగింది. (రేపు ఉదయమే వస్తాడుగా అతను?)

ఆరాత్రి ప్రత్యేకంగా దివ్య దగ్గిర కెళ్ళి అతని ఛాతీ మీద రెండు, నాలుగు, ఐదుసార్లు ప్రేమగా తట్టి చెప్పింది – ''నువ్వు అనవసరంగా వ్యాకుల పడతావు. నీ ఆరోగ్యం గురించి పట్టించుకోవు. చూడరాదూ, ఈ రోజుల్లో... చాలు, ఇప్పుడు నేను నీ మాటొక్కటి కూడా వినను. మరొకళ్ళ కోసరం ఈ మాదిరి...! ఎంత ఉరుకులు – పరుగులు పెట్టాల్సి వస్తోందీ! ఇక నేనెలా చెబితే అలా చెయ్యండి. ముసలి వాళ్ళమేం కాలేదు మనం. ఆఁ, లేకపోతే! నలుగురు పిల్లలు పుడితే మాత్రం ఏయింది?... ఏమయింది?.. ఏమయింది?''

ఏమీ కాలేదు. ఏమీ కాలేదన్నదే ఆ రాత్రి దివ్య అనుభవ పూర్వకంగా తెలుసుకున్నాడు. అత్యధిక సుఖాన్ని పొంది ఉదయం దివ్య అన్నాడు – ''శుచీ, నువ్వు భలేదానివి! శుచీ, ఏమీ జరగలేదు శుచీ!''

పోటీ పడటానికి తయారవుతున్నట్టుగా శుచి ''రా సవ్యంగా చూస్తున్నానులే నిన్ను'' వంటి భావంతో రాత్రంతా గడిపేసింది.

(చావడానిక్కూడా తీరికుండదు, ఎందుకని? పనికిమాలినవాడా, నేను నీకోసరం కళ్ళువిప్పార్చుకుని కూచునుంటాననుకున్నావా నువ్వు!) ''గీతీ, సునీతీ, ఇదేవిఁటి? ఇదేమి ఆడంబరం? నీలంఫ్రాక్ ఎందుకేసుకున్నావు? విప్పు. నేను చెబుతున్నాను, విప్పు. కొత్తబట్టలు కట్టుకోనవసరం లేదు.'' (అతనిరాకకి నాఇంట్లో పరవర్తనేమీ రానక్కర లేదు, చూపనక్కరలేదు.) ''గజరీ ఈ ఈ ఈ, ఓ గజరీ, చాకుతో నా చెయ్యి తెగింది. నిమ్మకాయ నువ్వే పిండాలి. బటాటావడా? (బటాటావడ – బంగాళదుంపలూ, శనగపిండితో చేసేవడ) ఆఁ, అదే చెయ్యి.'' పచ్చి మామిడి కాయల పులుసు తయారైంది. నువ్వు ముక్కు, కనుబొమలు ముడిచావు. అతని కిష్టమైన భోజనాన్ని తయారు చేసి, చేతిలోకి విసన కర్ర తీసుకుని, అతని కోసరం ఎదురు చూస్తాంటా ననుకున్నాడేమో అతను!...

వెడుతున్నాడు! గొప్పవాడు! నా వూరి మీంచి ఇలా వెళ్ళి పోయే శక్తి అతని కుందా! చెవులుపుచ్చుకుని ఈ ఇంటికిలాక్కొచ్చి అప్పుడు చెబుతాను...

శుచి అతని రాక గురించి ఆలోచిస్తూ ఇంట్లో ఏర్పాట్లు పూర్తిగా మార్చివేస్తోంది. దీర్ఘంగా నిట్టూరుస్తూ, పళ్ళు కొరుకుతూ, చెబుతోంది - ''ఫ్లవర్ వాజ్‌కో పువ్వులవసరం ఏముంది? మల్లె మొగ్గలు చచ్చినా ఉండవు. నీతి తల్లో వుంటే... లేదు, అవసరం లేదు.'' ఆమె కుర్చీ తొలగించి అందులో కూచునే వ్యక్తికి వినిపించడానికి వాక్యాలు కూర్చుకుంటోంది. (రండి. దయచెయ్యండి. ఈయన మావారు, నా స్వామి. నా యీ యింటికీ, ఈ పిల్లలకి, వాతావరణానికీ, సర్వానికీ అధిపతి. నీచుడా! అర్థమైందా? నువ్వేమీ కావు. ఏమీ కావు. అసలేమీ కావు. మూర్ఖుడా నువ్వు ఈ ఇంటి గడపకి అవతలుండాల్సిన మనిషివి. కేవలం ప్రేతానివి - అనేక ప్రేతాల్లో ఒక ప్రేతానివి! చిత్తమండి, పిల్లలున్నారు. నేను గొడ్రాల్ని కాదు - కానీ, అడగడానికి నువ్వెవరు? ఒకళ్ళిద్దరు కారు నలుగురు పిల్లలున్నారు... ఇంకా నలుగురు పుడతారు! చెప్పు! నేనేమయినా ముసలిదాన్నయి పోయానా? ఫేషన్లో నాకు విశ్వాసం లేదు. కుటుంబ నియంత్రణలో కూడా లేదు. చిత్తమండి అందరూ అలా తిరిగి రావడానికి పోయారు. తిరిగొచ్చే సమయానికి తిరిగొస్తారు. ఎవరూ బారులు తీరి నిలబడి నీ ఎదురుగా పెరేడ్ చేసి నిన్ను గౌరవించ నక్కర్లేదు...)

''ఓ నీతీ! సునీతీ! ఇదంతా ఏవిఁటీ? గీతీ మీరంతా ఏం మాట్లాడకుండా కూచున్నారెందుకని? ఇవాళే సీరియస్‌గా ఫిల్మ్‌ఫేర్ చదవాలనిపించిందా? నువ్వు కూడా ఇవాళే పాఠం మననం చేసుకోవాలా? రేడియో వినక్కర్లేదా? వాల్యూమ్ హెచ్చించూ. బాగా హెచ్చించు నాకు వంటింట్లోకివినపడాలి. హోటలో - రెస్టారెంటో అనిపించదులే. ఉత్సాహంగావుండండి. నవ్వండి - ఆడండి. ఈ మాదిరిగా మొహం జేవురించుకుని తిరక్కండి. ఆఁ, నేను వంటింట్లో వున్నానూ... (ఇప్పుడే అతనికి బుద్ధి చెబుతాను. పచ్చి మిరపకాయల కారం ఎక్కువేసి కూర చేస్తాను, దెబ్బతో కళ్ళవెంట నీళ్ళు రావాలి! పశువులకి ఉలవ కూర చేస్తాను, దెబ్బతో కళ్ళ వెంట నీళ్ళు రావాలి! పశువులకి ఉలవ గుగ్గిళ్ళు పెడతారు, ఎందుకో? ఆఁ నువ్వు పశువ్వేగా, ఇప్పుడు నీ బాకీ అంతా తీర్చేస్తాను!)

''మీరెక్కడికెడుతున్నారు? అతనుసిగరెట్‌తాగడు...తాగుతాడా?''

''బహుశా తాగుతాడేమో!''

''ఖరీదైనవి తేవాల్సిన అవసరంలేదు.'' (గొప్ప వాడైతే అది తనింట్లో

మాకేవిఁటి?) పనామా తీసుకురండి. ఏమన్నారూ? చూడండీ ''నేను స్టేషన్ కెళ్లాను. (ఆవాలు - ఉప్పుతో దిష్టి తియ్యాలిలా వుంది!) అంతే. నేను చెప్పింది చెప్పతనికి. (అతని కోసంఎదురుచూస్తున్నాననిచెప్పొద్దు. అజ్ఞాపిస్తున్నాననిచెప్పు)'' ''నా తరఫునపిలవండి. రాకుండా ఉండలేడు.''

(దయచెయ్యండి కాస్త! అతని బుర్ర పగలగొట్టక పోతే... అయ్యో? ఆ గాలా? ఇన్ని గంటలూ? ఓ-హో-హో-హో! పోతే, ఎంతమాత్రం అక్కరల్లేదు. ఈ రోజు వెళ్ళేట్టయితే ఇప్పుడు వెళ్ళు, ఇప్పుడేలే, వెంటనే! లేదు. పచ్చిమంచినీళ్ళు కూడా ఇవ్వను. వెళ్ళు, లే... లే... లే...! ఫో ఇక్కణ్ణించి. నిన్నెవరు పిలవొచ్చారని ఇక్కడి కొచ్చావ్? తమాషా చూద్దామని వచ్చావా? నన్నెలా వెర్రిదాన్ని చేశావో చూద్దామని కదూ నీ మనసులో ఉన్నది? ఇన్ని గంటల దానాన్ని ఆ సమయంలో ఇవ్వలేకపోయాను, కపటీ! అబద్ధాల మారీ!)

(బండిస్టేషన్‌లో కొచ్చుంటుంది.) ''నీతీ, ఇలా రా తల్లీ. నా దగ్గర కూచో. కాస్త జోరుగా కవిత వినిపించు!'' (ఒంటరీ దొరకలేదా! మూర్ఖుడు! ఈయన్ని గుర్తు పట్టాడో లేదో. గొప్ప వాడైపోయాడు కదా అతను!) ''ఓహో, రండి రమేష్ భాయీ, ఈ సొరకాయ మజ్జిగ పులుసుని కాస్త రుచి చూడండి. ఉడికించిన సొరకాయని ముద్దగా రుబ్బి తయారు చేసి... అందులో నా పేరుగల ఆవాలు... ఏవిఁటి మీరు కూడా! నామతి...'' (టాక్సీ చేసుకుంటే ఎంత సేపవుతుంది? ఆ పుస్తకాల పండితుడికి జగడమేసుకోవడం బాగా అలవాటైంది కూడా. నోరు పడిపోవాలే గానీ ఆ రోగం వొదిలినప్పుడు కదా! అవునూ - కాదూ నించి బయట పడరే..) ''గజరీ - ఓ గజరీ, ఫాన్ కాస్త హెచ్చించు. వేడిగాలితో గది ఉడికిపోతోంది. చూడూ ఇరానీ హోటల్నించి నాలుగణాల ఐసుతీసుకురా... నీతీ, గీతీ, సునీతీ ఈ, ఈ, ఈ... ఎక్కడున్నారందరూ? ఇలారండి. ఇక్కడవంటింట్లోకూర్చోండి అందరూ. నాకు సాయం చెయ్యండి. నేనెలా చెబితే అలా చెయ్యండి. ఇక్కడే ఉండండి, ఇక్కడే... ఇక్కడే... నాదగ్గర, నా కందుబాటులో...! మీ పప్పా...''

దివ్య వొచ్చాడు.

దివ్య వొచ్చి అనేకసార్లు ఇలాగే పిలుస్తాడు. స్టేషన్ నించొచ్చి అతను పిలిచాడు. అతనిలాగే శుచిని పిలుస్తాడు. పిలిచే క్షణం, పిలుపు వినే క్షణం ఢీకొన్నాయి. దివ్య వంటింట్లోకి రాకముందే గీతిని మందలించాడు - ''ఏయ్ పడిపోతావ్. ఏం చేస్తున్నావ్?''

''గడియారానికి కీ ఇస్తున్నాను. చూడు గడియారాన్ని ఇప్పుడు

నిన్ననే...'' గీతి జవాబిచ్చింది.

దివ్య శుచితో చెప్పనారంభించాడు - ''అతని ప్రోగ్రామ్ కాన్సిలయిది. అతని మనిషి ఉత్తరంఇచ్చాడు. పాపంఅతనుప్రత్యేకంగా రాలేకపోతు న్నందుకు విచారాన్ని వ్యక్త పరుస్తూ ఉత్తరం వ్రాసి మనిషికిచ్చి పంపించాడు. ''నీతీ, కాస్త ఈ వాచీని టేబిల్ మీద పెట్టమ్మా.''

''ఎంతైంది? టైమ్ కరెక్ట్ చేస్తాను.''

''అరె, ముందు పూర్తిగా కీ ఇవ్వు!''

దివ్య చెబుతున్నాడు - ''ఎంత గొప్ప మనిషి! కానీ కాస్త కూడా గర్వం లేదు. లేకపోతే అతనికేం పట్టింది క్షమాపణ కోరడానికి? అయినా కోరాడు. నిన్ను కూడా అడిగాడు...''

(ఏవిటీ?

ఏవిటీ?

ఏవిటీ?

రాలేదూ? రాలేదూ? రాలేదూ? మళ్ళీ నన్ను వెర్రిదాన్ని చేశాడు!)

శుచి మనసు ఎగిరి పడింది. పూర్తిగా కీ ఇచ్చిన గడియారం స్ప్రింగు సర్ర్ర్ర్ - 'ఛన్న్' అన్న శబ్దంతో తెగిపోయింది. ముళ్ళు తిరుగుతున్నాయి, తిరుగుతూనే వున్నాయి...

''పప్పా, చూడు ఇదీ...''

''గీతీ, మోతీ కాకాతో చెప్పు గడయారం తీసికెళ్ళమని. ఇంత పాతదై పోవడంతో దాని స్ప్రింగ్ తెగి వుంటుంది. అమ్మేసినా కూడా ఏ బాధా లేకపోను...''

గీతి ముక్కాలి పీట మీద ముక్కాలి పీట వేసుకుని పైకెక్కింది. కిందకి దిగుతూంటే ముక్కోణాకారంలో వున్న కీ ఇచ్చేది చేతినించి జారిపోయింది. ముక్కాలి పీట మీద 'ఠక్' మని కొట్టుకుని ఎగిరివెళ్ళి శుచి తలకి తగిలింది.

శుచి ''అమ్మో'' అంటూ తలపట్టుకుని కూర్చుండి పోయింది.

''చాలా గట్టిగా తగిలిందమ్మోయ్...''

అవరుద్ధమై రోదిస్తున్న శబ్దం నెమ్మది నెమ్మదిగా హెచ్చయింది. దివ్య చూస్తూండిపోయాడు. ఒక చిన్న 'కీ' ఇచ్చేది తగిలితేనే ఈమె ఈ విధంగా వెక్కి వెక్కి ఏడుస్తోందా? నలుగురు పిల్లల తల్లి! గత రాత్రి జరిగింది గుర్తుకొచ్చి అతని పెదవుల మీదికి మందహాసం వొచ్చింది - ''శుచీ, నువ్వు నిజంగా భలే దానివి!'' అతని హృదయం ద్రవించింది.

గీతి ఆలోచిస్తోంది - ''అమ్మకి బాగా దెబ్బ తగిలిందా? రక్తం కూడా

రాలేదు... మరి?''

శుచి తల పట్టుకుని లేచి నిలబడి ఆలోచించసాగింది.

(అతనిలాంటి హరామ్‌ఖోరే! కానీ... మంచిదే... లేకపోతే మళ్ళీ 'ప్రేత భోజనం' పెట్టి ఇంకా ''... రాబోతున్నాడు'' వంటి వార్తలు చెవులు తెరుచుకుని వినే ఒక గొప్ప కార్యక్రమం జీవితంలోంచి బహుశా శాశ్వతంగా ముగుస్తుంది. జీవితంలోనూ హృదయంలోనూ ఒక్కసారిగా ఎంత పెద్ద భాగం ఖాళీ అయిపోతుంది!)

# 17. చితి

## రఘువీర్ చౌధరీ

రఘువీర్ చౌధరీ జననం క్రీ.శ. 1938. జన్మస్థానం ఉత్తర గుజరాత్‌లోని బాపూ పురా. ఉన్నత విద్యని అహమ్మదాబాద్‌లో పొందారు. వృత్తిరీత్యా అధ్యాపకులు. 'ఆకస్మిక స్పర్శ', 'గైర్ సమజ', 'బాహర్ కోయి ఛే' కథా సంపుటాలు. 'అమృత' అనే వీరి నవల వీరికి కీర్తి వృద్ధిని కలిగించింది. 'తమసా' కావ్య సంపుటి.



నిప్పుమీద బూడిద చేరింది. మధ్య రాత్రి ఇటువంటి చలిలో జీవన్ మోకాళ్ళ మీద శిరస్సు పెట్టుకుని కూర్చున్నాడు. పొలానికి దక్షిణపు మూల, ఎటునించి గుడ్లగూబ అరుస్తున్న శబ్దం వస్తోందో అది జీవన్ కనురెప్పల లోతుని పరీక్షిస్తోంది. అతను కుతూహలం లేని దృష్టితో పడమటి వైపు చూశాడు. చల్లారి పోతున్న నిప్పుని చివరి వరకూ అంటుకునుండేట్టు, ఆరకుండా ఉంచే యోచన చేస్తున్నాడు. అతను చాలాసేపు ఊదాడు. బూడిద ఎగిరింది. మళ్ళీ ఊదాడు. నిప్పు నెరుసు లెగురు తోంటే జీవన్ ఆలోచనలో పడిపోయాడు.

ఈ రోజు యౌవనంలో వున్న ఒక స్త్రీ మరణించింది. శ్మశానం ఇప్పటి వరకూ వెలుగుతూనే వుంది. అన్ని కట్టెలూ అంటుకున్నాయి. ఏవీ సరి చెయ్యాల్సినఅవసరంలేకపోయింది. అఖండమైన కొరకంచుల్లోంచి నిప్పు రవ్వలు ఎగసి వేరవుతున్నాయి. నిప్పురవ్వలమధ్యప్రదేశం వెలుగుతోంది. శ్మశానం వేడెక్కింది. కానీ ఇప్పుడు నెమ్మది నెమ్మదిగా బూడిద కూడుకుంటుంది, తెల్లారేసరికి కేవలం కింద భూమి మాత్రమే వేడిగా వుంటుంది. బహుశః కొన్ని శక్తివంతమైన నిప్పు రవ్వలు బొగ్గులుగా మారి మిగిలిపోతాయి. వాటి మధ్య కొన్ని అస్థికల అవశేషాలుంటాయి - కొన్ని కప్పబడిపోయి, కొన్ని బయటికి కనిపిస్తూ, రెండు - మూడు రోజుల వరకూ జీవితపు చూపు అనాయాసంగా ఆ పరుచుకున్న బూడిద మీదా, ఇంకా దానిలోంచి ఏర్పడే కుప్పలవైపు ప్రసరిస్తుంది. మళ్ళా ఆకుప్ప కూడా నాలుగు వేపులకీ విస్తరిస్తుంది, చివరికి చనిపోయిన మనిషి యొక్క ఏ గుర్తూ మిగలదు,

ఆమెని మొదట మిగతావ్యక్తుల్నించి వేరుచేసి గుర్తించ గలగడానికున్న గుర్తు (రూపు). అనేకమంది అవిభక్త అవశేషాలతో పాటే ఈ అవశేషాలు కూడా కలిసిపోతాయి. జీవితం ఇదంతా చూస్తూంటుంది, ఇంకా ఆలోచిస్తూంటుంది.

జీవన్ పొలం తగినంత పెద్దది. శ్మశానంకన్నా చాలా పెద్దది. శ్మశానం అయితే అతి కష్టం మీద ఇరవై ఎకరాలుంటుంది. అందులో కూడా ఉత్తరం వేపు దట్టమైన తుమ్మ పొదలున్నాయి, తూర్పు వేపు చెరువుంది, దక్షిణ దిక్కున జీవన్ పొలం. దక్షిణపు అంచు జీవన్‌పొలాన్ని మధ్యనించి చీలుస్తోంది – ఒక పొడవు, వెడల్పూ ఉన్న చతుర్భుజాన్ని ఒక త్రికోణం భేదిస్తున్నట్టుగా వుంటుంది. ఇక్కణ్ణించే పొలంలోకి రాకపోకలకి దారి వుంది. రెండు గ్రామాల్ని కలిపే పెద్ద దారి శ్మశానం మధ్యలోంచి పోతుంది. అందుకే పొలాని కొచ్చేప్పుడు జీవన్‌కి సగం శ్మశానాన్ని దాటాల్సి వస్తుంది. అప్పుడప్పుడు కంచె మధ్యగా వేసిన దారిలో కాలు మోపుతూ – మోపుతూ అతను నిలుచుండి పోతాడు. వీపు తిప్పకుండానే అతను వెనక్కి చూస్తాడు. అతని చూపు శ్మశానం దాటి రెండో అంచు చేరుకోవాలనుకుంటుంది. ఒక రాత్రి అతని కలలో ఆ అంచున మర్రి, జామ చెట్లతో కూడుకున్న ఒక గుబురు వుండటం చూశాడు. చెట్లు కదలటం లేదు. గాలి పురాతనమైన చెట్టు మొదల్నించి వెడుతూ మధ్యలో వున్న లోతైన చెరువులో గుండ్రంగా తిరుగుతోంది. ఆ చెరువు పడమటి గట్టుమీద నిలబడిన మర్రి చెట్టు మధ్యకి కొట్టెయ్యబడివుంది. కొట్టేయ వలసిన చెట్టుమొదలు తాలూకు ముక్కలు చెరువు గట్టున చెదిరి పడున్నాయి. వాటి మీద కప్పులేని ఒక గుడిసె వుంది. జీవన్ హఠాత్తుగా అందులో ఒంటరిగా పడివున్న ఒక పిల్లవాణ్ణి చూశాడు. బంగారు రంగు తల వెంట్రుకలు పిల్లవాడి కళ్ళని కప్పేసున్నాయి. బుగ్గల మీద ప్రవహించిన కన్నీటి ధారలు ఎండిపోయాయి. పిల్లవాడు కుడిచేతి చిన్నవేలిని పట్టుకుని కూర్చున్నాడు. పైకి చూడటమే లేదు వాడు. జీవన్ ఏం చెయ్యాలి? అతణ్ణి పిలవాలన్న కోరిక కలిగింది, కానీ ధైర్యం చాలలేదు... అది కలే, కానీ జీవన్ చూపు కలలో కనబడిన ఆ స్థలాన్ని ఇప్పటికీ వెతుకుతోంది. చివరికి అతను మనసుకి సర్ది చెప్పుకుని పొలానికి వచ్చేస్తాడు.

అవును, అతని పొలం శ్మశానం కన్నా చాలా పెద్దది. పొలం నించి ఆదాయం కూడా బాగానే వుంటుంది. చిరిగి పేలికలైన అతని పాత గుడ్డలు, లంబాడీల లాగా బ్రతికే తీరు చూస్తే అలా అనిపించదు. ఎంత భూమి, విత్తులు సరిగాచాలకుండా పడుండిపోయిందో. అతను దాన్నిచూడ్డానికి కూడా

వెళ్ళడు. అయినా కూడా యదార్థమేమంటే దాని మీద పంట బాగా వుంటుంది.

జీవన్ కూతురిపేరు రయీ, అయిదేళ్ళది. చాలాఅందంగా వుంటుంది - ఎంత అందంగా వుంటుందంటే హేతీ గుర్తొస్తుంది. జీవన్‌కి పెళ్ళయి ఏడేళ్లయింది. అయిదేళ్ళనించీ జీవన్ తన చేత్తోనే రొట్టె తయారు చేస్తున్నాడు. రయీఎప్పుడుపెద్దదవుతుంది? ఎప్పుడు ఈ భారం వహిస్తుంది? మళ్ళా పెద్దదయ్యాక రయీ తండ్రి ఇంట్లో వుండటం కూడా ఎన్ని రోజులు? జీవన్ ఇదేమీ ఆలోచించడని లోకులంటారు.

గ్రామస్థులు జీవన్‌కి మతి చెడిందంటారు, ఎందుకంటే అతను చాలా అస్తవ్యస్త వైఖరితో బతుకుతాడు. బతుకుతాడేమిటి, అలాగే బతుకుతున్నాడు. పైకి కనబడుతున్న దాన్ని చూసి ఒకళ్ళ తర్వాత ఒకళ్ళు చాలామంది జనం అలాగే అనుకోవడంప్రారంభించారు. ఈనాటి చితికిపోయిన స్థితి ఎక్కడ - ఇవాల్టికి నాలుగైదేళ్ళ క్రితం రాగి రంగులో మెరిసిపోయిన జీవన్ ఎక్కడ! కొందరు దీని రహస్యాన్ని అర్థం చేసుకున్నారు. అతనితో విరోధం తెచ్చుకోకుండా జీవన్‌కి మతి చలించిందని అనుకున్నారు. జీవన్ ఈ మాటని వ్యతిరేకించడు, ఎందుకంటే అతనికితెలుసు తనకేమయిందో-తెలుసు.

క్రితం వేసవిలో చాలా రోజుల తర్వాత జనానికి కర్కశంగా వున్న జీవన్ కంఠస్వరంవినిపించింది. ఆశ్చర్యం, అది క్రమంగా బలహీనమై పోయింది. అందులో పరిచయం ఉంది, కఠోరత లేదు. అందుకే అతని కంఠస్వరం బిగ్గరగా వుందనడం అతిశయోక్తిగా వుంటుంది. కానీ మొత్తానికి చెప్పవలసిందేమంటే ఈ కంఠస్వరం అదే, మొదట బిగ్గరగా వుండేది.

ఆ కంఠస్వరం ఒక్కసారి, అస్పష్టంగా..., అయ్యో, ఎలాగైంది! మంచీ చెడూ చెప్పే సర్‌పంచ్ ఆ రోజు మంచి సలహా ఒకటి ఇవ్వడానికెళ్లాడు. అయినా కూడా ఆయన జీవన్‌తో కళ్ళుకలపలేక పోయాడు. అతనంద రితోనూ పరుషంగా మాట్లాడాడు - ఏం మాట పట్టుగొచ్చారు! జన మంతా ఏమనుకుంటున్నారు నన్ను గురించి? అందరూ మొహాలు దించుకుని వెళ్ళిపోయారు. జీవన్ తన యింటి గడప మీద ఒంటరిగా నిలబడిపోయాడు. ఇంటికి వచ్చిన వారిని వెళ్ళిపొమ్మని చెప్పే సంఘటన అతని జీవితంలో మొదటి సారి జరిగింది. మొదటైతే అతనిల్లు అతిథులకి స్వాగత మివ్వడంలో ప్రసిద్ధి చెందింది.

కొలిమి దగ్గిరనుంచి లేచి నిలబడ్డాడు. పశువులు మేసే చోటునుంచి ఎండు జొన్న చొప్ప తేవడానికి వెళ్ళిపోయాడు. తెలగ పిండి నింపి ఎత్తి తీసుకు వచ్చాడు. కొలిమి భగ భగ మండుతోంది. అగ్ని జ్వాలలు అతని కనుబొను

లకన్నా ఎత్తుకి లేస్తున్నాయి. కానీ ఈ జ్వాలల్లో కూడా వేడి ఎందుకు లేదు? బహుశః మంచు పడబోతోంది. కాబోలు అనిపించిందతనికి. కాస్సేపు చేతిని కొలిమినించి దూరంగా ఉంచితే చాలు అతనికివేళ్ళకణుపులు మండుతున్నట్టని పిస్తున్నాయి. ఇది మంచు పడటానికి గుర్తు.

మళ్ళీ నిద్రపోవడానికి రాత్రి మిగలదు, అందుకని అతను కొలిమిని వొదిలి లేచి నిలబడిపోయాడు. నిద్రపోవడానికి వెళ్ళిపోయాడు. ఎద్దులు అతన్ని చూసి మెళ్ళో గంటలు మోగించాయి. జొన్న పైరునించి రెండు మోపులు కోసి అతను పశువులు మేసే చోట వేశాడు. మంచె మీదికి ఎక్కాడు. పై బట్టని తలనించి కాళ్ళదాకా కప్పేసుకున్నాడు. పైనించి బొంత కప్పుకున్నాడు. పొగాకు అయిపోయింది, అందుకని చిలుము తాగాలన్న కోరికని అణుచుకున్నాడు.

ఒకమాటు మొహం బయటికి పెట్టి చూశాడు. చంద్రుడు పడమటి దిశకి దిగిపోయాడు. మరి అది పుష్యమి నెలలో ద్వాదశి.

నిద్ర రాకపోవడం చేత అతను అటూ ఇటూ దొర్లుతున్నాడు. అతనికి రోజు నిద్ర రాదనిపించింది. లేచి కూచుకున్నాడు. కానీ, ఏం చెయ్యాలో అర్థం కాలేదు, దాంతోమళ్ళాపడుకున్నాడు. తలని బాగా కప్పుకుని నిద్ర పోవడానికి ప్రయత్నించసాగాడు.

కొంత కాలం వేగంగా గడిచిపోయింది. నెమ్మది-నెమ్మదిగా అతని మొత్తం శరీరం మీద ఒక బరువైనది తిరుగుతున్నట్టు అనుభవం కలగసాగింది. పరిస్థితిని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించ సాగాడు. అందులో సఫలత లభించకపోగా చాలా కంగారు పడ్డాడు. కుడివైపు వెండి గాజులు ఖనఖనమని చప్పుడు చేస్తున్నాయి. అతని కర్ణపుటాలు కంపిస్తున్నాయి. ఎడం చెవిని ఒక సునిశితమైన శబ్దం కొసేస్తోంది. కొంత సేపటి తర్వాత మూడోశబ్దం పొంగి వచ్చింది. మెడలో వేసుకునే ఆభరణాల శబ్దం. మూడు శబ్దాలూ కలిసి ఒకటి అయ్యాయి. ఒక చెయ్యి వొచ్చి జీవన్ ఛాతీమీద పడింది. ఆ చెయ్యి దాడి చేసేదిగా లేదు, మెడలోహారంలా ఆకర్షణీయంగావుంది. జీవన్ ఆలోచించాడు - సంకోచం కారణంగా ఈ చెయ్యి చైతన్య రహితం కాలేదా? ఆ చేతిని తెలివిగా అతను నొక్కి పట్టాడు. వొత్తిగిలి ఆ చేతిని అనుసరిస్తూ కోరుతున్న దేహాన్ని స్వాధీనం చేసుకున్నాడు. బరువుకి మంచె విరగలేదు. రహస్యం తేట తెల్లమైంది. రెండో చేతిలో వున్న గడ్డి కోసే కత్తిని చూసేసరికి సందేహం లేకపోయింది. జీవన్ ఆమె చేతినించి కత్తిని విడిపించి గట్టిగా విసిరేశాడు. కత్తి పైకెగిరి మళ్ళా దగ్గర్లోనే కింద

పడింది. దాని వేటు చల్లటి నేలలో దిగిపోయింది.

''జనం అనుకుంటున్న మాట నిజం.''

''ఏ మాట?''

''నువ్వు భూతమయ్యావని.''

''నువ్వూ నిజంగాఇలాగే అనుకుంటున్నావా? భలే నేను భూతాన్ని కాగలనా?''

''అవును, కాగలవు. చనిపోయిన వాళ్ళ వేదన ఇలాగే ఛాయగా మారి తిరుగుతూంటుంది.''

''కాదు - కాదు, ఇది నీ భ్రమ. నేను భూతాన్ని కాలేదు. నేనేమీ కాలేదు.''

''చూడూ, ఇలాంటి వ్యర్థప్రలాపాలు చెయ్యకు. లేకపోతే పీక నొక్కుతాను. ఇప్పుడు చెప్పు.''

''ఓహో. నువ్వు పూర్తిగా కసాయి వాడివై పోయావు.''

''కసాయీ? నువ్వు కూడా ఇలాగే అర్థం చేసుకున్నావా హేతీ? గ్రామమంతా అలాగే అంది, నువ్వు కూడా అదే అంటున్నావా? గడ్డి కోసే కత్తి చేసిన కాస్తంత గాయం నిన్ను కబళిస్తుందనీ, నేను నిస్సహాయుడినై పోతాననీ నాకేం తెలుసు?''

''దోషం నాదే, కానీ ఇప్పుడేం చెయ్యగలవు? కోపం కొద్దీ నేను పాలూ - పంచదారా తాగేశాను. ఆ విషయం రహస్యంగా ఉండిపోయింది. ఇందులో నీ దోషమేమీ లేదు.''

''కానీ గ్రామమంతా నన్ను హంతకుడంటోంది.''

''పొరబాటు... జనం అంతా మర్చిపోయుంటారు. చాలా సంవత్సరాలు గడిచిపోయాయి.''

''లేదు, నిన్న రయీ అడిగింది.''

''ఏవిటి?''

''జనం నేను హేతీని చంపేశానంటున్నారని.''

''నువ్వేమన్నావు?''

''నిజమే తల్లీ, నేనే మీ అమ్మని చంపేశానన్నాను.''

''అలా చెప్పకూ. అయ్యో రామా! ఇప్పుడెలా వెనక్కి రాను? పూర్వంలాగా ఇప్పుడు రయీని నా దగ్గిరికెలా పిలవను? నీ కాళ్ళెలా పట్టను? ఏం చెయ్యను? ఇప్పుడు నేనేం చెయ్యను?''

హేతీ లేచి కూర్చుంది. జీవన్ పాదాల మీద తలవుంచి ఏడవసాగింది - ''నా వల్ల పొరబాటైంది. నన్ను క్షమించు. ఇప్పుడు రెండో పెళ్ళి చేసుకో,

బాధపడకు.''

''ఏమన్నావ్? అలా ఎప్పటికీ జరగదు.''

''జరగకదు, ఇది జరగదు, ఎప్పటికీ జరగదు, ఎప్పటికీ, ఎప్పటికీ.''

– తన కంఠస్వరాన్నే విని జీవన్ మేలుకున్నాడు. దూరంగా ఎక్కడో ఏడుస్తున్న నక్క తనకంఠస్వరాన్ని మధ్యలోనే తుంచేసింది. శ్మశానానికి అటువేపు కుక్క భౌమంది.

అతను లేచి నిలబడ్డాడు. తెల్లవారుతోంది. జీవన్ కళ్ళు బరువుగా వున్నాయి. పై బట్ట తలకి చుట్టుకుని కొలిమి దగ్గిర కూచున్నాడు. నిప్పు ముట్టించాడు. ఆ వెలుగులో ఎదురుగా సరిగా సాగుచెయ్యని భూమి నల్లగా మెరవసాగింది. మరోజ్వాలా లేస్తూంటే ఆ నేలలోలేచిన రిజకాగడ్డి ( రిజకా = మేథీజాతా గడ్డి. పశువులకి మెయ్యడానికివేస్తారు.) కనబడుతోంది. దాని మీద ఒక యువతి నడుస్తోంది. అప్పుడు రిజకా గడ్డి పూలు పైకి లేచి తను సంపూర్ణ కోమలత్వంతో దారిన పోయేవాళ్ళ కాళ్ళని స్పర్శించసాగాయి. యువతి సమ్మోహితురాలై కొంగుని భుజం మీద సరిచేసుకుని కింద కూచుంది. రిజకాని కొయ్యసాగింది.

''నీకు ఎవరు చెప్పారు ఈ పని చెయ్యడానికి.''

''నా యిష్టం!''

''లే–లే! పెద్ద వచ్చింది ఇష్టప్రకారం చేసేది. అస్తమానూ అడ్డదిడ్డ పనులు చేస్తావు.''

''చాలా మందిని చూశాను వెర్రోడా!''

''లేచిపో, లేకపోతే పిండి చేసి పారేస్తాను.''

''అరె పో–పో, ఆడంగోడా!''

''..................''

అంతే చేతిలోంచి లాక్కున్న గడ్డికోసే కత్తి పైకి లేచింది, ఓహ్! జీవన్‌కి తన తలమీద తగిలినట్టుంది. అతను కళ్ళు నులుముకున్నాడు. తిరిగి చూస్తే రెండు – మూడు రక్తపు మరకలు వేరు వేరు ఆకారాల్లో గుండ్రంగా తిరగసాగాయి. వాటిచలనం పెరగసాగింది. ఒకటి వృత్తాకారంగా కనబడ సాగింది. వృత్తం చిన్నదైపోయింది. వానిలోచంద్రుడు ఇమిడిపోయాడు. చంద్రుడికి పైన మరో మరక ఉత్పన్నమైంది.

తూర్పు దిశలో ఎర్రని కాంతి పొటమరిస్తోంది. ఆ చిత్రం అస్పష్టంగా అయిపోతోంది, దూరం – ఇంకా దూరమైపోతోంది, అది పడమర వేపుగా పోయి కనుమరుగైపోయింది. ఎర్రని కాంతిహెచ్చుతోంది. సూర్యుడు ఉదయించే సమయమైంది.

జీవన్ పిడకల దగ్గిర కెళ్ళి ఒక ఎండిన పిడకని తీసుకొచ్చి కొలిమిలో వేశాడు. మంచె కిందున్న వంకర టింకర జొన్నలని తొడుక్కుని ఇంటి కెళ్ళి పోయాడు.

ఆకాలువ దగ్గిర వున్న పొలం గట్టుమీద పోతున్నాడు.

గ్రామానికి చేరువనున్న ఒక పొలంలోని ఇప్ప చెట్ల కింద ఒక కొలిమి కనబడింది. భరతరీ (భరతరీ = భజనచేసేవాళ్ళజాతి) జాతికి చెందిన కుటుంబం ఒకటి అక్కడ విడిసింది. ఇద్దరు మొగపిల్లలు, వాళ్ల తండ్రి... తండ్రే అయివుంటాడు! చిన్న పిల్లాడి దగ్గిర సారంగివుంది. వాడెలా పాడుతున్నాడంటే, ఆపాట తండ్రి వాడికి నేర్పినట్టున్నాడు -

''పే 'లాపే' లా జుగమా రాణీ!
ఆమే రే పోపట్ రాయ్, రాజా రామనా.
ఓతరా తే ఖండమాం ఆంబలో పాక్యో త్యారే,
సూడలే మారీ మనే చాంచ్...''

చిన్నప్పుడు జీవన్ ఈ గీతాన్ని చాలాసార్లు విన్నాడు. స్కూల్లో అంత్యాక్షరి ఆడుకునే సమయంలో ఎన్నిసార్లు ఈ గీతం కావలసి వచ్చిందో. ఇప్పటికూ్కడా అతనికి కొన్నిపంక్తులు గుర్తువున్నాయి. బాల్యం మొదలుకొని పుష్యమీ శుక్ల ద్వాదశి నాటి వరకూ గడిచిన సమయమంతా గుర్తువచ్చింది. అతని పాదాలు ఇంటి వరకూ చేరుకున్నాయి. అతను ప్రాంగణంలో నాలుగు వేపులకీ చూస్తూ నిలుచుండిపోయాడు.

జీవన్ కంఠస్వరం విని రయీ మేలుకుంది. పె త్తల్లి ఇంటినించి తన ఇంటికొచ్చేసింది. జీవన్ గేదెలకి పాలు పితుకుతున్నాడు. రయీ పొయ్యి అంటించింది. జీవన్ టీ కాచాడు. ఇద్దరూ తాగారు.

''నువ్వు... నువ్వేడుస్తున్నావా... నువ్వేడుస్తున్నావా నాన్నా?''

''లేదు తల్లీ, ఇదీ, పొగవస్తోంది కదా!'' స్వరాన్ని తగ్గించడానికి ప్రయత్నిస్తూ జీవన్ జవాబిచ్చాడు - ''నాకు పొలంలో ఒక పనుంది తల్లీ, ఈ గొయ్యి నిండేదాకా మంట పెడుతూండూ, చలి కాచుకుంటూండూ, నేను వస్తాను.''

అతను పొలం వేపు వెళ్ళిపోయాడు.

సూర్యుడు పైకి వచ్చాడు.

శ్మశానం చల్లబడిపోయింది. శాంతించిన చితివేపుమళ్ళా ఒకసారిచూసి జీవన్ తన పొలంలో అడుగుపెట్టాడు. మళ్ళీ ఒక్కసారి తిరిగిచూశాడు. మధ్యాహ్నం వరకూ పొలంలోనే వుంటాడు. అతని పొలం చాలా పెద్దది.

# 18. సరళ్ – శంపా

మధు రాయ్

మధు రాయ్ జననం క్రీ.శ. 1942. జన్మభూమి గుజరాత్‌లోని జామఖంభాలియా. ప్రస్తుతం అహమ్మదాబాద్‌లో ఒక వ్యాపార సంస్థలో పనిచేస్తున్నారు. మొదట కలకత్తాలో ఉండేవారు. 'బాంశీ నామనీ ఏక్ ఛోకరీ', 'రూపకథా', 'కాలసర్ప' కథాసంపుటాలు. 'చహేరా', 'కామినీ', 'సభా' మొదలైనవి నవలలు. 'అశ్వద్ధామ' ఏకాంకిసంపుటం. 'కుమారనీ అగాశీ', 'కోఈపణ్ ఏక్ ఫూలనుంనామ్ బోలోతో'... అనేక సార్లు విజయవంతంగా వెయ్యబడిన నాటకం.



సరళ్‌కీ, శంపాకీ ఒకళ్ళంటే ఒకళ్ళకి ప్రేమ. వాళ్ళిద్దరూ ఇంచుమించు రోజు సాయంకాలం పార్కులో కొచ్చి కూర్చుంటూ వుంటారు. ఇక శని, ఆదివారాలైతే పూర్తిగా రోజంతా కలిసి కబుర్లు చెప్పుకుంటూ గడుపుతారు.

ఒక రోజు సాయంకాలం సరళ్, శంపా పార్కులో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. ''ప్రపంచం అంతరిచేంత వరకూ ఇలాగే ఉండిపోతే ఎంత బాగుణ్ణు'' అంది శంపా సరళ్‌తో. సరళ్ మాంచి హుషారు పుట్టించే కబుర్లు చెబుతున్నాడు. ఇలాంటి కబుర్లు వినాలని ఎవరికి మనసుగా ఉండదు! అకస్మాత్తుగా పార్కులాంతర్ల మసక వెలుతురులో అతనికి శంపా కుడిచెయ్యి కనబడకుండా పోయింది. ఇప్పటి దాకా ఉన్న శంపా చెయ్యి ఇంతట్లోకే ఏమైపోయిందో మొదట సరళ్‌కి అర్థం కాలేదు. ఇంతకు ముందే శంపా కుడిచెయ్యి దుస్తుల సహితంగా మాయమైందని కొద్దిగా అవగతమైంది. మాయమైన చోట అంచు కనిపిస్తోంది అంతే. ఉన్నట్టుండి సరళ్ భయపడ్డాడు. అతను మాట్లాడటం అలాకొనసాగిస్తూనేవున్నాడు. చూస్తూ చూస్తూండగానే శంపా చేతిని అదృశ్యం గావించిన రేఖ శంపా కంఠం, మెడ, తల, ఇంకా మొత్తం శరీరమంతా సంచరించింది. భయం చేత సరళ్ ఇంకా అలా మాట్లాడేస్తూనే వుండిపోయాడు.

పార్కు వుందీ, బెంచీ వుందీ, దీపం వుంది, కానీ శంపా...

ఒక్కసారిగా అంతర్థితురాలైపోయింది. ఉన్నట్టుండి సరళ్‌అవాక్కై పోయాడు. అతనినాలుక స్తంభించిపోయింది. సరళ్ మాట్లాడేటప్పు డెప్పుడూ అలసినట్టు కనబడేవాడు కాడు. శంపా ఎలా అదృశ్యమైందో ఎవరికి మాత్రమేం తెలుసు. శంపా అదృశ్యమైనాక ఇంకాఅక్కడే కూర్చునుండాలో, అన్వేషించాలో, లేకపోతే వెళ్ళిపోవాలో తేల్చుకోలేక పోతున్నాడు సరళ్.

''శంపా, శంపా, నువ్వుఉన్నావా?'' మెల్లిగా పిలిచాడు సరళ్, జవాబేదీరాలేదు. సరళ్ భయందూరమైంది. ఆశ్చర్యంతగ్గింది. అంతవరకూ తనలోతానే ఒంటరిగామాట్లాడుతూవుండి పోయాడన్న విషయం మెల్లిగా గుర్తుకు వచ్చి సిగ్గుతో నాలిక కరుచుకున్నాడు. ఏదో భ్రమ కలిగి వుండొచ్చు. సరళ్ లేచి నిలబడ్డాడు. ఎక్కడ పిరికివాడని అంటారో నన్న భయంతో బెంచీకి కాస్తదూరంలో నిలబడ్డాడు. మళ్ళీబెంచీని పట్టించుకోనట్టు వెళ్ళిపోయాడు. ముందుకి కదిలి వేగంగా నడవసాగాడు. చివరికి ఒక్క పరుగు తీసి బయట నడిరోడ్డు మీది కొచ్చేశాడు.

శంపా మాయమైందని జ్ఞప్తికొచ్చింది సరళ్‌కి. శంపా యింటికెళ్ళి వాకబు చెయ్యాలని నిశ్చయించు కున్నాడు. వెడుతూ వెడుతూ హోటల్ దగ్గిర కొచ్చాడు. ఆ హోటల్లో రోజూ సరళ్, శంపా టీ తాగుతూండేవారు. కెటిల్‌తో టీని తెప్పించు కోవడం ఇష్టం సరళ్‌కి. కెటిల్‌లోని టీ ఆకుల్ని వాసన చూస్తే అతనికి నిషాగాఉండేది. హోటల్లో ఫోనువుంది. అతనక్కడికి చేరుకున్న సమయానికి తరుణ వయస్కులైన కుర్రాళ్ళు కొందరు పబ్లిక్ ఫోన్ దగ్గిర అల్లరిచేస్తున్నారు. వినేవేపునించి వాళ్ళుమాట్లాడ్డం, వినడం చేస్తున్నారు. సరళ్ ఆత్రుత పడుతూ నిలుచున్నాడు.

ఈ కుర్రాళ్ళుతన్ని శంపాతో అనేకసార్లు చూశారు. ఆట పట్టించారు. వాళ్ళతో పరిచయమేం లేదు గానీ పోలికల్ని బట్టి అతను వాళ్ళ నెరుగును. తను ఫోన్ చెయ్యడానికి రావడం చూస్తూనే కుర్రాళ్ళు ఆట పట్టించేవారన్నది సరళ్‌కి గుర్తే, అయితే ఎందుచేతనో, అతన్ని గుర్తించగానే కుర్రాళ్ళు ఆకతాయి ఆట వొదిలి బుద్ధిమంతుల్లా అవతలికి తప్పుకున్నారు. సరళ్ ఫోన్ ఎత్తాడు. అవతల నుంచివినవచ్చింది, ''హలో?'' ''శంపా వుందా?'' సరళ్ అడిగాడు.

ఫోన్ మీద ఏమీ వినపడలేదు. ఎందుకనో అర్థం కాలేదు సరళ్‌కి. రిసీవర్ని తిరగామరగా చేసీ, నాణెం వేసే డబ్బా మీద తట్టి చూసీ, దాని మీద మొట్టీ ప్రయత్నించి చూశాడు. ఏమైనా వినబడుతుందేమోనని. కానీ ఏమీ

వినిపించలేదంటే వినిపించ లేదంతే. హోటల్ మేనేజర్ అతనికిపరిచయస్తుడు. ఆయనా, కుర్రాళ్ళూ కూడా ప్రయత్నించారు. ఫోను బాగానే వుంది. సరళ్ మళ్ళీప్రయత్నించాడు. అటునించివినిపిస్తోంది, ''హలో?'' సరళ్ అడుగు తున్నాడు, ''శంపా వుందా?'' అటునించి వినబడింది, ''శంపా?'' అంతే ఇంక మళ్ళా నిశ్శబ్దం. సరళ్ ఫోన్‌ని ఎత్తి పడేశాడు. అతను ఆలోచనల అగాధంలో మునిగిపోయాడు. చాలా వింతగాకనిపిస్తున్నాడు. గొప్ప ఓటమితో మెల్లిగా పళ్ళు కొరుక్కుంటూ బయటికి వచ్చాడు.

హోటల్ బయట కిళ్ళీ దుకాణం ఉంది. అతనక్కడ నిలబడి ఎవరో ఇద్దరు రిక్షాలో కూర్చుని వెళుతుండటం చూశాడు. అతనికి జ్ఞప్తికి వచ్చింది. శంపా యింటికి రిక్షాలో వెళ్ళినా వెళ్ళవచ్చు. శంపా యింటికి రిక్షాలో వెళ్ళాడు సరళ్. శంపా యింటి బయిట రిక్షాని ఆపి వుంచాడు, ఒకవేళ శంపా ఇంట్లోనే వుంటే ఆమెనూ తీసికెళదామని. సరళ్ జేబులో చూసుకుంటే డబ్బులు తక్కువ వున్నాయ్. రిక్షాని వొదిలేశాడు. ఇంట్లోకి వెళ్ళాడు.

''శంపా?''

శంపా యింట్లో ఒకింత ఆశ్చర్యం అలుముకుంది.

''శంపా ఎవరూ?''

అరె! సరళ్ విస్తుబోయాడు. ఇదేవింటీ? శంపా ఇంట్లోనే శంపాని ఎవరూ ఎరగరూ? అతనికి మళ్ళీ గుర్తు వచ్చింది శంపా ఇంట్లో అందరూ శంపాని 'బేబీ' అంటారని.''బేబీ ఎక్కడ?'' అని అతను అనబోయేంతలో వయసులో పెద్దదైన ఒక స్త్రీ పిండి అంటిన చేతుల్ని చిరుగులు మాసిక లేసిన పై బట్టతో తుడుచుకుండూ ఇంట్లోంచి బయటికి వచ్చింది. ఆమెశంపా మేనత్త. పేరు చంపాబహన్. సరళ్ కంగారుపడిపోతూ ''అఁహఁ - అఁహఁ, శంపా, శంపా, మీ మేనకోడలు... బేబీ... బేబీ...'' అన్నాడు.

అందరూ అతన్నేచూస్తూండిపోయారు, అతనేదో అనరాని మాట న్నట్టు. తను శంపా అనేచెప్పాడు చంపా అనలేదని అతనికి గుర్తువుంది. ఒకవేళ చంపా బహన్‌తో పనివున్నట్లయితే తను చంపా బహన్ అనైనా లేదా శంపా మేనత్త అనైనా అని వుండేవాడు. అతనికి శంపాతో పనివుంది. అతను శంపా అన్నాడు.

''బేబీ, బేబీ'

చేతిలో ఇంద్రజాల్ కామిక్స్ పుచ్చుకుని శంపా చిన్నచెల్లెలు లోపలి గదిలోంచి బయటికి వచ్చింది. చలివల్ల నేరేడు పళ్ళలా వున్న బుగ్గలు పగిలి వున్నాయి. కళ్ళజోడు పెట్టుకువుంది. సహజంగా ఆ వయస్సుకుండే

సంకోచం కారణంగా చాలా కఠినురాల్లాకనిపిస్తోది. అనుమానంతో సరళ్‌వేపు చూసింది, ''ఏవిఁటి పని?''

''కాదు - కాదు నాకుపని వున్నది శంపాతో ఈమె పెద్దక్కతో.'' పరికిణీ, జాకెట్ ధరించిన పెద్దక్క బయటికివచ్చింది. సరళ్ హతాశుడయ్యాడు. ఆమె ముఖం మీద మొటిమలున్నాయి. కురులలో ఒక పాయ చందమామ వంటి నుదుటి మీద అమరివుంది. ఈమె శంపా కాదు. సరళ్ ఇంచుమించు ఉక్కిరి బిక్కిరవుతూ ''ఈమె కాదు, ఈమె కాదు'' అన్నాడు. అతనీ అమ్మాయిని చూడనైనా లేదు. శంపా వయసే వుంది, శంపా యింట్లో వుంది, కానీ శంపా కాదు. అతను శంపా తండ్రితో మాట్లాడేడు, ''శంపా అండీ, మీ కుమార్తెల్లో మధ్య ఆమె...'' కానీ మాట ముందుకి సాగలేదు. శంపా ఇంట్లో శంపా లేకపోవడమేవిఁటో ఎవరికి మాత్రం ఎలా తెలుస్తుంది? ఇంత మటుకూ అందరూ అతనేదో పొరబాటున ఈ ఇంట్లోకి వొచ్చేసి వుంటాడనుకుని ఆశ్చర్యపోతున్నారు.

శంపా ఫోటో ఒకటి తనదగ్గిరవుందని గుర్తుకొచ్చి సరళ్ ఆనందంతో ''చూడండీ'' అన్నాడు. ''నేను ఫోటో చూపిస్తాను చూడండి'' అన్నాడు. తన పర్సు తీసు ఫోటో బయటికి తీసి చూపిస్తూ చెప్పాడు ''ఈ అమ్మాయి.''

శంపా తండ్రి నవ్వేరు. అది సరళ్ ఫోటో. సరళ్ ఫోటో చూశాడు. ఏడుపు పర్యంతం అయాడు. జేబులన్నీ తడుము కున్నాడు. శంపా ఫోటో ఎక్కడా లేదు. సరళ్ అక్కడినుంచి లేచి నిలబడ్డాడు. కొంచెం దగ్గిర్లోనే శంపా స్నేహితురాలొకామె ఉంటోంది. వెళ్ళి అక్కడికి చేరుకున్నాడు.

''రండి సరళ్‌భాయీ'' స్నేహితురాలు స్వాగతమిచ్చింది.

''అమ్మా, సరళ్ భాయీ వచ్చారు.'' తల్లి బయటికి వచ్చింది.

''చెప్పు సరళ్ ఆరోగ్యం బాగుందా?''

''శంపా ఉందా?''

''శంపా! అంటే?''

''శంపా, శంపా, నీస్నేహితురాలిక్కడుందా? విజయ్‌భాయ్ కుమార్తె...'' సరళ్ ఆదుర్దాగా చేతులు జోడించాడు. స్నేహితురాలు కూడా వెంటనే నమస్కరించింది. శంపా స్నేహితురాలు శంపా పేరుగల అమ్మాయి నెవర్నీ ఎరగదు. ''శంపా? ఆడపిల్ల పేరే?'' ఇప్పుడింకేం చెయ్యాలో సరళ్‌కి పాలుపోలేదు. శంపాని మర్నాడు కాలేజీలో కలుసుకోవాలని నిశ్చయించుకున్నాడు. ఆమెకాలేజీకొస్తుంది, కలవడం పడుతుంది. స్నేహితురాలింకా నమస్కార ముద్రలోనే వుంది.

మొదటి పీరియడంతా శంపా వచ్చేదారివైపే చూస్తూ గడిపేశాడు సరళ్. మళ్ళీ బయటికివచ్చి నిలబడి నిలబడి అలిసి పోయి రెండో పీరియడ్‌లో క్లాసులోకి పోయి కూర్చున్నాడు.

''రోల్ నంబర్ నూటరెండు''

''ప్రెజెంట్ సర్...''

ఇంక రోల్‌నంబర్ నూటయిర్వై శంపాది.

''రోల్ నంబర్ నూటయిర్వై'' ప్రొఫెసర్ పిలిచారు. జవాబేమీ రాలేదు. ''రోల్‌నంబర్ నూటయిర్వై'' మళ్ళీ నిశ్శబ్దం.

అప్పుడే జవాబు వినపడింది. ''ప్రెజెంట్‌సర్.'' ఎవరో అబ్బాయిది కంఠస్వరం. ఒక్కసారిగా మునివేళ్ళమీద నిలబడి చూశాడు. ఒక లావుగా వున్న అబ్బాయి హాజరు వేయించుకుంటున్నాడు. ప్రొఫెసర్ గమనించటం లేదు. ''రోల్‌నంబర్ నూట ఇరవయ్యొకటి...''

పీరియడ్ అయిన తర్వాత ఆ లావుపాటి అబ్బాయి దగ్గిరకి వెళ్ళాడు. సరళ్. అడగబోతూ అబ్బాయినోట్‌బుక్ మీద చూశాడు. దానిమీద కె.టి. కొఠారీ, రోల్ నంబర్ 120 అని వ్రాసివుంది. సరళ్ ప్రొఫెసర్‌ని అడిగాడు, ''సర్, రోల్ నంబర్ నూట ఇర్వై ఎవరూ?'' ప్రొఫెసర్ కసురుకున్నారు ఆఫీసులో కనుక్కోమంటూ. ఆఫీసువాళ్ళు చెప్పారు, ''నూటయిర్వై కె.టి. కొఠారీ.''

''మరీ... శంపా శుక్లాదీ?''

ఆఫీసువాళ్ళు పదిహేను నిమిషాలు వెతికిన మీదట, ''రోల్ మీద శంపాశుక్లా ఎవరూ లేరు'' అన్నారు.

''శంపా విజయరాయ్ శుక్లా'' సరళ్ పట్టు విడవకుండా మరోసారి వెతకమని చెప్పాడు. రోల్ చూపించడానికి ఛార్జీ నాలుగు అణాలు.

ఒక్క దఫా చూపించడానికి డబ్బులు తీసుకున్నారు ఆఫీసువాళ్ళు, కానీ సరళ్‌ని అడిగారు, ''ఆరోగ్యం బాగుందా?'' అని.

సరళ్ కాలేజీలో ఇంచుమించుగా అందర్నీ అడిగాడు. కానీ శంపా ఎక్కడుంది అన్నదానికి సమాధానం బహుదూరం, శంపానివ్వరూ ఎరగరు.

తన స్నేహితుడు ఒకతనితో శంపా గురించి చెబుతూండేవాడు సరళ్. అతన్ని అడిగితే ఆలోచిస్తూఉండిపోయాడు, ''శంపా?'' ఈ పేరు మొదటిసారిగా వింటున్నాను అన్నాడు. స్నేహితుడు. ''రోజూ ఆమె గురించి చెబుతూండేవాణ్ణి'' అన్నాడు సరళ్. ''గుర్తు లేదు. నాకు జ్ఞాపకం రావటం లేదు'' అన్నాడు స్నేహితుడు.

సరళ్ హాస్టల్ కెళ్ళి శంపా ఉత్తరాలు చదవాలను కున్నాడు. కానీ, బేగ్‌లో ఉత్తరాలు లేనేలేవు. శంపా అతనికి ఒక ఫౌంటెన్ పెన్ బహుమతి నిచ్చింది. దానిమీద సరళ్ శంపాల పేర్లుచెక్కివుంటాయి. సరళ్ చూసుకుంటే దానిమీద ఏమీ చెక్కిలేదు, కేవలం పెన్ తయారీ దార్ల కంపెనీ పేరుందంతే.

సాయంకాలం పార్కుకి వెళ్ళాలనుకున్నాడు సరళ్. పార్కు కెళ్ళే ముందు హోటల్‌కివెళ్ళాలనుకున్నాడు. హోటల్‌లోకెళ్ళి అతను పరిచితుడైన మేనేజర్‌తో ''నాతో ఒకమ్మాయి వచ్చేదీ'' అంటూ ఆమె గురించి మాట్లాడాడు. మేనేజర్ మర్యాదవ్యక్తం చేస్తూ ''అమ్మాయా? మీరు ఒంటిగానే వచ్చేవారే?'' అన్నాడు. వెయిటర్ కూడా అలాగే అన్నాడు. ''అదేమిటి? ఇక్కణ్ణుంచి ఆ అమ్మాయి అనేకసార్లు ఫోన్ చేస్తూండేదీ. మొన్ననేగా ఆమె 'ఆలస్యమైంది భోజనం చేసివస్తానూ...' అంటూ ఫోన్ చేసిందీ? 'నిన్ననేగా నేను ఆమె ఇంటికి ఫోన్ చేశానూ?' అన్నాడు సరళ్.

''కానీ ఇక్కడ ఫోను ఎక్కడుంది? మీకు భ్రమ కలిగింది...''

భ్రమా? మనసులో 'నాకు భ్రమా?' అనుకుని సరళ్ లేచి టెలిఫోన్ ఉండే స్థలం చూశాడు - అక్కడ ఏమీ లేదు. అక్కడ ఫోన్ లేనేలేదు.

వెళుతూ వెళుతూ సరళ్ పార్కులోకి వచ్చాడు. నిన్న ఏ బెంచీ మీద కూర్చున్నాడో దానిదగ్గిరకొచ్చాడు. అతను చూస్తూండగానే మళ్ళీ విచిత్రంగా బెంచీ ఓ చివర్నించి మాయమైపోతోంది. క్షణంలో బెంచీ అదృశ్యమైపోయింది. చూసుకుంటే సరళ్ గోరింట కరకంచె దగ్గిర నిలబడి వున్నాడు.

బ్లాక్ బోర్డు మీద రాత తుడుచుకు పోయినట్టుగా పార్కు పూర్తిగా తుడిచిపెట్టుకు పోతోంది. చూస్తూ చూస్తూండగానే పార్కు ఎక్కడో మరుగైపోయింది. సరళ్ పరిగెట్టుకుంటూ గేటుగుండా బయట పడి వెనక్కి తిరిగి చూస్తే గేటు కూడా అదృశ్యమైపోయింది. పార్కు ఎక్కడుండేదో అక్కడ తారు రోడ్డు తయారైంది. సరళ్ భయభీతుడై రిక్షా చేసుకుని శంపా యిల్లు చేరుకున్నాడు. శంపా యింట్లో ఇప్పుడు కేవలం ఆమె తండ్రిగారు వున్నారు. విజయరాయ్ అతన్ని అడిగారు, ''రండి ఎక్కడి నించి రావడం?''

సరళ్ చకితుడై తనని పరియం చేసుకుంటూ ''నేను నిన్న కూడా వచ్చాను'' అన్నాడు. ''మీరేదో భ్రమలో ఉన్నట్టున్నారు. నిన్న ఇల్లు తాళం వేసివుంది. అందరూ బొంబాయిలో ఉన్నారు. నేనూ ఇవాళే వచ్చాను'' అన్నారు విజయరాయ్.

తను సరళ్‌ని అంతకు ముందెప్పుడూ చూడలేదన్నారు

విజయరాయ్. సరళ్ పరుగు పరుగున శంపా స్నేహితురాలి దగ్గరకు చేరుకున్నాడు. అక్కడా సరళ్‌ని ఎవ్వరూ గుర్తు పట్టలేదు. ఇద్దరికి నలుగురు పోగై జనం ''నువ్వు దారి మర్చిపోయుంటావ్ భాయ్'' అంటూ దారి చెప్పడం ప్రారంభించారు. స్నేహితురాలు ''మిస్త్రీకీ పౌల్‌లో మా పినతల్లి కూతురుంటోంది. ఆమె నాలాగే వుంటుంది. మీరు... బహుశః దృష్టి భ్రమ కలిగివుంటుంది'' అంది.

మరుసటి రోజు సరళ్ కాలేజీలో అడుగు పెడుతూండగా రోల్ నంబర్ నూటరెండుకి జవాబుగా మరొకుర్రాడు హాజరువేయించు కుంటున్నాడు. నాలుగణాలిచ్చి ఆఫీసులో వాకబుచేస్తేరోల్‌నంబర్ నూటరెండు జె.సి. గ్రేవాల్ దనీ, సరళ్ పి. పటేల్ పేరు గల అబ్బాయెవరూ కాలేజీలో లేడనీ తెలిసింది. సరళ్ తన పుస్తకాలూ, కాపీలూ చూపించాడు. అవన్నీ జె.సి. గ్రేవాల్ పేరున్నవి కావటం ఎలా జరిగిందో ఎవరికి తెలుసు. అవన్నీ అతని కిచ్చెయ్యాల్సొచ్చింది. సరళ్ హాస్టల్ కెళ్ళి వాకబు చేశాడు. అతని రూమ్‌లో ఎవరో విదేశీ ఉంటున్నాడు. అతను చాలా మంచి మర్యాదతో సరళ్‌కి స్వాగతమిచ్చి, సరళ్ రాత్రులు ఇక్కడ నిద్రపోతున్నాననీ, గత రెండేళ్ళుగా పడుకుంటున్నాననీ అనుకోవడం సరళ్ భ్రమఅనిబోధ పరిచాడు. విదేశీపేరు టి. బ్రౌన్... ''టి ఫర్‌టెడ్ అంటె థియొడోర్...'' సరళ్ దండెం మీద ఆరేసిన తన బట్టలు చూపించాడు. అది చూసిన మీదట అవి అతని సైజ్‌వి కావని తేలింది. అతని ఆల్మారాలో పుస్తకాలున్నాయి, అయితే వాటి మీదున్న పేరు థియొడోర్ బ్రౌన్.

హాస్టల్ రిజిస్టరులో సరళ్ పేరు లేదు. సరళ్ యూని వర్సిటీలో తన పేరు గురించి వాకబు చేయించాడు. అక్కడ గత అయిదేళ్ళ రికార్డులలో అతని పేరు లేదు. మున్సిపల్ ఓటర్ల లిస్టులో కూడా అతని పేరు లేదు. అతను ఒకటి రెండు పత్రికలు తెప్పిస్తాడు, వాటి చందాదారుల లిస్టులో కూడా అతను లేడు. దీపం లేకుండా సైకిల్ మీద వెడుతున్న నేరానికి అతను ఒక మారు పట్టుబడ్డాడు, కానీ కోర్టుకేసులలో అతని పేరుగానీ నేరం గానీ అసలేదీ నమోదై లేదు. ఒకసారి క్రికెట్ ఆడుతున్నప్పుడు అతని తలమీద దెబ్బ తగిలింది, అప్పుడతను హాస్పిటల్‌లో చేర్చబడ్డాడు, అయితే అక్కడి రిజిస్టర్‌లో కూడా అతను లేడు. హాస్టల్ మెస్‌లో అతని కూపన్ బుక్కేదీ లేదు. మునిసిపల్ రికార్డులో నాగరిక సంఖ్య 42221 ఎవరో తెల్లజుట్టు వ్యాపారి పేర, వుంది. కాలేజీ ఐడెంటిటీ కార్డ్‌లో అతని ఫోటో లేదూ, పేరూ లేదు. లైబ్రరీలో ఏ రిజిస్టర్‌లో అతను సంతకాలు పెడుతూంటాడో అందులో అతని

వందలాది సంతకాలు అదృశ్యమైపోయాయి. పోస్టాఫీస్‌లో ప్రతీనెలా వచ్చే మనియార్డర్ల రశీదులన్నీ బాగా వెతికినా కూడా దేని మీదా సరళ్ పేరు దొరకలేదు. సరళ్ ఇంటికి టెలిగ్రాం ఇచ్చాడు, అయితే అతని స్వగ్రామం పేరుగల గ్రామమే ఏదీ లేదు. అతను ట్రెయిన్ టికెట్‌కి డబ్బులు తెప్పించుకోవడానికని ఉత్తరం వ్రాసి, పోస్టాఫీస్‌లో సర్టిఫికెట్ ఆఫ్ పోస్టింగ్ మీద ముద్ర వేయించు కోవడానికి ఫారం ముందుకు తోశాడు. కానీ స్టాంపు గుద్దే గుమాస్తా, ''దీనికి జవాబు రాదు. ఎందుకంటే ఈ జిల్లాలో ఈ పేరుగల పోస్టాఫీసులేదు'' అన్నాడు.

సరళ్ తనచేతి గడియారం, ఫౌంటెన్ పెన్ అమ్మెయ్యాలని ఆలోచించాడు. తన స్నేహితుడొకతని దగ్గిరకెళ్ళిరెండు వస్తువుల్నీ చూపించడానికి నిశ్చయించుకున్నాడు. అయితే అతని మిత్రుడతన్ని గుర్తుపట్టడని అతని నమ్మకం. రెండు వస్తువుల్నీ చూపించి అతనేదో చెప్పబోయేటంతలో మిత్రుడు ఎంతో కృతజ్ఞతతో, ''ఓహ్ థాంక్యూ! ఎక్కడ దొరికాయ్?'' అన్నాడు. సరళ్ ఏదో అనేలోగానే మిత్రుడు తన భార్యని పిలిచి, ''చూశావా, నేను చెప్పలేదు. రైల్లోనే మర్చి పోయొచ్చేసుంటాం అని. పాపం ఈయన తీసుకొచ్చారు. కానీ భాయ్, ఇది నా వాచీయేనని ఎలా తెలిసింది?''

''ఏం మీ పేరుంది గదా దీని మీద'' అంది అతని భార్య పెన్నూ, గడియారం మిత్రుడి చేతిలోంచి హస్తగతం చేసుకుంటూ, ఆ వస్తువులు మళ్ళా ఎక్కడ పోతాయో అన్నట్టుగా. మిత్రుడి భార్య ఇద్దరి చేతా చదివించింది, రెండు వస్తువుల మీదా 'అశోక్ త్రివేదీ' పేరు చెక్కబడివుంది. అశోక్ త్రివేదీ కృతజ్ఞతా పూర్వకంగా సరళ్‌కి షరబత్ ఇచ్చి జోక్ చేశాడు, ''చలిలో షరబత్, క్షమించాలి మరి, ఇంట్లో బొత్తిగా పాలు లేవు, పైగా ఆవిడ కోప స్వభావురాలు గదా... హెఁహెఁ.. ఇందుచేత షర్‌బత్తే మంచిది... హెఁ...హెఁ...''

వెళుతూ వెళుతూండగా తన జోళ్ళు ఇరుకైపోయాయన్న విషయం గమనించాడు. వాటిని ఊడదీసి చూస్తే చేతిలోవి పదేళ్ళ పిల్లాడి జోళ్ళలా వున్నాయి. సరళ్ జోళ్ళనక్కడేవిసిరేసిఉత్తికాళ్ళతోనే నడవడం ప్రారంభించాడు. సాగిపోతూ తలమీద తడుముకుంటే తల గుండులాగుంది. ఒక్కటి కూడా వెంట్రుక లేదు. చొక్కా (జేబులో) చెయ్యుంచబోయాడు, అతను కేవలం నిక్కరు ధరించి రోడ్డు మీద నడుస్తున్నాడు. ఎవరికీ ఎందుకని కుతూహలం కలగటంలేదో ఎవరికి తెలుసు. సరళ్ పరుగు తియ్యడం

ప్రారంభించాడు. పరిగెడుతూ పరిగెడుతూండగా శరీరం మీది రోమాలు రాలి రాలి గాలిలో ఎగిరిపోవడం ప్రారంభించాయి, శరీరం నుంచి అదృశ్యమై పోయాయి. వస్త్రాలు లేని దశలో పరిగెడుతూ పరిగెడుతూ ఒక సెలయేటి దగ్గిరకి వచ్చాడతను. నీళ్ళలో కాళ్ళు ముంచి బయటికి తీశాడు, కానీ కాళ్ళు బయటికి రానేలేదు – మోకాళ్ళ దాకా కాళ్ళు అదృశ్యమై పోయాయి. ఇసుక తిన్నె మీద తనపేరు వ్రాసేందుకు ప్రయత్నించాడు సరళ్, కానీ అతను పేరు మర్చిపోయాడు, భాష మర్చిపోయాడు. వ్రాసినవి వంకర టింకర గీతలు. సెలయేటి స్వచ్ఛమైన నీటిలో ప్రతిబింబం చూసుకోవడానికని శిరస్సు వంచాడు – ఏమీ కనబడటం లేదు. సెలయేరు ప్రవహిస్తోంది, దాని నీటి మట్టం కింద ఇసుక, రాళ్ళు శుభ్రంగా కనిపిస్తున్నాయి, కానీ సరళ్ ప్రతిబింబం ఏ మాత్రమూ కనబడటం లేదు. చేతులు రెండూ ఒకదానితో ఒకటి కలపబోతే కేవలం గాలి చేతికొచ్చింది. ఇప్పటిదాకా అతనికి వినిపిస్తున్న సెలయేరు, కోయిలల శబ్దాలు ఆగిపోయాయి. అతనికేమీ వినిపించటం లేదు, స్పర్శేమీ కలగటం లేదు. సరళ్ సాంగోపాంగంగా లుప్తమైపోయాడు.

సరళ్ నామరూపాలు ఆనవాళ్ళు లేకుండా భూమ్మీద నించి ఎంత శుభ్రంగా తుడిచిపెట్టుకు పోయాయంటే తను ఒక వ్యక్తి అనేది ఒక భ్రమ అని సరళ్‌కి అనిపించేటంతగా ''మీకేదో భ్రమ కలిగింది.'' ''ఏదైనా భ్రాంతి కలిగుండవచ్చు.'' ''దృష్టి భ్రమ కలిగింది బహుశః'' అతను ఆత్మ విశ్వాస పూర్వకంగా ఎప్పటి వరకూ తనుఉన్నాడని చెప్పగలడో అంతవరకూ వున్నాడని సరళ్‌కి తెలుసును. ఇక అక్కడికే సరళ్ తన అస్తిత్వాన్ని నిలిపివేశాడు, ఎందుకంటే అతని సంబంధీకుల లాగానే బహుశః అతని ఆత్మ విశ్వాసం కూడా అతనితో విస్మయ పూర్వకంగా, ''మిమ్మల్నా? ఎక్కడో చూసి వుంటాను, అయితే జ్ఞాపకం రావటం లేదు'' అంటుందనేమో.

# 19. కిటికీ

**రాధేశ్యామ్ శర్మ**

రాధేశ్యామ్ శర్మ జననం క్రీ.శ. 1936. జన్మస్థానం ఉత్తర గుజరాత్‌లోని వావోల్. వృత్తిరీత్యా పత్రికా రచయిత. 'విచారాం' కథా సంపుటి. చిన్న నవల 'ఫేరో' ఒక కళాత్మకమైన ప్రయోగంగా పేర్కొనబడి, చర్చించబడింది. 'ఆంసు అనె చందరుణు' అ ఛాందస రచనల సంపుటి. ఫిల్మ్ రివ్యూలు వ్రాస్తూంటారు.

★ ★ ★

నాలుగువైపులా ఎత్తయిన పొదరిళ్ళు, నీడనిచ్చేవటవృక్షాలు, ఎండిపోయినా పచ్చగా కనిపించాలని ప్రయత్నించే తుమ్మ చెట్ల మధ్య వున్న ఒక గ్రామం.

ధూళి నిండిన ఒకవాడ. అయితే దుమ్ము ఎక్కువ ఎగరడం లేదు. ఏ రోజుల్లో ఎగుర్తుందంటే పెళ్ళి ముహూర్తాలున్న కాలంలో, ఎండలో నాలుగు దార్లు కలిసే చోటికి పెళ్ళి ఊరేగింపుల్ని ఆత్రంగా చూడ్డానికెళ్ళే ముసలమ్మలు వేగంగా వెడుతూంటారు. మిగతా రోజుల్లో సోమరితనంగా నడిచినా గుర్రాలు పరిగెత్తినట్టు వెళ్ళినా కూడా దుమ్మెందుకు రేగదో మరి. దగ్గర్లో వున్న ఇళ్ళ మండువాల మురికాల్వలవలనించి నీరు ప్రవహిస్తుంది. లేదా దుముకుతుంది. అదీ కాకపోతే బొట్లు బొట్లుగా పడుతుంది. కానీ ఈ వాడ మొత్తంమీద పిల్లలే లేరా? అల్లరిపిల్లలు?

పిల్లలైతే ఉన్నారు. ఏ ఇంట్లోకి మనం వెడుతున్నామో ఆ ఇంట్లో ముగ్గురున్నారు. చిన్న చిన్నవైనా ఉంగరాల జుట్టుండి, అయిదో తరగతి చదువుతున్న సుమారు పదేళ్ళ పిల్లవాడు, వాడి ఇద్దరి అక్కచెల్లెళ్ళు. అక్క పదమూడేళ్ళది -పరికిణీ, జాకెట్ వేసుకుంటుంది, తన పుస్తకంలో పాలలెక్క చేసి తల్లికి చూపిస్తూంటుంది. రెండోది ఏడేళ్ళ చెల్లెలు, అస్తమానూ ముక్కు నలుపు కుంటూంటుంది, గౌను, వేసుకు తిరిగుతూంటుంది. సాయంత్రం భోజనంచెయ్యడానికి ముందే నిద్రపోతుంది, రాత్రి నిద్రలో ఉలికులికి పడుతూంటుంది.

కానీ ఈ పిల్లలు వాడలో బయట ఆట్టే కనిపించరు. అంతకన్న బయటి గాలే వాళ్ళ తల్లి కిటికీ మీద ఆరేసిన చీర, రవికలు పిల్లల బట్టలకి ఎక్కువగా తగులూతుంటుంది. గాలి? ఇక్కడి గాలిని చలిగాలి అని చెప్పవచ్చు. కానీ ఈ పిల్లల తల్లి సంజమసక చీకట్లో పత్తినించి గింజల్ని వేరు చేసి, దీపం వొత్తులు పంచుతూ పొరుగామెతో కబుర్లు చెబుతూవుంటుంది. ఈ గాలి శ్వాసతో పాటే లోపలికెడుతూనే సీసంలాగా నిండిపోతుందని తరుచూ చెబుతూం టుంది. ఏయింటి గురించిచెప్పుకుంటున్నామో అందులో దేవీ పీఠం వుంది. తాత తండ్రుల కాలంనించీ ఆ గూడు ఏ దైవశక్తిదో నివాసస్థానం అయివుం టుందని అంటారు. ఎవరు రోజూ సాయం సంధ్య వేళ గూట్లో దీపం వెలిగించి, నవరాత్రుల్లో ఉపవాసాలు చేసి, వ్రతాలు చేస్తారో వాళ్ళకే ఈ ఇంటిని అద్దెకిస్తాడీ ఇంటియజమాని. మొదట ఈ ఇంట్లో ఒక డాక్టరుండేవాడు, తర్వాత ఒక వంటవాడుండేవాడు, ఇప్పుడు కుటుంబ నియంత్రణ ఆఫీసులో పనిచేసే ఈమె తన ముగ్గురు పిల్లలతో ఉంటోంది. మూడు నెలల క్రితమే ఈ గ్రామానికి పని చెయ్యడాని కొచ్చింది.

పెంకులు కప్పిన ఇల్లు అట్టే ఎత్తుండదు. రెండంతస్తులదైనా కానీ పై అంతస్తుని కాతరియా (కాతరియా= పైకప్పుకి సరిగ్గా కిందనుండే అంతస్తు) అనడం ఎంతో సముచితంగా వుంటుంది. వర్షాకాలంలో పెంకుల మీదనించి నీటిధారలు పడుతూంటాయి. నీళ్ళు మోసే ఆమెవరైనా కిందనించెళ్ళిందంటే తల మీదుండే మూడు బిందెల పైన వున్న మొదటి బిందె తప్పకుండా నీటిధారల వల్ల తొలగి కిందపడుతుంది. కానీ చాలా సంవత్సరాలనుంచి ఇలా జరుగుతున్నా ఎవరికీ ఇది తట్టలేదు. ఎవరైనా పెంకులు మార్చడానికి పైకెక్కితే కదా తడుతుంది. కానీ ఆశ్చర్యం, పెంకులు మార్చకపోయినా కూడా కప్పుచెక్కుచెదరకుండావుంది. సరే, అనిపిస్తూంటుంది- మరి కోతులు ఎగరడం - దుమకడంవల్లవిరిగి పోయాయేమో అని. ఇంటి యజమాని ఇంకా ఇతర ముసలమ్మలూ అంటూంటారు - ''ఆ జగదంబ మహిమ!''

పెంకులపైన ముళ్ళకంపలు పడి వున్నాయి, చలిగాలి తిరుగుతూనే అవి ఏదో కలలో లీనమైపోయినట్టుంటాయి. ఆకాశంలో తరుచూ చక్కర్లు కొడుతూండే గద్దలు ప్రత్యేకించి ఈ ఇంటిపైన ప్రదక్షిణాలు చేస్తూంటాయి. పిల్లలు గనక వాడలో వుంటే ఈ దృశ్యాన్ని చూస్తూంటారు.

ఈరోజు కూడా ఉంగరాల జుట్టు కుర్రాడు అదే విధంగా చక్కర్లు కొడుతున్న గద్దల్నిచూశాడు. గద్దలొకదానితో ఒకటిపోట్లాడు

తున్నట్టున్నాయి. కానీ నెమ్మదిగా చెదిరిపోసాగాయి. కుర్రాడు కళ్ళు ఇంకా – విప్పార్చుకుని చూస్తున్నాడు. రెండు గద్దలు తప్ప మిగిలిన వన్నీ విమానాల్లా కళ్ళు ముందనించి మాయమయ్యాయి. రెండు ఉండిపోయాయి. ఇష్టానుసారం పండగ చేసుకుంటున్నాయి. కుర్రాడు వినోదిస్తూ అక్కా చెల్లెళ్ళు నిద్దర్నీ పిలిచాడు – ''నీనా... వాసలీ!'' ఒక గద్ద ముక్కున ఏదో వుంది, దాన్ని లాక్కునేందుకు రెండో గద్ద ఆక్రమణ జరిపింది. ఒకసారి ఆ వూరికి కొత్తగా వేసున్న ఎలెక్ట్రిక్, తీగల్లో చిక్కుకోబోయాయి. కానీ బతికి పోయాయి. రెండోది ఎక్కువ బలం గలది. మొదటి గద్ద తన ముక్కుతో పట్టుకున్న వస్తువుని పెంకుల మీద పడేసి, విశాలమైన ఆకాశంలో చక్కర్లు కొట్టసాగింది. కుర్రాడికి కుతూహలం పెరిగింది. ఇంటికున్న ఒక పైపు మీద కొంచెం పైకెక్కి పెంకులమీద పడివున్న ఆ వస్తువుని చూస్తేగానీ అతనుండలేక పోయాడు. అక్కడ ఒక ఎలుక చచ్చి పడివుంది. ఇంతలో రెండో గద్ద ఆక్రమణ చేసి ఎలకని ఎగరేసుకు ఎగిరి పోయింది. మొదటి గద్ద ఎగురుతూ ఉండిపోయింది. ఆ అబ్బాయి తల్లి పిలుపు వింటూనే ఇంట్లో కెళ్ళి పోయాడు. లోపలి కెళ్ళగానే అతను ఇనపవూచలున్న కిటికీని తెరిచాడు, కానీ తెరుస్తున్నప్పుడు అతని చెయ్యి అతనికి తెలియకుండానే ఊచల్లో ఇరుక్కుపోయింది. తెగ లాగినప్పటికీ చెయ్యి రాకపోయేసరికి అతను ''అక్కా!'' అని అరుస్తూ చెప్పాడు – ''నా చెయ్యి మళ్ళీ కిటికీలో ఇరుక్కుందీ.'' కాస్త కూడా గాభరా పడకుండా మరో గదిలోంచి వచ్చిన అమ్మ అతని మోచేతినీ, మణికట్టునీ యుక్తిగా ముడిచి కిటికీలోంచి బయటికి తీసేసింది. అబ్బాయికీ, తల్లికీ వెనకాల మతిపోయినట్టు నిలబడున్న అతని అక్కా చెల్లెలూ అలా చూస్తూ ఉండిపోయారు.

వాడలోంచి ఎకాయెకీ ఒక ఒంటె మందగమనంతో నడిచి వెళ్ళింది. ఒంటె వీపు మీద కూచునేందుకు ఒక ఆసనం వుంది. కానీ పెళ్ళి వూరేగింపుతో వచ్చే రథంలో ఉండేటటువంటి చిన్న ఆసనం లాగా వుంది. ఇంకా వెనకాల ఒక ఉయ్యాల ఊగుతోంది, అటూ ఇటూ కదిలిపోతోంది. ఉయ్యాల జోలెగుడ్డ ఎరుపు రంగుది. దాని మీద తెలుపు రంగులో గుర్రం, ధ్వజం వున్న బల్లేన్ని పుచ్చుకుని గుర్రం మీద కూర్చున్న రౌతు చిత్రంగా గీసి వుంది.

అమ్మ చెప్పింది – ''పదండింక అన్నం తిందురుగాని.''

మళ్ళీ తనలో తను అనుకుంటున్నట్టుగా అంది –''పోస్టుమేను వచ్చాడా కానీ జవాబిచ్చేందుకు అక్కడ ఎవరూ లేరు. లోపలి గదిలోంచి కంచాలు కింద పడేసిన చప్పుడూ, గిన్నెలు దొర్లిపోయిన చప్పుడూ

వినవచ్చాయి. ఒంటరి తనపు ఆలోచన నుంచి విముక్తి కోసరం ఆమె గదిలో ఓ కన్నే నుంచి చూస్తోంది, అన్నీ సరిగ్గా వున్నాయో లేవో. కిటికీ రెక్కల్ని రెంటినీ ఒకదాన్నొకటి పరస్పరం ఢీకొట్టేట్టుగా లాగివేసింది. దెబ్బతో కిటికీ ఒక్కసారిగా మూసుకుపోయింది. ఫుర్రు మంటూ ఒక పిట్ట ప్రౌఢ వయస్సులో వున్నట్టున్న ఒక పురుషుడి ఫొటో వెనక దాక్కుంది. ఇప్పుడిక కిటికీకున్న గొళ్ళెం పెట్టాలి. గొళ్ళెం పెట్టకపోతే మళ్ళీ మళ్ళీ గాలివచ్చి కిటికీ తెరుచుకునేట్టు బాదుతుంది. అది ఆమెకు నచ్చదు. ఉట్టిమీది గిన్నెల దొందతరని ఎన్నడూమూతలేకుండా వుంచకూడదు. ఎందుకంటే, అందులో వుంచిన తాజా భోజనాన్ని ఎలకలూ, పిల్లులూ ఇష్టమొచ్చినట్టు పాడుచేస్తాయి. కిటికీలు, ద్వారాలు ముయ్యకపోతే జరిగేదిదే. కిటికీ తెరుచున్నట్లయితే ఎలకలూ, పిల్లులే కాదు కుక్కలు కూడా లోపల దూరతాయి.

కొక్కేనికి తగిలించడానికి గ్గాను గొళ్ళేన్ని పట్టుకుని గట్టిగా లాసాగింది. కీచు కీచు మనే శబ్దంతో పాటుగా గొళ్ళెం పడింది - ఇలా కీచు కీచుమనే శబ్దం, ఏదోపాడైపోయిన ఉయ్యాలలోంచి దాని గొలుసు రింగుల్లోంచి వొస్తోంది. నూనె వెయ్యలేదులాగుంది వాటిల్లో. ఊచల కిటికీ తలుపులకి బిగించిన బందులు విశ్రాంతితో శ్వాస తీసుకున్నట్టుగా ఉన్నాయి.

ఉయ్యాల ఈ గదిలోనే వుంది. ఇంటి యజమాని దయకి గుర్తుగా ఈ ఉయ్యాల ప్రత్యేకంగా అద్దెకున్న వాళ్ళకి లభిస్తుంది. ఈ ఇంటి గురించి భారీ సందేహాలని పెంచుకునే ఇంటి యజమాని కొత్తకోడలికి ఉయ్యాల అచ్చిరాలేదు. ఉయ్యాలకొంచెంగాఊగితేఆమెకికళ్ళు తిరుగుతున్నట్టుంటుంది, దాని మీద నిద్రపోతే బుసలు కొట్టే పెనుపాములు, కొండ చిలవలు కలలో కనపడతాయి.

ఎండ వలన మూసిన కిటికీ ఊచల నీడలు పగుళ్ళు వారిని ఉయ్యాల బల్లమీద పడేసరికి ఆమె భయపడింది. ఉయ్యాల ఒక పెద్ద రంగస్థలంలాగా ఎందుకు కనిపిస్తుందో ఆమెకి అర్థం కాదు. వెంటనే పదమూడేళ్ళ సురేష్‌కీ, వాసలీకీ నీనా అన్నం వడ్డిస్తున్న రెండో గదిలో కొచ్చేసింది. ఈ గదిలో మంచులా చల్లగా అవుతోంది.

''లే, నీనా అన్నం నేను పెడతాను'' - అంటూ ఆమె పీటమీద కూచుని వడ్డించ సాగింది. వడ్డిస్తూ వడ్డిస్తూండగా తన బట్టలు మోకాళ్ళ మీంచి పైకి పోయాయనీ, పాదాలు నేలకి తొక్కిపెడితే కలిగిన గగుర్పాటుకి పైకి లేచి నుంచున్న రోమాలు బయటికి కనిపిస్తున్నాయనీ గుర్తువచ్చింది. ఇది

చూసుకోగానే సంకోచం అనుభవమైంది. ఆమె చీర కింది వరకూ లాక్కుంది. నీనాకీ, తనకీకంచాల్లో భోజనం పెట్టుకుంటున్నప్పుడు మనసులో అనుకుంది - ''ఈ విధంగా నా పాదాలు బయటికి కనబడితే ఆయనకి నచ్చేది కాదు.'' ఆమె మనసులో ఎవరో రంగుల బొమ్మ వేసినట్లయింది - పొడుగాటి జూకాలూగించుకుంటూ ఒకామె ముఖం మెరిసింది. ఆమెకి చేరువగా రైలు బళ్ళుఘుక్ - ఘుక్ అంటూ విపరీతదిశల్లో పరుగులెడుతున్నాయి. ధనధనమంటూ పరుగులెట్టే చక్రాల మధ్య ఖాళీ జాగాల్లోంచి కనబడే కాలువలు - చెరువుల స్థిరమైన కాంతిలాగయింది ఆమె క్షణ కాలం.

''అమ్మా, ఆకుకూర'' అబ్బాయిమెల్లిగాఅన్నాడు. అమ్మ వినకపోగా పైకి చూస్తోంది. అమ్మ ఎక్కడ చూస్తోంది' అతను మళ్ళీ చెప్పాడు - ''ఆకు కూర'' యాంత్రికంగా చెయ్యెత్తి చిన్న బాణలిలో మిగిలిపోయిన కాస్తంత ఆకు కూరని పోగు చేసింది. కంచంలో ఆకు కూర పడిన 'థప్' అన్న చప్పుడికి సురేష్ తలెత్తి చూసేసరిగి గింజల వంకాయి వేసి వండిన ఆకు కూరతో చచ్చిన ఎలక ఏకమైంది. అందువలన మరేమీ తినలేదు.

వాసలీ చేతిలో ముద్దతో ఆడసాగింది. తల్లి మందలించింది -''సరిగా తిను.'' నీనా ఇవాళ తన పాఠాన్ని వల్లె వేసుకుంది. వంట చెయ్యడంలో తల్లికి సాయం చేసింది, అందుకే సంతోషంగా తింటోంది. తల్లి సరిగా తిన్నదో లేక నామమాత్రంగా తిన్నదో కూడా ఆమెకి ధ్యాసలేదు. త్వరగా చెయ్యి కడిగేసుకుని చీరకి తుడుచుకుంటూ, ఆమె నీనా ఎంగిలి కంచాలు, గిన్నెలు తియ్యసాగారు.

సురేష్, వాసలీ స్కూల్ బేగ్స్ సర్దుకోవడం ప్రారంభించారు. వాసలీ ధ్యానం తన బేగ్ కున్న తెల్లగుడ్డ మీద కుట్టిన నెమలి మీదికి వెళ్ళింది. అది నెమలేనా అన్న సంశయం వచ్చిందామెకి. అయితే మరి అది నెమలిలా ఎందుకుకనబడ్డంలేదూ? ఆ నెమలి రెక్కలు కూడా లేనట్టుంది! ఆమెని కొంచెం వ్యర్థ ప్రలాపాలు చేసేదిగా జమకట్టిన సురేష్ - ''వాసలీ, త్వరగా కానీ, లేకపోతే ఆలస్యమైపోతుంది, నంబర్ కట్ చేస్తారు'' అన్నాడు.

మండువాలో గిన్నెలుతోముతూ, బూడిదతోగిన్నెలు తోముతూంటే వచ్చే ఘిస్-ఘిస్ చప్పుడు మధ్యనీనాతల్లితో, ''అమ్మా, నాకు కంపాస్ కావాలి.'' అంది.

కొద్ది సేపటి దాకా గిన్నెలు తోముతున్న చప్పుడే వినిపించింది. తల్లి అంది ''జీతం వచ్చాక ఇస్తాను.''

''కానీ టీచరు క్లాసునించి బయటికి పంపించేస్తానంటున్నారు. ఇక ఉత్తరం రాసివ్వవూ!''

''రాసిస్తాను. పద త్వరగా కానీ . లేకపోతే నాకు కూడా ఆసుపత్రి కెళ్ళడం ఆలస్యమై పోతుంది. ఇంకా చాలా పనులున్నాయి.

ముగ్గురు పిల్లలూ స్కూల్ కెళ్ళడానికి తయారవుతూండగా కిటికీ నించి వచ్చేఎండఉయ్యాల మీద పూచలనీడలు ఇంకాఎక్కువగా పడుతున్నాయి. సురేష్ తలుపు వెనకాల పెట్టిన చెప్పుల్ని వెతుక్కోవడానికి వెడితే ఇంటికప్పుకివేళ్ళాడదీసిన కమ్మీలు అతని టెన్నిస్ బేట్‌కి ఢీ కొన్నాయి. అక్కణ్ణించి బయటికి వచ్చి అతను పెన్ను అడగడానికని లోపలి గదిలో కెళ్ళాడు. ఉయ్యాలకి వేలాడుతూ ఊగుతున్న ఊచలు కూడా ఊగడం మాని స్థిరంగా వుండి కిటికీ ఊచల నీడలతో కలిసి ఏకాకారాన్ని పొందాయి.

గొళ్ళెం తీస్తే మళ్ళీ రింగులో కీచుకీచుమనే శబ్దం అయింది. రింగు మళ్ళీ జ్ఞప్తికి తెస్తుంది ఉయ్యాలుంది కానీ దాని ప్రతిధ్వని ఎక్కడా వినబడదని.

కిటికీ తెరుస్తూనే ఊచలు మాయం. ఊచల స్థానంలో ద్వారం ఫ్రేము పొడగూ, వెడల్పూ ఉన్న చట్రం. చట్రంలో ఆవు శకునం చూడ్డానికి ఎదురు చూస్తూ నిలుచున్న ముగ్గురు పిల్లల నీడలు. ఉయ్యాల మీద ముగ్గురు పిల్లలు తలల నీడలు పడుతున్నాయి. వాటిని ఎత్తయిన శిఖరాలనుకుని చిన్న పురుగులు ఒకదాని తర్వాత ఒకటి శిఖరాలు ఎక్కి దిగుతున్నాయి. ''ఒరే, కిటికీ మూసి వెళ్ళు, లేకుంటే నేను లేవాలి''- లోపల్నించి అమ్మ కంఠం ఆ వెనుక కిటికీ మూస్తూ సురేష్ స్వరం ''సూర్యా, ఒకసారి రిక్షాకింద పడబోయి తప్పించుకుంది. ఆమె దాన్ని పట్టుకోకపోతే దానికింద పడుండేది, కానీ మళ్ళీ...''

ప్రసూతి గృహంలో డాక్టరన్నారు - ''అయినా కూడా వాడికి జైలు శిక్ష పడుండేది. మీరు ఫిర్యాదు చెయ్యకపోతే వాళ్ళు తప్పించుకుంటారు.

''అరే, ఇవాళ నేనూ త్వరగా పరిగెట్టాలి. కొత్త జబ్బు, చాలా భయంకరమైనది, ఒకవేళ కేసు ఎక్కడైనా బెడిసిందో... ఈ పావడ బొందు ఎప్పుడో మార్చాల్సింది కానీ సమయం దొరకటంలా... పోస్ట్ కూడా రాలేదు. పేపర్లో వేయించి వెంటనే పంపేస్తామన్నాడు అతను...

అప్పుడే కిటికీకి అవతల్నించి ఒక ఆగంతకుడి ఖాకీ స్వరం - ''ఏమండీ, మీ పోస్ట్.''

పోస్ట్‌లో దిన పత్రిక వొచ్చింది. వెంటనే పేపరు తెరిచేసి పేజీలు తిరగెయ్య సాగింది. ఆరోపేజీలో సినిమాలు - నాటకాల ప్రకటనలు వుండే

చోట నాలుగు వైపులా అంచుతో ఒక ప్రకటన వుంది. అందులో ఒక వేపు రెండు జుట్టు పాయలలో ఒకటి ఉన్నతవక్షస్థలం మీదవేలాడుతూండగా వయ్యారిభామ లాగున్న ఒకామె చిత్రం వుంది. రెండో చివర తిన్నగా పై వేపు నొక్కుల జుట్టూ, చిన్న చిన్న మీసాలూ వున్న ఒకతని ముఖం వుంది.

యువతి ఫోటో కింద ఇలా వ్రాసుంది.

శ్రీమతి చంద్రిక. వయసు 30 ఏళ్ళు. ధల తేజా నివాసి. చంద్రలాల్ పరమానంద్ దవే భార్య. ఈమె ప్రక్కనున్న ఫొటోలోని వ్యక్తి... ఆర్. ఎం.పి డాక్టర్‌తో పారిపోయింది.

చివర ఇలా వుంది.

ఈ యిద్దరూ ఏదో చిన్న గ్రామంలో డాక్టర్ వృత్తి చేస్తూ భార్యా భర్తలలాగా నివసిస్తూండవచ్చు. శ్రీమతి చంద్రిక బ్రాహ్మణ వృత్తి చేసుకునే తన భర్త ఇంట్లోంచి ఇరవై అయిదు తులాల నగల్నీ, సుమారు తొమ్మిదేళ్ళ వయసు గల వినోద్ పేరున్న కుమారుణ్ణి తనతో తీసుకుపోయింది. పిల్లవాడికి రెండు మూడు ముందుపళ్ళు బయటికొచ్చివుంటాయి. అతనికి అప్పుడప్పుడు నోట్లోంచి నాలుక బయట పెట్టే అలవాటుంది. ఈ స్త్రీ కుడి చేతి మీద ''రామనామ్ సత్య హై'' పచ్చ పొడిచివుంటుంది. జాడ తెలిపిన వారికి తగిన బహుమాన మీయబడును.

ఇంకా 'పునశ్చ' తో...

వ్యాస్‌గారూ,మీరు చేసిన దానికి మాకు ఏ విధమైన ఆరోపణా లేదు. మీరు తిరిగివచ్చాక ఏమీ అనము. అమ్మ, నాన్నగారూ జబ్బుగా ఉన్నారు. వాసలీ బెంగ పెట్టుకుని ఏడుస్తోంది.

– యశోదా మాధవలాల్.

కొంత సేపటిదాకా ఆ పురుషుడి ఫొటో వేపు చూస్తూండిపోయింది ఆమె విచారంతో నిట్టూర్చి ఉయ్యాల కున్న వేడి కమ్ముల మీద కూర్చుంటూ అనుకుంది – ''మీరు ఈ లుచ్చా స్త్రీ కోసం మి జందెంతో ఉరిపోసుకోమని వ్రాస్తున్నారు. ఈ నా జుట్టు స్వయంగా ఎందుకు ఉరేసుకో కూడదు?''

కానీ మళ్ళీ ఆ స్త్రీ ఏదో అజ్ఞాత స్టేషన్ నించి వ్రాసినది గుర్తు వచ్చింది – ''డాక్టర్‌గారు, నన్ను లేవదీసుకుని రాలేదు. నేనే ఆయన్ని లేవదీసుకొచ్చాను.'' అది గుర్తు తెచ్చుకుని ఆమె విచార గ్రస్తురాలైంది. తనే స్వయంగా పేపర్లో వేయించింది, తనే కంప్లయింట్ ఇవ్వాలనుకుంటోంది, ఇంతకీ ఆ స్త్రీయే... ఉయ్యాల ఊగసాగింది. కిటికీ ఊచల నీడలు ఒకసారి ఉయ్యాల బల్లమీద, ఒకసారి కింద పరిచిన తివాసీ మీదా పడుతున్నాయి. ఆమె

కిటికీచువ్వల్లోంచి బయటికిచూస్తోంది. ప్లాస్టర్ ఊడిరావడంతో కురూపాన్ని సంతరించుకున్న ఆ పెద్ద యింటినీ కాలం చేత చెంపదెబ్బలు తిన్న విరిగి పోయిన ఇటికల్నీ - మొదటిసారిగా ఈ రోజే చూస్తున్నట్టుగా తనివి తీరా చూసింది. ఆమె చెవుల్లో ఇప్పుడు కేవలం ఒకే శబ్దం మారు మోగుతోంది - ఉయ్యాలూగుతున్నప్పుడు శబ్దం 'కిచుడ్-కిచుడ్-కిచుడ్.'

కిటికీ ఎదురుగా వచ్చి ఎవరో నిలబడ్డారు. నీడ చూసి తుళ్ళిపడి ఆమె పైకి చూసింది - ప్రసూతిగృహ నౌకరు. అతనన్నాడు - ''అమ్మా బేగి రాండి. కొత్త కేసుకి టయాంకి ముందే బిడ్డుట్టేసినాడు. డాకటేరు బాబు మిమ్మల్నెంటనే పిల్చుకు రమ్మన్నారు.''

కొద్ది సేపట్లోనే తలుపులుమూసుకున్నాయి. దేవి గూట్లో అఖండంగా వెలుగుతున్న దీపం మిణుకు మిణుకు మంటోంది.

# 20. దొంగ

**ఈవా దేవ్**

ప్రఫుల్ల దేవ్ (జననం క్రీ.శ. 1931) జన్మభూమి నడియాడ్. విద్యా భ్యాసం బరోడాలో. 1947 నుండి 1963 మధ్యకాలంలో వాషింగ్టన్ యూనివర్సిటీ, సెయింట్ లూయీస్, మిచురీలలోవుండి మనస్తత్వ శాస్త్రంలో డాక్టరేట్ పొందారు. మైసూర్‌లో అధ్యాపకులుగా పనిచేశారు. వీరివి రెండు కథా సంపుటాలు ప్రచురితమైనాయి – ''ఆగంతుక్', 'తరంగిణీ నుం స్వప్న' చిన్న నవలలు కూడా వ్రాశారు.

★ ★ ★

మలేం నాకేం మా అమ్మ దగ్గిల ఏలవడం బోల్డిట్టం నాకలాంటి... అరే, ఓరో తలుపు తెలిచాలు. అమ్మో! నాన ఓరో ఒకాయన్తో లోపలికొచ్చారు. నాకైతే ఎంత బయమేసిందంటే నేను అమ్మా... అమ్మా... అమ్మా... అమ్మా... అనేడుత్తూవంతింతిలోకిపరిగెత్తాను. ఆయన్లేడూ నన్ను కొత్తడానికొచ్చాడు. నిజెంగా, ఆయన నన్ను కొత్తడానికే వొచ్చాడు. బాబోయ్, నాకైతే బోల్డు బయమేసింది. మరీ నాకు బయమేసినప్పుడల్లా ఏలుపొత్తుంది, అప్పులేం ఉచ్చకూడా వొచ్చేత్తుంది. వంతింతిలో కెల్తూనే అమ్మ గుండెలికిఅతుక్కు పోయాను. మధ్యమధ్యపారిపోవాలని బోల్డు అనిపిత్తోంది. ఐతే పారిపోవడంఎల్లా? బయట గదిలోనేమో నాకు బయమేత్తున్నాయన్తో నాన కూతున్నాలు. అమ్మ దగ్గిల బోల్డు వేరిగా (వేడిగా) వుంది. నేనుండ లేకపోయాను. చుప్-చుప్ మంటూ వేలు చీక్కుంటూ ఉచ్చ పోసేశా మలేం ఇప్పుడు ఉచ్చ పోసినందుకు అమ్మ కోప్పడేదే కానీ ఇప్పులు అమ్మ పంచదార తిండంలో ఎలా మునిగిపోయిందంటే నన్నూ... నన్ను కోప్పడ్డమేం మర్చిపోయింది. నాన వొత్తున్నాలు. రాటం వింటంతోనే ఆ పంచదార డబ్బాని వెంటనే అలమారలో పెట్టెయ్యడానికి పరిగెత్తింది. నాన ఆగదిలోనే వుంటం మంచిదైంది లేపోతే కొత్తకుండా ఉండే వాలు కారు. నాన నన్ను కొత్త బోతే ఉచ్చెలా వొత్తుదంతే, ఉచ్చెలా వొత్తుందంతే మలింక అడక్కూ. మల్లా నాన్నే ఇలా అంతారు – ''ఇంత పెద్దాడివయ్యావు ఒంటిలా, కుచెం కూలా

బుద్ధిలేదు.'' ఇంకా అంతాలూ ఎలాంతమ్మకి అలాంతి బిద్దత, అలా కాటంచేతే నాకు బోల్డు బోల్లుడ ఇట్టం. ఎప్పులూ అంతూాంతాను అమ్మ దగ్గిల ఎంత మజాగా వుంతుందంటే, ఎంత మజాగా వుంతుందంటే, అంతకన్నా బోల్డు మజా అమ్మ గుండెలికి అతుక్కుపోయి చుస్-చుస్ మంటూాంటే వుంతుంది. ఇంకెవలి దగ్గిలా ఇంత మజా లాదు. నేనూ నాకిట్టమైన అమ్మా. నాన ఇంతిలో లేపోతే మేం వంతింతిలో బెల్లం, పంచదార డబ్బా తెలిచి ఎంత మజా చేత్తామో, అంత మజా బోల్డు తక్కువ సార్లు దొలుకుతుంది మాకు. అవును కదూ, రాత్రప్పుదే మజా అంతా వొచ్చేత్తుంది. నానకితెలీదుగానీ నానకెలా తెలిసిపోతుందో అమ్మ నడుగుతాలు, అమ్మదొలికిపోతుంది. మల్లా మమ్మల్నిద్దల్నీఎల్లా కొలతాలంతే మా మజా అంతా పోతుంది. ఇంకా నాకు ఉచ్చొచ్చేత్తుంది, ఒకతే ఉచ్చ. అప్పుదప్పుదు కాక్కు కూడా వొచ్చేత్తుంది, పంపు దగ్గిల కెల్లకముందే. మా అమ్మ ఎక్కేక్కి బోల్డు ఏలుత్తుంది. అంత కన్నా ఏం చేత్తాం?... అరె-అరె నానొత్తున్న చప్పులు! నాన, నాన, నా-న, నా-న, లోపలికొచ్చేశాలు. అమ్మవెంతనే రొత్తికి పిందినానబెత్తదంలో ములిగి పోయింది. నేను బయపడిపోయి అమ్మకాల్లదగ్గిలకూతుంది పోయా. నానొచ్చి అన్నాలు, ఇవ్వాల మేము బోల్డు తిన్నగా ఉన్నత్తున్నామని. ఇంకా, ఇలాగే తిన్నగా ఉంతే కొన్ని లోజుల్తలవాత ఎవలింతికోమమ్మల్ని పెల్లికి తీసికెల్తా నన్నాలు. ఆఁ తిన్నగా ఉంతాం అన్జెప్పిందమ్మ. పెల్లి...! పెల్లి...! పెల్లి...! అంటే మంచి మంచి మిఠాయిలు తిండం ఓ-హో! బోల్డు బోల్డు బావుంతుంది.

ఛుక్-ఛుక్ మనే బండిలో కూతుని మేం పెల్లి జలిగే వూలొచ్చాం. చచ్చాం ఇంత మందిని చూసేసలికి నాకెంత బయమేసిందంతే బోల్డు కట్టంమీద నేను ఉచ్చనాపుకున్నా. మేం ఎవలింతికో వొచ్చాంగా, ఇల్లు బోల్డు పెద్దది, బావుంది. రొండో - నాలుగో గదులు, నీల్లోసుకునే పెద్దగది ఇంకా అందులో పేద్ద నాలుక్కాళ్ళ పీటమంచిది. అమ్మ ఒకచిన్న గదిలో సందూాకంపెత్తుంచి, పక్కపలిచి, ఇల్లు తయాలు చేసింది. నేను అమ్మ దగ్గిల నక్కి కూతున్నాను. అక్కడ నాకు బోల్డు బాగా వుంది. బాకాల వాళ్ళు తడం -తం -తడం-తం అని వాయిత్తున్నాలు, బాజాల వాళ్ళు ఘొం-ఘొం అని వాయిత్తున్నాలు. నా అంత అబ్బాయిలు డాన్సాడుతున్నాలు! అక్కడ అబ్బాయిలు కూడా బోల్డు మంచి వాళ్ళు. నన్నేడిపించదం లేదు కూడా. ఒక్క నానే రోజంతా అరుత్తున్నాలు. ఏవనంతే - ''ఓమ్మా కోడలా, నువ్వు తిన్నగా తయారవాలి. కోడలా - కోడలా ఇంతికెల్లాక చెప్తా నీ పని ఓ తమ్ముడూ,

వంత శాలకి దూరంగా ఉండాలి. ఈ పిల్లాన్ని నీ దగ్గిలే అత్తే పెత్తుకోవాలి. కుంచెం కూడా ఒక్కన్నీ ఒదలకూడదు.'' కానీ మా అమ్మెందే బోల్డు తెలివైంది. ఎలాగంతే దగ్గిల్లో ఎవలూ లేకుండా వుంటే గబుక్కున వంతింతిలో దూరి, ఒకసారి బెల్లం ముక్క, ఒకసారి చిటికెడు పంచదార, మరోసారి దేశి – విధేశీ మిఠాయిలూ తిండానికి తెత్తుంది. తనూ తింతుంది, నాకూ తినిపిత్తాంతుంది. ఎంత మజాగావుందో మా ఇద్దలికీ! ఎంత మజా వొత్తోంది! తిని తిని నా పొట్ట పగిలేత్తుంది. ఒకరోజే మయిందంతే ఎవరూ చూత్తం లేదు. కాబట్టి అమ్మ వంతింతిలో దూరింది. ఇంతట్లో నేను ముసలి పనిమనిషి రాటం చూశా. నేను బోల్డు సేపు ఊం... ఊం... సాగించాక అమ్మ వింది. నేనైతే గదిలో ఓమూల చిక్కుకుపోయా. ముసలి పనిమనిషి అరవడం మొదలెత్తింది – ''ఓ కోడలా, ఓ కోడలా! దేనికోసం అలా అనీ వెతికేసి కెలికేత్తున్నావు?'' అమ్మ అంది – ''ఏం లేదు పెద్దమ్మా, తోమటానికి లోపల గిన్నె లేమయినా కొత్తగా పడ్డాయేమోనని చూత్తున్నాను.'' ఆ పనిమనిషి బడబడలాడుతూ వెళ్ళిపోయింది. నాకేమో నానొచ్చి జోళ్ళతో ఒకతే ఇదిగా తంతాలేమోననిపించింది! జోళ్ళతోతన్నులంటేనాకు బోల్డు బయమేసింది, ఉచ్చొచ్చేత్తోంది. అదిగో అమ్మ వెంటనే లోపలికొచ్చేసి నన్ను గుండెలకి హత్తుకుంది. అప్పుడిక నాకుచ్చాగిపోయింది. అమ్మ బడబడ లాడసాగింది – ''ఎలాంటాళ్ళు చచ్చారు! ఈపనిమనిషికూడా నావెనకాతలే వుంతూాంతుంది, మేం తన కోటనేదో దోచుకెల్లిపోతా మన్నత్తు!'' కుంచెం సేపున్నాక మళ్లీ అమ్మ బయతికెల్లింది. ఇతూ – అతూ చూసి తిరిగొచ్చింది. లోపల అమ్మ గదిలోపెట్టిన సందూకుపెట్టిలు తెరిచి, తెరిచి చూడ్డం మొదలెత్తింది. ఒక సందుకులో అమ్మకి బోల్డు మంచి మిలమిల మెరిసే పసుప్పచ్చ రాయున్న ఉంగలందొలికింది. అమ్మదాన్నేచూత్తూ ఉండిపోయింది. అమ్మకి బోల్డు ఉషారొచ్చింది. ఉంగలాన్ని అమ్మ వేలుకి పెట్టుకునేదే కానీ ఆ ముసల్ది పరిగెత్తుకుంతూ లోపలికొచ్చి, బాప్‌రే! ఏం గొడవ చేసిందనీ, పులిని పత్తుకున్నత్తు! అదంతా వింతే నాకు ఉచ్చ రాబోయింది. ముసల్ది అంతోంది – ''ఓ కోడలా, ఏం చేత్తున్నావు నువ్వు? నిలబడు నువ్వు. ఏం తీశావ్ నువ్వు? చెప్పు, చెప్పు, ఏం దొంగిలించావ్?'' అమ్మ నుంతుని చెప్పింది – ''ఏం లేదు పెద్దమ్మా, ఏం తియ్యలేదు. నేనిక్కడ ఊలికే కూతున్నాను. అమ్మ ఉంగలాన్ని గుప్పిత్లో దాచి రెండు చేతులూ వెనకాల దాచింది. నేను బోల్డు బయపడ్డాను. ఉచ్చునాపుకుంతూ పరిగెత్తుకెల్లి అమ్మ వెనకాల దాక్కున్నాను.

ఉచ్చునాపుకుంతూ పరిగెత్తుకెల్లి అమ్మ వెనకాల దాక్కున్నాను. అమ్మ

ఏడుత్తూ (ఉత్తుత్తినే!) చెబుతోంది - ''ఏమీ తియ్యలేదు. నేను నిజం చెబుతున్నాను, నేనేదీ తియ్యలేదు.'' ఇంకా ముసల్ది అరుత్తూ అంతూనే వుంది - లేకపోవడమెలా! ఈ పెత్తెలన్నీ అస్తవ్యస్తంగా ఎలా అయ్యాయి? నేనన్నీ కక్కిస్తాను ముండా! చెప్పు నీ చేతిలో దేవిఁటి?'' అప్పటికి చాలా బోల్డు మంది జనం పోగయ్యాలు. మంచి మంచి పిల్లలన్జెప్పానే వాళ్ళూ వొచ్చాలు. నాకు బలే మజాగా వుంది. నాకు వాళ్ళిప్పులు నాతో ఆడతాలని పించింది. సలిగ్గా అప్పుడే ఏం జలిగిందంతే అమ్మ నా నోరు పెగల్దీసి బెల్లం ముక్క పెత్తినత్తు ఉంగలాన్ని నా నోత్లో పెత్తేసింది. అమ్మ ఉంగలాన్ని దాచడానికినాకిచ్చిందని అంతాఅర్థం చేసుకున్నా. నాన్న హఠాత్తుగా వత్తోంతే అమ్మెప్పులూ ఇలాగే చాలా వస్తువుల్ని నా నోత్లో దాచేత్తూంటుంది. నేనింత వరకూ దేన్నీ మింగెయ్యలేదు. చూలూ, నేను ఉంగలాన్నిలాగే నాలిక్కింద నొక్కి వుంచాను. ఆ ముసల్ది లేదూ ఆమె అమ్మ చేతులు పత్తుకులాగుతోంది. ఇలా చేతులు లాగవద్దంది అమ్మ. ముసల్ది చేతులేం, ఇలాగే నాలికూ్కడా లాగుతానంది. చెప్పు ముండా, చెప్పు నీ చేతిలో ఏముందో? నాన బయతికెక్కడికో తిలగడానికెల్లాలు గనక సలిపోయింది. లేకపోతే మమ్మల్నిద్దల్నీ జోళ్ళతో ఎలాతన్నుండేవాలంటే నాకుచ్చొచ్చేసుండేది. ఇంతలో పిల్లలందలూ చేతులు పైకెత్తి హో-హో అని గోల చెయ్యడం మొదలెత్తారు. నాకు బోల్డు హుషారొచ్చింది. నాకూ్కడా హో-హో అంతూ గోల చెయ్యాలనిపించింది. నాకైతే అనిపించిందీ వాల్లు నన్నెడిపించదంలేదు గనకఇప్పులు నాతోఆడడానికొచ్చాలు. నేను ఆడకపోవడం ఎలా! వాల్లని చూసి నేనుకూడా చేతులుపైకెత్తి గంతులెయ్యడం మొదలెత్తాను, వాళ్ళలాగే హో, హో అని గోల చెయ్యాలనిపించి 'హో... ఊ...ప్' అన్నాను. అంతే ఉంగలం ఒక్కసారిగా బయతికొచ్చి, వెళ్ళి పడింది ఆ ముసల్దాని చేతిలో! దాన్నామె వెంతనే ఒడిసిపత్తి అరవడం మొదలెత్తింది - ''ముండా! అబద్ధాల మారీ! దొంగపీనుగా!'' బాబోయ్! అది అమ్మ నెంతలాతిట్టిందో! ఎంత తిట్టిందో! నాకూ ఏడుపొచ్చేదే, ఉచ్చొచ్చేసేదే, కానీ ఆ కుర్రాళ్ళు ఎంత మంచివాళ్ళంతే వాల్లతో పాటు నేను కూడా ఆడుతూ డేన్సు చెయ్యడం మొదలెత్తా. వాల్లంతా ''ఏయ్ దొంగా, ఏయ్ దొంగా!'' అంతూ డేన్సు చేత్తున్నాలు. నాకు ఇది వింతోంతే ఎంత మజాగా వుందంటే నేను కూడా ''ఏయ్ దొంగా, ఏయ్ దొంగా'' అంటూ గోల చెయ్యడం మొదలెత్తాను. నేనిలా మొదటిసారి ఈ పిల్లల్తో ఆడాను. నిజం చెబుతున్నా నాకు బోల్డు మజా వొచ్చింది. పిల్లలెంత మంచివాల్లు!

---

printed at J.J. Offset Printers, Press Area, Wazirpur, Delhi - 110035